# జగజ్జ్యోతి

## ద్వితీయ సంపుటము

★

గ్రంథకర్త:

హరికథాపితామహ

**శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు**

★

ప్రకాశకులు:

**శ్రీమతి కర్రా శ్యామలాదేవి**

2 వ లైను, శ్యామలానగర్

గుంటూరు — 6

This book is published with the financial assistance of the government of Andhra Pradesh Ministry of Cultural affairs. We thank them for their aid.

# కృతజ్ఞత

ఈ బృహద్గ్రంథమును అచ్చొత్తించుటకు ఆంధ్రప్రదేశ్
ప్రభుత్వ సాంస్కృతిక శాఖామాత్యులు గౌరవ
నీయులు శ్రీ భాట్టంశ్రీరామమూర్తిగారు,
దీనికి ప్రభుత్వపరముగా ధనసహా
యము అందజేసిరి. వారికి
నా కృతజ్ఞతాభి వంద
నములు

శ్యామలానగర్,
గుంటూరు-6.
1-1-83.

క్రా ఈశ్వరరావు

# విషయానుక్రమణిక

## అయిదవ ప్రకాశము



## ఆఱవ ప్రకాశము

## ఏడవ ప్రకాశము



## ఎనిమిదవ ప్రకాశము

# జ గ జ్జ్యో తి
# స మీ క్ష

## 'త త్త్వ కళానిధి' నీలకంఠశాస్త్రి (కౌండిన్య)

విద్యా సము పార్జనమునకు బాల్యము ప్రథానసమయము. భారతదేశమున గురుకులమున వసించుచు గురుశుశ్రూషణము నొనర్చి గుర్వనుగ్రహమునకు పాత్రుడై విద్యను నేర్చుట సంప్రదాయసిద్ధమగు విషయము. గురుశుశ్రూషణమున ఒకప్పుడు బాలుడు విశేషశ్రమమును ఓర్చుకొనవలసియుండును, ప్రసిద్ధేతిహాసమగు భారతమున తొలుతనే ఉపమన్యుడు. వేదుడు. ఉదంకుడు మున్నగువారు ఎంతెంత శ్రమముల కోర్చిరో వర్ణింపబడినది, అనర్ఘరాఘవకర్తయగు మురారి కవిగూడ తాను విద్యాసము పార్జనమునకు పడిన పాట్లను —

"జానీతే నితరామసౌ గురుకుల క్లిష్టోమురారిః కవిః"

అని చెప్పుకొనినాడు.

ఈ గురుకులక్లేశము ఛాత్రసామాన్యవిషయమైనను కొందఱు మేధావులకు ఈక్లేశముతో పనిలేదు, అట్టివారికి గురూపదేశము నామమాత్రమే దీనినే పెద్దలు –

" ఉపదేశమపేక్షన్తే విద్యాః సత్పాత్రసంగతాః"

అనిచెప్పిరి.

అట్టిమేధావులలో హరికథా పితామహులు శ్రీ ఆదిభట్ల నారాయణదాసు గారు ఒకరు. వీరికి అక్షరసమామ్నాయము రాకుండగనే గ్రంథపఠనమబ్బుట ఆశ్చర్యము. వీరు తమ సంగతిని ఎఱుకపఱచుచు -

"నాల్గేండ్లయీడున నాకెల్ల చదువు
లబ్బె దమంతనే నరసిన కొలది
నే బుట్టులయకాడ నేమాటకాడ
నాటపాటల మేటి ననిపించుకొంటి" (నామాట)

అనిచెప్పుకొనిరి అయిదు వత్సరము ప్రాయమున ఉపనయనము అయిన వెంటనే గురువులకడ కొలదికాలము వేదాధ్యయనమును గావించిరి. అటులనే తమ జనకులకడ

కావ్యములను తమ బాల్యావస్థయందే చదివిరి. వేదమును పూర్ణముగా అధ్యయనము గావింపలేదు. కావ్యములనుగూడ సమగ్రముగ చదువలేదు దానితో వారికి గురుసంనిధి యందలి విద్యాభ్యాసము ముగిసినది, తరువాత అభ్యసింప మొదలిడినగాని విద్యకూడ అంతియే

గాలికి వచ్చిన పాటలను పద్యాలను ఆటలను పాడుచు చదువుచు ఆడుచు బాల్య చేష్టలతో తమ గ్రామమగు అక్షాడయందే ప్రధానముగ బాల్యమును గడపిరి.

అనంతరము ఆంగ్ల విద్యాభ్యాసమునకై విజయనగరము వచ్చిరి. విజయనగరము వచ్చునప్పటికి తాము 'గోచీకి' స్వస్తిచెప్పి 'గావంచా'కు స్వాగతముపలికి తిమనిచెప్పుకొనిరి. అప్పటికి శ్రీదాసుగారి మేధాసంపత్తి, ప్రతిభ, విమర్శకత, లోకపరిశీలనము గూడ వికసించిన వి. ఆనాటి నానాకళలతో విలసిల్లు విజయనగర పరిస్థితి వీరి శేముషీలతకు ఆలంబన యష్టిఅయ్యెను. కవిత, అష్టావధానము, హరికథాగానము గూడవారికి అచటనే ఆరంభమయ్యెను,

శ్రీదాసుగారికి సహజములగు కొన్ని గుణములు గలవు, వానిలో – స్వశక్తిపై ప్రగాఢ విశ్వాసము, స్వయం కృషి, స్వేచ్ఛ, నిశిత పరిశీలనము, అనవరత గ్రంథావలోకనము, దాపరికము లేకుండ తన చేష్టలను వెల్లడించుట, సత్యప్రియత్వము అహింసావ్రతము, పరమేశ్వర భక్తి, కలహమునకు ముందడుగు వేయుట (కలహ ప్రియత్వము) మున్నగునవి. చిన్ననాట అంకురితములు అయిన భావములే ప్రౌఢయౌవనమున మానిపోక ద్రఢమూలములయినవి. స్వేచ్ఛాసంపన్ను లగుటచే ఇతరుల భావములను పరప్రత్యయనేయ బుద్ధులుగా అనుసరింపక ప్రతివిషయమును స్వతంత్రముగా నూహించుట వీరిస్వభావము.

సంస్కృతాంధ్రాంగ్ల వాఙ్మయమున వీరు పఠింపని ప్రధాన గ్రంథము లేదు, అందునను సంస్కృత వాఙ్మయమునందలి వేదములు కల్ప ధర్మసూత్రములు దర్శనములు పురాణములు సూత్రగ్రంథములు సంగీత సాహిత్య గ్రంథము – లను వేయేల అష్టాదశ విద్యలను, అనగా వేదవేదాంగ మీమాంసా – న్యాయపురాణ ధర్మశాస్త్ర గాంధర్వవేద ఆయుర్వేద ధనుర్వేద నీతిశాస్త్రార్థశాస్త్రాదులను తమ నిశితమగు మేధా శక్తితో పరిశీలించి కొన్ని కొన్ని సిద్ధాన్తములను ధృఢీకరించు కొని వానిని లోకానుభూతితో మేళవించుకొనిరి, అట్టివాని ప్రకాశనమే యీజగజ్జ్యోతి, వాఙ్మయము యొక్క లోతుపాతులకు పోయి అర్థానిని సమగ్రము గమథించి, అందలి సారమునే

యీ గ్రంథరూపమున వెలువరించుటచే ఇట్టి భారతీయ వాఙ్మయ పయోరాశినుండి శ్రీ దాసుగారు పైకి దీసిన యమృతమే యీ గ్రంథము అని చెప్పవలసియుండును, ఈ పనిని దాము ఎట్లయిన చేయదలంచి నట్లు

"తెలుగు వారలకున్ దేట తెల్లముగను
తెలుగులో నెల్ల విద్దెల దెలుప నెంతు;
అన్ని విధముల నసుగాచు నాంధ్రదేశ
మునకు నాయచ్చియున్న యప్పనము దీర్తు

అని ప్రతిజ్ఞ చేసినారు,

ఈ గ్రంథమునకు 'జగజ్జ్యోతి' యనునామము ఎంతయోయుపపన్నము. నామ రూపాత్మకమగు నీవిశ్వము నందు రూపాత్మకవిశ్వమును (శాశ్వతముగ) ప్రకాశింప జేయునది నామరూప ప్రపంచమే. అది అష్టాదశ విద్యారూపమున వెలుగుచున్నది, కావున రూపప్రపంచమునకు నామ ప్రపంచము ప్రకాశకజ్యోతి, దండిమహాకవి కూడ ఈ విషయమునే –

"ఇదమంధం-తమః కృత్స్నం జాయేతభువనత్రయమ్।

యదిశబ్దాహ్వయం జ్యోతిరాసంసారంన దీప్యతే" (కావ్యాదర్శము)

అనితెలిపినాడు, కాగా అట్టినామాత్మక ప్రపంచసారభూతములగు నష్టాదశ విద్యలను పిండి తనతెలుగు వారలకు శ్రీదాసుగారు తేట తెల్లముగను దృఢముగను ఈ గ్రంథ రూపమున అందించిరి, కావున నీ గ్రంథమునకు ఈ "జగజ్జ్యోతి" నామము ఎంతయో యుపపన్నమై వెలయుచున్నది.

శ్రీదాసుగారు గురువుల కడగావించిన విద్యాభ్యాసము పూర్వము తెలుపబడినది.. పరిస్థితమగు వీరివిజ్ఞానములో అది "అఆ" మాత్రమే. తక్కిన శాస్త్రాది విజ్ఞానమం తయు తమ నిశితమగు మేధాసంపత్తితో అనవరత శాస్త్రాధ్యయనమును గావించి సంపాదించినదే. ఈ గ్రంథమును మనము సమగ్రముగ పఠించినచో వారి విజ్ఞాన సంపద ఎంత విస్తృతమో మనకు అందు కొంతమాత్రమే అవగతమగును.

ఇందు ఒక విశేషముగలదు. శాస్త్రములు సంప్రదాయబద్ధముగా అధ్యయనము చేయదగినవియే. అట్లుగావించినచో సంప్రదాయాగతజ్ఞానము అందు గోచరించును.

కాని స్వతంత్రబుద్ధులట్లు చేయజాలరు, కావున వారిభిషణ స్వతంత్రమార్గము నను సరించుట సహజము. ఈ విషయము శ్రీదాసుగారి గ్రంథముల యందు సర్వత్రగో చరించును. దానికి తోడు వారు మానవతావాది. తమ మానవతా వాద సాధనమునకు వారు ఒకప్పుడు సంప్రదాయమును గూడ తెగనాడుటకు వెనుదీయరు. కాని శ్రీశంకర భగవత్పాదులున్నగువారు శాస్త్రజ్ఞానము కంటె సంప్రదాయమునకు గౌరవము నిచ్చి నట్లు తెలియును.

శ్రీదాసుగారి హృదయము – తనసాటివారలకు ఎట్టి కష్టము కలుగ కుండ మెలగుచు, ఎల్లపుడు పరోపకార పరాయణుడై, ఎట్టి జీవహింసను గూడ ఎన్నడును జేయక, (జీవహింసయన శారీరక జీవహింస) సత్యవ్రతుడై, భగవద్భక్తితో జీవించుట ఉత్తమధర్మము. సకల శాస్త్రములకును వీనియందే తాత్పర్యము అని దీనినే వారు ఈ గ్రంథమున పౌనఃపున్యముగ బోధించిరి, ఇందుజర్చించిన సకల శాస్త్రతాత్పర్యము గూడ ఇదియే యనివారి భావనము. మఱియు వారు – "ఋషిప్రోక్తములగు శ్రుతి స్మృతులకు ధూర్తులు కొందఱు స్వవార్థమును మఱుగుపఱచి సత్య – భూతదయా – పరోపకారములకు వ్యతిరేకముగా స్వార్థపరత్వముతో అపార్థములను గల్పించి పశు హింసచేయుమ జనులలో న్యూనాధిక భావముల నేర్పఱచినారని" అభిప్రాయపడిరి. ఈ బోధనము ప్రతిప్రకరణమునను పునరుక్తము గావింపబడినది, అట్టితమసిద్ధాన్త మును అన్నిపర్యాయములు అంతగట్టిగా దెల్పినగాని వారికి తృప్తిలేదు, ఏదేని యొక బోధ దృఢముగ బోధించుటకు పలువిధములగు దృష్టాన్తములతో మనసున గాఢముగ నాటునట్లు పలుమారులు తెల్పుటలో దోషములేదు. అందుపునరుక్తి దోషములేదు. సామా న్యజనానుభవవిరుద్ధమగు జీవేశ్వరైక్యమును తనయనుంగు తనయునకు బోధింప నెంచి అరుణిమహర్షి తొమ్మిది పర్యాయములు పలుదృష్టాన్తములతో ఒకే "తత్త్వమసి" అను మాటను బోధింపలేదా ? కావున తాను ప్రధానమని తలంచిన విషయమును ఎన్నిపర్యా యములు బోధించినను అందు పునరుక్తి దోషము గలుగదు.

శ్రీదాసుగారు మానవతావాదులని తొలుత దెలుపబడినది. వారు తమమానవతా వాదమునకనుకూలమగు నట్లు శ్రుతిస్మృతుల కర్థమును దెల్పిరి.

శ్రీదాసుగారు ఉత్తమ వైదిక నిష్ఠాగరిష్ఠుల సత్సంప్రదాయముననే జనించిరి వారే తమ్ము గూర్చి -

"శ్రీభరద్వాజ గోత్రభవుల మాదిభట్లస్మార్త వైదికులము.
ధరణినన్ను నారాయణ దాసుఁడంద్రుఁడు" (రుక్మిణీకల్యాణ)

"మారాకారుఁడు వేదశాస్త్రనిధి బ్రహ్మజ్ఞాని మాయాదిభ ట్టారాజేంద్రుఁడు
సత్కరింపఁగమహాయజ్ఞంబులన్ జేయుచున్"

"ద్రావిడాష్టాదశాగ్రహార ప్రభువయి
యజ్ఞముల్ గృహమేధియై యాచరించె"

"బ్రాహ్మణ ప్రభువులై బహుయజ్ఞశాలలన్
బన్నిరజ్ఞాడాది భట్లవారు" (స్వ వంశవర్ణనము)

అనిచెప్పుకొనిరి, వారి పూర్వ పురుషులలో, ౧ అబ్బయసోమయాజి, ౨ వేంకటేశ్వర యజ్వ ౩ యజ్ఞేశ్వర చయనులు, ౪ వేంకటచయనులు మున్నగు వారు పెక్కురు సోమయాజులు గలరు.

ఇట్లు దాసుగారు ఉత్తమ సోమపీథుల వంశమున జన్మించియు ప్రాక్తన జన్మ సంస్కారముచే పశువిశసనమునే గాదు ఏచిన్నప్రాణి హింసనైనను సహింప జాలరు. అది వారి స్వభావము. వీరి యహింసావ్రతపరమాధి యెట్టిదనగా — తాము చర్మమయములగు పాదరక్షలను గూడ ధరింపలేక "కేన్వాసు" చెప్పులను మాత్రమే ధరించిరి. ఇట్టి అహింసాభినివేశము గల్గిన వారు, శాస్త్రము ప్రమాణమని తలంచువారు అగు శ్రీదాసుగారు, యాగములు వేదవిహితములని దెల్పు ప్రమాణ వాక్యములకు అన్యధావ్యాఖ్యానములు గావించుటలో ఆశ్చర్యములేదు, "అగ్నిషోమీయం పశుమాలభేత" మున్నగు విధివాక్యములలోని "ఆలభేత" పదమునకు స్పర్శమాత్రమేగాని విశసనమెంత మాత్రము గాదనివారు జెప్పిరి, "ఆలభేత" పదమునకు విశసనమే యర్థమైనచో,

"బ్రహ్మణే బ్రాహ్మణ మాలభేతే, క్షత్రాయ రాజన్యం"

మున్నగు శ్రౌతవాక్యములలోని "ఆలభతే" శబ్దమునకు విశసనము అర్థముగా చెప్పబడుచున్నదా అనివారు ప్రశ్నించిరి, మరియు "పశుమాలభేత" అనుచో 'పశువు' అనగా చిత్తము, 'ఆలభేత' అనగా దైవాయత్తాముగావింపవలయునని యర్థము (అనగా మనుజుడుతన చిత్తమును దైవాధీనము గావింపవలయునను నర్థము) చెప్పవలయును అనిదెల్పిరి శ్రీదాసుగారు.

i) అట్లే "ఇషేత్వోర్జేత్వా—"మన్నగు వేదశబ్దములకు లోకోపకారకముగా చరించుటయే మనుష్యధర్మమను నర్థము తప్ప మఱేయర్థమైనను చెప్పుట మునుల అభిప్రాయ మెంతమాత్రము కాదు. దానికేగాదు. వేదమంతటికి పరోపకారము సల్పుటే అర్థమని మునుల యభిప్రాయము.

ii) 'ఇషమేవోర్జం యజమానాయదధాతి' అను బ్రాహ్మణమువలన పలాశశాఖ అనుదానికి 'కుండనిండుగనున్న వండిన యన్నము" అనగా అన్నకబళము అర్థము. దానిని తనతోటిపాటి ఆకలిగొన్నవారికి పెట్టుమని భావము. (25 పు)

iii) అట్లే "చోదనాలక్షణార్థోధర్మః" అనుదానిలోని 'చోదనా' శబ్దమునకు, సర్వభూతదయ, సమస్తప్రాణులను ప్రేమించుటయను నర్థమే జైమినిముని తాత్పర్యము.

తాము ఇట్టి యర్థములనుదెల్పుటకు శ్రీ దాసుగారు ఈ దిగువశిష్టవచనమును ప్రమాణముగా దెల్పిరి—

"ప్రస్తావా దథవౌచిత్యా ద్దేశకాల విభాగతః।
శబ్దైరర్థాః ప్రతీయన్తే న శబ్దాదేవ కేవలాత్॥" అని. (౨ భా. ౬ పుట)

"యుగానుసారముగ ఆచారములు నిద్రాహారవిహారాదులు విధానాదులు మారుచున్నట్లు, వేదముల శబ్దార్థములు, వానినను సరించి కర్మములు మారక తీరదు". (1 భా. 98 పుట).

కావున కాలానుసారముగ శిక్షావ్యాకరణ ఛందోజ్యోతిష నిరుక్త కల్పములు సర్వజన సాధారణోపయోగకరణములుగా ఎప్పటి కప్పుడు మార్చుకొనవచ్చును. (26 పుట) 'మహర్షులు చెప్పిన ధర్మమును దేశకాలోచితముగ మార్చుకొనవలయును. వేదతాత్పర్యముగూడ, స్వార్థపరితమాని భూతదయగల్గి లోకోపకారవ్రతమును కొనసాగించుటకై భక్తరక్షణ దీక్షాపరతంత్రుడగు పరమేశ్వరుని నిరంతరము నవవిధభక్తిమార్గములచే గొలువవలయుననియే.

శ్రుతిస్మృత్యాదులకు పెక్కురు పెక్కువిధములుగా వ్యాఖ్యగావించిరి. కొందఱు కేవల మానవతే ప్రధానముగాని శాస్త్రములో పనిలేదను కొనువారికి శాస్త్రవ్యాఖ్యానము

లతో పనిలేదు కాని మఱికొందఱు కేవలశాస్త్రమే ప్రధానముగాని మానవత ప్రధానము కాదనియు, శాస్త్రము చాలవఱకు మానవతకు అనుకూలముగానే యుండు ననియు, ఏది యెట్లయినను శాస్త్రసంప్రదాయము ననుబట్టియే ప్రవర్తింపవలయుననియు దెల్పుదురు. మఱికొందఱు మానవతను ప్రధానముగాభావించుకొని తదనుకూలముగ శాస్త్రమును సమన్వయించుచుందురు. నేటికాలమున సంప్రదాయానుబద్ధులమనుకొను ద్విజులు శాస్త్రమునకే ప్రాధాన్యము నొసగిన మానవతాదూరులని చెప్పబడుచున్నారు. కాని శ్రీ దాసుగారు మానవతకు ప్రాధాన్యమొసగి శాస్త్రమును తదనుకూలముగ వ్యాఖ్యానింతురు.

శ్రీ దాసుగారు తెల్పిన తమ గ్రంథరచనా సముద్దేశమును మనముగాంచినచో వారి హృదయము మనకు వెల్లడియగును చూడుడు—

"నాకును మర్త్యలోకమునకును హితమునలంచి మునిమతానుసారముగా శిష్టాచారపద్ధతి దేశకాలపాత్రానుసారముగ మార్చి జగద్ధితమునకై అమూల్యసారము న్దెలుప నాశక్తికొలది ఈగ్రంథమును విప్రేరితుడనై వ్రాయవలసివచ్చెను" (487పు) "ఇట్లెంతకాలము కన్నీరు సముద్రమై యుప్పొంగ ప్రతిమాలి వ్రాసినను, నోటిమాటలను బోధించినను, నిక్కముగా అరణ్యరోదనముగా ఘోరకలికాలము గావింపక మానదని తెలిసియు, ఇట్లు పాత్రవ్రాతన్దెలుపుట నాసహజకృత్యము."

"తన తోటిపాటివారందఱు సుఖముగా నెట్లు జీవింపగలరో అట్టి ఉపదేశమును, ఒరులు విన్నను వినకున్నను పల్కులను వ్రాతలను ఇట్లు వెల్లడించెదను. ఇట్టి వ్రాతల మీమనసు కఱిగించుటకై కలములు కన్నీటిసముద్రమును కల్పించుట నా స్వభావము."

ఒకచోట శ్రౌతస్మార్తకర్మాచరణశీలుర నుద్దేశించి ఇట్లనిరి - "ఓ దంభశ్రౌతస్మార్తకర్మఠుడా! నాకు శిక్షక వైయాకరణాదులతో పనిలేదుగాని, నీకు తప్పక భూతదయయును, సకలజన సమ్మతాచరణ విధానమును బోధించి నిన్నొప్పించి నిన్ను కేవల భాగవతుని జేసినగాని నాచదువునేర్పునకు బలిమేమి? కవినైన సార్థక్యమేమి? ఇంత గ్రంథము రచించిన సాఫల్యమేమి?" (56-71, 71-77 పుట) "పశుహింసను ప్రతిపాదించునట్లు తోచు శ్రౌతకల్పములను ఖండించుకొఱకును, ఉపనిషత్సారభూతమగు "న హింస్యాత్సర్వభూతాని" "అహింసా పరమోధర్మః" అనువాక్యములను

సమర్థించుట కొఱకును "ఇష్టి" రూపముగా ఈ గ్రంథము రచింపబడినదని ప్రాజ్ఞు లెఱుంగునది" (91 పుట)

"సర్వేజనాః సుఖినోభవంతు" అను దృష్టితో లోకులందఱు హాయిగా నుండ గోరుటయే మనుష్యుడాచరింపవలసిన విధియని సకల శ్రుతి స్మృతిపురాణేతిహాసముల తాత్పర్యముగా స్వార్థత్యాగియైన లోకోపకారికి బోధపడును, వాడే ఆస్తికుడు, యజమానుడు, వైదికుడు, అనూచానుడు, పారమార్థికుడు" (1 భా-75 పుట) కావున "వేద శాస్త్రపురాణములన్నియు తాము సుఖపడి ఒరుల సుఖపెట్టుటకే పుట్టినవిగాని హెచ్చు తగ్గులను బోధించి పరస్పరద్వేషమును పుట్టించుటకు గాదు" అని దెల్పిరి

శ్రీ దాసుగారు మానవతావాదియయ్యు ఆమానవతావాదము నిర్దైవతారూపము గాదు. వారు పెక్కుచోటులందు దైవపౌరుషములనుగూర్చి సువిపులముగా చర్చించి లోకవ్యవహారమునకు దైవపౌరుషములు రెండును ఆవశ్యకములే అని తెల్పుచు అందు తుదకు దైవమునందే హెచ్చు మొగ్గుచూపిరి. భారతీయశాస్త్రములలో ప్రధానగ్రంథములగు బ్రహ్మసూత్రభగవద్గీతలలోగూడ ఈ దైవపౌరుషచర్చగావింపబడినది. (చూ. కృతప్రయత్నాపేక్షస్తు విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః" (బ్ర. సూ. 2-3-42) (భ. గీ. 18-13-16) శ్రీ దాసుగారుకూడ ఈ విషయమున ఇట్లు వారి సిద్ధాన్తసారమును ప్రదర్శించిరి—

"ఆకాశము భూతములకన్నింటికి ఆధారమైనట్లు దైవము పౌరుషమున కాధారమైనది. పౌరుషము గుఱ్ఱము. దైవము రౌతు. దైవపౌరుషములు రెండును చేరకే కార్యమును జరుగదు" అని చెప్పి పరమార్థముగా దైవగతిన్ దప్పుకొనుటకు పురుషప్రయత్న మెంతమాత్రము కొఱగాదు. "తుదకున్నదే దైవము, మఱి పౌరుషము లేనేలేదు."

"మిథ్యాభూత పురుషకారము కుందేటికొమ్మువలె అసంభవము. ఎండమావుల వలె భ్రాంతి కల్పితముగాని నిక్కముగా దైవమే వాస్తవమనియు ఆ దైవమే ఆత్మయనియు నాసిద్ధాన్తము" (37 పుట) అని తెల్పిరి.

ఇట్టి దైవానుగ్రహ సంపాదనమునకు యుగభేదముచే పెద్దలు సాధనములను మానుష శక్తిసామర్థ్యములనుబట్టి భిన్న భిన్నములుగా పేర్కొనిరనియు శ్రీ దాసుగారిట్లు తెల్పిరి—

తపః ఫలం కృతయుగే, త్రేతాయాంజ్ఞానముత్తమమ్ ।
ద్వాపరే యజ్ఞమేవాహుః, కలౌకేశవకీర్తనమ్ ॥ అని.

దీనికి పలువురు పలువిధములగు వ్యాఖ్యలుగావించిరి. అందు దాసుగారు — కృతయుగమనగా ఏకాగ్రతపశ్చరణముగావించు సమయము. త్రేతయనగా పదార్థ తత్త్వమెఱిగి యుక్తాయుక్తజ్ఞానముతో సకలలోకహితముగా ప్రవర్తించుసమయము. ద్వాపరమనగా సర్వస్వమును భగవదర్పణము గావించుకాలము, కలియనగా భగవంతుని సర్వదా గుర్తుతో స్మరించు సమయము అనివ్యాఖ్యానించిరి. ఏసమయమునందైనను ఎవ్వరైనను దేవతాప్రీతికొరకు తమ సర్వస్వము నర్పించుట శ్రేయమే, అందు గ్రామదేవతలకుగాని ఇంద్రాదిదేవతలకుగాని జంతువులను సమర్పించువారు అధములు, పాలు నేయి పూలు పండ్లు సమర్పించు వారు మధ్యములు, దయాపరులై హింసచేయక నిష్కామనతో మనోవాక్కాయ కర్మములను సమర్పించువారు ఉత్తములు అని వారు వివరించిరి (ప్ర.భాగ. 4. పుట)

వర్ణాశ్రమ ధర్మవిభాగవిషయమున వారు ఇట్లు నిర్ణయించిరి "వర్ణాశ్రమ ధర్మములు లోకోపకారముకొఱకే మునులు నియమించిరి, అందు - జ్ఞానము, శౌర్యము, కృషి, సేవ అనుధర్మములతో లోకోపకారపరాయణులైన సజ్జనులు పాళ్లభేదమున - జ్ఞానమధికముగాగల వారు బ్రహ్మణులు, శౌర్యమధికముగా గలవారు క్షత్త్రియులు, ఎక్కువవాణిజ్యపు నేర్పుగలవారు వైశ్యులు, మిక్కిలి పరచర్య యందు నైపుణ్యము గలవారు శూద్రులు. లోకోపకారపరాయణులగు నీ బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యశూద్రులు సమానగౌరవము గలవారేగాని వారిలో ఎక్కువతక్కువలు లేవు, గౌరవమర్యాదలందఱకు సమానములే" (12వ పుట) "ఒకేమనుజునియందు ఈనాల్గు ధర్మములు గూడనున్నచో అతడొక్కడే చాతుర్వర్ణ్య స్వరూపుడగు" నని వారి నిర్ణయము. (17 పుట)

ఈ గ్రంథమున దాసుగారు చార్వాక దర్శనము మొదలు ఔపనిషదర్శనము (శాంకర) వఱకు సర్వదర్శనములను ప్రకరణమును బట్టి పరామర్శించిరి అందు "ఈదేహయాత్రకు చార్వాకమతము మొదటి మెట్టు అనియు, జగద్గురు శంకరాచార్యోపదిష్టమగు అద్వైతము తుదిమెట్టు అనియు నడుమనున్న సర్వదర్శనములను మధ్య నున్నమెట్ల"నియు దెల్పుచు నిట్లు వివరించిరి —

చార్వాకమతము దైవమునంగీకరించని నాస్తికమతమని అందఱు చెప్పుదురు. కాని "యావజ్జీవం సుఖం జీవేన్నాస్తిమృత్యోర గోచరః" (బ్రతికియున్నంత వఱకు

హాయిగా బ్రతుకు వలయును. చావనివాడెవ్వడునులేడు) అని చెప్పు చార్వాకుడు గూడ తనకు తెలియకుండగనే దైవము నంగీకరించెనని చెప్పవలయును. ఏలయన, సర్వమునకు ప్రధాన సాధనమగు సమయమనునది మనుజుని చేతిలోలేదు. అదియే సమయా పరపర్యాయమగు దైవము. కావున సమయము నంగీకరించు చార్వాకుడు గూడ పౌరుషమునే గాక దైవము నొప్పుకొంట రూఢి "(27 పు) అనినిర్ణయించిరి, మఱియు దయానిధియగు బృహస్పతి సర్వభూతాను గ్రహముగ నొరుల సుఖపెట్టి జనులు తాముసుఖపడుటకై ఈచార్వాక మతమును బోధించెను. ఈబృహస్పతి మతమునకు కొందఱు తప్పువ్యాఖ్యానములను గావించిరి" అనియు వీరుతెల్పిరి. మఱియు జగద్గురు శంకరాచార్య సిద్ధాన్తమొకటియే యుక్తి యుక్తము; యథార్థానుభవ ప్రత్యక్ష ప్రమాణ సిద్ధమును. తక్కిన ఋషిమతములన్నియు, పామరబోధకై దేవతలను ప్రతిమాదులందు దెల్పియుండును" (180 పుట) అని ఆయాదర్శనముల విషయమై తమఅభిప్రాయమును దెల్పిరి.

శ్రీదాసుగారు పలుచోటులందు వేదనిత్యత్వమును చర్చించిరి. ఈవ్రాతలు వివిధములుగా నున్నట్లు అగపడుచు పరస్పర విరుద్ధము లనిపించును కాని వారు కొన్నిచోటులందు తమసిద్ధాన్తమును తెలుపుదురు. వారు (60 64 పుటలు) ఇట్లు తెల్పిరి -

"శబ్దము వర్ణాత్మకముగాను స్వరాత్మకముగాను కన్పట్టుచు కృతకమగుచున్నది గావున అయ్యది అనిత్యమనియు వేదములు గూడ అంతేఅనియు తార్కికులు చెప్పుచున్నారు, కృతకమన్గా ఇంద్రియదృష్టమై ఘటము వలె (కార్యము) పౌరుషేయము గదా! ద్రవ్యగుణకర్మ సామాన్య విశేషసమవాయాత్మక సప్తపదార్థములు గూడ అట్టివేయగుటచే అయ్యవికృతకములని తార్కికు డేల చెప్పడు? కావున తర్కమునకు ఒకముక్క మొనగాని ఆధారముగాని లేదనియు, ఎన్నటికినితార్కికుడు సంతుష్టుడు కానేరడనియు చెప్పవలయును. తుదకుతార్కికునకు ఆప్తవాక్యమే ప్రమాణము. నమ్మకము చేతనే జనుడు సన్తుష్టుడగును. శబ్దాత్మకమగు వేదము సత్యము; నిత్యము; కృతకము కాదు, కావున తర్కము చిత్తక్షోభహేతువుగాని సంతుష్టిహేతువు కాదని తెల్పిరి (68 పుట) "మఱియు కాలమునకు క్షణము గడియ జాము పగలు రాత్రి దినము వారము పక్షము నెల యేడు మొదలగు విభాగములు మనము కల్పించుకొన్నట్లు శ్రవణైక గ్రాహ్యము ఆకాశగుణమునగు నిత్య శబ్దమునకు అచ్చులు హల్లులు పదములు వాక్యములు ఉదాత్తాది స్వరములు కల్పితములు;

వేదరూపనిత్య శబ్దము ఎన్నడును కృతకముకాదు, దానికి ఆప్తవాక్యమే పరమ ప్రమాణ భూతము. శబ్దతత్త్వవిదులగువైయాకరణులు మాత్రమే శబ్దబ్రహ్మరూపమగు వేదనిత్యానిత్యత్వముల నెఱుంగ గలరు" అని దెల్పిరి.

వారు రెండవప్రకాశమున 68-84 పుటలలో వేదస్వరూపము, వేదచోదితార్థము వైదికకర్మలకు పూర్వమీమాంసా సంబంధము, పూర్వమీమాంసా స్వరూపము, పూర్వోత్తరమీమాంసలకు గలభేదమును సంగ్రహముగను సుబోధముగను నిరూపించిరి.

మూడవ ప్రకాశమున "మిశ్రవాదనిరాకరణ" మనుపేర శ్రీదాసుగారు పార్థసారథిమిశ్రుడు అద్వైతమత నిరాకరణమును గావించెనని చెప్పుచు మిశ్రమతమును ఖండించిన విధమును పరిశీలించినచో వారి తీవ్రౌద్ధత్యము అగపడును. 301-314 పుటలలో వారు నిరూపించిన శ్రౌతవిజ్ఞానమును తెలియ వలసినదే!

వర్తమానకాలమున, ప్రాచీన గ్రంథములలోని వైద్యము జ్యోతిషము తప్ప తక్కిన శాస్త్రములను నీవుతెలియనవసరము లేదనియు ఆరెండే తోడిపాటివారికి ఉపకారము గావించుట కుపకరించుననియు వారి వక్కాణ. వారు యజ్ఞవిధులను శ్రౌత స్మార్త విధానములను ఆయుర్వేద విధానపరములనుగా సమన్వయింతురు. కానిచో సర్వవ్యాపులగు దేవతలకు చేటపీట పొయ్యి తెడ్డులతో పనియేమి అని ప్రశ్నించిరి. మఱియు యజ్ఞవిధులలో యుగభేదములను బట్టి నేడు హింసకు స్థానములేదు, హస్తి పాదమున తక్కిన పాదములు ఇముడునట్లు సకల ధర్మములును మాహింస్యాత్సర్వాభూతాని" అహింసా పరమోధర్మః "అనుసూక్తుల చేవిధింపబడిన అహింసాధర్మమున అంతర్భవించును. కావున ఈకాలమున అహింసయే ప్రధానము, మఱియు - వరికి నివ్వరి, సోమలతను పూతీకప్రతినిధు లయినపుడు పశువులకు బదులు పిష్టపశువులను గాని కాయగూరలను గాని ప్రతినిధులుగా నేల గ్రహింపగూడదు ? అని ప్రశ్నించిరి.

(ఈశ్వర సంకల్పమే బిందువు, ఆ బిందువు ప్రబద్ధలుకాగా పుట్టిన ధ్వనివ్యక్తమగుచున్నది. శ్రుతిసంపన్నమగు ఆరవమే శబ్దబ్రహ్మము అందుండియే సర్వవేదములు, సర్వశాస్త్రములును నుద్భవించినవని వారు తెల్పిరి. భాషయందలి సకలాక్షరములును అకారము నుండియే వివృతము లగుటచే శబ్దములకన్నింటికిని అకారమేమూలము కావుననే జగన్మయుడగు విష్ణువునకు అకారము వాచకమయినది.)

భిన్న భిన్న యుగములలో ధర్మములు తార్మారగుచుండుటను, ఆయాయుగములకు తగునట్లు మునులు ధర్మమును బోధించిరి, "కలౌపారాశర స్మృతః" అనుటచేపరాశరుడు చెప్పినధర్మమునే కలికాలమున ననుసరింపవలయును "దానమేవ కలౌయుగే" అని పరోపకార మొనర్చుటయే కలిజనుల కవశ్యకర్తవ్యము. సోమయాగములు పనికిరావు, వైశ్వదేవముచేసి అతిథిగావచ్చిన ఏ అధమ జాతివానికైనను అన్నపానాదుల పెట్టుట, భూమిసేద్యము చేయుట ముఖ్యకర్తవ్యములు.

"నష్టేమృతే ప్రవ్రజితే క్లీబేచపతితేపతే।

పంచస్వాపత్సునారీణాం పతిరన్యో విధీయతే" (ప్రాయశ్చిత్తకాండ - 28 శ్లో) అనుపరాశర వచనమునకు శ్రీదాసుగారు ఒకవ్యవస్థను గావించిరి, చూ 2-భా (180 పుట)

స్త్రీపునర్వివాహము నంగీకరింప వలయును। దాన వ్యభిచార నివృత్తియగును.

భగవన్నామ సంకీర్తనముకన్న తరించు నుపాయములేదు అని పరాశరుడు చెప్పెను।

ఆయా శాస్త్రకర్తలందఱును చతుర్విధ పురుషార్థములను నిరూపించుచు తుదిని పరమపురుషార్థమగు మోక్షమునందుటకు తమశాస్త్రముచే సిద్ధాన్తముగా నిర్దిష్టమైన మార్గము ననుసరించు వారే ప్రధానాధికారులని చెప్పుట సామాన్యవిషయము, తత్సామాన్యముగా శ్రీదాసుగారు కూడ తమగ్రంథమున అట్లేనిరూపించిరి, చూడుడు -

"మార్గిదేశియని నోటిపలుకు శరీరావయవ చాలనము, వేషము, చతుర్విధాభినయములును (వాచిక - ఆంగిక - ఆహార్య - సాత్త్వికాభినయములు) ప్రత్యేకముగ రెండు విధములు. మార్గియనుచతుర్విధాభినయ సంగీతము మంత్ర బ్రహ్మణాత్మక వేదము వలె అపౌరుషేయము. కేవల బ్రహ్మసృష్టము అతీంద్రియులగు భరతాది మున్యేక ప్రయోగసాధ్యము, కావున ఈమార్గిగాంధార గ్రామమువలె ఈ భూలోకమున వ్యవహారమునలేదు.

వాచి కాంగికాహార్యసాత్త్వికాభినయాత్మకమగు దేశిమాత్రము భూలోకమున ప్రయోగమున గలదు, వేదములు పఠించుటకును శ్రౌతకర్మము లాచరించుటకును సర్వజ్ఞులగుమునులు తప్పకించిడజ్ఞులగు మనుజులు ఎంతమాత్రము పనికిరారు. కావుననే ఋగ్యజుస్సామాథర్వణముల నుండి వాచికాంగి కాహార్య సాత్త్వికాభినయాత్మకమగు గాంధర్వవేదము పంచ జనులగు మనుష్య ఉభయలోకములను దరించుటకు

సంసారులకు స్పష్టమయినది. దేశిసంగీతమునకు కావలసినది లోకరంజనమేగాని దానికి మఱెట్టి నియమములతో పనిలేదు (2 భా. 125 పు.)

"చతుర్విధాభినయములతో అభినయించుచు దైవభక్తిగల్గి లోకమునకు పకృతి గల్గించుటయే అవశ్యకర్తవ్యము"

"స్వార్థపరతమాని భూతదయకల్గి లోకోపకారవ్రతమును కొనసాగించుటకై భకరక్షణ దీక్షా 'పరుడగు పరమేశ్వరుని నిరంతరము నవవిధభక్తి మార్గములతో గొలువవలయుననుయే వేదశాస్త్రముల ముఖ్యతాత్పర్యము' (27 పు)

"పరమార్థము నెఱిగిన మహాత్ములు కేవల శాంతరసమయులై ———వేదశాస్త్ర గ్రంథస్వరూపులై పరమ భాగవతులై" తస్మాద్విద్వాన్ ప్రేపవదేత్, పీవన్నృత్యేత్ (పీవచరేత్) (తైత్తిరీయ) అనువిధివాక్యాను సారముగా ఇహపరసంతారకులై వాచికాంగి కాహార్య సాత్త్వికాభినయము లన్నటించుచుంబామరుల కిహపరలోక సంతరణ మార్గ ముల నెఱిగించుచున్నారు"

"నారాయణుడమృతుండు సవితృమండల మధ్యవర్తియై చతుర్విధాభినయ విద్వాంసునకు మాత్రమే గమ్యుఁడగును"

"వేదములు అభినయ రూపములు. అందుఋగ్వేదము వాచికాభినయ ప్రధాన ము, యజుర్వేదము ఆంగికాభినయ ప్రధానము, సామము ఆనద్ధసుషిరాది వాద్యాలం కృతము, అధర్వణము నవరసాత్మక సాత్త్వికాభినయ ప్రధానము."

'చతుర్విధాభినయ ప్రయోక్తయు వాసుదేవపరబ్రహ్మము నొక్కరే." (340 పు.)
'సంగీతజ్ఞుడగు మనుజుడు మూర్తీభవించిన బ్రహ్మము." (341 పుట)

ఇట్లు శ్రీదాసుగారు సంగీతాభినయాభి నివేశముతో తచ్ఛాస్త్రావశ్యకతను తద్విశిష్టతను ఆత్మద్రష్టాన్తాభిప్రాయమున వివరించిరి.

కాలగతి చాల చిత్రముగా నుండును. ఆదిమనుజులలో ఎన్నెన్ని పరిణతులను గల్పించునో మన మూహింపజాలము. లోకములో కొందఱు పితృపితామహ క్రమ మున వచ్చు వర్ణాశ్రమ వంశాచారములే ప్రధానము సత్యములు అని వాని నెంత మాత్రము మార్పు చేయుటగాని, విడుచుటగాని చేయ జాలక వానినేపట్టుకొని ప్రాకులాడు వారు నేటికిని అచ్చటచ్చట వేకువ జామునందలి నక్షత్రములవలె అగప డుచున్నారు, మఱికొందఱు దేశాకాల పరిస్థితులను గమనించి తదనురూపముగ ఆచా

రవ్యవహారములను మార్పుగా వించుకొని అయ్యది శాస్త్రచోదితమే యని సాటిప్రజ
లకు బోధించుటకై తచ్ఛాస్త్ర విజ్ఞానమును శేముషీవిశేషమును ప్రయోగించుచున్నారు.

శ్రీదాసుగారు తమచిన్నతనమునాడు అనగా హరికథామృత కావ్యరచనా సమయమున ఎట్లు బాధపడిరో గాంచుడు —

'వర్ణాః సంకలితాః శ్రియోవిచలితాః వేదాః పరీభావితాః

గావః క్రూరవిభక్షితాః ఋషిమతం భూమ్యాంవినిక్షేపితమ్." (హరికథామృతం)
ఇందు వర్ణసాంకర్యము గల్గినదేయని ఆనాటి కురుక్షేత్ర సంగ్రామారంభమున అర్జునుని వలె దాసుగారు బాధనందినట్లు స్పష్టము, కాని కాలము గడచిన కొలది దేశకాల పరిస్థితులచే గల్గిన ప్రజల హృదయగతులను బట్టి వారుగూడ — జగమునందలి మానవతాజాతి యొక్కటియే. అందరు మనుష్యలోక్క జాతి వారే — అవివేకులు అన్యోన్యకలహ విద్వేషాదిమూలమున జాతినీతి మతముల ప్రత్యేకముగా కేవల స్వలాభమునకై ఏర్పరచుకొని— చిరకాల జీవనమున సౌఖ్యమును మంటిపాలు చేసికొను చున్నారు. అని పలికిరి. అట్లేవారు తమతారుణ్యమున తాము రాజమహేం (55 పుట) ద్రవరమున కేగినపుడు ఆనాడు సంఘసంస్కరణమను పేర విధవావివాహములను ప్రబోధించు కందుకూరి వీరేశలింగము గారిని "విచిత్రవివాహకర్త" అని అపహాసమును గావించిరి కాని తాములోక ప్రవృత్తిని అవగతము చేసికొని కలియుగమున పరాశరస్మృతి పరమ ప్రమాణమనియు, అందు విధింపబడిన విధవావివాహము శాస్త్రీయమే యనియు నిరూపించిరి.

శ్రీదాసుగారు వేదమును గూర్చి పలువిధములగు నభిప్రాయములను వెలువరించిరి. వారు వేదములో కర్మమును బోధించు పూర్వ భాగము కంటె బ్రహ్మతత్త్వము బోధించు నుత్తరభాగమునే మెచ్చుకొనునట్లు తెలియును. దానికి ప్రధానహేతువులు పూర్వ భాగమంతయు నిత్యానైమిత్తికములగు కర్మములను హింసాసంకలితములగు యజ్ఞయాగాదికర్మములను బోధించుటయే కానొప్పును యజ్ఞవిధివాక్యములకు వారెట్టియర్థములను దెల్పినను పూర్వవ్యాఖ్యాత లందఱును ఆవాక్యములను హింసావరాములుగానే అందు కేవలము జ్ఞానముమాత్రమే బోధింపబడినది కావుననే జ్ఞానబోధకులగు వ్యాస - శంకర - బుద్ధాదులనే పరమ ప్రమాణ భూతులుగా శ్రీదాసుగారు పౌనఃపున్యముగ పేర్కొనిరిగాని జైమిని శబరస్వాములను చేర్కొనలేదు -
(గాయత్ర్యుపాసనము)

ఇకఉపాసన విషయమున వారియభిప్రాయములో ఆదిత్యోపాసనము ప్రథమ కర్తవ్యమనియు, అదిగావింపక ఇతరోపాసనములుగావించినచో ఫలములేకపోవుట సరిగదా, ప్రత్యుత అనర్థములు కూడ కలుగును గావున ప్రధానోపాసనమును గావించి ఇతరోపాసనములను గావింప వలయునని స్పష్టముగా దెల్పిరి (423 పు.)

శ్రీదాసుగారికి అచ్చతెనుగు నందమితప్రీతి, తమప్రీతిని వారు –

"మొలక లేతదనము తలిరులనవకంబు
మొగ్గసోగదనము పూవుదావి,
తేనెతీయదనము తెన్గునకేగాక
పరుషసంస్కృతాఖ్య భాషకేది?"

అనిస్తుతించినను వారు సంస్కృత భాషనే ఉత్తమభాషగా గుర్తించినట్లు ద్వితీయ భాగములోని "శబ్దప్రపంచ నిత్యోత్పత్తి" అనుప్రకరణమున స్పష్టముగ దెల్పిరి. (192–201 పుట) అందు వారు - సంస్కృతభాషను, జగచ్చైతన్యకర కిరణ - స్వరూపాత్మకుడగు సూర్యునితోడను, సకల బ్రహ్మాండమును దనలో నిముడ్చుకొనిన ఆకాశము తోడను సరిపోల్చి చెప్పిరి.

"శిష్టాచారః ప్రమాణం" అనువచనములోని శిష్టులనగా స్వార్థత్యాగులై కేవల లోకోపకార పరాయణులై సర్వభూతదయా పరులైన పరమ భాగవతులే శిష్టులు వారి వచనములే అనుసరణీయములు అని వీరిసిద్ధాన్తము.

ఈగ్రంథమున శ్రీదాసుగారు వాఙ్మయమున ప్రధాన భూతములగు దర్శనములను మూలభూతములగు వేదములను కల్ప శ్రౌతధర్మగృహ్యసూత్రములను నిరుక్తాదిషడంగములను దేశమునగల ఆచారాములను ఇవి అవియననేల, సర్వమును తరచితరచి తమ సిద్ధాన్తములను ఇందుపనిబంధించిరి, తమసమయమునందు గల కొందఱ దంభాచారాములను, ఆసమయమున అచ్చటచ్చట కొలది కొలదిగా వెలయుచున్న కొన్ని సంస్కారములను పరిశీలించుచు తమకు నచ్చినవానిని ప్రమాణీకరింప యత్నించిరి తమ్ము ఆక్షేపించిన వారిని తమతీవ్రములగు వాక్కులతో ఎదుర్కొనిరి,

తీవ్రమగువాక్కు, నిశితమగు బుద్ధి, అసాధారమగు లోక పరిశీలనము, సర్వశాస్త్రవిజ్ఞానముగల వారల విమర్శనము లెట్లుండుననుటకు శ్రీదాసుగారి యీ జగజ్జ్యోతి గ్రంథమే యుదాహరణము, ఒకదృష్టితో గాంచినచో శ్రీదాసుగారు మానవతావాది, వారిహృదయము సుమానుషము. ఒకచోట వారు ఇట్లందురు – "వేదములు శాస్త్రములు పురాణములు ఉపన్యసించుట వ్రాయుటకంటె ఆకలిగొన్నవానికింత పట్టెడు కూడుపెట్టుట కోటింతలు మేలుగదా" అని.

వారికొన్ని సిద్ధాన్తములు ఎంత విచిత్రములో కాంచుడు, ఉదాహరణమునకు -
"కన్నతల్లి భూమియొక్క సారమును చీల్చుకొని తక్కిన యవయవములనన్నింటిని
కాపాడు తనపాదములకు భూసారము ఎక్కనీయక చెప్పులు తొడుగుకొని తనయడు
గులకు సుఖంకర భూస్పర్శమును తప్పించుటచే పాదరోగములు కల్గుచున్నవి, ఇట్లే
తనసకలా వయవములకును లేనిపోనితొడవులు కల్పించుకొనియు, వంటకములన్నజగి
పానీయములను అగ్గిసెగను వండిమఱగించి కృత్రిమ కల్పనములచే సహజారోగ్య
దశం జెఱచి, ప్రకృతిన్ వికృతింగావించుకొని కోరికష్టములకు బాలై అల్పాయువు
లగుచున్నారు" (431 పు.)

ఇక తుదిదగు నెనిమిదవ ప్రకరణమున పూర్వము చర్చించిన విషయములనే
ప్రధానముగాజేసికొని, బ్రహ్మరూపము కైవల్యము, సంసారము, లోకస్థితి కర్మము
జాగ్రదాదిస్థితులు, సంగీతసాహిత్య సంబంధములు, విద్యాద్వైవిధ్యము ఆకాశపదార్థా
వశ్యకత, కీటాదులకు గల అమానుషశక్తి సంపదమున్నగు బహువిషయములను
పూర్వమీమాంసాన్యాయ శాస్త్రరీతుల ననుసరించి నిరూపింపబడినవి ఇందు తీవ్రవాక్శ
స్త్ర ప్రయోగము లేని కేవలశాస్త్ర విషయ ప్రదర్శన మాత్రమే, ఇది శ్రీదాసుగారి
న్యాయవ్యాకరణ పూర్వోత్తరమీమాం సాదిశాస్త్రవిజ్ఞానమునకు మణిదర్పణ మని
చెప్పుట ఎంత యోయుక్తము,

ఇట్టి శ్రీదాసుగారి సిద్ధాన్తములతో ఏకీభవింపని వారు పెక్కురుండవచ్చును,
హృదయశూలములగు తీవ్రశబ్దజాలములతో దూషణము లేకున్న బాగుండునని కొంద
ఱు తలంప వచ్చును, కాని తమమనోగత భావములను ఆక్షేపించువారలకు అట్లే
సమాధానము చెప్పవలయునని వారిభావన. ఏది ఎట్లున్నను ఐకమత్యముతో జనులు
జీవయాత్రను గడుపవలయునను వారి ప్రధానాశయముతోడ విప్రతిపత్తి ఎవ్వారలకు
గూడ గలుగదు.

ఇట్లు శ్రీదాసుగారు గహనములగు శాస్త్రరహస్యములను ప్రమాణములతో
పండిత పామర సుబోధమగు నట్లు తెలియ జెప్పి తరింపజేసిరనుట పరమ సత్యము
ఇట్టి లోకోపకారక గ్రంథసంతరణమునకు వారికివేనజోహారులు,

ఇట్టి యుత్తమ గ్రంథమునకు సమీక్షవ్రాయ నవకాశము గలుగ జేసిన సాహి
త్యప్రియులు సహృదయులు శ్రీకట్టా ఈశ్వరరావు గారికి నాహార్దికములగు అభినందన
ములను అర్పించు కొనుచున్నాను,

# జగజ్జ్యోతి

## అయిదవప్రకాశము

### శబ్దసిద్ధి

"నిర్వాణోఽవాతే" అను పాణిని సూత్రమున వింతసాధనమున దీపమాఱిపోఁగా నిర్వాణోదీపః అనియర్థము చెప్పిన పాణిని యర్థమే సహేతుకముగ నున్నది. ఒకప్పుడు వాస్తవముగాఁ గార్యజనక కారణమున్నయెడ నింకొకప్పుడు లేకుండుటెట్లు? కాఁబట్టి యొకప్పుడున్న పదార్థము రూపభేదము గొన్నప్పటికి బొత్తిగా నే స్థితిలోనైన లేకుండుటెట్లు? బ్రహ్మకారణము, జగత్తు కార్యమను నుపనిషన్మతమే సమంజసముగాని, చార్వాకబౌద్ధాది మతము లెంతమాత్రమును సమంజసములు ముమ్మాటికి న్గానేకావు. "తస్మాత్త్రిపుండ్రం విప్రాణాం నధార్యం మునిసత్తమాః" కాఁబట్టి బ్రాహ్మణు లెట్టియూర్ధ్వపుండ్రములయిన నధరించఁగూడదు - అను వసిష్ఠస్మృతి ప్రకారము నారాయణు నర్చించనివాఁడు బ్రాహ్మణుఁ డెంతమాత్రము న్గానే కాఁడని యూర్ధ్వపుండ్రములచే నలంకరించుకొన్నవారు బ్రాహ్మణులుగాని వైష్ణవులుగాని యెంతమాత్రము న్గానేకారని సిద్ధాంతీకరింపఁబడెను. ఇప్పటి యూర్ధ్వపుండ్రధారులగు వైష్ణవులును నారాయణునిదప్ప నితరదేవతలం భజించువారును బ్రాహ్మణులుకానేకారనియు సాధించు సకల మునిశ్రేష్ఠుఁడగు వసిష్ఠవాక్య మిప్పు డుల్లంఘించిరో!! యధునాతనాస్తిమ్మన్యులు.

వేయేండ్లక్రింద జరిగినది పరోక్షమని కొందఱు, నూఱేండ్లక్రింద జరిగినది పరోక్షమని కొందఱు, రెండుదినములక్రిందట జరిగినది పరోక్షమని కొందఱు గోడతెఱ మొదలయినవాని చాటున జరిగిన పని పరోక్షమని కొందఱు వైయాకరణు లభిప్రాయపడుటచే శబ్దముల

రూపనిష్పత్తిని గుఱించికాని శబ్దార్థములఁగూర్చికాని నానాభిప్రాయ
ములు ప్రాచీన వైయాకరణు లిచ్చుటచేతను నిక్కముగా నేకాల
మున నెట్లు శబ్దము నదర్థము నెచ్చటెచట నెట్లు వాడఁబడెనో యట్టి
శబ్దములును దదర్థములును నాయాదేశముల నాయాకాలములవాడుక
యొక్క ప్రాచుర్యమునుబట్టి యప్పటికి సాధువులే. కాఁబట్టి దేశ
కాలముల వాడుకను బట్టి శబ్దములకును దదర్థములకును వ్యాకరణ
మేర్పడుచుంటచేత "ప్రయోగశరణా వైయాకరణాః" అను
వాక్యానుసారముగా లక్ష్యలక్షణములు దేశకాలానుసారముగా సకల
కర్మములందు మాఱుచుంటచేత మనుష్యులేర్పఱిచినపద్ధతులకు వ్యవస్థ
యెద్దియు న్లేదు. "నమ్లేచ్ఛితవైనాపభాషితవై" అబద్ధముగాను
సందిగ్ధముగాను మఱి యస్పష్టముగాను మఱియు నపభ్రంశముగాను
బలుకఁగూడదను నియమము దేవతాప్రీతిగా నొనర్చు యజ్ఞమునందు
మాత్రమేగాని లౌకికభాష కెంతమాత్రము నెట్టి నియమమును లేదు.
"ఏకశ్శబ్దస్సుష్ఠు సంప్రయుక్తః-అప్రసిద్ధమపుష్టార్థమ్" సార్వలౌకిక
ముగా నొనర్పఁబడిన కావ్యములందు సలక్షణ శబ్దములు నియమింపఁ
బడెనుగాని లోకవ్యవహారమున దేశ కాల పాత్రానుసారముగా
యథేష్టశబ్దములను మాట్లాడుకొనవచ్చును. మఱియును వ్రాసికొన
వచ్చును. మఱియు నితరుల కెవ్విధమయిన యపకారము నొనర్చ
కున్నయెడల నెట్టి శబ్దములయిన మాట్లాడువచ్చును. మఱియును
సర్వజనవిదితముగా గ్రంథరచనఁ గావించుకొనవచ్చును. తన యభి
ప్రాయమును సంపూర్ణముగా వెల్లడింపఁగలిగి యెవ్వరిని నొప్పించని
ప్రతిశబ్దమును సలక్షణమైనదే కాఁబట్టి లేనిపోని కట్టుబాట్లను వ్యావ
హారికభాషకొఱకై మును లెంతమాత్రమును శబ్దానుశాసన మొనర్చ
లేదు. కాఁబట్టి వేదాంగములాఱును షడ్దర్శనములును సకల భూతదయ

నుద్బోధించుచు సర్వలోకోపకారముకొఱకు మాత్రమే మును లుపదేశించినారు. కాని తెలిసీ తెలియని ప్రాకృతు లావేదాంగములకును షడ్దర్శనములకును స్వార్థపరులై పండితులమనుకొని భూతహింసను ప్రతిపాదించుచుఁ దప్పు వ్యాఖ్యానములను భాష్యములను గావించుట దుష్కాలక్రూరచేష్టితమని భూతదయాపరులును సకల లోకోపకార పరాయణులును లోకమంతటను దప్పవేయకతీఱదు. సర్వవేదశాస్త్రము లందెల్ల నతీంద్రియదర్శిష్టలు పరమకారుణికులు సర్వభూతసములు సకల జగద్ధితులగు మునులు లోకోపకారములు సకలభూతదయాపరము లయిన కర్మములను మాత్రమే త్రికరణశుద్ధిగాఁ జేయవలసినదని మాత్రమే యుపదేశించిరని మువ్మాటికి నృబద్ధిమంతులందఱు న్నమ్మి కొని వ్యవహరించి యిహపర సౌఖ్యము నందుచున్నారు.

## —: నాదబ్రహ్మప్రశంస - ఛందశ్శాస్త్రనిర్ణయము :—

"అపరఆహ - కశ్చిద్వైయాకరణ ఆహఅన్యే వైయాకరణాః కేచిత్ కేచిత్ ...ఏకే—అపరే" అని భాష్యమం దనేక వైయాకరణుల నానాభిప్రాయములు శబ్దసాధుత్వమునుగూర్చి యంగీకరింపఁ బడుటచేత ననేక వైయాకరణుల యభిప్రాయానుసారముగా నానా దేశకాలపాత్రానుసారముగా నుచ్చరింపఁబడు వ్యావహారికభాష కొక నియమములే కెక్కడికక్కడే సాధువగుచున్నది. వేమాటలేల! ఛందస్సునఁగాని లోకమునఁగాని లోకోపకారకములగు వాచికాంగికాహార్య సాత్త్వికాభినయవిశేషములన్నియును నిర్దుష్టములే పఱియును లోకుల నొప్పించు మనోవాక్కాయకర్మ విశేషములన్నియును మిక్కిలి దోషములేయని నిర్దేశింపకతీఱదు. "సన్న్యసేత్సర్వకర్మాణి వేదమేకం నసన్న్యసేత్" అను నాచార్యోక్తి ననుసరించి లోకోపకారముగా నాశ్రితులను నడపించి రక్షించుదైవభక్తిని మాత్రము విడువఁగూడదు

గాని తక్కిన లోకవ్యవహారములనెల్ల విడిచిపెట్టవలయును. వేద మనఁగా జగత్సృష్టిస్థితిలయ కారణమగు దేవునిగూర్చి పరోపకారముగాఁ దన బ్రతుకు కొనసాగించుటకై నిరంతరము చేయు ప్రార్థనము. "తత్ర పీలు శబ్దో వృక్షాకృతౌ పుంలింగః ఫలాకృతౌ నపుంసకలింగః" పీలు శబ్దము వృక్షమునకర్థమైనపుడు పుంలింగము ఫలమునకర్థమైనపుడు నపుంసకలింగమనుటచే వేదమందుఁదప్ప వ్యావహారికభాషయందు శబ్దమునకుఁగాని యర్థమునకుఁగాని లింగమునకుఁగానియొకనియమమెద్ది యున్నానరాదు. వాడుకననుసరించియే లౌకికభాషలు ప్రయోగింప వలయును. మఱియట్టిభాష సకలజనరంజకముగాఁ బ్రయోగించినపుడే యాభాషలు సలక్షణములనియును వ్యాకరణసాధువులనియుం జెప్పఁ దగును. నెపములు కొండెము లిచ్చకములు దబ్బరలు గద్దింపులు బెదరింపులు తిట్లు ప్రాణిహింసాకరములగు వాక్కులు మొదలగు సంజ్ఞలన్నియును వ్యాకరణసాధువులును సలక్షణములు సుశబ్దము లెంతమాత్రము న్గావు కావు. మఱలమఱలఁ జెప్పవలసినసంగతి యేవిధముగానైనఁ బ్రాణిహింసాకరములు మనస్సునొప్పించు పలుకులు గాని మఱెట్టికర్మములు గాని యెంతమాత్రమును బ్రయోగార్హములు కావనియే సర్వశాస్త్రకారులగు మునుల ముఖ్యాభిప్రాయమని నిర్దేశింపకతీఱదు. ఉణాది సూత్రములు-ధాతుపాఠము-ప్రాతిశాఖ్యములు - ఫిట్ సూత్రములు-నిరుక్తము మొదలగు వ్యాకరణ నియమములన్నియు వేదములఁగూర్చి మాత్రమే యుద్దేశింపఁబడుటచేతఁ బాణినిమునికంటెఁ బ్రాచీనములుగాఁ గన్పట్టుచున్నవి "తమేర్వాక్చ-తమేరూల ప్రత్యయః పుగాగమోదీర్ఘశ్చ-తామ్యతితేనేతి తాంబూలమ్" ఈ తీరుగా వ్యావహారిక భాషను వేదభాషను సార్వలౌకికముగా నిరంతరము నిల్పఁగోరి తమ తమ యభిప్రాయానుసారముగా యాస్కముని మొదలగువారు సంస్కరించిరి.

గాలివానలూ భూకంపములూ మొదలగు నసాధ్యభీతికోపద్రవములనుండియును మఱియీతిబాధలనుండియును దప్పించుకొనుటకు నాపౌరుష మెంతమాత్రమునుబనికిరాదు. కాఁబట్టి యెందుకైన ధైర్యము నిల్వకుండెను. కాలమునకు నా దేహములొంగి నావశముకాకున్నది శ్రమముమాత్రమే యనుభవించుట నావంతై యున్నది. "నీవేతప్ప నితఃపరంబెఱుఁగమన్నింపఁగదే దీనుఁడ నావే యీశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా" యను భాగవతవాక్యముకన్న సంస్కృతము సలక్షణమును నేర్వఁదగినదియుఁ బ్రయోగింపఁదగినదియు నుపదేశింపఁబడఁదగినదియు వాక్యముచ్చరింపఁదగిన దెద్దియునుగాదు. లోకోపకారమును దైవప్రార్థనమును దెల్పని శబ్ద మపశబ్దముగాని సుశబ్ద మెంతమాత్రము న్గానేరదు. "ప్రస్తావాదథ వౌచిత్యాద్దేశకాలవిభాగతః శబ్దైరర్థాః ప్రతీయంతే నశబ్దాదేవకేవలాత్" కాఁబట్టి యేశబ్దమైనను జనులకుఁ బరస్పరోద్దేశమును వెల్లడింపఁగలిగెనేని సలక్షణ సంస్కృతశబ్దమే యగును. ఈశబ్దమిట్లుండవలెనను నియమమక్కరలేదు నిత్యములగు వైదికశబ్దములకుఁదప్ప ననిత్యములగు లౌకిక వ్యావహారికశబ్దముల కొఱకు వ్యాకరణలక్షణ మెద్దియు నవరసములేదని మున్మాటి కెఱుంగవలెను. పరులకుఁ దనయభిప్రాయమును వెల్లడించునట్లు లౌకికశబ్దము లెట్లైనం బ్రయోగింపవచ్చును. దేవుఁడు-ఇల్లు-తండ్రి-తల్లి-కొడుకు-కూఁతురు-కుక్క-ఆవు-మనస్సు-కన్నీరు-గొడ్డలి - చెట్టు మొదలగునర్థములిచ్చు ననేకశబ్దములింమించుచొక్కలాగ ననేకభాషలలో వాడఁబడుచుంటచే నేభాషనుండి యేభాష పుట్టెనో చెప్ప సాధ్యము కాదు.

(ఋగ్వేదసంహితకు పదిమండలములు - ఇరువదినాల్గధ్యాయములు (1) మొదటిమండలమున 24 అనువాకములు 191 మంత్రములు (2) మండలమున 4 అను. 45 మంత్ర. (3) మ. అ5

మం.62,(4)మం. ఆ 6. మం. 58 (5) 6. 87 (6)6. 75(7) 6. 104 (8) 10.92 (9) 7. 114 (10) 12. 191 మొత్తముపై పదిమండలములు 85 అనువాకములు 1028 మంత్రములు. బాష్కలశాఖాను సారముగా 1025 మంత్రములు 64 అధ్యాయములు 2006 వర్గములు కలవి. 64 అధ్యాయములు-2006 వర్గములు-10417 పద్యములు. శౌనకమతానుసారముగా 1058 1/2 శ్లోకములు 10616 శ్లోకము లని యును 2042 వర్గములు 10622 శ్లోకము లనియును. ఋగ్వేదసంహిత. యందలి పదములు 153826. ప్రతిశ్లోకమునకు 14 గాని 15 గాని పదములు. క్రమచర్చ పదములు 110704 and the number of syllables are 452000 మఱియు శ్లోకములు 10402 గాయత్రియందు 2451, ఉష్ణిక్కు 341 అనుష్టుప్ 855, బృహతీఛందస్సునందున్న శ్లోకములు 181 పంక్తి 312, త్రిష్టుప్ 4253 జగతి 1348 అతిజగతిలో 17, శరక్వరి, 26 అతిశరక్వరి 9 అష్టి 6, అత్యష్టి 84 ధృతి 2 అతిధృతి 1 ఏకపది 6, ద్విపదలో 17 ప్రగాథబర్హత 194 కాకుభ 55 మహాబర్హత 25 వెరసి 10402 శ్లోకములు.) అన్ని వేదములకును ఋగ్వేదము పాదు. సకలాష్టాదశ విద్యలం బ్రకటించు వైఖరులును, మఱియును జగమునందలి సమస్త మానవకోటులు మాటాడుకొను భాషలన్నియును సకలవైఖరీకారణములయి పదునాల్గు మాహేశ్వరసూత్రములంబట్టియే పొడచూపుచున్నవి. ఇంతియేకాక నిక్కముగ నుదాత్తానుదాత్తస్వరితప్రతచ్యయాదిస్వరవిశేషాత్మకములయి ప్రవహాణ వాయువశమునొందారు నాశ్రయించి గ్రహగతిపరిభ్రమించు మూలభేదములవలన బుట్టిన యనాదిశబ్దమునకు మనుష్యుల యుపయోగమునకై వైఖరీమూలముగా నానాభాషలకుఁ బుట్టిల్లుగా నాదిపురుషుడు భగవంతుఁడు సర్వభూతదయాపరుఁడునగు మహేశ్వరుఁడు అ-ఇ-ఉణ్ మొదలగు చతుర్దశ సూత్రములను మనుష్య లన్యో

న్యము తమ యభిప్రాయము తెఱిఁగించుకొనుటకై వైఖరీమూలము గాఁ బాణిని మొదలగు నాదివైయాకరణులకుపదేశించెను. పరమ కారుణికులగు నాయాది వైయాకరణులు సకలలోకోపకారకముగా ఋగ్వేదాతిచ్ఛందస్సులను యథాపూర్వకముగా లోకములో నిల్పుట కొరకును మఱియును మనుష్యుల యభిప్రాయములు వాగ్రూపకము గాను గ్రంథరూపముగాను వెల్లడించుకొను సౌలభ్యము నుద్దేశించి యును నానా వ్యాకరణములం బ్రచురించిరి.

ఉదాత్తాది స్వరములు పురుషరూపములు. కకారాదివ్యంజన ములు స్త్రీరూపములు. ఈస్వరవ్యంజన మిథునములనుండి స్త్రీ పురుషమిథునములవలన నానాజంతువృద్ధియయినరీతిని గ్రమక్రమముగా నొక యుదకబిందువున కొక బిందువు కలసి మహాసముద్రములయిన చందమున ధ్వనివిశేషములచేరికచే సప్తాదశవిద్యలును మనుష్యభాష లన్నియును బ్రవృత్తినివృత్తులనందుచు జగమువలెఁ గార్యరూపము లుగానున్నవి. పరా-పశ్యన్తీ-మధ్యమా-వైఖరులకెల్ల మూలమును మఱియు సకలజగత్కారణమును నాదబ్రహ్మము. ఇంతకును బ్రాకృ తులగు మనుష్యులయూహకు నవాఙ్మనసగోచరమగు నాదబ్రహ్మ తత్త్వమందదు. దైవముకారణము-పౌరుషముకార్యము-మృద్ఘటముల కి భేదమయినట్లు దైవపౌరుషములకభేదము చెప్పకతీఱదు. మృత్తువలె దైవము నిత్యకారణము. ఘటమువలెఁ బౌరుష మనిత్యకార్యము. పెక్కుతర్కములేల, సకలజగత్క్రియలకెల్లదైవమే ముఖ్యకారణము దైవమవాఙ్మనసగోచరపదార్థమనిమాత్రము తెలిసికొనబడెను. స్వార్థ పరులుగాక కేవల లోకోపకారపరాయణులగు పరమభాగవతులకు మాత్రమాదైవము ప్రత్యక్షమగునని నిశ్చయింపకతీఱదు. పరమ భాగవతుఁడే కేవలముగా మనుష్యరూపముగానున్న దైవమని బుద్ధి మంతులు తెలిసికొనుచున్నారు. భగవంతునకుం బరమభాగవతునకు

స్వర్ణకటకములవలె నామరూపభేదమేగాని వస్తుభేద మొకింతేయును లేదు. నాదాత్మకమగు పదునాలుగు మాహేశ్వరసూత్రముల మూలమునఁ బదునాలుగు షడ్జాదిస్వరాత్మశ్రుతులు పదునాల్గు భువనములు నానావిధభగవన్మాహాత్మ్యము న్వెల్లడించు పదునల్గురు ప్రహ్లాదాది పరమభాగవతులు విలసిల్లి విష్ణుస్వరూపమును వెల్లడించుచుంట ప్రాజ్ఞులెల్లరు గనిపెట్టవలసిన ముఖ్యాంశము.

ఏయింద్రియప్రవృత్తియైనం గలుగనీక సర్వము విష్ణుమయమని నిరూఢజ్ఞానమున కేవలానందమునఁ బ్రహ్లాదుఁడు, నాదబ్రహ్మోపాసనమున హరికథలఁ బాడుచు నారదుఁడు, సమాధినంది పరాశరుఁడు, తపస్సుచేఁబుండరీకుఁడు, త్రిభువనములకును జ్ఞానోపదేశముచే వ్యాసుఁడు సజ్జనారాధనముచే నంబరీషుఁడు, బ్రహ్మజ్ఞానముచే శ్రీశుకుఁడు, శౌనకపురాణకథనముచే శౌనకుఁడు, బ్రహ్మచర్యవ్రతముచే భీష్ముఁడు, బ్రహ్మధ్యానముచే దాల్భ్యుఁడు, అనశనవ్రతముచే రుక్మాంగదుఁడు, దుష్టసంహారవ్రతముచే నర్జునుండు, స్వధర్మ పరిపాలనముచే బలిచక్రవర్తియు, నవవిధభక్తిమార్గములచే విభీషణుఁడును, స్వార్థపరతమాని లోకోపకారపరాయణులై సర్వకర్మములను భగవదర్పితములు కావించుటచేఁ బరమభాగవతోత్తములునాఁబరగిరి. నిత్యమగునాదబ్రహ్మమును బరమపురుషుఁడగు శివుడక్షర సమామ్నాయముగాఁ బదునాల్గు సూత్రములను జగదుపకారముగాఁజేసిన న్జేయనీ పాణిన్యాది పరమమును లాసూత్రముల ననుసరించి వ్యాకరణశాస్త్ర మొనర్చనీ, కాని ప్రాకృతుఁడవగు నో వైయాకరణసూచీ! నీ వానాదబ్రహ్మతత్త్వ మెఱిఁగినట్లు డాబుచేయుచుంటివా చాలుచాలునీవ్యాకరణజ్ఞానము - నీ ముఖమువలె వెల్లిచూపుచున్న దింక మొట్టలో మొట్టని మొండిచెయ్యి బయలుపర్చు మోశిక్షకుఁడా యెవని కంపు వాస కింపన్నట్లు నీఘ్రాణము ననుసరించి యొరులఘ్రాణశక్తిని వివరింప నెంచితివా ?

ఏదీ "ఇషేత్వోర్జేత్వా" అను శ్రుతియందు "ఇషే" అనునపుడున్న
స్థాయి "త్వోర్జే" అనుట కెంత క్రింది కనుదాత్తమొనరించెదవో? ఉదా
త్త శ్రుతి కనుదాత్త శ్రుతికి నెడమెంతో? "ఉచ్చైరుదాత్తః నీచైరను
దాత్తః" ఒక స్థాయి యేర్పడినపిమ్మటఁగదా యాస్థాయికంటె హెచ్చు
తగ్గులు పలుకవచ్చును? హెచ్చుతగ్గులనఁగా ధ్వనియొక్క స్థూల
సూక్ష్మదశలా? లేక, శ్రుతిస్థాయి స్వరభేదములా? ఉదాత్తానుదాత్త
స్వరిత ప్రచయస్వరము లే శ్రుతులంబట్టి పలుకుచున్నావో నీకెరుకా?
"శ్రుతిస్థానేస్వరాన్వక్తుం నాలం బ్రహ్మాపిత త్త్వతః జలేషుచరతాం మార్గం
మీనానాం నోపలభ్యతే" అని దేవమునియు శిక్షకాగ్రణియు నగునార
దుఁడే వక్కాణించుచుండఁగా మూఢవిశ్వాసముతో గతానుగతికుఁడవై
"శతాంధాః కూపం ప్రవిశన్తి" యనునట్లు సర్వవిదుఁడననియు లక్షణవేత్త
ననియు మాగురువుగారిట్లే యుచ్చరించినారనియు మాయూరిపాఠ మిట్లే
యనియు నిద్దియే సుస్వరమనియును స్వార్థపరత న్సంచరించు నో ప్రాకృ
తచ్ఛాందసమ్మన్యుఁడా బొంతకాకిలా గనపస్వరముగా శ్రుతుల నుచ్చ
రించి యన్యాయముగా గ్రుడ్లగూబయార్పువలె నాశీర్వాదించుమిషతో
న గ్రతాంబూలమాసించు నీయపస్వరాశీర్వాదము నెందఱి నన్యాయ
ముగాఁ జంపుచున్నదో! చాలు నీపాటి నోర్మూసికొను-నీకు షడ్జాదిస్వర
జ్ఞానమా! మన్నా! "చతుశ్చతుశ్చతుశ్చైవ షడ్జమధ్యమపంచమాః
ద్వేద్వే నిషాదగాంధారౌ త్రిస్త్రిః ఋషభధైవతౌ" అనునపుడు "తీవ్రా
కుముద్వతీ ఛందః" అను శ్రుతులయందు షడ్జాదిస్వరాత్మకోదాత్తాను
దాత్తాదులు సరిగా నుచ్చరింప నీతరమా? "అక్షతాశస్త్రరూపేణ వజ్రం
పతతిమస్తకే" అను పతంజలివాక్కు నలక్ష్యముచేసి ఘనపాఠీసని
మూఢులం బెదరించి పిశాచమువలె ఛాందసమ్మన్యుఁడా! ఇఁటింట
ముష్టిదండుకొని "ఉదరనిమిత్తం బహుకృతవేషం" అనునట్లు నీ యాచ
నముచేతను మఱి నీయపస్వరోచ్చారణచేతను సుఖముగా బ్రతుకు

చున్నలోకులను దంభుఁడవై యూరకేలచంపెదవు? చాలుచాలు-శిక్షా
ఘ్రాణదుర్గంధ మవలికిఁ బొమ్మో ప్రాకృతపాతకాధమా!- నారదాది
మునులకు వేదపఠనశక్తి చెల్లినఁజెల్లనిమ్ము నీబోఁటిసహజమూర్ఖాత్ము
న కుదాత్తాదిశ్రుతుల నుచ్చరింపఁ దరమా? నీవనుకొన్న లక్షణ మవ
లక్షణమింక బయల్పడుమోఘన్దఃపండితమా! నీలఘువనఁగా నెంత పరి
మాణము? గురువునకు రెండులఘువులు మఱియు మూఁడులఘువులు
ప్లుత మనుచున్నావుగదా? ప్లుతకాలము "త్రకామ్" అను గొల్ల
దానికూతవంటి కాలమనుచున్నావు. నూఱుతామరరేకులు సూదితో
నెంతలో గ్రుచ్చఁబడినవో యట్టిది కాలమనియును మఱి యాకాలము
పెరిఁగినకొలంది క్షణకాష్ఠనిమేషాది కాలవిశేషములనియు నర్ధమా
త్రము మాత్రము లఘుగురుప్లుతము లనియును శాస్త్రసంజ్ఞల న్గ్రుమ్మ
రించుచుంటివి. మానుషపితృదేవాది మానములకాల మనంత విధ
ములుగదా? కంటిరెప్ప వేసినకాలము పలమందులో వేయియవవంతు
తత్పరమందు సహస్రభాగము ముహూర్తము గనుక కాలమును గణిం
చుట దేవగురువగు బృహస్పతికైన శక్యము కానిచో "క్" అను
హల్లును వ్యక్తీకరింపఁజేయు నకారాద్యచ్చులు కలుపక తీఱదుగా?
అయకారాదిస్వరము లుచ్చారణమున నిల్చునవధి కాలమెంత?
పలమా? తత్పరమా? ముహూర్తమా! లేక, నిమేషమా? మొదట
మాత్రాకాలమెఱిఁగినపిమ్మటఁగదా యొకమధ్యకాల మేర్పడినపిమ్మట
నంతఃంటె ద్రుతము మఱి విలంబమును బొడగట్టును "క్" అను
కేవలహల్లుచ్చరింపఁదరముకాదుగా? అందుపై నచ్చుంచి యుచ్చరింప
వలెను. అయచ్చుచ్చరించుకాలమెంత? మఱి యాయచ్చుతోఁ బలుకు
కకారాదు లుచ్చరింపఁదగుకాలమెంత? లఘుగురుప్లుతనిర్ణయ మచ్చు
లకా? లే కాయచ్చులఁగూడుహల్లులకా? "శ్రీరామ" అను పద
మున రా గురువు మ లఘువు శ్రీ గురువు. మొత్తముపై నామూఁడ

క్షరములుకూడితగణ మనుచున్నావు. మఱి శాస్త్రవిశేషములచే నక్షర చ్ఛందస్సు గణచ్ఛందమునని నానాగణములు నిరువదియేడు ఛందములు సమవిషమవృత్తములు గాయత్ర్యాదినామకచ్ఛందోవిశేషములతో వాఙ్మయముయొక్క యడుగుజాడల మఱి యానడక చమత్కారముంజెప్పుచున్నావుకదా? మొట్టమొదట నీయడుగులిడువిధము నీ కెఱుకా? యెప్పుడెంతకాలమున నీయడుగుపడుచున్నదో? కాలవశమున నీ వెట్లు తోట్రుపాటునడక నడచుచున్నావో నీయడుగే నీస్వాధీనములో లేనపుడు నాదబ్రహ్మాత్మకమగు సరస్వతిన్నడుప నీతరమా?

మంత్రబ్రాహ్మణాత్మక వాఙ్మయమునకు వేదమని సంజ్ఞ. నియతస్వరయుక్తముగా మంత్రము పఠించవలెను. బ్రాహ్మణము యథేష్టస్వరమునఁ బఠింపవచ్చును గాఁబట్టి బ్రాహ్మణముతప్ప మంత్రము పఠించుటకుఁ బ్రాకృతు లర్హులుకారు. నియతస్వరమున మంత్రముచ్చరించుటకు బ్రహ్మయైనఁ జాలఁడని నారదమహర్షి వక్కాణించుటచేత లౌకికులగు మనుష్యులు మంత్రమును బఠించుటకుఁగాని యుపదేశించుటకుఁగాని యెంతమాత్రమును బనికిరారు. మంత్రము దేవరహస్యము గనుకనే మంత్రమనుపేరఁ గొంత వేదము పరఁగుచున్నది. ఆ మంత్రము వ్రాయఁదగదు. పఠింపఁగూడదు. మఱి యుపదేశింపఁగూడదు. ప్రాకృతులు ఋగ్వేదాది త్రయీమంత్రమనుకొన్న వేదమంత్రములు కృత్రిమములుగాని వాస్తవములుకావు. వాస్తవవేదమంత్రముల స్వరములు "తీవ్రాకుముద్వతీ మందాది" శ్రుతులప్రకార ముచ్చరింప బ్రహ్మకైనఁ దరముకాదని దేవముని వక్కాణించుటచేత మనుష్యులనుకొన్న ఋగ్వేదాది వేదమంత్రములు నిశ్చయముగా మనుష్యకల్పితములుగాని వాస్తవములుకావు. కాఁబట్టి మనుష్యలోకమునఁ బ్రసిద్ధమగు వేదములుగాని వేదాంగములుగాని నిశ్చయముగా ననాది సంప్రదాయసిద్ధములగు మనుష్యకల్పితములు

గాని యెంతమాత్రమును నిత్యములనిగాని యపౌరుషేయములనిగాని చెప్పరాదు మఱేమన లోకోపకారపరాయణులు నతీంద్రియద్రష్టలు నగు మునులు మానవధర్మరక్షకై భారతమువలెఁ గల్పించిన కల్పనములు. అట్టి మునికృతములగు వేదశాస్త్రములయొక్క ముఖ్యప్రయోజనము మనుష్యులకు స్వార్థపరత మాన్పించి పరోపకారముగా నడపించు మనుష్యధర్మమును బోధించుటయును మఱి జగత్కారణమగు దైవభక్తికిఁ బురికొల్పుటయును. కాఁబట్టి వేదవేదాంగవేత్తలమనియును దా ముచ్చరించునవియే శ్రుతులనియును దా ముపదేశించునవియే వేదాంగములనియును దమమాట విననివారు చెడెదరనియుఁ దాము పిక్కపెట్టి వల్లించినశబ్దజాలమును దా ముచ్చరించిన స్వరములును దాము నియమించినఁ జాతుర్వర్ణ్యకర్మములును వైదికాచారమును నిరసించువారు నరకభాజనులని నిందించుచు స్వార్థపరులై దంభవేషములతో సంసారమున మున్గితేలుచు పశుహింసాపరాయణులు స్వజాత్యభిమాన పిశాచగ్రస్తులునగు వైదికమ్మన్యులు భూతదయకు వేరువిత్తులయి మనుష్య ధర్మమగు పరస్పరప్రేమానురాగముల జెఱచి జగద్ద్రోహు లగుచున్నారు. లోకములోని మనుష్యులందఱుం బరస్పరానురాగముతో నన్యోన్యరంజకములగు మాటలు వ్రాఁతలు మఱియు వివిధాభినయ విశేషములు యథేష్టముగాఁ జేసికొనవచ్చును. సూర్యునకు మాఱుగా సూర్యప్రతిమను రాగినాణెమునఁ జెక్కించినట్లు దివ్యములగు వేదవేదాంగములను మనుష్యులు తమ కంఠస్వరముల నుచ్చరించుచుఁ దమచేత వ్రాయుచు తమ శరీరకర్మముల వెల్లడించుచున్నారు. సర్వలోకోపకారకములు భూతదయాపరములుకానివి దివ్యవేదవేదాంగ ప్రకృతిశబ్దము లెంతమాత్రము న్గానేరవు. స్వార్థపరతను మాన్పించి భూతదయను హెచ్చరించి లోకోపకారము కావించు పలుకు పలుకు. పాట పాట. పద్యము పద్యము.

కర్మము కర్మము. చేష్ట చేష్ట. నడక నడక. తనతోడిపాటివారికెల్ల సంతోషకరముగా భూతహింస కావింపక బ్రతుకు మనుష్యుఁడు మనుష్యుఁడు. కాఁబట్టి యోఛందశ్శాస్త్రాభిమానీ! జగద్రంజకమగు నేని నీపలుకును నీపద్యమును నీపాటయు నీయభినయమును నీనడకయును మిక్కిలి శాస్త్రీయమనియే యెంచుకొనుము. లోకరంజకమయినపని యంతయును శాస్త్రీయమే. త్రికరణశుద్ధిగాఁ బ్రజోపకారము కావించుపనియే యథాశాస్త్రము. ప్రాణిహింసాకరము జనబాధకమగు కర్మయంతయు నశాస్త్రీయమని దెలిసికొని జనరంజకము కానిచో నీ యిరువదేడు ఛందోపద్ధతులను నీవృత్తనియమములను నీపదవాక్య ప్రమాణ లక్షణములన్నిటి నట్టిపెట్టి నీవుఛందశ్శాస్త్రవేదివేని లోకోపకారముగా నీయడుగు వేసి యందఱికి మంచిగా నడచుకొనుము. సకలజనరంజకముగా నీవు పలికిన పలుకెల్ల సలక్షణమే, వ్రాసిన వ్రాఁతయెల్ల సలక్షణమే. ప్రస్తుత ముపయోగించని నీప్రాచీన లక్షణపద్ధతులు విప్పక విసని స్వార్థపరుఁడవై మూఢుల బెదరించి డాబులుకొట్టక తిన్నగా లోకోపకారముగా సకల జనరంజకముగా నడచుకొనుము పొమ్ము.

## నక్షత్రశాస్త్ర పక్షఖండనము

రావోయీ, నక్షత్రసూచీ! "ప్రవృత్తిరేషాభూతానాం నివృత్తిస్తు మహాఫలా" అను మనువాక్య మలక్ష్యపెట్టి స్వార్థపరుఁడవై నీసౌఖ్యము నీభోగ మాసించి యిల్లు వాకిలి యాలి మొదలగు నసర్థపటాటోపముతోఁ బరోపకారమునకై ప్రవర్తిల్లక ధనార్జనకై యాకాశ పంచాంగములు చెప్పెదవా? నీపేఁపేనీ కగపడదు నీయింట్లోని సంగతి నీకుఁ దెలియదు. నీ కెవు డెంతప్రాప్తించునో నీ వెఱుఁగవు. నీయింటి నాల్గుమూలల ప్రమాణమేఁతో నీకుఁ దెలియదు. నీతలిదండ్రు లెవరో

నీవు రూఢిగాఁ జెప్పఁజాలవు. ప్రాచీనులవ్రాఁతలంబట్టి మను లొనర్చిన
గ్రంథములు తెలిసీ తెలియక గ్రహములనుగణించెదవా? చదువుకొన్న
వానికన్నఁ జాకి నయమను సామెత యెంతనిజము? వానయెప్పుడుకురి
యునో నీకన్న బాగుగ తిర్యగ్జంతుచేష్టలు వెఱ్ఱిగొల్లలు చెప్పఁగలుగు
టయు నెంచుకొనవేమి? అవ్యక్తకాలము నిత్యమును మూలమును
సూక్ష్మమును, దినాదివ్యక్తకాలమనిత్యమును కార్యమును స్థూల
మును-స్థూలకాలహేతువగు నవ్యక్తలగ్నమును బృహస్పతియైనఁ గని
పెట్టఁ జాలఁడన నీది వృషభలగ్నము వానిది మీనలగ్న మని జ్యోతిష
మును నీకూటివృత్తి కావించుకొని జాతకములు పంచాంగములు వ్రాసి
గురికి బెత్తెడెడముగా ఫలములు ప్రచురించుచు నీమాట సాగినపుడు
నీ తెల్వితేటలు స్వార్థపరుఁడవై చాటుకొనుచుఁ దెలిసినవానివలె
నటించి మూఢులను వంచించి ధనార్జనము కావించుకొనఁదలంచె
దవా? "నకోఽపివేత్తి - సారస్వతందుర్లభమ్ - ఆగమాఃఖలు
దుర్లభాః - ఆయుర్దాయంగహనమ్" అనుశాస్త్రము నుల్లంఘించె
దవా? విశ్వతోముఖమగు శాస్త్రబాహుల్యమునఁ దోఁచు ఋషి
భిన్నాభిప్రాయములను సమన్వయము కావించుకొని "ఇదమిత్థమ్"
అని నిరూఢిగాఁ బ్రతిజ్ఞ సల్పి ఫలముచెప్పి నెఱవేఱఁగలవా? ఈసంవ
త్సరము శనిరాజు. శని పాపిష్ఠుఁడు గనుక జనపీడ కలుగవచ్చును. రవి
వర్షాధిపుఁడుగనుక మందవృష్టి కావచ్చును. రవి పాపుఁడు. కుజుఁడు
సస్యాధిపుఁడు. కుజుఁడు పాపుఁడు కనుక పంటలు చెడవచ్చును.
గురుఁ డర్ఘాధిపుఁడు గనుక ధరలు మందము కావచ్చును, దప్పదు
గురుఁడు పరమ శుభుఁడుకదా బుధుఁడు మంత్రి బుధుఁడు వైశ్యుఁడు
నపుంసకుఁడు గనుక వైశ్యులు నపుంసకు లభివృద్ధిపొందెదరు. ఈ
సంవత్సరము పంచగ్రహకూటమని నీపెఱటి యనంటిచెట్టు గెలవే
యుట చూచి చెప్పినట్టు చెప్పుచున్నావో సిద్ధాంతీ! శాస్త్రమును

జదివినా వనుచున్నావు - నీవు గుర్తించినది సంజ్ఞలు, మసిఘంటము తాళపత్రములు కకారాదివ్యంజనము లకారాద్యచ్చులు కూడిన కృత్రిమ శబ్దజాలముగాని వాస్తవముగా శాస్త్రము కాదు. మును లుపదేశించిన శాస్త్రమునకు నిజమగు కాలునకు మరగాలువలె మునుల యభిప్రాయమునకు నీ చదివిన శాస్త్రము కృత్రిమ ప్రతి బింబముగాని వాస్తవము కాదు. మునులు శాస్త్రమెఱుంగనీ సంసా రాంధుఁడవగు నో ప్రాకృతుఁడా! నీవు శాస్త్ర మెఱుంగు టెట్లనంత మగు శాస్త్ర మహాసముద్రపుటొడ్డుగూడ నీకుఁ గోటియోజనముల దవ్వుకదా! రాతిబొమ్మనుబట్టి నారాయణుఁ డీబొమ్మవలె కనుముక్కు చెవులు మొదలగు శరీరావయవములు కలవాఁడనుకొను మూఢుని వలె వస్తుజ్ఞానము పుస్తకములు తాళపత్రములు కకారాద్యక్షర సమూహములు తెలుపఁగలవనుకొన్నావా? కుజగ్రహము భూమికి మిక్కిలి చేరువ. కుజునిలోఁ గొన్ని పంటకాలువలున్నజాడ కనుపట్టు చున్నది. కాఁబట్టి కుజమండలము భూమండలమువలె జంగమ స్థావర ప్రాణి సంచారముకలది కావచ్చునని టప్పాలుకొట్టుచున్నావే? నీకడు పులోఁ బ్రతిక్షణమునుగలుగు మారుపు నీ మన సు త్తరక్షణమున నెట్లుండునో తెలిసికొనఁగలవా? భూపతనము-శిర్షోదయము-ప్రథమ శ్వాసమును గనిపెట్టి లగ్నమేర్పర్చి జాతకము వ్రాసినచో ఫలములు తప్పిపోవనుచున్నావే? "కాలోహిదురతిక్రమః" కాలమునీఱ శక్యము కాదని యెఱుఁగవా? నీమనఃప్రవృత్తితోనే వర్తమానభావికాలములు భూతకాల మగుచుంటచేత భూతకాలముతప్ప వర్తమానభావికాల ములు లేనేలేవుకదా? గతించినకాలముతోఁ బ్రయోజనములేదు గనుక నింతకును మూర్తమును స్థూలమును వ్యక్తము నగుకాలమ నిత్యకార్యము వికారము గనుక దైవవశమున ననంతవిధములమాఱు చున్న కాలమును లెక్కింప దేవతలైనఁ జాలరన నీశక్యమా? ఏమేమీ

శనిగురుకుజరవి బుధశుక్రచంద్రమండలము లొకదానిక్రింద నొకటి యున్నవా? సూర్యసిద్ధాంతమున వ్రాయఁబడియున్నదా? నీవీవుఁ నీకగపడదుగాని-శాస్త్రదర్శమునఁ జూడఁగలనంటివేని యద్దమున నీ వీఁపు నీ కగపడ నీ గ్రహగతులు నీగురువు చూచెనా ? నీవు చూచితివా ? పదివేలసంవత్సరముల క్రిందనీ తాత నీకుఁ జెప్పెనా? సంస్కృతభాషలోఁ బ్రాకృతులు మునులయభిప్రాయ మిట్లుండవచ్చునని సందర్భానుసారముగా విరచించిన గ్రంథమునందలి సప్తగ్రహములు రవిచంద్రకుజబుధగురుశుక్రశనులను శబ్దములకు షడ్జఋషభగాంధారమధ్యమధైవతనిషాదములను సప్తస్వరములకుఁ గాని సప్తోర్ధ్వలోకములకుఁ గాని సప్తవర్ణములకుఁ గాని సప్తసముద్రములకుఁ గాని సప్తార్చులకుఁగాని సప్తఋషులకుఁగాని సప్తాంగములకుఁగాని సప్తవ్యసనములకుఁగాని సప్తోపాయములకుఁగాని సప్తపాతాళములకుఁగాని సప్తధాతువులకుఁ గాని సప్తవాయువులకుఁగాని సప్తవారములకుఁగాని సప్తకులపర్వతములకుఁగాని సప్తపదులకుఁగాని మఱియిట్లు సప్తసంఖ్యాకపదార్థములనంత సంఖ్యాకములుగా నేర్పర్చఁబడినయభిప్రాయమే మోనీ కెఱుకా? ఏమోయీ ఛాందసుఁడా! ఇంక శాస్త్రానుసారములని తప్పటడుగులిడుచున్నావా? ప్రస్తుత లోకరంజకముగా నీయడుగులు వేయుచు నీనడక లోకోపకారముగా నుండనిమ్ము చాలును వేదపురుషుని వాగాత్మకమగు ఛందము లోకమునకుఁ బనికిరాదు. దేవతారాధనమునకు మాత్ర మేర్పర్చఁబడిన నియతపద్ధతులను లోకులు సరిగా ననుసరింపఁజాలరు శాస్త్రానుసారముగాఁ జేసిన గాడిదపిల్లలను సామెత యెఱుఁగవా ? నీతోడిపాటి జనులకుఁ దగినట్లు వ్యవహరించుము. వేదమునకు లోకమునకును దైవమునకు జగమునకును సంబంధ మొకింతయును లేదు. దైవగతి న్గని పెట్టఁగల మహాత్ముఁడు మిక్కిలి యరుదు. జీవనవృత్తి స్థాపించుకొన్నప్పుడు మనుష్యున కేశాస్త్రజ్ఞానమును నిక్కముగా నల

వడనేరదు. స్వార్థపరతమాని కేవలలోకోపకారమునకు మాత్రమే నీ
శాస్త్రజ్ఞాన ముపయోగించినపుడు భగవత్కృపవలన నీయుద్దేశము
కొంత ఫలించవచ్చును. ప్రకృతిబద్ధుఁడవు స్వార్థపరుఁడవు సంసారాంధ
కార నిర్మగ్నుఁడవు సోమరివి కాలవశుఁడవు దైవోపహతుఁడవు తుచ్ఛ
మర్త్యుడవుఁ నీకుఁ గేవలాతీంద్రియద్రష్టృముఖైకగోచరమగు శాస్త్ర
జ్ఞానము వంధ్యాపుత్త్రప్రాప్తివంటిదని రూఢిగ ముమ్మాటికి నమ్మి
కొని గ్రుడ్డికంటి యభినయమువలె హాస్యాస్పదమగు నీ పంచాంగ
ప్రకటనము కట్టిపెట్టుకొని కరుణాసముద్రుఁడగు భగవంతుని ధ్యానము
చేసికొనుచు నన్నపానవస్త్రములిచ్చి నీతోడిపాటివారికిఁదోడుపడుము.
తెలిసీ తెలియని యో నక్షత్రసూచీ! ధనార్జనమునకై యడ్డదిడ్డముగా
సారకాయలు నఱకుచుఁ బ్రశ్నములు చెప్పక తొలఁగిపొమ్ము నీ వాల
కముచాలుచాలు. సర్వకార్యములు దైవాధీనములు. నీ పురుషప్రయ
త్నముగూడ దైవప్రేరితమే దేవుఁడు భక్తపరాధీనుఁడు. నీవు
స్వార్థపరతమాని యహంకార మమకారముల నడంచుకొని కేవల
లోకోపకారము సల్పుటకుమాత్రమే వ్యవహరించెదవేని దయామయు
డగు భగవంతుఁడు నీకు సాయపడి నీ మనస్సంతుష్టిరూపమగు కైవల్య
పదవి నీకొసఁగు నిద్దియే నీ బ్రతుకు ప్రయోజనమని తెలిసికొనుము.
వేదశాస్త్రరూపకములయిన మునులయుపదేశములో బోధలు వాస్తవ
ములేగాని యట్టియతీంద్రియద్రష్టల యుపదేశములను మఱియు వారి
బోధలు నింద్రియదృష్టములుకానేరవు - ప్రాకృతజనులు గ్రహింప
నేరరు. గ్రంథరూపముగా నట్టి దివ్యబోధ కావింపఁబడ శక్యముకాదు,
వర్ణములక్షరములు గ్రంథములు మొదలగు సంజ్ఞలచేత దివ్యజ్ఞానము
తెలుపఁబడఁబోదు. వేదశాస్త్రబోధకములుగా నేర్పర్చబడిన గ్రంథము
లన్నియు మునికృతములుకావు. తెలిసీ తెలియని ప్రాకృతజనులు
జ్ఞానలవదుర్విదగ్ధులుఁగల్పించినకృత్రిమములీ వేదశాస్త్రగ్రంథములన్ని

యును. వాస్తవజ్ఞాన మింద్రియదృష్టమెంతమాత్రమున్నాఁబోదు నిక్క-
ముఁగాఁ బరమార్థమతీంద్రియముగాని వ్యావహారికమెంతమాత్రము
న్గాదుగనుక నీ స్వార్థపరతయు నీదంభవేషము నీ పండితమానితన్గట్టి
పెట్టు మాదిమధ్యాంత శూన్యుఁడగు కాలపురుషునో పామరతుచ్ఛ
మర్త్యుఁడా ! నీ కొలబద్దతోఁ గొలువనెంచెదవా ? యో తెలిసీ తెలియని
యహంకార విమూఢాత్మా ! నీకంటె మిక్కిలి కాలజ్ఞానమునఁ బశు
వులు నయము, పక్షులు నయము, పురుగులు మేలు. చీమలు పుట్ట
లేర్పర్చుకొనుటజేతఁ బక్షులు గూళ్ళు కట్టుకొనుటచేఁ బశువులు
గుహలు పొదలు మొదలగు నిరవులాశ్రయించుటచే నెండ గాలి వాన
మొదలగు వర్తమాన భావి కాలజ్ఞానము కలవిగా కనగూడినతోడనే
గర్భముధరించిన చిన్నెలు తెలిసికొనికదా పక్షులు తమకు భావికాల
మునకు గ్రుడ్లుపొదిగి పిల్లల న్గాపాడుటకై ముందుగాఁ దమనేర్పు
కొలది గూళ్ళు నిర్మించుకొనుచున్నవి. నీచిత్త మంతరిక్షమున
వ్రేలాడఁగట్టుము బెల్లమునకెట్లొకదాని వెంబడి నొకచీమ యెగ్రబా
కునో? ఓనక్షత్రసూచీ ! కాలవస్తుజ్ఞానము సహజముగాఁ బుట్టునుఁ
గాని నీ కృత్రిమములగు చదువులచేత నొక్కింతయు న్దెలియఁబడదు.
మఱియును బరమార్థవేత్తయగు ముని యుద్దేశము కృత్రిమములగు
శబ్దాది సంజ్ఞల కగోచరము నీయక్షరములు నీతాళపత్రములు నీ
కాగితములు నీఘంటములు నీకలములు నీరంగులు నీవ్రాతలు నీయుచ్చా
రణములు నీయవయవవిన్యాసములు నిలోకవ్యవహారమంతయును నీ
స్వప్నమువలె దైవవశము గాని నీవశమెంతమాత్రమున్గాదు . కాఁబట్టి
శాస్త్రవేత్తవని కూటికై టప్పాలుగొట్టు మూఢులం బెదిరించకు.
నీసంగతి నీవెఱింగినయెడల నిట్లుకూటికై పడరానిపాట్లుపడుట నీగ్రహ
చారమా ? ముందుసంగతి నీవు తెలిసినట్లు మూఢులను మోసపుచ్చి
బాబుచేయుచున్నావే, నీనిద్రలో నీవేమిపలవరించెదవో నీకే కలలు

వచ్చునో నీతల్లిదండ్రులెవరో ప్రమాణముచూపి నిశ్చయించి చెప్పఁ గలవా? రాకొల్లసిద్ధాంతీ! శనికక్ష్యముయొక్క పరిమాణమెంత? బ్రహ్మాండభాండములోనది యెంతస్థల మాక్రమించెను? బ్రహ్మాండ భాండమున్న యాకాశమునకుఁ బరిమితికలదా? నీకతీంద్రియవర్ణనమేల? వ్యవహారజ్ఞానముకలిగి నీబ్రతుకు సార్థకముగా నన్నవస్త్రములొసంగి నీతోడి పాటివారలకు నీవుసాయపడునట్లు కష్టపడు. మఱియు భగవం తునిగూర్చి నీకుతోడ్పడుటకై మొఱ్ఱపెట్టు. మునిజనైకగమ్యమగు కాలజ్ఞానబోధ నీ కేల? చాలుచాలు దున్నుకొని భగవంతునిపై భార మువేసి పండినపంట నొరులతో వంతుపంచుకొని బ్రతుకుము. నక్క యెడ దేవలోకమెడ! జ్యోతిషమెడ ప్రాకృత మూఢ మర్త్యుఁడవు నీవెడ? నీవు బ్రతికియున్నావా? యేప్రమాణముచే నీస్థితిని నీవు తెలి యగల్గితివి? నీస్వానుభవమేకదా నీజాగ్రదవస్థను నీకెఱింగించుచున్నది? లేక వేదశాస్త్రములు నీతో నీవు బ్రతికియున్నావు జాగ్రదవస్థలో నున్నావని నీకు బోధించుచున్నవా? వేదశాస్త్రములు నీకూపిరిదీయుట నప్పుచున్నవా? వేదశాస్త్రములను జదువుకొని యవి నీకు బోధించిన ప్రకారముగా మొదట నూపిరితీసుకొనుట చూచుట వినుట స్పర్శ మనుభవించుట యాఘ్రాణించుట మొదలగు మనోవాక్కాయకర్మము లాచరించుచు లోకవ్యవహారము నల్పుచున్నావా? నీబ్రతుకు నీకు సహజసిద్ధమా? లేక వ్రాఁతచదువువలె నాగంతుకమును కృత్రిమమా? గ్రహములు సంచరించుచున్నవి. కాలానుసారముగా సర్వజగత్క్రియ లును జరుగుచున్నవి "సాంగ వేదయదివాన వేద" అను శ్రుతిప్రమా ణమైన నాలోచించకిన్ని సంవత్సరములక్రిందట జగముపుట్టెను. మఱి న్నాళ్ళకు నశించు గ్రహతారలసంఖ్యయింత మఱి వానిగతి తత్త్వపరి మాణవిధానములిట్టివని గ్రంథములవల్ల నేర్చుకొంటి ననుచున్నావే యాగ్రంథములు నీవంటి జ్ఞానలవదుర్విదగ్ధులగు ప్రాకృతమర్త్యులు

కల్పించి యతీంద్రియద్రష్టలగు మునులొనర్చిరని యనాదిగాఁ దమ
తమ వెనుకటివారికి నమ్మకముకలిగించుటకై వశిష్ఠాది నామము
లమ్మునుల కొసంగిరి. వాస్తవముగాఁ బ్రతిబింబము సత్యపదార్థ
మగునా? ప్రతిబింబము కల్పితము. సహజము సత్యపదార్థము. అతీం
ద్రియద్రష్టలు నప్రాకృతులు సర్వస్వతంత్రులు స్వయంభువులునగు
వ్యాసాదిమహర్షుల యథార్థతత్త్వజ్ఞానమునకు శబ్దాదివిషయములు ప్రతి
బింబములా-శబ్దాదివిషయములకీ జగము ప్రతిబింబము. నీ బ్రతుకీజగ
మునకు నీడ కాఁబట్టి నీ వేదశాస్త్రిజ్ఞానము ప్రతికృతియుఁ గృత్రిమము
స్వప్నసదృశ భ్రాంతికల్పితము. తెలిసీ తెలియక సర్వమును దెలిసినట్లు
నటించుటయును లేనికల్పనములు చేసికొని కోరి కొఱవితో దలఁగోకు
కొని యక్కఱమాలిన దుఃఖములను స్వర్గ నరకములనుగల్పించుకొని
యన్యోన్యము భూషించుకొనుట దూషించుకొనుటయును దైవసృష్టి
కన్న నూఱురెట్లు తను మనస్సృష్టి కావించుకొని ఖేదమోదములందుట
వెఱ్ఱిమర్త్యుల స్వభావము. కొన్ని పశుపక్షి సరీసృపములకు మాంసా
హారమును మఱికొన్నిటికి శాకాహారమును గొన్నిటికిఁ గేవల జలసం
చారమును మఱికొన్నింటికి కేవల స్థలసంచారమును మఱికొన్నింటి
కుభయప్రదేశసంచారము స్వభావమయినట్టు స్వర్గనరకములు స్వప్న
ములు విభ్రాంతులు జాత్యభిమానములు నవ్వులు చదువునందెలు
లేనిపోని దుఃఖములు తెచ్చిపెట్టుకొనుటయు నీర్ష్యాసూయలు మొద
లగు ననన్యజంతుసామాన్యాధివ్యాధులు మనుష్యులకు సహజసిద్ధ గుణ
ములు. మనుష్యులలో "ఉత్తముఁడు హితముచేయుచు నూరకుండు.
మధ్యముఁడు మేలుకావించి మాఱువెదకు। అధముఁడొరుచేయు హిత
మైన నణఁచిపుచ్చు। హితమునకు నెగ్గుచేయువాఁడెవ్వఁడగును" ఓ
పండితమ్మన్య! నీ కన్న వస్త్రములిచ్చి నీసోమరితన మెన్నక నీకొఱకై
పాటుపడు సాధులనొమ్మనపుచ్చి యందఱికన్న నీకేమో తెలిసినట్లు

బూకరించి బ్రతుకనెంచెదవా ? నీమట్టుకు నీవు మోఁకాళ్ళపై నీతల నుంచుకొని యాలోచించుకొనుము. నీతోడిపాటివారికన్న నీవొక్క దార్ఢ్యమునఁదప్ప మఱెందులో నధికుఁడవో ? పోపో, చాలుచాలు, నీపంచాంగము - నేఁడేకాదశి రేపుద్వాదశి యేమ్యముకాఁగా నొకటి తరువాత రెండవయంకమేమ్మమెమూడవయంకము వచ్చునన్నట్లున్నది నీగణితప్రజ్ఞయును గ్రహదానములుచెప్పి యాదానములకు ముఖ్య పాత్రమీవే యనుచుంటివా ? సోమరిబ్రతుకున కలవడి కాయకష్ట ముచే నితరులఁ బోషించి నీవు సుఖపడక నీకీగ్రహముచాలదు నీది మూల ఘోరశాంతిచేసి సోమరిపోతు బ్రాహ్మణులకన్న పానములచే గ్రొవ్వించవలయు ననుచున్నావా ? బ్రాహ్మణులుతప్పఁ దక్కినవా రన్నపానవస్త్రములకు పాత్రులుకారు. బ్రాహ్మణులుతప్ప దేవునిం బ్రార్థించుటకు నారాధించుటకును ధ్యానించుటకును బరమార్థమెఱిఁ గించు వేదశాస్త్రముఁల బఠించి బోధించుటకుం బాత్రిగా ననర్హులని వదరుచుంటివే ? యోధూర్తుఁడా! మనుష్యుల కందఱికి న్మానవజాతి యొక్కటియే యని సర్వజనసముఁడవు కావేల "శునిచైవశ్వపాకేచ పండితాః సమదర్శినః" అను భగవద్వాక్యమును బఠించి నీపాండిత్య మంతయు నెక్కడనుండెనో మనుష్యులంద అన్యోన్యద్వేషముమాని యన్యోన్యప్రేమానురాగములతో నన్యోన్యసహాయమున బ్రతుకు వ్యవహారము నెఱవేర్చుకొనుటకన్న వేఱే మనుష్యధర్మము లేదని యెఱుఁగుము.

## నిరుక్తవాద నిరాదరణము

ఓ నిరుక్తదురుక్తాసక్తుఁడా ! యిటు రమ్ము మొట్టమొదట నీ "ఇషేత్వోర్జేత్వా" అను మొదలు వర్ణసముదాయస్వరూపకవాక్య ములే కృత్రిమములయినవని తెలిసీతెలియక "ఇషమేవోర్జంయజమా

నాయదధాతి" అని యర్థముం జెప్పఁ బ్రాహ్మణముఁ గల్పించిన పండి తమ్మానికిఁ దోడుగా "ఇషేత్వోర్జేత్వేతి పలాశ శాఖాంఛినత్తి" యని కల్పముం జెప్ప, భ్రాంతునకు సహాయభూతముగా "ఇషమ్" అను పదమున కన్నమని నిర్వచించుచున్నావా? చతుర్దశమాహేశ్వరసూత్ర ములును వేదములును మనుష్యకల్పితములగు కృత్రిమశబ్దములుగాని మేఘగర్జితమువలె సహజములెంతమాత్రమున్గావు. కృత్రిమశబ్దార్థ మున్గాడఁ గృత్రిమమే. గదలినను మఱియుం గదలకున్నను నిర్జీవమగు బొమ్మబొమ్మయేగాని సజీవప్రకృతి యెట్లగును? మనుష్యముఖావ యవకల్పిత స్వరవ్యంజనాత్మక పదపదార్థములు మనుష్యకల్పితములు కృత్రిమములుగాని వాయునిర్ఘోషముమాడ్కి సహజసిద్ధమెట్లగును? మనుష్యప్రయత్నకృతములగు నిండ్లు వాకిళ్ళు పెండ్లి పేరంటకములు వర్ణా శ్రమధర్మములు చతుర్విధోపాయములు చదువుసందెలు జాతిపద్ధతులు నానావిధవాఙ్మయము తదర్థము చతుర్విధాభినయములును మనుష్య జంతుస్వభావకల్పితములుగాని సర్వజంతు సామాన్యస్వభావసిద్ధములు కావు. మఱియు మేఘగర్జితమువలె మెరుపువలె గాలివలె భూకంపము మాడ్కిఁ జంద్రసూర్యగ్రహణములరీతి నహర్దినములమాడ్కి బంచ భూతములు తన్మాత్రలకరణి నపౌరుషేయములు సహజములెంతమా త్రమున్గావు. కాఁబట్టి నీ నిరుక్తమునీది నానిరుక్తమునాది. "ఇషేత్వా" త్వాయను పదమునకు తెనుఁగున "నీవు" అనియర్థము "ఇషేత్వా" అను పదమునకు సుఖించుటయని యర్థము. మొత్తముపై ఒరు లకు బాధరానీక నీయిష్టానుసారము సుఖించుమని యర్థము "ఊర్జేత్వా" అనఁగా "ఊర్జే" నీకును బరులకును బనికి వచ్చిన యాహారనిద్రా విహారోపయోగకరమయిన సామగ్రిని "ఊర్జేత్వా" అనఁగా నట్టి సామగ్రిని నీవు సంగ్రహించుకొనుమని యర్థము మొత్తముపై "ఇషేత్వోర్జేత్వా" అను శ్రుతికి సర

భూతదయాపరుఁడవై పరులను సుఖపెట్టి నీవు సుఖపడుము” అని యర్థము. వేదమనఁగా సగుణపరమాత్మ-పరమాత్మయమృతత్త్వము కాఁబట్టి యనిత్యేంద్రియోపాధి బద్ధులగు మర్త్యులతీంద్రియ వేదము నెఱుఁగఁజాలరు “విజ్ఞాతారంకో విజానీయాత్”అన్నిఁటిని దెలిసికొను పదార్థమితరముచేఁ దెలియఁబడనేరదు. దేవతల నుపాసించుటకై దేవతాప్రతిమలు శిలాదారుమయములుగాఁ గృత్రిమ కల్పితము లయి నట్లు అపౌరుషేయామృతత్వమగు పరమాత్మస్వరూపమును బ్రహ్మ జ్ఞానాత్మకమగు వేదము లోకోపకారార్థమై మునులచే వాఙ్మయము కావింపఁబడెను. దేవతాప్రతిమయగు రాతిబొమ్మ దేవతను దెల్పఁ జాలనట్లు మఱియు దేవతకును దత్ప్రతిమయగు రాతిబొమ్మకు మను ష్యుల భావనయందుఁ దప్ప మఱెట్టిసంబంధమును లేనట్లు అనిత్యమర్త్యేం ద్రియ కల్పితములగు వాఙ్మయాత్మకమగు ఋగాదిశ్రుతులు కృత్రి మములు మఱియును దేవతోపాసనాసాధన మాత్రములై వేడి వులుసు వడ్డించుకొనుటకు సాధనములగు తెడ్డులవలె కృత్రిమము లనక తీఱదు. ఇంతేగా కెవరెవరి పాండిత్యముకొలంది నర్థమీఁగల దేవభా షతో వేదములు రచింపఁబడుటచేత వేదాంగములుగూడ యథేష్టార్థ ప్రతిపాదన సంస్కృతభాషలోనే యాధునిక ప్రాకృతులచేఁ గల్పింపఁ బడెను. కాఁబట్టి వేదశాస్త్రములం దిహపరలోక సౌఖ్యసంధాయకము గాను మఱియు సర్వజనోపకారమగు రీతిగా నర్థము చెప్పి సర్వలోకోప కారకవర్తనము తాననుసరించి పరులకుఁగూడ నట్టి సద్వర్తనము మప్పి స్వార్థత్యాగియై సర్వభూతదయాపరుఁడై సర్వలోకోపకార మొనర్చు యాస్కముని తాత్పర్యమెఱుఁగనేరక నానార్థపరములగు గీర్వాణపద ములకుఁ బశువులం గ్రతువుల బలిచ్చుట వేదవిధియనియు నగ్గిలోను బుగ్గిలోను నేయిపాలు మొదలగు నాహారపదార్థములు వ్యర్థముగాఁ గలుపుట వేదచోదితమనియు స్వార్థపరతమాని లోకోపకారమునకై

కక్షించక సోమయాజులై సోమరులై దంభవేషములతో లోకులకొకింత
యుం బనికిరాక బ్రాహ్మణులమనియు ద్విజులమనియు నాచార్యుల
మనియు మఠాధికారులమనియు దేవబ్రాహ్మణులమనియు మతగురు
వులమనియు వేదాంతులమనియు దామెన్నంటికిన్నెలియఁజాలని పర
మార్థతత్త్వమున్నూర్చి సారకాయలు నఱకు నానావిధవేషములుదాల్చి
మూఢులంబెదిరించి పరుల నిద్రాహార సౌఖ్యంబులొకింతయు గనిపెట్టి
యొరులకష్టేషములెంచకతిని క్రొవ్వుఘూర్తజనులన్విశ్వసింపఁ గూడదు.
ఇషేత్వోర్జేత్వాది వేదశబ్దములకు లోకోపకారముగాఁ జరించుటయే
మనుష్యధర్మమను నర్థముతప్ప మఱేయర్థమైనను చెప్పుట మునుల
యభిప్రాయమెంతమాత్రమున్నాదు. చతుర్వేద శబ్దజాలమంతటికిని
సముద్రజలమంతటి కొక్కటియేచవియైనట్లొక్క పరోపకారము సల్పు
టయే యర్థమని ముమ్మాటికిన్ మునుల యభిప్రాయము. నీ నిరుక్త
దురుక్త పశుహింసా ప్రతిపాదకార్థము న్వెల్లడించక నోర్మూసికొనుము.

## నైఘంటిక శ్రౌతవిధుల భ్రాంతివాదము

నైఘంటికుఁడా! చాలు నీపాండిత్యము. ఆకసమందనంతసంఖ్యాక
నక్షత్రసమూహాత్మకమగు పాలజాడవంటిది వేదవాఙ్మయము. వైదికశబ్ద
ములను విభజించియాశబ్దతత్త్వ మెఱింగి తదర్థమును దెల్పు ప్రతిజ్ఞ
నీ మాటకేమిగాని నిన్నుఁబుట్టించిన చతుర్ముఖునకైనఁ దరమా? "ఇ"
అను నక్షరమునకును మఱి "షే" యను నక్షరమునకును సూర్యకిర
ణములోని రంగులవలె ననంతకోటి సంఖ్యాకార్థములు చెప్పవచ్చునో
పండితమ్మా నీ! యీ శబ్దమున కిద్దియే యర్థముగానీ మఱే యర్థ
ముం జెప్ప రాదని నిర్దేశించెదవా? పోపొమ్ము లోకోపకారము కావింపఁ
జాలని శబ్దార్థమెల్ల యపార్థమని యింతటినుండి తెలిసికొనుము.

నీవు మఱొకసారి నీ కూళమొగము చూపవోయీ పశుమారణదారుణకర్ముఁడా! ఘోరశ్రౌతకర్మజల్పుఁడా! "ఇషేత్వేతి పలాశశాఖాంఛినత్తి" అని "ఇషేత్వా" అను మంత్రమునకు శ్రౌత క్రియఁగల్పించుచున్నావా? "పలాశ" అను శబ్దమునకు మోదుగుచెట్టని యర్థము చేసికొంటివా? "పలాశశాఖాంఛినత్తి" అనగా ఆకటిచే బాధ పడుచున్న తనతోడిపాటివాని యాకలిబాధ తీర్పఁగోరిన పరోపకార పరాయణుఁడు పలాశమనకుండనిండఁగనున్న వండినయన్నము పలాశ శాఖమనఁగాఁ నన్నకబళమని యర్థము చేసికో" ఇషమేవోర్జం యజమానాయ దధాతి" అను వేదాత్మక బ్రాహ్మణము నరయువా? దయాస్వరూపుఁడు ప్రజ్ఞానాత్మకుఁడు సర్వసముఁడు సర్వశక్తియు సంశ్రిత జనవత్సలుఁ డగు దేవుఁడు ప్రాణిహింసాకరమగు కర్మమును కేవల పరమార్థ ద్యోతకమగు వేదముఖమున విధించునా? చాలు చాలు "చోదనా లక్షణోధర్మః" అను జైమినిముని తాత్పర్యము తెలిసికొనుము. చోదనమనగా సర్వభూతదయ. సమస్తప్రాణులం ప్రేమించ వలసినదని మాత్రమే వేదము మనుష్యులను విధించుచున్నదని పరమ కారుణికుఁడగు జైమినిముని ముఖ్యతాత్పర్యము కనుకనే "నహింస్యాత్సర్వభూతాని" అను శ్రుత్యనుసారముగాఁ బూర్వ మీమాంసపై నుత్తర మీమాంసాశాస్త్రమును వేదవ్యాసముని యొనర్చెను. వశిష్ఠ స్మృతియందు, "నారాయణం పరంబ్రహ్మ బ్రాహ్మణానాంహి దైవతమ్, తస్మాత్త్రిపుండ్రం విప్రాణాం నధార్యం మునిసత్తమ" బ్రాహ్మణులు, నారాయణు నర్చించవలయుననియు క్షత్రియ వైశ్యులు సోమ సూర్యాదిదేవతల నర్చించవలయుననియును శూద్రులు రుద్రుని నర్చించవలెననియును కాఁబట్టి మూఁడుపంగనామములు బ్రాహ్మణుఁ డెంతమాత్రమును ధరించఁగూడదు. ఊర్ధ్వత్రిపుండ్రములను ధరించువాఁడు బ్రాహ్మణుఁ డెంత మాత్రము గానేరఁడు. మఱియు వైష్ణ

వుఁడు కానివాఁడు బ్రాహ్మణుఁ డనిపించుకోనఁడు కాఁబట్టి యూర్ధ్వ త్రిపుండ్రధారి వైష్ణవుఁడున్గాఁడు. బ్రాహ్మణుఁడు గానేరఁడు. సూర్య సోమ రుద్రుల నారాధించువారు వైష్ణవులుగాని బ్రాహ్మణులుగాని కానేరరు. మఱియు నూర్ధ్వపుండ్రములు ధరించుట వైష్ణవులుంగారు మఱియు బ్రాహ్మణులుంగారు అని వశిష్టస్మృతి చెప్పుచున్నది. వశిష్ఠు నకు భిన్నమైన మునిమతములు గలవు కాఁబట్టి యథేష్టము నేశబ్దము నకునైన నర్థము నిర్వచించవచ్చును. ఋషులమతము లన్యోన్య విరుద్ధములు. వేదశాస్త్రములు బహుముఖములై నానాధర్మప్రతి పాదకములయినప్పటికి మొత్తముపై భూతదయను లోకోపకార వర్తనమును మాత్రమే బోధించుచుంట తేలిన ఫలితార్థము "యస్మా త్కేవల వేదవాక్యైర్న శక్యతేఽనుష్ఠాతుం విక్షిప్తత్వా ద్వేదవాక్యా నాం గూఢార్థత్వాచ్చ- అతఃకవిభిరాచార్యైఃప్పదార్థ కుశలైర్వదా ర్థేభ్యోనిమ ఏప్వ్యకర్మార్థం సుఖావబోధనానీమాని విద్యాస్థానాని ప్రవ ర్తితాని-శిక్షాకల్పో వ్యాకరణం నిరుక్తం ఛందోజ్యోతిషమితిధర్మ శాస్త్రం పురాణం న్యాయవిస్తరో మీమాంసాదీని- అత ఆచార్యో భగవాన్ శౌనకో వేదార్థవిత్ సుహృద్భూత్వా బ్రాహ్మణేభ్యోఽర్థ వాదానత్సృజ్యవిధిం సమాహృత్య పురుషహితార్థం ఋగ్వేదస్య శిక్షాశాస్త్రం కృతవాన్" అను ఉవలు భాష్యానుసారముగా నారు వేదాంగములు లోకవ్యవహార సౌలభ్యమునకై సూత్రరూపములు పండితు లొనర్చిరి. కాఁబట్టి కాలానుసారముగా శిక్షావ్యాకరణ చ్ఛందోజ్యోతిష నిరుక్తకల్పములు సర్వజన సాధారణోపయోగకరము లుగా నెప్పటికప్పుడు మార్చుకొనవచ్చును. వేదమువలె వేదాంగ ములు నిత్యములుకావు. "కాలరూపీజనార్దనః-కాలస్యకుటిలాగతిః" కాలవశమువలన నాకుఁ దోఁచినట్లెల్ల వేదశాస్త్రము లన్వయించి నీవు చెప్పిన యర్థమెల్లనో కూశ్రశ్రోత్రియుఁడా! యకాల ప్రేరణము

చేతనే కేవల భూతదయామయుఁడగు భాగవతుఁడు కాఁడని ప్రతిపా
దించుచున్నాఁడు.

అస్వతంత్ర జీవాత్మకు వేదమే చైతన్యము. వేదాంగము
లాఱును జ్యోతిషము కన్ను-వ్యాకరణము నాల్క-శిక్ష ముక్కు-
ఛందస్సు త్వగ్రూపక పాదము-నిరుక్తము చెవి-కల్పము మనస్సు నిశ్చ
యముగా నిట్లాఱు వేదాంగములు, శరీరాత్మక షడింద్రియ స్వరూప
ములు. కాఁబట్టి మనుష్యుఁడు స్వార్థపరతమాని తన యింద్రియ
షట్కసాహాయ్యముచేతఁ లోకోపకార మొనర్చవలయు. మఱి
యట్టి భూతదయను లోకోపకారక వ్రతమును గొనసాగించుటకై
భక్తరక్షణ దీక్షాపరుఁడు సర్వస్వతంత్రుఁడగు పరమాత్ముని న్నిరం
తరము న్నవవిధ భక్తిమార్గములచేఁ గొలువవలయు నిద్దియే సకల
వేదశాస్త్రముల ముఖ్య తాత్పర్యము. "యస్యైవ యదభిప్రేతం
సఏవత్తత్పలీన శాఖాంమ స్తకే నిక్షిప్య ప్రమాణీ కుర్యాత్" మృత
సాక్ష్యమువలెనే నసంభవమగు నశించిన వేదశాస్త్ర ప్రమాణములం
బట్టి యథేష్టముగా శ్రౌతస్మార్త కర్మధర్మముల నియమింపవచ్చును.
మన్వాదులు తమధర్మశాస్త్రరచన కాధారము నశించిన వేదశాఖలం
నిర్దేశింపనేల? ప్రకృతవేద విరుద్ధములయిన ధర్మముః నేర్పర్చుటకుఁ
దమకే ప్రమాణమో యట్టి ప్రమాణమే చూపి శ్రౌతస్మార్త కర్మము
లన్యథేష్టముగా మార్చుకొనరాదో? ప్రకర్షేణోచ్యతే వేదార్థఏభిరితి
ప్రవచనాన్యంగాని" కుల్లూకభట్టు వేదాంగములకు "ప్రవచన" అనుసంజ్ఞ
కలదనుచున్నాఁడు. ప్రవచనమనఁగా నుచ్చారణ - నియతోదాత్తా
నుదాత్తాదిస్వరవిధి. స్వరముచే నర్థముమాఱునుగనుక యొక్కమంత్రమే
యుచ్చారణ భేదముచే ననేకార్థములిచ్చుచు ననేకశాఖలై పరఁగు
చున్నది. "ఏవంప్రవచన భేదాత్ప్రతి వేదం భిన్నా భూయస్యః శాఖాః"
అనుటచే నేశబ్దమునకైన నుచ్చారణ నియమముగాని యర్థనియమము

గాని చెప్పరాదు. ఏశబ్దమునకైన యథేష్టార్థము చెప్పకొనవచ్చును. మఱి యథేష్టస్వరమున నుచ్చరింపవచ్చును. కనుక నీ యిష్టానుసారముగా "పశుమాలభేత" అను వాక్యము నుచ్చరించి క్రతువునఁ బశువుంజంపుట విధియనుటకు నీకెంత ప్రమాణమో యా శ్రోత్రియుఁడా నీవు తెలిసీతెలియనిధూర్తుడవు, క్రూరకర్ముడవు, నీయుచ్చారణము తప్పు, నీవు చెప్పెడియర్థ మపార్థము, నీపశుమారణకర్మ క్రూరకర్మము, నీవు మనుష్యపశువనుటకు నామాటమాత్రము సప్రమాణము కాదా? వేదమును జదువువిధిని శిక్షాఛందములును వ్యాకరణ నిరుక్తములర్థము తెలిసికొనుటకును జ్యోతిషకల్పములు యజ్ఞక్రియ లాచరించుటకు నుపయోగించుచున్నవి. "యత్రగాయత్ర్యోహిచ్ఛందసిపాదస్యాక్షరసంఖ్యానపూర్వ తేత్రతేయాదిభిః పూరయితవ్యా-యథాతత్సవితుర్వరేణియమితి-దివ్యగచ్ఛసువః పతఇత్యేవమాదయః" అను పింగళోక్తి ప్రకారము ఛందోనియమము వేదమునకుమాత్రమే గాని వ్యావహారిక దేశభాషలు యథేష్టనియమములతోఁ గావ్యములొనర్చుకొనవచ్చును. కాఁబట్టి లోకోపకారమును లోకరంజకమునగు రీతిగా శిక్షావ్యాకరణ నిరుక్తజ్యోతిషచ్ఛందః కల్పములను వేదాంగషట్కపద్ధతుల యథేష్టముగా దేశకాల పాత్రానుసారముగా మార్చుకొనవచ్చును. ఓఛాందసుఁడా! నీ వేదాంగనియమములుచెప్పి మూఢులం బెదిరింప కవలికిఁ బొమ్ము. అహంకార మమకారాత్మకమగు శరీరస్మృతిచేఁ జేయఁబడు మనోవాక్కాయకర్మములన్నియును పౌరుష కార్యములు. మఱియట్టి పౌరుషకార్యములన్నింటికిని దైవమేకారణము. దైవమనఁగా నహంకార మమకారాత్మకమగు శరీరస్మృతిరూపకమగు తెలివిచేదృష్టమగు జగత్కార్యమంతయూ ననఁగా నాకాశవాయ్వగ్ని జలపృథివ్యాత్మకమగు పాంచభౌతికప్రకృతి ప్రవృత్తిహేతువగు నవాఙ్మనసగోచరమగు నతీంద్రియనిర్గుణ బ్రహ్మము. వేయేల సర్వజగత్తు దైవవశమే యూ

దైవముయొక్క యథార్థతత్వ మతీంద్రియ విషయమని మాత్రము మనుష్యునిచేఁ దెలియబడును. మండలగ్రహములగు సూర్యచంద్రులు తారాగ్రహములగు కుజబుధగురుశుక్రశనులు ఛాయాగ్రహములగు రాహుకేతువులు మఱియు నవగ్రహములు సప్తవింశత్యశ్విన్యాది నక్షత్రములు మేషాది ద్వాదశరాసులు ముప్పది ముహూర్తములు క్రూరసౌమ్యగుణవిభాగములు కలాకాష్ఠనిమేషాదికాల విశేషములు శింశుమార చక్రస్వరూపము బ్రహ్మాండస్వరూపము చతుర్దశభువన విశేషములు వేయేల స్మృతిగోచరప్రత్యక్షాదిప్రమాణ సిద్ధపదార్థజాల మంతయును స్వప్నజాగ్రత్సుషుప్తి కారణాతీంద్రియాత్మపదార్థము మొదలగు సహజసిద్ధ సమస్తప్రపంచమంతకుం గారణము దైవమునాఁ బరఁగు. మెఱుపులుఱుము లశనిపాతములు గాలివానలు చీఁకటి మబ్బులు సకలేతిబాధలు సమస్తపాంచభౌతిక ప్రకోపోపద్రవ ములు కాలకృతరుజాజరామరణాద్యనిష్టకార్యములు ఋతువైప రీత్యములు శీతోష్ణస్థితి విశేషములు నానాదేశ జనస్వభావజ న్యాన్యోన్యప్రతికూలకార్యవిశేషము లంతర్బాహ్య శత్రుకృతప్రతీ కారములధ్యాత్మాధి భౌతికాధిదైవికతాపత్రయము మఱియును సకల ప్రాణి సుఖదుఃఖహేతువులన్నియు నహంకార మమకారమంతయును దైవమే. ఘటకపాలాత్మక మృద్వికార మంతకును మృత్స్వరూపమే యైనట్లు నానావిధపురుషకారమంతయును దైవస్వరూపమే.

"దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతమ్, తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణోమమ దేవతా" దైవమనఁగా సమస్తజగ త్కార్యములకుం బ్రేరేపక కారణమగు నెద్దియోయొక యవాఙ్మానస గోచరపదార్థమట్టి దైవవశమున సకలజగదుద్భవస్థితి నాశకార్యవిశే షములన్నియును జరుగుచున్నవి. మఱియాదైవము ధ్యానాత్మకసమాధి యోగమున కధీన మాధ్యాన సమాధి బ్రాహ్మణునివశము కాఁబట్టి

బ్రాహ్మణుఁడే ప్రత్యక్షదైవమనకతీఱదు కావుననే భూదేవతయని బ్రాహ్మణుఁడు వ్యవహరింపఁ బడుచున్నాఁడు. దైవమువలె దైవజ్ఞుఁడగు బ్రాహ్మణుఁడుఁగూడ నతీంద్రియ మహిమాతిశయుఁ డగుటచేత లోకములో బ్రాహ్మణుఁడెవఁడో ప్రకృతిబద్ధులగు మర్త్యులు కనిపెట్ట లేరుగాని యాకాశము పంచేంద్రియ దృష్టము కాకపోయినను పృథివ్యప్తేజో వాయువుల కాధారమగు నాకసమున్నట్టుల ననుమానప్రమాణముచేత నిర్దేశింపఁబడు తీరున దైవమును దన యధీనము చేసికొని తన్నుం బ్రార్థించెడి భక్తుల కష్టములఁబాపి శుభములు సమకూర్చుచు సత్త్వగుణమయుఁడై స్వార్థపరతమాని సర్వభూత దయాపరుఁడై సర్వజనసముఁడై సర్వలోకోపకారపరాయణుఁడై స్వాధీన సకలేంద్రియుఁడై యథేష్టనియమిత సకలజగత్కార్యుఁడై సర్వభూతమయుఁడై సకలకర్మ సాక్షియై సకలలోక బాంధవుఁడై సకల భువనచక్షువై సకల జగదుద్భవస్థితి నాశనకారణమై వందారుజనమందారుఁడై సర్వలోక వ్యవహారమూలమై త్రిగుణాతీతుఁడయ్యును త్రిగుణమయునివలెఁ గేవల సచ్చిదానందలక్షణ నిత్య సత్య నిర్వికార పరమాత్ముఁడయ్యు నింద్రియగోచరునివలె నుదయాస్తమయ వికారశూన్యుఁడయ్యునుపచయాపచయ ప్రకృతి బద్ధునివలె సమస్త ప్రాణి ప్రత్యక్షముగ నహరహమ్మున్దోచు సూర్యునికన్న భగవంతుఁడును "ధ్యేయస్సదాసవితృమండల మధ్యవర్తీ నారాయణః సరసిజాసన సన్నివిష్టః, కేయూరవాన్మకరకుండలవాన్కిరీటీ, హారీ హిరణ్మయవపుర్ధృతశంఖచక్రః" అని ధృఢముగా విశ్వసించి భాస్కరుఁడే ప్రత్యక్ష దేవుఁడని నిరంతర ధ్యానసమాధి యోగమున మున్గియుండియును గేవల పరోపకారమునకు మాత్రమే యావజ్జీవమును వ్యవహరించు మానవుఁడే బ్రాహ్మణుఁ డన మరియును భూదేవతయనఁ బరఁగును. పురాణములం బేర్కొనఁబడిన పరమభాగవతులందఱును బ్రాహ్మణులే.

బ్రాహ్మణులుఁ లేనిచో నెక్కాలమందైన జంగమస్థావరాత్మకమగు ప్రపంచ ప్రవృత్తియే కలుగదు. వేదశాస్త్ర ప్రవర్తకులై సకలభూత సములై కేవల లోకోపకారముగా బ్రతుకుచున్న మహాత్ములగు మనుష్యులెల్ల బ్రాహ్మణులే. ఆత్మతత్త్వ మెఱుంగుటకు త్వగ్జిహ్వానాసా చక్షుః శ్రోత్రమనోరూప కేంద్రియ షట్కమువలె ఋగ్యజుస్సామాథర్వవేద చతుష్టయతత్త్వము వేదాంగషట్కముచే నెఱుంగఁబడును. అహంకారమమకారములు తగ్గించుకొని స్వార్థపరతమాని కేవల లోకోపకారమునకై మాత్రమే పాటుపడు మనుష్యుడు బ్రాహ్మణుఁ డనఁదగునుగదా మఱి యట్టి బ్రాహ్మణునకుఁ దప్ప నితరున కెంతమాత్రమును వేదశాస్త్రజ్ఞానము లభింపనేరదు. వేదశాస్త్రములు జీవనోపాయముగా నభ్యసించువారెల్ల జ్ఞాన లవదుర్విదగ్ధులై విభ్రాంతులై విపరీత దృష్టులై యహంకార మమకారబద్ధులై కేవలస్వార్థపరులై మనుష్యుల నధమాధములై జగద్ద్రోహులని గర్హింపఁదగిన నామబ్రాహ్మణులుగాని బ్రాహ్మణులెంతమాత్రమున్నారు. "గుణాఃపూజాస్థానంగుణిషు నచలింగంనచవయః" లోకులకష్టేష్టములుకనిపెట్టక కేవల స్వార్థపరుఁడైనవాఁడు చదివిన వేదశాస్త్రములన్నియుం బూడిదిన్బోసిన పన్నీరువలె వ్యర్థమగుటయేగాక క్రూరజంతువునకున్న వాఁడి కోరలు కొమ్ములు గోళ్లువలె సకలప్రాణుల కుపద్రవకారణములుగూడ నగును.

## హింసాదూషణము

ఓ పశుమారణకర్మదారుణ శ్రోత్రియుడా! చాలుచాలు నీ క్రూరశ్రౌతవిధి. "వాయుంశ్వేతమాలభేత" అను శ్రుతికి వాయు దేవతకొఱకు తెల్లమేఁకనుచంపి బలియిమ్మని యర్థముచెప్పుచున్నావా? యో మేఁకనంజుడు చవిమరిగినకూళా! ఛీ! శ్రౌతజ్ఞానము నీ

మొగమువలె దారుణము చాలుచాలునో దుర్మతీ! యా శ్రుతికి శీతగాలి వీచునప్పుడు నిర్మలమగు ముతుకదుస్తుదాల్చుకొమ్మను శ్రుతియొక్క ముఖ్యాభిప్రాయమని తెలిసికొనుము. శిష్టసాంప్రదాయానుసారముగా శ్రౌతకర్మములు జరుపుచుంటిననెదవా? నీవలెఁ గ్రూరమాంసాశన వ్యసనపరులు కూళలు పండితమ్మన్యులు నహంకారమమకార విమూఢాత్ములు దురభిమానగ్రస్తులు ప్రాకృతపామరులగు నీపూర్వుల దురాచారమునునమ్మి "అంధేనవనీయమానాయథాంధాః" గ్రుడ్డివాని నూతఁగొన్న గ్రుడ్డివగుచున్నావా? ప్రాచీనులయినను నవీనులయినను సకలభూతదయాపరులై సకల లోకోపకారముగ వ్యవహరించిన వారి యాచారము ననుసరించుము. పో పో మఱికొంతసేపు నిన్నుఁ జూచిన నీక్రౌర్య మంటు తెవులటు బాధించునేమో! శ్రౌతముకల్పము వేదాంగము నీవు తెలిసికొన్నట్టు ప్రాణిహింసకావించుమనియును వ్యర్థముగా ద్రవ్యము నగ్గిబుగ్గిపాల్సేయుమనియును రవంతయునోభ్ధింపదు. శబ్దతత్త్వమెఱుఁగ నపస్వరముగానఱచు గ్రుడ్లగూబవు నీకితరజంతువుల నొప్పి తెలియ వెద్దుపుండు కాకికి నొగులా? "స్వరజ్ఞానాత్పరంనాస్తి" చనతత్త్వమెఱుఁగనిఱను మునివ దుర్జనుడా! సుస్వరజ్ఞానము లేనందున నీహృదయము దయార్ద్రముకాకున్నది. మాంసాహారమును శాకాహారమును నీవు కాకివలె హేయదేయములనక తిని క్రొవ్వి నీయపస్వర వేదోచ్చారణముచే లోకుల నన్యాయముఁగ జంపుచున్న వో శ్రోత్రియమ్మన్యా! ప్రవచన భేదమున వేదమనంత శాఖలుగానున్నది. నీయపస్వరోచ్చారణచే నీవుచ్చరించెడు శబ్దమే వేదశాఖనైననుజేరకో స్వార్థపరుఁడా గ్రుడ్లగూబయార్పు లోకులను భయపెట్టుచున్నది. నీ వుదాత్తాది స్వరములన్నెలుపు షడ్జాదిసప్తస్వరాత్మక గాంధర్వవేద మొకింతయు నెఱిఁగినచో నిట్లు శ్రౌతకర్మము మిషవెట్టి జంతుహింస నొనర్చెదవా? "సంగీత సాహిత్యరసానభిజ్ఞః సాక్షాత్పశుః పుచ్ఛ

విషాణశూన్యః” తౌర్యత్రిక ప్రయోగజ్ఞానము లేనివాఁడు త్రతువు కాఁడె? “శ్రుతిర్మాతా లయః పితా” అనునట్లు నీకు నీ తల్లిదండ్రుల సంగతియే తెలియదో సంకరుఁడా? “సప్తస్వరాన్ ప్రయుంజీత దక్షిణం శ్రవణం ప్రతి, ఆచార్యైర్విహితం శాస్త్రం శిష్యపుత్రహితైషిభిః” అను ప్రకారముగా గాంధర్వవేదతత్త్వ మెఱుఁగక గార్దభస్వరమునఁ లోకులచెవులు చిల్లులువొడుచుచు సకలజనరంజనముగాఁ బలుకనేరక- నీపిలుక నీబూడిదె-నీయపస్వరోచ్చారణము నీయెత్తెత్తి యెంగిలాకున నడుగిడు నాచారము-నీపిశాచవేషము బ్రాహ్మణుఁడవా? శ్రోత్రియుండవా? యనూచానుఁడవా? యోకుక్షింభరుఁడా! సుస్వరజ్ఞానము లయసామర్థ్యము నొకింతయు లేని నీనోటివేదము కుక్కనోటి పురోడాశము కన్న హేయము. సర్వభూతదయాపరుఁడు స్వార్థత్యాగి సకలలోకోపకారవ్రతపరాయణుఁడు సర్వజన రంజకుఁడుకాని నీబోటిదంభుఁడు నామబ్రాహ్మణుఁడు బ్రహ్మబంధుఁడు బ్రాహ్మణబ్రువుఁడుకాని యథార్థముగా బ్రాహ్మణుడెంతమాత్రమున్గాఁడు. “జీర్ణమంగే సుభాషితమ్” నిజమయిన వేదమతీంద్రియముగాని నిక్కముగా నింద్రియములచే నెంతమాత్రమున్దెలియఁబడదు మఱియుం దెలుపఁబడదు. తెలిసినట్లుగాని భోధించునట్లుగాని యింద్రియప్రవృత్తినొకింతయు నగపర్చ మానవంతులగుమునులకుమాత్రమే గమ్యమగు నతీంద్రియనాదబ్రహ్మాత్మకవేదము నీయధీనమైనట్లు కనులు మిటకరించుచు యజనయాజనాధికారమునఁ బేదమేఁకలం జంపి చుచుఁ బొట్టపోషించుకొనుచున్నావా? ధూర్తఛాందసుఁడా! మొట్టమొదట శ్రుతిః యజ్ఞానముం దెల్పు శిక్షనభ్యసించి పిదపవర్ణాత్మక శబ్దానుశాసక వ్యాకరణ మెఱిఁగి యనంతరము సందర్భానుసారముగాఁ బదరచనా విన్యాసవిశేషములం దెలుపు ఛందోజ్ఞానమనుసరించి యవల దేశకాలపాత్రానుసారముగా బ్రయోగముకావించు జ్యోతిషతత్త్వమరసి-పిదప స్వరవ్యంజ నాత్మక

పదములకర్థము నిరూపించు నిరుక్తమందెలిసి యవ్వాల శబ్దభావాను సారముగా నిహపర సాధక కర్మముల వెల్లడించు కల్పవిధానమాచరించి యుభయలోకములం దరింపజేయు ననాది నాదబ్రహ్మాత్మకమగు వేదములం బ్రచురించు సర్వభూత దయాపరులు సకలలోక రంజకులు సర్వపదార్థతత్త్వకోవిదులగు మానవులుమాత్రమే బ్రాహ్మణులుమఱియును భూదేవతలనందగుదురు.

“హరిణాపిహరేణాపి బ్రహ్మణాపి సురైరపి లలాట లిఖితా లేఖాపరిమార్ష్టుం నశక్యతే” అనునట్లనాదికర్మఫలానుసారముగాఁ గార్యములఁజేయుచు, కాలపురుషవశులై జీవులు మొదలు తుద లేని జననమరణప్రవాహరూప సంసారమునఁజిక్కి యవశులై సుఖదుఃఖములనుభవించుచున్నారు. ప్రాణులకెల్ల సుఖించుకోరిక స్వభావము. దుఃఖము నెవ్వరున్గోరరుకదా? సుఖము లభించినయెడల నెల్లజీవులకు న్గోరని కోర్కెగదా ? సుఖమునకుబదులుగాఁ గష్టము తెచ్చుటకై యెవ్వరునుఁగోరకుంటగూడఁబ్రాణులస్వభావమేగా? సుఖాభిలాషతోనే యింద్రియవృత్తి కలుగునుగాని యట్టి పంచేంద్రియ ప్రవృత్తి జన్యమగు కర్మయొకపుడు బాధాజనక మైనప్పటికి స్వాభిలషితసుఖ మెన్నటికైనఁ గలిగించునను నాశచేత దమపురుషప్రయత్నమందు నడునడుమఁ గష్టములనుభవించుచుండియును శాశ్వతులగు జీవాత్మలు దిగంతరేఖవలె మఱియు నెండమావుల మాడ్కి యథార్థముగాఁ దోఁచు నభీష్టసౌఖ్యసంపూర్ణపదవికై సంతతము దేవులాడుట సహజము. అట్టి సహజగుణప్రవృత్తికి హేతువై యతీంద్రియమై యవాఙ్మనసగోచరమై యాకస్మికమై యనశమై దృశ్యాదృశ్యమై “ఇదమిత్థమ్” అని నిరూపించుట కశక్యమై సర్వజగత్స్వరూపమై మఱియును సకల లోకాతీతమై తోఁచియుందోఁచకగపడీ యగపడకందీయందకయుండీ లేకన్నియుండుదానై యెద్దియున్గాక జీవుల పౌరుషమున కొకపుడన్ను

కూలించుచూ నింకొకపుడు ప్రతికూలించుచు సర్వజగత్సృష్టిస్థితి హేతుభూతమై త్రిగుణమయమయ్యును త్రిగుణాతీతమై సకలజంతు సుఖదుఃఖమూలమై సర్వజంగమస్థావర ప్రవృత్తినివృత్తిజనకమై సకల ప్రాణిబంధమోక్షకారణమై యాకాశమువలె పృథివ్యప్తేజోవాయు ప్రవృత్తి నివృత్తులకాధారమయి సర్వజగదంతర్బహిఃపూర్ణమై జాగ్రత్స్వప్నాది విజ్ఞానదశలందు జీవులకు సకల జగద్రూపముగాఁ బ్రత్యక్షమగుచు విస్మృతిరూపసుషుప్తిమూర్ఛాద్యజ్ఞానదశలందుఁ దిరోహితమై సకల జగత్కర్మసాక్షియై సకలప్రాణికర్మప్రవృత్తినివృత్తి హేతుమర్త్య బుద్ధ్యగోచరమై సర్వమున్నానయ్యు నెద్దియు గానిపదార్థమే దైవము నాఁబరగి జీవులకు జగద్రూపమున ఖేదమోదములు బుట్టించుచు విస్మృతిదశయందేపదార్థజ్ఞప్తినైనఁ గలిగింపకుంట సర్వజనానుభవమే కదా ?

## వైదికోక్తి

కొందఱుమునులు బ్రతుకను బండికి దైవపౌరుషములు రెండు చక్రములవంటివనియును మఱికొందఱింద్రియ గోచరమగు సమస్త జగము పౌరుషకృత్యమేయనియును మఱికొందఱు సకల పురుష ప్రయత్నమూలమే దైవమనియును మఱికొందఱు దైవపౌరుషములకు మృద్ఘటములవలె వస్తుభేదమే లేదనియును సిద్ధాంతీకరించినారు గాని పరులసిద్ధాంతములు నాకేల ? నేను జీవించియున్నట్లు నాకు నేనే ప్రత్యక్షప్రమాణమైనట్లు నాస్మృతికి మఱియు నావిస్మృతికిని నాయహంకారమమకార ప్రవృత్తినివృత్తులకును నాజాగ్రత్స్వప్నసుషుప్తి దశలకును మఱియు నాయభీష్టప్రతికూలములకు భయశోకమూలమంతయును నా యింద్రియ వ్యాపారాత్మకమగు పురుషకారమునకుఁ గేవలము భిన్నమగు దైవమే. నాశరీరము నామనస్సు నా కోరిక నా

సుఖమునకు ప్రతికూలమయి నాకు వేఱుగాఁదోచు జగమంతయును
దైవమే నాకు మూఁడేండ్లవయసున నాకుఁ గల్గిన కష్టసుఖములఁ
గూర్చిన జ్ఞప్తి యెద్దియును లేదు. మూఁడేండ్లు మొదలైదేండ్లవరకను
భవించిన సుఖదుఃఖానుభవము పరాకుపడ్డస్వప్నము మాడ్కి లీలగా
జ్ఞప్తిలో నున్నది. రెండేండ్లన్నర మొదలు క్రమక్రమముగా నహం
కార మమకారప్రవృత్తియు నాకు వేఱుగఁ గన్పట్టి వివిధలోకవస్తు
జ్ఞానమభివృద్ధికాఁ జొచ్చెను ఆలోపుగా గర్భస్థుఁడనై యూపిరి త్రీసి
కొనుట కేవల దైవవశమేగాని నాపురుషకారము కాదుగా? మూఁ
డేండ్లు మొదలు నాయాఁకలిదప్పికలు వెల్లడించుకొను విధము నా
కష్టేష్టములు సూచించు విధము నాయహంకార మమకార ప్రవృత్తి
యు నా యింద్రియగోచరమగు స్వల్పపరిమిత వివిధలోకవస్తువులందు
నాయల్పానుభవముఁబట్టి నాకుఁ దోఁచిన హేయాదేయపదార్థములం
బట్టి కలుగు నామనః ప్రవృత్తి నివృత్తులు మొదలుగా నాయందలి
పురుషకారము తలచూపికొనసాఁగఁ జొచ్చెను మూఁడేండ్లలోపు
నాకుఁ గోర్కెలున్నట్టుగాని యా కోర్కెలు తీర్చుకొనుటకు నే నొన
ర్చిన పురుషప్రయత్నముగాని నాకు హేయాదేయవస్తు జ్ఞానముగాని
నాకంటె నితరవస్తుజ్ఞానముగాని నాజ్ఞప్తిలో లేదు. కాఁబట్టి నామూఁ
డేండ్లలోపుగా గలిగిన నా చూపు నా వినికి మొదలగు నా సకలేం
ద్రియ ప్రవృత్తులు నాకవశములయి నాకెఱుక లేకయే స్వభావమో
దైవమోగాని యెద్దియో యొకటి నేను వివరించి చెప్ప శక్యముకాని
యొకవస్తువువశమునఁ బొడచూపెనని యిప్పుడూహించుచున్నాను.
ఇప్పటి నాసుషుప్తి మూర్ఛావస్థలయందు నేనేమిచేసితినో యేకష్ట
సుఖములనుభవించితినో నాపురుషకారమట్టి విస్మృతిదశలో నెట్లుండెనో
నేఁజెప్పఁజాలను. మిక్కిలి మంచుగాలివీచుచు నొడలు వణికించుచు
దౌడలుదగ్గరకావించుచు దంతవీణను మొరయించుచు నుహుహూ

యని పలికించుచు కాల్సేతులు ముణిఁగించుచు వెచ్చదనమునకై యువ్వెళులూరించుచు శీత బాధతీర్చుకొనుటకై ప్రయత్నింపఁజేయుచుంట సహజకృత్యముగాని నావలనగాని యితరప్రాణులవలనఁగలిగిన పురుషకృత్యమెంత మాత్రమున్నాకుంట యెల్లరి కనుభవ సిద్ధమే కదా? సహజములయిన పంచభూతముల యొకవిధమయిన కూడిక వలనఁగలిగినయీశరీరవృక్షము పంచభూతమయమగు నెఱవునఁ బెఱుగుచున్నది. ఈ దేహమునకు బాదగు స్త్రీగర్భాశయము పంచభూతమయము. మఱి యీశరీరవృక్షమునకు బంచభూతసమ్మేళనవిశేషమే బీజము. పంచేంద్రియములును మనోబుద్ధిచిత్తాహంకారములును బంచభూతసమ్మేళనవిశేషముచేతనే ప్రవర్తిల్లుచు మఱి యాపంచభూతాన్యోన్య విశ్లేషవిశేషముచేతనే నివర్తిల్లుచు సత్త్వరజస్తమోగుణాతీతయాత్మక జాగ్రత్స్వప్న సుషుప్తుల జీవాత్మున కనుభవింపఁ జేయుచున్నవి స్వప్నజాగ్రత్సుషుప్త్యవస్థోపాధి విశేషాశ్రయముచేత నింధనముఁబట్టి యగ్నియొక్క కార్యవిశేషము లగపడునట్లుజీవాత్ముఁడు తనయనుభవమును జతుర్విధాభినయముల న్వెల్లడించుచున్నా డిదంతయును గేవల దైవమేగాని పురుషకార మెంతమాత్రము న్గాదు. "వాచారంభణం వికారోనామధేయమ్" అను శ్రుత్యనుసారముగా మిథ్యాభూతములగు నామరూపావివక్షయందు ఘటకపాలాది పౌరుషకృత కృత్రిమనామరూపములు తొలఁగింప మిగిలినవాస్తవము మృత్తేయైనవిధమున మిథ్యాభూతపురుషకారము కుందేటి కొమ్మువలె నసంభవము నెండమావులవలె భ్రాంతికల్పితముగాని నిక్కముగాదైవమే వాస్తవమని యాదైవమే యాత్మయనియును నాసిద్ధాంతము.

ఓ శ్రోత్రియుఁడా! నీసిద్ధాంతము నాకు సరిపడనట్లు నామాట నీకుగిట్టక పోవచ్చును. ప్రాణుల యిష్టానుసారముగాఁ బాంచభౌతిక ప్రవృత్తినివృత్తులు కలుగలేదు. మర్త్యులుతమపురుషప్రయత్నముచే

దమయిష్టానుసారముగాఁ దమశరీరోద్భవస్థితి వినాశములు కలుగఁ
జేసికొన నేరరు. నవగ్రహచారములు కాలగతివిశేషములు ఋతువుల
మార్పులు మొదలగు దైవికకృత్యములకుఁ బౌరుషమధీనమని యెందఱు
నంగీకరింపక తీఱదుగదా? కాఁబట్టి సర్వము న్దైవవశమే దైవవశము
గాని లోకకృత్యమొక్కటియును లేదు. ఇట్లు దైవముకన్న సర్వ
కార్యహేతువు వేఱెద్దియు న్లేదని ఘంటాపథముగాఁ జాటుచున్న నేను
నిన్నో ఛాందసుఁడా! పశుమారణ దారుణ కర్మమును మానుకొ
మ్మని గర్హించుటకుఁ గారణమో కూళమూర్ఖా! బుద్ధిజాడ్యజనితో
న్మాదుఁడా! యో శ్రోత్రియమ్మన్యుఁడా! యిపుడు కొంచెము తెల్వి
తెచ్చుకొని సర్వమును దైవవశమేయని యుపదేశవశమున నొప్పు
కొనుచున్నావు కనుక నాదైవప్రోత్సాహమేయని సర్వభూతదయా
పరుఁడవు కమ్ము పరోపకారక కర్మము తప్పఁ ద్రికరణశుద్ధిగా మరే
కర్మమైన నహంకార మమకార విమూఢాత్ముఁడవై చేయఁబోకుము.
జగత్కార్యములన్నియును దైవాధీనములే యనుచున్నావు కదా?
నా పశుమారణదారుణ శ్రౌతకర్మము కూడ దైవవిధి ప్రేరితమే యని
శాంతిగొనకేల నన్నట్లు తూలనాడెదవేమో యీ కర్మభ్రష్టుఁడవగు
భాగవతమ్మన్యుఁడా యనెదవేని యో కూళవైదికుఁడా! వినుము.
నీకహంకారమమకారములున్నంతవఱకును మఱియును నీవు స్వార్థైక
పరుఁడవై యరిషడ్వర్గములకు లోబడి నిన్నువలె లోకులను ప్రేమించ
కున్నంతవఱకును నీకుం భ్రాంతి స్వరూపమైన పౌరుషముగా వాస్తవ
మగు దైవమే జలచంద్రునివలె నీమనస్సునందు ప్రతిబింబించుటచేత
నీకుం బౌరుషముతప్ప దైవమన్న మాటయే లేదు. సర్వమును దైవ
కృతమే యను దృఢజ్ఞానముగల భాగవతుఁడు నీవలెఁ బశు విశసన
కర్మ మాచరించఁడు. మఱియును సర్వభూతదయాపరతన్మానఁడు.

స్వార్థపరతలేని భాగవతునకు దైవముతప్ప వేఱేజగమే లేదు. కుక్షిం
భరుఁడవై కామ్యకర్మమొనరించు కూళఛాందసుఁడా ! నీకుఁ బొరు
షముతప్ప దైవమే లేదు. కేవలమును దైవముమీఁద భారమువేసి
సమస్తకర్మములును దైవమునకే సమర్పించి సర్వజనసముఁడవై సర్వ
భూత దయాపరుఁడవై పశుహింసక కామ్యకర్మము మానుకొనెద
వేని నీకు శాశ్వత కైవల్యానందము కలుగును. ఆహితాగ్ని యగ్న్యా
హితుఁడను పర్యాయపదముల కగ్నిని సమకూర్చుకొన్నవాఁడు.
"అగ్నిముఖా వై దేవాః" అను శ్రుతికి జాఠరాగ్ని సరిగా నున్నపుడే
దైవస్వరూపమగు సమస్త జగమును దేహధారికి నిరూపించునని
భావము. జఠరాగ్ని సరిగా లేనపుడు దేహి విపరీతదృష్టితో భ్రాంతుఁడై
స్వార్థపరుఁడై సంసారాంధకారమునమున్గి యరిషడ్వర్గమునకు లోనై
యో శ్రోత్రియమ్మన్యుఁడా నీవలెఁ గామ్య కర్మములునల్పుచు స్వపర
భేదకారణాత్మకమగు వృథా పురుషకారమున వ్యవహరించుచుఁ బశు
మారణాది దారుణకృత్యము లొనర్చును. "అగ్నిమీళే పురో
హితమ్" అను ముఖ్యవేద ఋఙ్మంత్రమునకుఁ బరమనెడు సంజ్ఞను
బరుగు నా హృదయమున కెద్దిమేలో యట్టి "వాసుదేవః సర్వమితి"
యను సద్భావనను గలిగించి నన్దరింపఁజేసెడు నాజఠరాగ్ని స్వరూపు
డగు పరమాత్మనే నేను సంతతమును భజించెదనని తాత్పర్యము
కాఁదా? సకలభూతసముఁడవై సకల లోకోపకారపరుఁడవై స్వార్థ
పరత మానుకొని నీవు దేహయాత్ర నడుపుకొంటయే నీకు దేహ
స్మృతి యున్నదనుక దైవధ్యానము చేసినవాఁడ వగుదువు. "జ్యోతి
ష్టోమేన స్వర్గకా మోయజేత" స్వర్గరూపమగు శాశ్వత కైవల్యా
నంద మందనాసించిన జీవాత్ముఁడు సకల భూతదయా స్వరూపమును
సకల లోకోపకార పరాయణాత్మకమును స్వార్థ త్యాగస్వరూ
పమును నగు జ్యోతిఃస్వరూప మగు నిత్యానిత్య వస్తువివేకమును

సంపూర్ణముగా దేహస్మృతి యున్నవఱకును బురుషకారమున సంపాదించుకొనవలసినది. పరమార్థమును సంపాదించుకొనుట కొఱకు ముఖ్యసాధనము శరీరముకన్న నితరమెద్దియును గాదుకనుక ఈ దేహముకన్న యజ్ఞవేది వేఱేలేదు. త్రేతాగ్ను లీదేహమునందే యున్నవి. దేహస్మృతియే పత్ని యాస్మృతికిసాక్షియగు జీవాత్మునే యజమానుఁడు. నాభి హృదయ మూర్ధములందు గార్హపత్యాది త్రేతాగ్నులు వెలుఁగుచున్నవి. ఆ యగ్నిత్రితయమును నియత నిద్రాహార విహారములచే సమృద్ధిగ్ధీపములు కావించుటయే జ్యోతిష్టోమ మొనర్చుట.

## ప్రకృతి ధర్మ విచారము

దేహ యాత్రాత్మక నిత్యాగ్నిష్టోమ కర్మమును జీవాత్ముఁడవ్యక్తముగా నొనర్చుటనే వ్యక్తముగా భగవంతునకు శిలామయాది విగ్రహము లేర్పర్చి యర్చించునట్లు పామరబోధకై స్థూలరూపములగు యజ్ఞశాలలు క్రతువిధాయక శ్రౌత కర్మక్రియాకలాప మంతయును మునులు పౌరుషమునఁ గల్పించిరి. దైవకల్పిత యజ్ఞ స్వరూపము లీ మనుష్యాది ప్రాణి దేహములు. యథార్థముగా సజీవములై సంచరించు జంతువుల సృజించిన భగవంతుని మహిమ నరయక కృత్రిమములు నిర్జీవములు నగు బొమ్మల సొగసు మెచ్చుకొను పామరుల వలె నో శ్రోత్రియమ్మన్యులారా! కల్పితములు కృత్రిమములు నిర్జీవములగు దారుమృణ్మయ యజ్ఞశాలలను బన్నుకొని వ్యర్థముగా నేయి, పాలు మొదలగు నాహార ద్రవ్యముల నెందుకు మంటలోఁ గల్పెదరు. ఆఁకటవేగు మీ తోడిపాటి జంతువుల నా యాహార ద్రవ్యములతో సంతోషపర్చరక్కటా! యేమీ పాపిష్ఠ మంద గ్రహాచారము? మీ తప్పు కాదు. సర్వమును వాసుదేవుఁడే యని

దృఢనిశ్చయములేని నా తప్పు. నా యెదుటనుండి తొలఁగిపొండో కూళసోమాసులారా! మీ క్రౌర్య మంటు తెవులగునేమో?

రేఫము మూర్ధన్యమని కొందరు దంతమూలీయమని కొందఱు శిక్షన్జెప్పుటచే శిక్షాశాస్త్ర మనేక విధములు. "సర్వపార్షదం వ్యాకరణమ్" అను భాష్యోక్తిచే శబ్దవ్యుత్పత్తియ నియతము నైఘంటిక నైగమదైవత భేదముల న్నిరుక్తము త్రివిధమై కేవలాచ్ఛాదిక శబ్దార్థములను నియతముగా వక్కాణించుచున్నది. వర్ణాగమోవర్ణ విపర్యయశ్చద్వౌచాపరౌవర్ణ వికారనాశౌ, ధాతో స్తదర్థాతిశయేన యోగ స్తదుచ్యతే పంచవిధం నిరుక్తమ్-భవేద్వర్ణాగమా ద్ధంసః, సింహోవర్ణవిపర్యయాత్, గూఢోత్మావర్ణవికృతే ర్వర్ణనాశాత్పృషోదరమ్" అని శబ్ద కల్పద్రుమమను గ్రంథమునఁ బ్రతిపాదించినట్లు నిరుక్తశాస్త్రము నానావిధము ప్రవచనాత్మక స్వరవ్యంజనోచ్చారణ భేదమున వేద మనంత శాఖికము. మునిమత భేదమున వ్యాకరణము నవవిధము. ఉదాత్తానుదాత్త స్వరితాత్మక శ్రుతిలయానుసృత స్వరోచ్చారణ పాఠవిశేషమున శిక్షాశాస్త్రము నానావిధము. మంత్ర బ్రాహ్మణ భేదాది వివక్షా మూలమున వేద మనేకవిధము. గద్యపద్యాత్మక పదవాక్యసందర్భరచనా విశేషమున ఛందము బహువిధము. సిద్ధాంత సంహితాహోరాది భేదమున జ్యోతిష మనంత విధము శ్రౌతస్మార్తాత్మ కర్మ విభేదమునఁ గల్ప మనంత ప్రకారము. కాఁబట్టి యనాది గాన పౌరుషేయమే శ్రవణేంద్రియ ప్రత్యక్షమయి నప్పటి కష్టాదశ విద్యామూలమగు శబ్దబ్రహ్మాత్మక వేద యాథార్థ్యము చక్షుర్గోచర మయినప్పటికిని గూఢమగుటఁ బ్రాకృత మానవులచే గ్రహనక్షత్రాది ఖగోళతత్త్వమువలె "ఇదమిత్థమ్" అని నిశ్చయింపఁ దరముకాదు. నామాఖ్యాత - నిపాతో - పసర్గ విభేదమున నాల్గువిధములు శబ్దములు. ఇరువది యుపసర్గలు. వేద

మంచు మఱిరెండుపసర్గలుకూడఁ జెప్పఁబడుటచే నిరువదిరెండుప సర్గలు నామవాచకములతోఁ గాని క్రియలతోఁ గూడినపుడుగాని యీ యుపసర్గలు నానార్థకములుగా నానాప్రక్రియలను వెల్లడించును. తక్కినవి ప్రత్యయములు కొన్ని ప్రత్యయము లర్థవంతములు. మరి కొన్ని నిరర్థకములు. ఆప్రత్యయములసంఖ్య వివరింపశక్యము కాదు. నామములకు మూఁడులింగములుమూఁడు వచనములు మఱియు నేడు విభక్తులును గలవు. వికరణి విభేదముచే ధాతువులు-కృత్తద్ధిత ప్రత్య యములచేతను నాల్గువిధముల సమాసములచేతను ప్రకటింపఁబడు నామములు శబ్దమున కైదవ విభేదమును వెల్లడించుచున్నవి. శాక టాయనాదినైరుక్తులు నామవాచకములన్నియును ధాతుజన్యములే యనియును గార్గ్యాదివైయాకరణులు కొన్నినామవాచకములు ధాతు జన్యములు కావనియును ప్రతిపాదించిరి. శబ్దసృష్టి సహజసిద్ధము కాఁబట్టి యీశబ్ద మిట్లుత్పన్నమయినదని చెప్పుట కెవరితరమగును? అనాదిగా సహజముగా మనుష్యులు తమయూహ లన్యోన్యము న్వాచి కాంగికాహార్య సాత్త్వికాభినయాత్మక నాదబ్రహ్మవివృతాత్మక జగ ద్విధానమున నామరూపాత్మకముగాఁ బంచేంద్రియప్రవృత్తిచేఁ దెల్పు కొనుచున్నారు. నామరూపము లనంతవికారములయి యనిత్యము లయి ప్రతిక్షణము మాఱుచువచ్చుచుంటచే నిద్ది వేదశబ్దమనియు నిద్ది సంస్కృతమనియు నిద్ది ప్రాకృతమనియు నిది వికృతమనియు నిది తత్సమమనియు నిది తద్భవమనియు నిద్ది దేశ్యమనియును మఱి యీ శబ్దము నిత్యమనియు నిది యసత్యమనియు నిది వైకల్పికమనియును నామరూపములకొకమేఱగాని యొకకొలతగాని యొక యర్థముగాని యొకపద్ధతిగాని మానవు లేర్పర్చ వీలులేదు. మానవుల చతుర్విధాభి నయాత్మక నామరూపములు పౌరుషేయములయ్యు నామానవదృష్టికి వలయరేఖకువలె నాదిమధ్యాంతములు నిరూపింప నెవరికిన్దరముకాదు

గనుక నీవైఖర్యాత్మకమగు వైదిక లౌకిక శబ్దజాలముభయము న్గూడఁ బంచభూతాత్మకనుగు నీజగమువలె సహజమున పౌరుషేయ దైవికమని చెప్పకతీఱదు. జగమంతయును సహజ దైవకల్పితమైన ప్పుడు జగములోని దేహములు మఱి వారియింద్రియవృత్తి మూలక పౌరుషముగూడ దైవకల్పితము కాకుండునా? కాఁబట్టి సమస్తమును దైవమేగాని పౌరుషమన్నమాటయే లేదు. దైవమే సత్యము పౌరు షము శశవిషాణమువలె నసంభవము. అనేకవస్తువు లొక్కపేరునఁ బిలువఁబడునవి. ఒకపదార్థమునకే యనేకనామము లున్నవి. కాఁబట్టి యేభాషకైన నొకవ్యవస్థ లేదుగనుక నేశబ్దమునకైనను వ్యుత్పత్తి చెప్పఁదరము కాదుగనుకనే "ఉణాదీన్యవ్యుత్పన్నాని" అని చెప్పఁ బడెను. పృథ్వీశబ్దము ప్రథయను ధాతువునుండి పుట్టినట్టుగునఁ ప్రథ యనుధాతువునకుఁ బర్చఁబడుటయర్థముచెప్పెదవే? యెవ్వరు భూమిని జాపచుట్టవిప్పి పఱచినట్లు పఱచినారు? భూమిని జాపచుట్టవలె నంత యును విప్పిపఱచిన జనులకు నిలుచుట కాధారమెద్ది తూ? పర్చఁబ డ్డది కనుక పృథ్వియనుచున్నావే? కాఁబట్టి యనాదిగా వైఖరి ప్రతి క్షణము నానాదేశకాల పాత్రానుసారముగా మాఱుచున్నదనుటచే నేభాషకైన నొక్కపద్ధతి నిరూపింపరానందున వేదములును శిక్షాది వేదాంగము లనిత్యములు మరియుంగాలోచితములుం గృత్రిమములు మనుష్యకల్పితములు పౌరుషేయములుగాని పంచభూతములవలె సహ జములు వాస్తవములు న్గావు. జనులు తమయూహ నన్యోన్యముదెల్పు టలో ననంతవిధముల నామరూపములు తత్తద్దేశకాలపాత్రానుసార ముగానేర్పరచుకొనుచున్నారుకాఁబట్టి యోశ్రోత్రియుడా! నీవాక్కును నీకర్మమును మాత్రము స్వప్రమాణమనియు నితరుల భాషలుగాని కర్మములుగాని యప్రమాణములు నాస్తికకల్పితములని వదరకుము- మఱియును నెనరుమాలి నీవలె ఖేదమోదము లనుభవించు పశువులం

బట్టి విధ్యుక్తమని భ్రాంతుఁడవై చంపకుము-సర్వజగత్కార్య ములును దైవవశములే పౌరుషమన్న పదార్థమే బొత్తుగా నబద్ధము నసంభవము మిథ్య మృష యనుచున్నావుగా? యనాదిగా మునికృత ములై సంప్రదాయానుసారముగా వేదచోదితమైన పశుబలి మొద లగు క్రతువిధానములను విధ్యుక్తము నాచరించు శ్రోత్రియుల నేల నింది చెదవు? శ్రౌతము మఱియు సకలాధ్వర్యకృత్యములు విధిప్రేరిత ములేకదా? ఆస్తికులము వైదికులము మఱి యనాదిశిష్టాచరణదీక్షితు లగు మమ్మును బామండుఁడవై వైదికశబ్దములు పౌరుషేయములని యును వేదాంగషట్కము పామరరంజకముగా స్వార్థపరులు ధూ ర్తులు మాంసాశనపరులు కల్పించిన దుష్టకల్పనములనియును ప్రాచీన మునిమతమును దూషించుట భావ్యమా? వేదశాస్త్రములు మఱి యనాదిశిష్ట సంప్రదాయానుసృత శ్రౌత స్మార్త కర్మములన్నియును దైవప్రేరితములేయనిదృఢవిశ్వాసమునఁ దెలిసికొన్న భాగవతమ్మన్యుఁ డా శ్రుతిచోదితమగు పశుహింస నొనర్చు శ్రోత్రియులును క్రతువు లును దైవికములని భావింపనేల? జడమైన శరీరముగాని చైతన్య స్వరూపుఁడగు జీవాత్ముఁడుగాని చంపఁబడునని వగచు భ్రాంతుఁడా "నైనంఛిందంతి శస్త్రాణి నైనందహతిపావకః" అను భగవద్వాక్య మరయవా? నిర్జీవమగు జడము హింసింపఁబడదు మఱియును "అసం గోహ్యాయం పురుషః" అను శ్రుత్యనుసారముగా నిరుపాధికుఁడగు నాత్మునకుఁ జావుపుట్టువులు లేవుగా? నీ పెద్దల మతానుసారముగా నడువక నాస్తికమత మవలంబించి పామండుఁడవై వేదబాహ్యుఁడవై నోటికివచ్చినట్లు ప్రేలుచుఁ జేతికివచ్చినట్లు వ్రాయుచు నహంకార మమకారబద్ధుఁడవయ్యు జీవన్ముక్తునివలె నటించు భాగవతుఁడా! నీ వేసములు నీ టక్కులు నీ యాటపాటలు నో పతితుఁడా! నీదురా చారము నీకులవిరుద్ధవర్తనము నీకుపాండిత్యము పామరులనుమాత్రము

రంజింపఁజేయు నీయభినయము చాలుఁ బిట్టు కొంచెము కూఁతఘన
మను సామెత నీతల చూడు వేదవేదాంగములను మునిప్రణీతశాస్త్ర
ములను వైదికాచారములను ప్రాచీన శిష్ట సంప్రదాయముల నోజాతి
భ్రష్టా! నిందించుటచూడు; చాలుచాలు ననెదవా?-యో శ్రోత్రియ
మ్మన్యుఁడా! సావధానము నాలించుము. కర్మములు మనోవాక్కాయ
రూపముల మువ్విధములు మఱియును నిఖిలజగత్సృష్టిస్థితి సంహార కా
రణము నశరీరుఁడగు సూర్యుఁడు బింబరూపముగాఁ దోఁచునట్లు నిర్గు
ణుఁడగు నారాయణశబ్దబ్రహ్మముయొక్క నివృత స్వరూప మీ
జగము "సర్వం విష్ణుమయం జగత్" అనునట్లు విశ్వమ తెయు
నారాయణుఁడేగాని యింద్రియగ్రాహ్యమయిన యుష్ణకిరణాలవాల
మయి యంతరిక్షమునఁ గన్పట్టు బింబము సూర్యుఁడుకాఁడు. మాయో
పాధ్యాత్మకమగు నయనేంద్రియదోష వికార మాగుండ్రని సూర్య
బింబము. జలచంద్రునివలెఁ బ్రతిఫలము నీడగాని వాస్తవసూర్యుఁడు
కాఁడు. "అశరీరమాత్మా""యస్యభాసావిభాతీదం విశ్వమ్" "సర్వాం
తర్బహిః పూర్ణుఁడు""సాక్షీ చేతాః కేవలోనిర్గుణశ్చ" "సర్వమాత్మైవ
ఖలు కంకేనపశ్యేత్" మొదలగు శ్రుతులంబట్టి సర్వమును దైవ
మగు నారాయణుఁడే గాని ద్రష్ట-దృక్కు-దృశ్య మీ త్రిపుటియేకదా
జగత్తు-కారణము కార్యాత్మకమగు జగత్తు బీజవృక్షములకు మృద్ఘ
టములకును వస్తుభేదములేకున్నను నామరూపములు రెండును
మాయాకృతములు గనుక నారెండింటినిఁ దొలఁగింపఁగా మిగిలిన పర
మార్థ వస్తువు దైవమే. నామరూపములు రెండును పౌరుషకల్పిత
ములుమిథ్యలు.నామరూపసాక్షిపరమార్థవాస్తవ తత్త్వమగు దైవము
వాసుదేవుఁ డింతవఱకు నీతో నోశ్రోత్రియుఁడా! నే నేకీభవించెదను
గాని ఉష్ణకిరణ బింబాకారముసూర్యుఁడుకానట్లు శ్రౌతస్మార్తకర్మా
చరణ పౌరుషకృత్యము దైవముకాదు. దైవము వాస్తవము మఱి

పౌరుషము మృగతృష్ణికవలె దైవప్రతిబింబమగు భ్రాంతి కల్పిత మిథ్యారూపము. ఈవృథాతత్త్వ కథనమెందుకు? దైవము మాట కేమిగాని నీపురుషప్రయత్నమున నీవుగాని నీ ప్రేమించిన జనులుగాని హింసింపఁబడుట కొప్పుకొనెదవా? యోకూళసోమాసీ "మహా ఋషీణాం మతయశ్చ భిన్నాః" అనుటచేత నీవలె నేఁగూడ ఋషులను విశ్వసించినవాఁడనేగాని ఋషులు కామ్యకర్మలు ప్రతిపాదింప లేదు. నీవు వారి తాత్పర్యమును గ్రహించలేదు. కేవల జగదుపకారపరాయణులు స్వార్థత్యాగులు సర్వభూతదయాపరులు జీవహింసను విధించిరనుట యసంభావ్యము. పురుషప్రయత్న సాధ్యమగు పనియంతయును పౌరుషకృత్యమేగాని పురుషప్రయత్నము సాధింపనసాధ్యమగు పని దైవకృతము. యజ్ఞశాలను గట్టుట. హోమకుండ నేర్పర్చుట మేఁక మొదలగు ద్రవ్యములను దెచ్చుటయుం బశుహింస కావించి వపాదికమును హోమ మొనర్చుటయుం దమ శక్త్యనుసారముగా నచ్చులు హల్లులుగా దమ కంఠధ్వని నేర్పర్చుకొని యావర్ణములతోఁబడ వాక్యములం బన్ని యుచ్చరించుటయును దమ శరీరావయవములఁ ద్రిప్పుటయును మొదలగు శారీరక కృత్యములం దమ శరీర సామర్థ్యమును బుద్ధిబలమును వినియోగించి మనుష్యాది దేహధారులు నెఱవేర్చఁగలిగిన పనియంతయును బురుషకారమే. తమ పురుషప్రయత్నము విఫలమగుటయు- గ్రహచారము కాలగతి- ఋతువుల మార్పు మొదలగు పురుషప్రయత్న సాధ్యములుకాని పనులన్నియును గేవల దైవకృత్యములు. దేహధారుల కనుకూలములుగాఁగాని ప్రతికూలముగాఁగాని హితములై కాని యహితములై కాని జరిగెడు దైవకృత్యముల మనుష్యాది దేహధారులు తమ యిష్టానుసారము నడిపింప నేరకుంట జనులందఱి కనుభవసిద్ధమేకదా? కాఱుమబ్బొదవి మెఱయుచుఱుముచుండు కారణముచే వర్షము కురియునని

గాలివాన దెబ్బతగిలి నదుపాయము లేర్పర్చుకొనుటకై ముందుగాఁ
బ్రయత్నపడి యిండ్లు కట్టుకొని వర్షకాలమునఁ దమతమ యిరవుల
నొదిగి సుఖించుట తమ పురుషప్రయత్నము కొనసాగినపు డట్లుసంపా
దించుకొన్న సౌఖ్యము పౌరుషకృత్యమే, కాని భూకంపాద్యుత్పా
తములచేతఁ దమ పురుషప్రయత్నమంతయును విఫలము కాఁగా
సుఖమునకు బదులు దుఃఖము తటస్థించుట దైవకృత్యము. సఫల
మైనను విఫలమైనను జీవులు తమ మనోవాక్కాయములచేఁ జేయు
పనులన్నియును బౌరుషస్వరూపములే. ప్రాణుల యింద్రియములకు
వెలియై యవశములయిన కార్యములన్నియును దైవకృత్యములే
"యజ్ఞేన స్వర్గ మకురుత" అనునపుడపూర్వసుఖఫలస్వరూప
మగు స్వర్గమును యజ్ఞమను పురుష ప్రయత్నముచేఁగూర్చుకొన్నాఁ
డనఁగా స్వార్థత్యాగియై లోకోపకార మను పుణ్యకర్మమును సకల
భూతదయాపరుఁడై యపూర్వమగు నిత్య మనస్సంతుష్టినిఁ గలుగఁ
జేసికొన్నాఁడని తాత్పర్యముగాని పురుషప్రయత్న సాధ్య మెంత
మాత్రము న్గాని యపూర్వ సుఖరూపమగు నణిమాద్యైశ్వర్యసిద్ధి
నొందెనని చెప్పుట పిచ్చికాదా? సంతుష్ట మనఃస్థితియే స్వర్గము
మఱియు నసంతుష్ట మనఃస్థితియే నరకము. జనులీ స్వర్గనరకముల
న్దమతమ మనోవాక్కాయ సామర్థ్యము ననుసరించి తమ పురుషకార
మునఁ జేసికొనఁగలరు-కాఁబట్టియే బ్రహ్మజ్ఞానవంతులయిన యాజ్ఞ
వల్క్యాది మహర్షులుపౌరుషదైవములు రెండు నీ సంసారశకటమునకు
రెండు చక్రములని సిద్ధాంతీకరించిరి. దైవము నిత్యము పౌరుష మని
త్యము - దైవ మనంతశక్తి-పౌరుష మల్పశక్తి-దైవము సహజము-
పౌరుషము కృత్రిమము-దైవము సత్యము - పౌరుషము మిథ్య -
దైవము పారమార్థికము- పౌరుషము వ్యావహారికము - దైవపౌరుష
ముల యదార్థతత్వము సమగ్రముగాఁదెలియ నశక్యముగాని యహం

కార మమకారములతో సంచరించు నుత్తము మనుష్యుఁడు "ఆత్మవత్సర్వ భూతానియః పశ్యతి సపండితః" అనునట్లు తన్నువలె నితర జీవులం బ్రేమించువాఁడే నిత్యమనస్సంతుష్టితో నిహపరములఁ వరించును.

## ప్రత్యర్ధ వివరణ

ఓయీ శ్రోత్రియమ్మన్యుఁడా! శిక్షావ్యాకరణ చ్ఛందో జ్యోతిష నిరుక్తములను గూర్చి నేనుదాసీనుఁడనై యుండెదన్గాని నీతో మాత్రము కలహించి నీపశువిశసనక్రూర శ్రౌతకర్మము న్మాన్పించుటకై దృఢపౌరుషము న్జూపకమానను. ఏపనినైన సాధించుటకుఁ జేయు నుద్యమము పౌరుషవశము. కర్మఫలము దైవవశముగదా! దయామయుఁడగు భగవంతుఁడు నాకుఁ దోడ్పడి పశుహింస న్నిచే మాన్పించుఁగాక. మనస్సులోనితలంపు కేవలక్రూరవాక్కును లోకమునకు హానిచేయనేరవు. కామక్రోధలోభ మోహమదమత్సరములను నంతశ్శత్రుషడ్వర్గముగాని వాక్పారుష్యముగాని కొట్టుట చెఱ నుంచుట యన్నపానములిడక బాధించుట మఱేవిధముననైన నొడలి నొప్పించుట చంపుటవలె లోకమునకు భయంకరములును హానికరములగు నుపద్రవము లెంతమాత్రమున్గావు. చుక్కలలో సంచరించు కోర్కెవలె వాఁడు నీకన్న భాగ్యవంతుఁడేల కావలెనని నీ వసూయపడుట వ్యర్థమగు పిచ్చితలంపు ఒరుల నెత్తిబాఱిచూచుట నిందించుట యిచ్చకమాడుటయెగతాళిచేయుటయును మొదలగు వాక్కాయచేష్టలు వెట్టివికారములు మొదలగు చేష్టలవలన లోకులకు లాభనష్టములు రెండును లేవు. కాని యాహారనిద్రావిహారములమాన్పించుట యొడలి నొప్పించుట చంపుటయును మొదలగు కర్మములు లోకులకు మిక్కిలి భయంకరములగు నుపద్రవములు. నాప్రేమించిన జన్తులయొక్కగాని

నాయొక్కగాని నిద్రాహారవిహారముల కడ్డురాక యొడళులనొప్పింపక నీవెట్లైన సంచరింపుము. మఱేజాతి నీతులనైన నవ్వర్తింపుము నీయెడ నాకుఁ గసింతయును ద్వేషపడుట కవసరమేమి? యో కూళసోమాసీ! నీవు పశుహింసమానుకొని ప్రాణుల యాఁకలిదప్పికలఁదీర్చు ద్రవ్యముల వ్యర్థముగా నగ్గిపాలు చేయకుంటివేని నీ వేజాతినీతు లనుసరించినప్పటికి నిన్నొక్కింతయున్దూలనాడ నాకవసరమేమి? పరమకారుణికులై స్వార్థత్యాగులై సర్వలోకోపకారపరాయణులై యతీంద్రియద్రష్టలైన మునులు క్రూరకర్మమగు మాంసాశనమున్గాని పశుహింసక క్రతువిధానమున్గాని ప్రతిపాదించెదరా? పామర దుష్టజనాభిరుచి ననుసరించి క్రూరజనరంజనముకై పశుబలివిధానము నో క్రూరశ్రోత్రియమ్మన్యాఁడా నీవంటి క్రూర పామరజనులు కల్పించిరని స్వార్థపరతమానివి భ్రాంతి కల్పితాగ్రజాత్యభిమానము న్విడనాడి భూతదయాపరుఁడవై తెలిసికొమ్ము. "లోకవ్యవహార పూర్వాశ్చ కేచి దృత్విగాదివ్యవహారాః సుఖార్థహేతుత్వేనాశ్రితాః" అని కుమారిలభట్టు చేసిన వ్యాఖ్యానముం దెలిసికొమ్ము. మఱియును "వేదాదృతేఽపి కుర్వన్తి కల్పైః కర్మాణి యాజ్ఞికాః, నతుకల్పై ర్వినా కేచిన్మంత్రబ్రాహ్మణమాత్రకాత్॥" అని కుమారిలుఁ డన్నట్లు వ్యావహారిక లౌకికదంభకల్పోక్తకర్మాసక్తులు కేవల పరమార్థదాయక మంత్ర బ్రాహ్మణముల నుపేక్షించుచున్నారు కదా? జనులందఱు నాఁడు మగ యనక పాటుపడి వండించుకొని గుంపులుకూడి భోజనముకై కూర్చుండిన సమయములను భోజనపదార్థములను మిక్కిలి రుచ్యముగా వండినవాఁ డధ్వర్యుఁడు మఱియెవరి జఠరాగ్నిబలమెంతో యందునకుఁదగినట్లు వారివారికి వంటకములు వడ్డించువాఁడు హోత మఱియును భోజనసమయమందు జనులకందఱు కుల్లాసముగా భగవన్నామసంకీర్తనమున శ్రవణపర్వము గావించువాఁడుద్గాత. ఇద్దియే యనాదిగా

లోకులందఱున్నావించు నహజాధ్వరము. ఇట్టి సహజాధ్వరమునకు లేని క్రూర కర్మములను వృథారచనా విశేషములం బండితాహంకారమున శ్రోత్రియమ్మన్యులు గ్రామదేవత జాతరవలెఁ గల్పనములు పన్నిరి. నెనరుమాలి జంతుహింస కావించుచుంట యెంతఘోరము?

"ధాతా యథాపూర్వమకల్పయత్ - తత్సృష్ట్వా దేవాను ప్రవిశ్య-సోఽకామయత, బహుస్యాం ప్రజాయేయ" అను శ్రుతులం బట్టి విధి ప్రపంచరచనా విశేషజ్ఞానాత్మమై యపౌరుషేయమై నిత్యమైన వేదస్వరూప శబ్దబ్రహ్మధ్యానాత్మక తపోమహిమచే రేయి పిదపఁ బగటివలెం బ్రళయానంతర మీజగమును యథాపూర్వకముగా సృజించెను. లోకమే వేదము వేదమే లోకమను స్మృత్యను సారముగా వేదశబ్ద మవ్యక్తము జగమా నాదబ్రహ్మము వివృత వ్యక్తస్వరూపము. కాఁబట్టి వేదాత్మక శబ్దబ్రహ్మమే యీ జగత్తు, కాఁబట్టియే కేవల పరమార్థదశయందు వ్యావహారికదశయందున్న వేదమంత్రాధ్యయనము లేనే లేదని యాచార్యులు ప్రతిపాదించిరి. వేదమందలి కర్మకాండము పౌరుషము. జ్ఞానకాండము దైవము. కర్మకాండమైహలౌకికము జ్ఞానకాండము పారలౌకికము. సాధన చతుష్టయ సంపదలేని మనుష్యులు జ్ఞానకాండమును బఠించినలాభము లేదు. మునులకు మాత్రమే జ్ఞానకాండ ముద్దేశింపఁ బడెను. అతీంద్రియద్రష్టలును బాంచభౌతిక లోకాతీతులు నశరీరులు కేవల జ్ఞానమూర్తులు ఘటాంతర్బాహ్యాపరిపూర్ణాకాశ సదృశులు దైవస్వరూపులామునులు భూతదయామయులు సర్వలోకోపకారపరాయణులు సర్వజనసములు వేదశాస్త్రరూపముగ సల్పినబోధ నెఱిఁగినట్లునటించు శ్రోత్రియమ్మన్యులు స్వార్థపరతచేతఁ బామరప్రీతికై తోఁచినట్లెల్ల శ్రుతుల కపార్థముచేసి శ్రౌతస్మార్తకర్మముల గల్పించి జంతుహింస కావించుట తప్పుతప్పు. మాయాప్రకృతిబద్ధప్రాణికోట్టిలో మనుష్యు

జంతువులు మిక్కిలి జ్ఞానలవ దుర్విదగ్ధులు విపరీతదృష్టులు దురహం కారారూఢులు స్వార్థపరులు కోరి దుఃఖము తగుల్చుకొను నవివేకులు సర్వజ్ఞులమని విఱ్ఱవీఁగు దంభులు తెలిసీ తెలియని మూర్ఖులు మిక్కిలి చంచల మనస్కులు మఱి యీమనుష్యులు చదివిన చదువును వ్రాసిన వ్రాఁతలును చేసిన చేఁతలు లోకోపద్రవకరములును మిక్కిలివ్యర్థము లును. "కీలోత్పాటీవవానరః" పనిలేక కోరి త్రాటిమాఁను నడిమి సీల నూఁడ బెఱికిన కోఁతివంటి బుద్ధిహీనులీమనుష్యులు కనుకనే "ధియోయోనః ప్రచోదయాత్" అను మంత్రరాజమును సంతతము నుపాసింపుఁడని బుద్ధిహీనులగు మనుష్యులకు బ్రహ్మోపదేశ మవ సరమయ్యెను. "ధీః" అనఁగా వివేకము. సర్వభూతదయాపరుఁడు సర్వజనసముఁడు సర్వలోకోపకార మొనర్చుటకై "నకర్మణానప్రజ యాత్యాగేనైకేనామృతత్వమానశుః" అనుశ్రుత్యర్థ మెఱిఁగి స్వార్థత్యాగ మొనరించిన పరమభాగవతుఁడు మాత్రమే మనుష్యు లలో నిక్కముగా బుద్ధికలవాఁడు. తక్కినజనులందఱును మూఱికివలె లోకమున కంటుతెవులువంటి చెఱుపుచెత్తలు.

## ఆచారవిధి

సత్వరజస్తమో గుణములను మూఁడు గుణములందుం బ్రతి గుణముయొక్క చతుర్థాంశము మాత్రము ఒక్కటినుండి శూన్యము వఱకును మరియొక్కటినుండి-10000000000000000 పరార్థము వఱకును ఏడుపాళ్ళలో నొకపాలు తగ్గుహెచ్చుల నొండింటి నగలసి సప్తపాతాళములు సప్తద్వీపములును సప్తోర్ధ్వ లోకములుగాఁ బరిణ మించు చుద్భవస్థితి నాశములందుచుం ద్రిగుణములతోఁ బ్రతి గుణము నందు నాల్గుపాళ్ళలో మూఁడుపాళ్ళు వికారము చెందక యమృత స్వరూపమై నిత్యనిర్గుణాత్మకమై బ్రహ్మవిష్ణుశివ త్రిమూర్తిరూపకమై

స్వయం ప్రకాశమానమై సకల జగదుద్భవస్థితి నాశహేతు వగు
చుండును- "పాదోఽస్యవిశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి"
అను శ్రుతిచెప్పిన అమృత స్వరూపమగు మూఁడు పాదములుగాక
ప్రకృతియందలి నాలవపాలు తిపరార్థ సంఖ్యాక ప్రమాణాబ్దముల
వఱకు స్వర్గ మర్త్య పాతాళలోక స్వరూపమై సంపూర్ణముగా
సృష్టిని హెచ్చి మఱి యన్నియేండ్లకే శూన్యస్వరూపమై తాఁగూడ
నమృదపాదమయి బ్రహ్మప్రళయమగును. "శాస్త్రదృష్టం గురోర్వా
క్యం తృతీయం చాత్మనిశ్చయమ్". శాస్త్ర మన్వయించుశక్తియల్పా
యువులగు ప్రాకృతజనులకు బొత్తిగాఁజాలదు. గురుబోధను స్థిరమా
నసులై సంపూర్ణముగా వ్యవహరింపనలవికాదు. కనుక నాకుఁదోఁచిన
యభిప్రాయము త్రిగుణావస్థాత్మక స్వప్నజాగ్రత్సుషుప్త్యవస్థాపర
వశుఁడ నగుటచే సరియగునో కాదో యెద్దియును "ఇదమిత్థమ్" అని
నిశ్చయింపనలవికాదు. ఏదెట్లున్నను నాయూహకందని దివ్యశక్తికి
నేవశుఁడనై బద్ధుఁడనై యాధ్యాత్మికాధిభౌతికాధిదైవికతాపత్ర
యములకు లోనై యుంటిననియును నాకోరిన ప్రకారము జరుగక లోక
మెట్లో విధివశమునఁ బ్రవృత్తినివృత్తులుపొందుచుంటయును మాత్రము
జాగ్రదవస్థయందు మాత్రమే కనిపెట్టుచుంటిని. మొత్తముపై తన
వలె జంతువు లన్నియును సుఖింపఁగోరి యున్నవని తెలిసికొనుట
సకలమనుష్య సాధారణ ధర్మముకావలయునను నాత్మనిశ్చయముతో
ని న్నేమిపనైన నోఛాందసమ్మన్యుఁడా! పశుహింస మానుకొంటి
వేని నీతో హాయిగాఁ గలసిమెలసి నా బ్రతుకున సుఖింపఁ గల నిది
నాస్వభావము. నావిధి దీనికేమందును? నీకు దయలేదా? నీవు పిల్లలం
బాపలఁ గనలేదా? నీవలె నీబంధువులవలె నీతోటి మనుజులవలె
నాపేద జంతువులంగూడ సుఖముగా బ్రతుకనిమ్ము "ప్రమాణమంతః
కరణ ప్రవృత్తయః- ఆత్మవత్సర్వ భూతాని యఃపశ్యతి సపశ్యతి"

నీ మోఁకాలున శిరమునుంచి యాలోచించుకొనుము. మాంసాశన వ్యసనపరుఁడవై బిక్షామిషచే గారెలు మరిగిన మఠాధికారి యతివలె క్రతుచ్ఛలమున వామాచారము నెపమున జీవబలివేసెదవా? "దేవా యజ్ఞమ కుర్వన్త- యజ్ఞేనయజ్ఞమయజన్తదేవాః" ఆ దేవతల యజ్ఞమందు నీవు మేఁకలను జంపునట్లు లోకూళసోమాసీ! నిన్నును నీ తగిలిన బంధువుల నాదేవతలు చంపుచుంట కనిపెట్టవా? నీవు జంతుహింస చేయవేని నీకు దేవతలు చావు చవిచూపించ రింత నిజము నామాటనమ్ము. సర్వజననములు సర్వభూతదయాపరులు స్వార్థత్యాగు లయిన పరమభాగవతులు మునులై శాశ్వతాయువులై యమృతులగుచు నిత్యబ్రహ్మానందమున సుఖించుచున్నారు.

"సౌఖ్యేశ్వరోసౌఖ్యభావే లగ్ననాథనిరీక్షితే। సుఖీభవతి లోకేషు పుమాన్ పండితపూజితః" అను జాతకశాస్త్రానుభవ మరయుము. ఇంద్రియగ్రాహ్యమైన దంతయుం బౌరుషస్వరూపమే. అతీంద్రియమును బౌరుషప్రేరేపకమును సకల జగత్కార్యహేతువును దైవము. విధిమంత్రార్థవాదములు ప్రశంసించును. ఆ కార్యముల నన్నింటిని మంత్రములు గుర్తించును. పశుబలిచేయు వేదికనట్టించుట. నానావిధభాజనములు సమకూర్చుట, యజ్ఞపశువులం దెప్పించుట, నానావిధ హోమద్రవ్యములను సమకూర్చుట-అగ్నిం బ్రజ్వలింపఁ జేయుట పశువుం జంపించుట మొదలగు కాయకర్మమంతయు నధ్వర్యుఁడు చేయవలసినపని. ఋగ్వేదసామవేదములను చిత్రముల కాధారమైన గోడవంటిది యజుర్వేదము. సామవేద సంహితయను పేరంబరఁగుగీతములం బాడువాఁడుద్గాత. కేవలఋగ్వేదమంత్రోచ్చారణమును మాత్రముసలక్షణముగానొనర్చువాఁడుహోత. శతపథబ్రాహ్మణ మధ్వర్యుఁడు బహ్వృచ బ్రాహ్మణమును హోత ఛాందోగ్య బ్రాహ్మణము నుద్గాతయు ననుసరించుచున్నారు. యాజకుల నేర్పఱ్చెడు

బుత్విగ్వరణ మనుకర్మతో నగ్నిష్టోమయాగము మొదలిడును. అగ్నిష్టోమముపిదప దీక్షణీయేష్టి జరుగును. దీక్షణీయేష్టి యందధ్వర్యు లుద్గాతలు ముఖ్యులు. హోత లముఖ్యులు. జ్యోతిష్టోష్టోమము గవామయనము-ఆదిత్యానామయనము - ఆంగీరసాయనము ద్వాదశాహము నైతరేయబ్రాహ్మణము చెప్పుచున్నది. గోష్టోమాయుష్టోమాది సోమయాగములలో జ్యోతిష్టోమము మొదటిది. సప్తసంస్థాత్మకమీజ్యోతిష్టోమము అగ్నిష్టోమము-ఉక్థ్యము-షోడశి-అతిరాత్రము అనునాల్గింటియందగ్నిష్టోమము మూలము. "స్వశాఖావిహితైశ్చాపి శాఖాంతరగతాన్విధీన్, కల్పకారా విబధ్నంతి సర్వఏవవికల్పితాన్, సర్వశాఖోప సంహారో జైమినేశ్చాపిసమ్మతః శాఖాసువికల్పః వేదేషు సముచ్చయః అవశ్యంచ శాఖాంతరోపసంహారోఽపేక్షితః యవైరపిమిశ్రైర్యజేత" అనుటచే నానాశాఖాత్మక వేదానుసారముగా యజ్ఞవిధానములు నానాప్రకారములు. జైమినిముని కన్నియు నంగీకారములే. కాబట్టి జీవపశుబలిపిష్టపశుబలి మొదలగు హింసాహింసల జెప్పు సకల యజ్ఞకర్మములు దేశకాలపాత్రానుసారముగా యథేష్టముగా యజ్ఞములు చేసికొనవచ్చుననియే జైమిని మతము. బ్రాహ్మణులమని యగ్రవర్ణజులమని వేదవేత్తలమని శ్రోత్రియులమని" "వర్ణానాం బ్రాహ్మణఃప్రభుః" లోకములోని యందఱి మనుష్యుల నన్నివిధములను శ్రేష్ఠులమని చెప్పుకొనుచు యజ్ఞమిష పెట్టి త్రాగుట-వ్యభిచారమూలముగా "ఏకశ్చిన్మాంయభతే" అను మొదలగు బండబూతులు పల్కుట పౌండరీకపు బహిరంగపు పందిలిగుడెసెవాటుమైథునము మొదలగు దౌర్జన్యములుచేయుచు జనులందఱికిని వ్యభిచారమును మద్యపానమును మాంసాశనమును పశుహింసయును బండబూతులును శ్రౌతకల్పవిధానములని నప్పుచున్న పనికిమాలిన కూళ చెనఁటి శ్రోత్రియులను క్రూరజంతువులను నిర్మూలమొనర్చు నట్టిదేశమునుండి ద్వీపాంతరములకుఁ దగిలివేయకున్న ప్రజాపాలకుల యవివేక

మనవచ్చును. కేవలపరమార్థ బోధకములగు వేదములను ధూర్త
క్రూరమర్త్య లోకవ్యవహారకర్మపరములుగా నర్థముచెప్పి పశుమార
ణాది దుష్టక్రూరకర్మముల విధించు నీ శ్రోత్రియక్రూరసర్పయాగము
ల్జేయించురాజులీ భూమినేలు పుణ్యకాల మెప్పుడువచ్చునో ? జగము
నందలి మనుష్యులందఱికి నిన్మానవజాతి యొక్కటియే. అందఱు నా
మనుష్య లోకజాతివారే. అహంకార మమకారాత్మకస్వాభిమాన
స్వార్థపరతచేత నరిషడ్వర్గమునకు లోనైన యవివేకు లన్యోన్య కలహ
విద్వేష హింసాసూయామూలముగా జాతి నీతి మతములం బ్రత్యేక
ముం గేవలస్వలాభమునకై యేర్పఱచుకొని తాము తీసికొన్న గోతిలోఁ
దామేకూలుచున్న యవివేకులై జాతిమతవైషమ్యములచేఁబరస్పరము
న్దన్నుకొని చిరకాలజీవన సౌఖ్యమును వ్యర్థముగా మంటిపాలు చేసి
కొనుచున్నారు. అపౌరుషేయములు నిత్యములు తేజోమయములు
నై వస్వరూపములు నాదబ్రహ్మాత్మకములగుసమస్తవేదము ఏకీభవించి
చేసినబోధాత్మకమగుగాయత్రీమంత్రము కేవలయథార్థజ్ఞానాత్మకమగు
బుద్ధివికాసమందలి కోర్కెను మాత్రమే ప్రతిపాదించుట తెలియక
బుద్ధియన్న ఫలముజనులందఱన్యోన్యానురాగముతో సుచిరజీవనసౌఖ్య
మనుభవించుటమాత్రమేయని బోధింపని ధూర్తులు శ్రోత్రియు లెంత
మాత్రమున్గానేరరు. శ్రౌతసూత్రములు గృహ్యసూత్రములు స్మార్త
సూత్రములు సామయాచారికసూత్రములు ధర్మసూత్రములు మొద
లగునూళ్ళన్నియును జనులందఱు న్దారితప్పకన్యోన్యప్రేమానురాగము
లతోఁ జిరకాలజీవనసౌఖ్యమనుభవించి కైవల్యానందమందుట కొఱకు
మాత్రమేసర్వలోకోపకారములు పరమకారుణికులతీంద్రియద్రష్టలగు
మునీశ్వరులచే సర్వప్రాణిహితముగా నేర్పఱచఁబడుట తెలిసితెలియక
స్వార్థపరులై వంచకులు తాముమాత్రమే శ్రోత్రియులమనియును
వేత్తలమనియును మానవులలో నగ్రగణ్యులమనియును నోటిబూరకర

ముచేఁ మూఢులను వెఱ్ఱివాండ్రను మఱియశక్తులను బెదిరించి తమ తమ కోరిన భోగములను సంపాదించుకొనుచు సకలక్రూరకర్మములు చేయుచు లోకమునకు వేరువిత్తులగుచుంట జనుల దురదృష్టము.

## విశ్వకల్యాణ ప్రేమభావము

"నాశ్య ఆర్యః శూద్రాయాం వధ్యః శూద్రఆర్యాయామ్" శూద్రుని భార్యతో వ్యభిచరించిన బ్రహ్మక్షత్రియ వైశ్యులను బహిష్కరింపవలెనుగాని బ్రహ్మక్షత్రియ వైశ్యుల భార్యలతో వ్యభిచరించిన శూద్రునిఁ దప్పక చంపివేయవలయును అను ధర్మశాస్త్రమును బట్టి యవసరమును బట్టి యన్నిజాతుల స్త్రీలు పురుషులును వ్యభిచరించుట సహజధర్మమనియును సహజముగా స్వార్థపరతమాని కేవల లోకోపకారమునకు మాత్రమే బ్రతికెడువా రుత్తమ మధ్యమాధమ స్థితులచే బ్రహ్మక్షత్రియ వైశ్యజాతులుగా నేర్పడుచున్నారనియును సహజముగాఁ గేవల స్వార్థపరులై ప్రాణిహింసకులై ధూర్తులయిన మనుష్యులు శూద్రులుగా నేర్పడియుండుటచేతను బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు వ్యభిచారదోషము కేవల ప్రమాదజన్యము నాకస్మికముగాని స్వభావసిద్ధము కాకుంటచేతద్విజుల వ్యభిచారమునకుఁ గొద్దిశిక్షయును శూద్రుల వ్యభిచారమునకుఁ బ్రాణాంతక శిక్షయును బోడిగొఱ్ఱె యెదురొచ్చినపుడు కట్టునదలించుటయును గ్రూరసర్ప మెదురొచ్చినప్పుడు చంపుటయును వ్యవహారమునఁ బ్రయోగింపబడునట్లు మునుల యభిప్రాయమని తెలియవలెను. బ్రహ్మ క్షత్రియ వైశ్యులు క్రమముగా స్వార్థపరత మానుకొని లోకోపకారమునకై జీవించుచు సత్త్వగుణ ప్రధానులగు మనుష్యులనియు "శూద్రః" అను శబ్దము "శుచశోకే" అను ధాత్వర్థానుసారముగాఁ బ్రాణులను దుఃఖపెట్టువారు శూద్రులనియును దెలియ

వలెను. లోకోపకారులు ద్విజులనియును ప్రాణిహింసకులు శూద్రు లనియును జాతులేర్పరచిన మునుల యభిప్రాయము. స్వకులధర్మాచరణము సరిగాఁజేసిన శూద్రుఁడు వైశ్యుఁడు క్షత్రియుడై క్షత్రియుఁడు బ్రాహ్మణుఁడై జన్మించును. లేనిచో బ్రాహ్మణుఁడు క్షత్రియుఁడై క్షత్రియుఁడు వైశ్యుఁడై వైశ్యుఁడు శూద్రుఁడై జన్మించునని ఆపస్తంబుఁడు పలుకుటచేత నుత్తర జన్మములు సత్కర్మ దుష్కర్మములు ఫలానుభవము తప్పవు.

మశక—తాండ్యబ్రాహ్మణ—లాట్యాయన—నిదాన—ఉపగ్రంథ—క్షుద్ర-తండాలక్షణ-పంచవిధ-కల్పానుపద-అనస్తోత్రములను దశవిధ-కల్పసూత్రములచేత శ్రౌతక్రియా కలాపమంతయును నడుపఁబడు చుండెను. ప్రాణుల యాఁకలి దప్పికలు తీర్చు నన్నపాన విశేషములు వ్యర్థముగా మంటిలోఁ గలుపక పశుహింస చేయఁబోక మఱియైనను ప్రాణులం బాధించని శ్రౌతస్మార్తకర్మములు సర్వజగ దుపకారము లయ్యేనేని విధిగాఁ జేయవలయునః యే సకల సూత్రకార మునుల ముఖ్యాభిప్రాయము. "లాట్యాయన మనుపదం కల్పమేవచ, ఉపగ్రంథాశ్చక్షుద్రాశ్చ తండాలక్షణమేవచ, సూత్రం పంచవిధేయంచ కల్పానుపదమేవచ, అనుస్తోత్రంచ విజ్ఞేయం దశసూత్రప్రకీర్తనమ్" ఈ పదివిధములయిన శ్రౌతసూత్రములంబట్టి "యేయజామహే" అను సప్తదశాక్షరముల నధ్వర్యసప్తదశకము దేవతాప్రీతికై మఱియుందమ శరీరారోగ్యము కొఱకై లోకులకు దైవభక్తి బోధించుట కొఱకై కృష్యాది శ్రమలందిన జనుల మనస్సుల కుల్లాసము పుట్టించుటకొరకై యన్నపానములచే గుంపుగుంపులుగా జనులందఱుం గూడి వేడుకగాఁ గాలక్షేపము చేయుటకొరకై యిహపర సాధనముగా యజ్ఞమును శ్రౌతకర్మమునుసర్వజగదుపకార పరాయణులు సర్వజ్ఞులుం బరమకారుణికులగు మును లేర్పర్చిరి. మునుల యభి

ప్రాయము మెఱుంగక వారొనర్చిన సూత్రముల కపార్థములు చేసి మాంసాశన వ్యసనపరులు స్వార్థపరులు ధూర్తులు పండితమ్మన్యులగు శ్రోత్రియమానులగు బ్రాహ్మణబ్రువులు పశుహింసాది క్రూరకర్మములును భస్మహవ్యములును గల్పించి లోకుల కపకార మొనర్పఁ దగదు తగదు. మనుష్యులందఱు నన్యోన్య ప్రేమానురాగములతో గలసిమెలసి కూడుగుడ్డలం బంచుకొని యరిషడ్వర్గమునకులోఁబడక "ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి సపండితః" అనువిధమున నందఱుం బండితులై గాలియెండవానల బాధను దప్పించుకొని యిండ్లు వాకిళ్ళు నిర్మించుకొని సమాన భోగభాగ్యములతోఁ ద్రికరణశుద్ధిగాఁ కృషి పశుపాలన వాణిజ్యములచేసోమరులుగాక సర్వలోకోపకారమునకై మాత్రమే యత్నించుచు ప్రతిమానవుఁడొరుల సుఖపెట్టి తా సుఖపడుచుండెన సదుద్యమమునకుఁదోడ్పడుటకై భక్తవత్సలుఁడగు వాసుదేవుని దన హృదయపీఠమునఁ బ్రతిష్ఠించుకొని ప్రార్థించుచుజాగరూకతతో వైద్యము జ్యోతిషము శిల్పము మొదలగువానితో దేహారోగ్యమును బాఁడిపంటలను మొదలగుసౌఖ్యముల సమకూర్పంజాలిన భౌతికశాస్త్రజ్ఞానమును మాత్రమే సంపాదించుకొని యాకాశపంచాంగములు మెట్టవేదాంతములు పుక్కిటిపురాణములు శరీరారోగ్యమునకుఁ బనికిరాని తర్కవేదాంతములు మొదలగు సోమరిపోతువిద్యలు స్వర్గనరకవర్ణనములు భూతభవిష్యజ్జన్మ కథనములు అన్నపానవస్త్ర సంపాదనమున కుపయోగించని వ్యర్థధర్మశ్రవణములు వ్రతములు మఱియును సర్వజన మనోవాక్కాయ సుఖప్రవృత్తికిఁ బ్రతికూలించు శ్రౌతస్మార్తాది ధూర్త కల్పిత కర్మములు మఱెట్టివధోపాయములయినను స్మరించక జనులందఱుఁ బరస్పర ప్రేమానురాగములతో బ్రతికిరేని యట్టి మనుష్యులు నిక్కముగా మనుష్యులనఁదగుదురు తగుదురు. వేదాంగములలో నొక్కజ్యోతిషముతప్పఁ దక్కినశిక్షా

వ్యాకరణ ఛ్ఛందోనిరుక్త కల్పములన్నియుం బనికిరానిసోమరిపోతులు
పన్నిన ధూర్తవ్యర్థకల్పనములుగాని నిక్కముగా సకల ప్రాణ్యుప
కారములు సర్వజనపరస్పరానురాగసంబోధకములు సుఖజీవం
ప్రయోజకము లెంతమాత్రమున్నావు. మనుష్యు లుచ్చరించుశబ్దము
లపౌరుషేయములు నిత్యములుం బరమార్థకబోధకములగు వేదము లు
కానేకావు. "ఇషేత్వోర్జేత్వా" అను నక్షరసమూహము మనుష్య
కల్పితముగాని దైవకృతముకాదు. మేఘగర్జితము సముద్రఘోషవలెం
గేవల నాదధ్వని మాత్రమే సహజసిద్ధము.అకారాద్యచ్చులుకకారాది
వ్యంజనములు పదములు వాక్యములుఁ దదర్థ విశేషములు సర్వ
వైదిక లౌకికభాష లివన్నియు నిండ్లు వాకిళ్ళు తోఁటలు దొడ్లు
నూతులు చెర్వులు మొదలగు మనుష్య రచనములవలెఁ బౌరుషేయ
ములుం గృత్రిమములేగాని సహజములు పౌరుషేయములుం దైవ
కల్పితములు కానేకావు. పంచభూతములు తత్తత్కాల విశేషకృత
వస్తూద్భవస్థితి వినాశప్రకారములును దైవకృత్యములు, పరస్పరసుఖ
జీవన సాధనములగు నన్నపానవస్త్రములు సమకూర్చుకొను జ్ఞానము
తప్పమనుష్యులుస పాదించుకొనఁదగినజ్ఞాన మింకెద్దియును లేదులేదు.
భక్తవత్సలుఁడు సకలజగదుద్భవస్థితినాశ కారణమగు సర్వజ్ఞుఁడు సర్వే
శ్వరుఁడగు దేవుఁడు కలఁడని త్రికరణశుద్ధిగానమ్మి సర్వలోకోపకార
ముగాఁ జిరాయు రారోగ్యములం దనకిచ్చి యీతిబాధలన్నింటినుండి
సంతతమున్గాపాడుమని యరిషడ్వర్గములను చెత్తనూడ్చి తన హృత్పీ
ఠమును నిర్మలము కావించుకొని యాభగవంతుని తేజోమూర్తిగా
నందునిల్పుకొని ధ్యానించుట మానవుల కర్తవ్యనిశ్చయజ్ఞానమే వేద
స్వరూపము సర్వలోకోపకారబుద్ధితప్ప వేదమున కింకొకస్వరూపమే
లేదు. సర్వభూతదయయు సర్వలోకోపకారబుద్ధియును ప్రత్యక్షదైవ
స్వరూపములు సర్వభూతదయయును బోధించునామరూపములుమాత్ర

మే ప్రత్యక్ష వేదములు పరులను సుఖపెట్టుటచేతఁ దనకు నిక్కముగా సుఖమబ్బుట సర్వజన ప్రత్యక్షానుభవము "అస్తిభాతిప్రియం సచ్చిదానంద లక్షణమ్" అను జ్ఞానముమాత్రమే యథార్థ వేదస్వరూపము. సర్వభూతములయెడ నదయ కలిగియుంటకన్న వేఱే కైవల్యానందము మఱి లేదు లేదు.

విధిప్రకారముగా లోకమెట్లు జరుగవలసినదో యట్లే జరుగుచున్నది. నీ తీతువుపిట్టరాయబారము బోధయును నీజ్ఞానలవదుర్విదగ్ధతా ప్రకటన మెందుకు నీవొక్కఁడవే తెలిసినవాఁడవా నీపాండిత్యమునుగూర్చి నీవేదప్వావేసిచాటుకొనెదవా యని నన్ను మీరు తూలనాడుదురో వైదికమ్మన్యులారా! ఆ సంగతి నే నెఱుఁగనా? నేమి చేయుదును. పశుమారణాది క్రూరకర్మమును స్వజాత్యభిమానాది దుష్టగుణ ప్రకటనమును శ్రౌతస్మార్తాదివ్యర్థ జీవహింసాకర్మముల నేవిధికి లోఁబడి మీరొనర్చుచున్నారో యావిధికేలోనై జనులందఱ అన్యోన్య ప్రేమానురాగబద్ధులై సమాన భోగభాగ్యముల స్వంతు పంచుకొని హాయిగా బ్రతుకుడని బోధించుచిట్లంబుధు లేడ్చుచు నేను వ్రాయవలసివచ్చెను. మిమ్మిట్లన్యోన్య మతవిద్వేషములం గలహించి తన్నుకొను మీరుచురవస్థనని యిట్లు నన్నుఁబొగులుటకు విధి నియమించెను భగవంతుఁడు నా కీవంతమాన్ని సర్వము వ్విష్ణుమయమునుదృఢ నిశ్చయమున్గలిగించి నామనశ్శాంతిని కలిగించువఱకును వృథాజాతిమత వైషమ్యములచే లోకులనుబాధించి బాధపడు మీ కట్లు బోధింపక మానను మానను. మనుష్యులందఱును సర్వభూతదయాపరులై పరస్పర ప్రేమానురాగబద్ధులై సుఖముగా జిరాయురారోగ్యములం బ్రతుకదగిన యుపాయములనుమాత్రము బోధించు మనోవాక్కాయకర్మములకన్న మనుష్యుల కవశ్యకర్తవ్యములు మఱేకర్మములును గావు. లోకోపకారమునకై తాను బ్రయత్నించుచుంటయును సకల ప్రాణులు

హాయిగానుంట పరికించుటకన్న తనకు వేరేసుఖస్థితి లేదనినిశ్చయించు కొనుటయును "సర్వేజనాః సుఖినోభవంతు" అని యహర్దివసమును జపించుచుంటయును లోకోపకారముగాఁ దన బ్రతుకుఁ గొనసాగించు మని భగవంతుని సంతతమును ధ్యానించుటయును నిక్కపుమానిసి ధర్మము. జంతుహింసచేయక శరీరవేదన మొనర్చ కాహారనిద్రా విహారసౌఖ్యముల కడ్డుతగులకున్నపుడే భాషయైన మాట్లాడుకొననీ యేజాతిమతములైన నవలంబించనీ యేయాచారములనైనాననుసరించనీ మఱెట్టి కర్మములైన నాచరించనీ మఱెట్లైన సంచరించనీ విహితధర్మమున కొకంతయు న్గొఱంతరానేరదు మఱియును గైవల్యసంపదకులోపము కాఁబోదు.

జ్యోతిషమును వేదాంగమున "రాక"యని పున్నమకును అమావాస్యకు "సినీవాలి" యనియును విదియచందురునకు "కుంగ" అనియును పేర్లు. "అస్తిత్రయోదశోమాస ఇతిశ్రుతిః" అనుటచేఁ బదుమూఁడవ మాసము నేడవఋతువును వేదము ప్రతిపాదించుచున్నది. నక్షత్రకల్పము-గ్రహయుద్ధము రాహుచారము-కేతుచారము-ఋతుకేతులక్షణము-నక్షత్రగ్రహోత్పాతలక్షణము - గూర్చి యథర్వణ వేదముచెప్పుచున్నది.పూర్ణిమామావాస్యలిప్తికాలములుగా గ్రహింపబడినవి. ( ) యూపలక్షణము లేక యుపజ్యోతిషమున బలియిచ్చుటకుఁదెచ్చిన పశువునుబంధింప నేర్పర్చిన పచ్చికట్టస్తంభము (2) మాంగలక్షణమను భాగలక్షణము (3) అనువాకసంఖ్య పరిసంఖ్య (4) చరణవ్యూహము (5) శ్రాద్ధకల్పము (6) ప్రతిజ్ఞ ప్రతిజ్ఞ (7) శుల్వాని (8) పార్షదము (9) ఋగ్యజూంషి (10) ఇష్టక పూర్ణము (11) ప్రవరాధ్యాయము (12) ఉక్థశాస్త్రము (13) క్రతు సంఖ్య (14) నిగమము (15) యజ్ఞపార్శ్వము (16) హౌత్రకము (17) పశవోద్ధానము (18) కూర్మలక్షణము. I పశువునుకట్టుకంబము

తీరు II మేంకతీరు III హోమవిధానము IV నానావిధయజ్ఞములు
తన యభీష్టములిచ్చి చిరాయురారోగ్యములం దన్ను బ్రతికించుమని
దైవమును నిరంతరమును దన నిర్మలహృదయమునధ్యానించుకొనుటకు
బదులుగా నీయజ్ఞనాటకములు వేషములు జనులకు వేడుకకై పగటి
వేషములు నాటకములవలె వేడబముగావించుచు లోకోపకారము
నకు బదులు భూతద్రోహ మాచరించు శ్రోత్రియమ్మన్యుల దౌర్జన్య
మునకు మేర లేదు. అన్యోన్యానురాగములం బరస్పర సాంగత్యము
సుఖింపనెంచిన స్త్రీపురుష ప్రథమసమావేశమును బెండ్లిరూపమున
నానావిధవిడంబనముల న్నిరూపించు స్మార్తకర్మముల వ్యర్థక్రియా
కలాపమును శ్రౌతమువలె మిక్కిలి హేయము. తన ప్రయత్నమున
కడ్డుదగులు చుందనకవశముగాc బంచభూతములు కాలవిశేషముల
న్సకలక్రియలు జరుగుచుంటచేతను దన శరీరోత్పత్తియునుదన పుట్టుక
యును దన బాల్యదశయును దన స్వప్నమును దన సుషుప్తియును
దన కవసరములయి జరుగుటచేతను జననమరణములును రోగములు
ముసిలితనమును దాంగోరిన సౌఖ్యమునకు భంగకరములై తన కవశ
ములై తటస్థించుటచేతను బుతువులమార్పు దివ్యభౌమోత్పాతముల
గ్రహగతులకు న్నాలోంగకతీఅకుంట చేతను జరారుజామరణ భయముల
నుండి తప్పించి తన యభీష్టసుఖము నిచ్చు దేవుడు సకల జగత్సృష్టి
స్థితిలయకారుండై సకలకర్మఫల సంధాతయై యున్నాండని నమ్మికొని
తన కోర్కె నీడేర్చ జనులందఱును దన్నుంజూచి యామోదింపం దాం
జిరాయురారోగ్యముల నభీష్టసౌఖ్యము లనుభవింపం జేయంగల
సామర్థ్య మాదేవునకుం గలదని తనతోడి జనుల సావాసమును బోధ
లనుబట్టి తాంగూడ లోకోపకారముగా బ్రతికి సౌఖ్యపడునట్లు తన
కా దేవుండు తోడుపడునని విశ్వసించిన సుజనుండు సకల భూతదయా
పరుండై సకలలోకోపకారపరాయణుండై పరుల సుఖముకై పాటు

పడుచు సన్మానవధర్మము నెఱవేర్చినవాఁడనఁబడును. చేటలు పీటలు నీళ్ళు నిప్పు లగ్గిబుగ్గులు యజ్ఞశాలలు మడిమైల లుపవాసములు కట్టు బొట్టులు సకలశ్రౌతస్మార్తకర్మములు జాతిభేదములు మతభేదములు మొదలగు నీదంభకృత్యము లన్నియును లోకులకుఁ బరస్పరద్వేష హేతువులై జీవహింసాకారణములై యరిషడ్వర్గప్రకోపములై మన స్సంతుష్టి నెరచుటకు మూలములై మనుష్యుల యవివేకమును వ్యర్థ కల్పనములను దౌర్జన్యమును స్వార్థపరతను మోసమును హెచ్చ రించుటకుఁ గారణములగుచున్నవి. భూతదయకన్న భగవంతునకు వేఱే రూపము లేదు. లోకోపకారమున నడిచి సకలజనులను రంజింపఁ జేయుటకన్న వేఱే దైవారాధన విధానము లేదు. పరులను సుఖపెట్టి తాసుఖపడుట కన్న మనుష్యజీవితమున వేఱే ప్రయోజనము లేదు. స్వార్థపరత మాన్పించి సర్వభూతదయ నొదవించి లోకోపకారముగా నడిపించని శ్రౌతస్మార్తకర్మము లన్నియును మిక్కిలి హేయములు గాని యెంతమాత్ర మాదేయములు కావుకావు. జగమంతయు జీవ మయమే.

స్థూలసూక్ష్మరూపములగు పాంచభౌతిక దేహములన్నియుంజేరి యుదకబిందువు లొండుటఁగూడి సముద్రరూపమైన ట్లీజగమంతయును సజీవదేహరూపమే నీవు పీల్చు గాలిలో నీవలె ఖేదమోదములు నిద్రా శనవిహార సౌఖ్యాభిలాషమును సుఖేచ్ఛయు మరణవేదనభీతియునుగల పంచేంద్రియ విశిష్టులు సూక్ష్మశరీరోపాధియుతులయి జీవులనేకులు కల రా ప్రాణుల న్వారిశరీరరూపముగానున్న గాలినిం బీల్చెదవు నీటిం ద్రావెదవు కాయపండుల న్నమలెదవు. జగమంతయును క్రిమిమయమే యనంతసంఖ్యాకసూక్ష్మదేహములతో బ్రతుకుచున్న జీవులను హింసిం పక నీ వూపిరికూడఁ దీసికొననేరవుకదా? భూతమయమగు జగము లోఁ భూతహింసనొనర్పక నీ నిద్రాహార విహారములోకింతయును

సాగనేసాగవుకదా ? యెందుకు భ్రాంతుఁడవై యోభాగవంతుఁడా ! ప్రతిక్షణమును భూతహింసచేయుచుంట మాత్రముచేతనే జీవయాత్ర నడుపుకొనుచున్న నీ బ్రతుకును నీవు తొల్త నిందించుకొని యూపిరి తీసికొనక ముక్కునోరు మూసికొనుము సకలేంద్రియనిరోధ మొనర్చుకొను మదిగో మేము బలియిచ్చు మేఁకలకన్న వేయియింతలు పెద్ద జంతువుల నీ వూపిరితీసికొనుటలోఁ బ్రతిక్షణమును హింసించుట కని పెట్టావా ? చాలుచాలు నీ షండ బౌద్ధబోధ తెలిసీతెలియక శ్రౌతస్మార్త కర్మలను నిందించకుము పట్టువిడుపులను కర్మములచే "అహమన్నమహమన్న మహమన్నమ్ - అహమన్నాదోఽన్నాదోఽన్నాదః" అను నుపనిషద్బోధ నెఱుఁగవా ? ఈ జగత్స్వరూపుఁడై దేవుఁడు సత్త్వరజస్తమోగుణములతోఁ దనంతట సృష్టిస్థితిలయరూపము లందుచుఁ గ్రీడించుచున్నాఁడని తెలిసికొని మనశ్శాంతి నందుము దయ హింస మంచిచెడ్డ పుణ్యము పాపమును శ్రౌతస్మార్త క్రియాకలాపములవలె నీమిథ్యా భ్రాంతి స్వరూపక కృత్రిమపౌరుష కల్పితములని తలంచవా ? చాలుచాలు నోర్మూసికొను. నక్కయేడ దేవలోకమేడ నీవు చూడు వేదవేదాంతవిహిత శ్రౌతస్మార్తకర్మములం న్నిందించుటచూడు. వ్రాఁతలు చేతనగునని యనాదిశిష్టసంప్రదాయము నిరసించి నాస్తిక్యము బ్రస్తుతించెదవా ? నీ కులధర్మము నీపెద్దలను నీజాతినీతులను నీపూర్వుల యాచారమును నీవు సరిగా ననుసరించుటచేతను మాత్రమే నీవు లోకోపకారము చేయఁగలిగి యిహపరములఁ దరింపఁగలవని తెలిసికొని బుద్ధిగొని యడ్డదిడ్డముగా శిష్టాచారము దూషించుట మానుము "వేదవేదాంగవేత్తాపి శిష్టాచారం నలంఘయేత్" అను మహాకవివాక్యము నరయవా ? "మహాజనోయేనగతఃసపంథా" అని నిన్నుఁ గన్నతలిదండ్రులు వారలం గన్న పెద్దలు నీకు విద్యాబుద్ధులు మప్పినగురువులు నీచుట్టునున్న

నీతోడిపాటిజనులు నీదేశమువారు నీకులమువారు నీజాతివారు నడిచిన దారి నడువవా? ఊరియందఱు దొకదారి యుల్లిపిచ్చుక దొకదారి యన్నట్లు నీవే తెలిసినవాఁడవా యనిన నోశ్రోత్రియమ్మన్యుఁడా! ఊర కేల శపించెదవు? "సర్వత్రాత్మాస్తి పురుషఏవేదగ్ంసర్వమ్" అనియుం జగమంతయుం జైతన్యమయమే ప్రాణిహింసచేయ గాపిరి కూడఁ దీసికొనరాదని నేనుమాత్ర మెఱుఁగనా? అతీంద్రియములై సూక్ష్మోపాధులనున్న ప్రాణులహింసించు విధము నీకు బొత్తిగా నప్రత్యక్షము. నీవు గాలిలోఁబీల్చి హింసించిన జంతువులు నీకప్రత్యక్షముగాని శ్రౌతస్మార్తక్రియల నీవు చంపుపశువులు నీవు నీకువలె మిక్కిలి ప్రత్యక్షముకాఁబట్టి నీదేహమును నీవు నఱకుకొననొల్లనట్లా పశుదేహమును బాధింపకుము. "ఆత్మవ త్సర్వభూతాని యః పశ్యతి సపశ్యతి" అను వాక్యము న్విశ్వసించి నీవలె జంతువులం దలంచి లోకులను సుఖపెట్టి నీవు సుఖించుమని సకల వేదవేదాంగములును సకల శిష్టమునులును దాత్పర్యపడుచున్నారు. మాంసాశన వ్యసనము లేని శిష్టమునులు పిష్టపశువిధాన మేలబోధించిరో తెలియవా? నీకు స్థావరజీవులకన్న జంగమజీవులు దగ్గఱ. జంగమజీవుల కీటకములకన్నఁ బక్షులు. పక్షులకన్నఁ జతుష్పాత్తులు పశువులకన్న మనుష్యులు మనుష్యులలో నీదేశమువారు వారిలో నీకులమువారు వారిలో నీబంధువులు వారిలో నీదారపుత్రులు మిక్కిలిదగ్గఱ. ఆలుబిడ్డలకన్న నీకు నీశరీరము కడుచేర్పు నీకుమిగులఁ బ్రియమైన నీదేహము నసఁగా నిన్ను నీవు పశువొనరించు దేవతల కాహుతి కావలసినదని విధించు శ్రౌతకల్పము నుపేక్షించి నీకుమిక్కిలి దవ్వయి సంబంధించక మిక్కిలి యప్రియమగు కంపు మేఁకమాంసమునా దేవతల కర్పించెదవు. నీగుండెకాయ నా దేవతలకు సమర్పించవలసిన దనియే సకల వేద వేదాంగములును మునులును బోధించుచున్నారని తెలియుము.

నీ ప్రాణము నీకు బెల్లమా ? ఆహార నిద్రా విహారసౌఖ్యమును నీవలె నాసించి బ్రతుకుచు నీకుఁగాని నీతోడిపాటి మనుష్యులకుఁగాని యేవిధమయిన హాని చేయకున్న మేఁకలను మేఁకవంటి సాధుజంతువులను స్వార్థపరుఁడవై చంపి కోసి తిని క్రొవ్వెదవా ? కూళసోమాసీ ! వేదవేదాంగములను గాని తద్ద్రష్టృమునీశ్వరుల న్గాని నే నేమియు నిందించ లేదుగాని పరమకారుణికులు సర్వజ్ఞులు సర్వలోకహితాచరణ పరాయణులగు మును లొనర్చిన శాస్త్రముల కపార్థములుచేసి శ్రౌతస్మార్తకర్మములను జంతుహింసకావించు క్రూరకర్మలగు మి మ్మోకూళసోమాసులారా! కాదనెదను. మాంసాశనక్రూరులగు ధూర్తస్వార్థపరులు పన్నిన క్రూరకల్పములను "శతాంధాః కూపం ప్రవిశన్తి" అను చందమున గతానుగతికులై శ్రోత్రియమ్మన్యులారా! వేదవేదాంగముల కపార్థముచేసికొని లోకద్రోహ మాచరించు మీకా నాకా పాషండ సంజ్ఞ తగు నాలోచించుకొనుఁడీ? మీరున్న దార్యావర్తమా ? పుణ్యభూమియా ? మీరుమాత్రమే యార్యులా ? ద్విజులా ? ఆస్తికులా ? వైదికులా ? తక్కిన దేశవాసులు స్మిగుష్టమతము కిట్టని భూతదయాపరులందఱును నాస్తికులా? అనార్యులా ? మ్లేచ్ఛులా ? పాషండులా ? పంచములా ? వేదబాహ్యులా ? అస్పృశ్యులా ? అసంభావ్యులా ? పతితులా ? పంక్తిబాహ్యులా ? చాతుర్వర్ణ్య బహిష్కృతులా ? యేమి మీదురభిమానము? మీదౌర్జన్యము? మీధౌర్త్యము? మీదుష్పాండిత్యము? మీ స్వార్థపరత? మీమూర్ఖత్వము? మీయవివేకము? మీక్రౌర్యము? మీ దుస్సాహసము? మీ పక్షపాతము? మీ కులాభిమానము? మీ భూతద్రోహచింత? మీ యసహన మో ఛాందసమ్మన్యులారా! కొంచెమాలోచించుకొనుఁడీ? జాతిమత వైషమ్యములు పెట్టుకొని పరస్పర ద్వేషములం దన్నుకొని కాట్లాడి కోరి లేనిపోని వాదులు తెచ్చుకొని

యెన్నటికైన సహజముగాఁ దప్పని మరణము న్గోరి తెచ్చుకొని యకాలమృత్యువు వాఁత నెందుకుఁ బడెదరో దుర్జాతి మానవులారా? నిక్కువముసుమ్య ధర్మ మన్యోన్య ప్రేమానురాగములతో జనులందఱు న్గలసిమెలసి పరస్పరసాహాయ్యమునఁ దెల్వితేటలతో హాయిగా బ్రతుకరేల? మీకన్నఁ బశువులు పక్షులు పురువులు వివిధములను స్వచ్ఛందముగా హాయిగాఁ బుట్టి పెరిఁగి సహజముగాఁ బ్రకృతిలో లయమగుచుంట తెలియరా? నీరు నిప్పు గాలి మొదలగు పంచేంద్రియ సౌఖ్యకరములగు పంచభూత కార్యములన్నియు సకల జంతువులకును సమానముగాఁ బ్రవర్తిలుచుంట కనిపెట్టరా? మనుష్యులలో మొత్తముపై నొకరికన్న నొకరు గొప్పవారు న్గారు కొద్దివారు న్గారు కష్టసుఖములు కావడికుండ లందఱికి న్సమానములే. స్వార్థపరత మాని యొరులయెడ నీర్ష్యాసూయలందక లోకోపకారమునకై పాటుపడు నిన్ను నీవు ప్రేమించునట్లు నీ తోడిపాటివారి ననుగ్రహముతోఁ జూచుట కలవాటు కొన్నాళ్ళు పడినపిమ్మట నా మతము మంచిదో చెడ్డదో నీకే బోధపడు నో ఛాందసుఁడా! దేవునకు మనుష్యులు వేదమునకు శాస్త్రములు ప్రతినిధులని నిర్దేశింపఁదగునా? దేవునకు నామరూపములు నాదబ్రహ్మాత్మక వేదమునకుఁ బ్రకృతి ప్రత్యయవర్ణ విభాగమును పామర బోధ కొఱకు మునులు కల్పించిరిగాని దేవుని యొక్క రూపములు వేదముయొక్క శబ్దార్థములును బారుపేయములు కృత్రిమములు ప్రాతిభాసికములుగాని వాస్తవములు కావు కావు. దేవునితోఁ గాని వేదముతోఁ గాని మనుష్యులకు సంబంధమేమియును లేదు. దేవునకును నాదబ్రహ్మాత్మకమగు వేదమునకును భేదమే లేదు. దేవుఁడే వేదము, వేదమే దేవుఁడు. రెండు నతీంద్రియ పదార్థములే. శబ్దభేదము తప్ప దేవునకును వేదమునకును వస్తుభేదము లేదు. దేవశబ్దము వేదశబ్దము నీ రెండు శబ్దములును బారుపేయ

ములుం గల్పితములు స్వప్నజగమువలె నామరూపాత్మకమగు నిజ్జగ మంతయును మిథ్యయును భ్రాంతి భాసికమును మనోవిభ్రాంతి మూలమును గాని యథార్థము కాదు కాదు. "ఇదమిత్థమ్"అని యే పదార్థమును వాస్తవముగాఁ బల్కుట సహజవిపరీత దృక్కులగు ప్రాకృత మానవులకుఁ దరముకాదు. ఎవరికో పుణ్యవశమునఁ బరమార్థ జ్ఞానమబ్బునట్టి ప్రాణియే మునినాఁబరఁగును. ఆముని కూడఁ బ్రాకృత మనుష్యులచేఁ దెలియఁ బడఁడు. తన వీఁపే తాఁదోమఁగొననేరక తన సంగతియే తనకుఁ దెలియకున్న యవివేకి మనుష్యుఁడు "నక్కయేడ దేవలోకమేడ" యన్నట్లతీంద్రియ పరమార్థమును లెక్కించుచుఁ దన పాండిత్యోత్కర్షను వెల్లడించుచున్నాఁడు. తక్కిన జంతువుల కన్న నెంత ధూర్తోగాని మనుష్యులందఱుం బరస్పరానురాగములతోఁ గలసిమెలసి లోకోపకారమునకై పాటుపడుట తప్ప న్వారితక్కిన మనోవాక్కాయ కర్మము లన్నియును మిక్కిలి కొఱగానివి కానివి. కుక్కలలో బాపనికుక్కలు రాచకుక్కలు కోమటికుక్కలు కాపుకుక్కలని భేద మెట్లు లేదో యట్లే మనుష్యులలో బ్రాహ్మణులని క్షత్రియులని వైశ్యులనియు శూద్రులనియును భేదము గడింపరాదు. ఆకార భేదము వయోభేదము తప్ప మఱియే భేదమయినను జంతువుల నే జాతికైన నెంచుట మిక్కిలి యవివేకము. మనుష్యు లందఱును మానవజాతిలోనివారే. స్త్రీలు పురుషులు సామర్థ్యభేదమునఁ బ్రాణి కోటులలోఁ బ్రకృతియుం బురుషుఁడని రెండే జాతులు కాఁబట్టి స్త్రీజాతియుం బురుషజాతియు నన్యోన్యానురాగముతోఁ గలసిమెలసి నిద్రాహారవిహార సౌఖ్యముల బ్రతుకుచున్న కాలము కృతయుగము. జనులకుఁ బరస్పరైకమత్యము తగ్గుచున్న సమయములు క్రమక్రమముగాఁ ద్రేత ద్వాపర కలియుగము లనఁబడు. భూతదయ కలిగి పరస్పరానురాగముతో మనుష్యు లంద ఱన్యోన్యముం గలసిమెలసి

కేవల శాకాహారులై పరస్పరసౌఖ్య మరసికొనుచు సమాన నిద్రా
హార విహార సౌఖ్యసంపాదనమునకై పాటుపడుచు సర్వభూత సము
లైయున్నసమయమే పుణ్యయుగ మనఁబడును. జాతిమతవైషమ్యము
లేక సమాన భోగభాగ్యములతో నన్యోన్య ప్రేమానురాగ బద్ధులై
మనుష్యులున్న స్థితియే స్వర్గము. జనులకుఁ బరస్పర ద్వేషము పుట్టిన
స్థితియే నరకము. సర్వభూత దయాపరుఁడై పరుల కొఱకుఁ బాటు
పడు మనుష్యుని కన్నఁ బ్రత్యక్షదైవ మితర మెద్దియును లేనే లేదు.
చదువులు సందెలు వ్రాఁతలు కోఁతలు పుస్తకములు జన్నిదములు
పెండ్లిండ్లు పేరంటకములు కులగోత్రములు జాతి మతభేదము లిండ్లు
వాకిళ్ళుడుపు లలంకారములు వేషములు వావులు వరుసలు నీయెను
బదినాల్గు కోట్ల జీవరాసులకు జననమరణములుఁ ఖేదమోదములు
నిద్రాహారవిహారసౌఖ్యాభిలాషయును సమానముగానుంటయేస్వభావ
సిద్ధముగాని కోరి క్రొవ్వి వ్యసనపరులై మద్యమాంసములకుం గొఱ
మాలిన భోగముల కలవడి మనుష్యులు తమలోఁ దాము భేద మెన్ని
కొని యరిషడ్వర్గమునకు లోనై పరస్పర ద్వేషమున దన్నుకొనుచుం
దక్కిన జంతువులకన్న నెక్కువ దుఃఖమునకుఁ బాలగుచున్నారు.
పూర్వులకన్న నధిక భోగభాగ్యారోగ్య దీర్ఘజీవన సుఖము లాసించి
యవివేక తీవ్రపురుష ప్రయత్నముచేఁ జిత్తాధిక్యమున వెట్టిపట్టు
దలతో మితిమీఱిన వ్యయప్రయాసములతో నమితాహార విహార
ముల కలవడి ఘోరమృత్యు ముఖమునుండి తప్పించుకొనుటకొఱకును,
రుజాజరావేదనలు తగ్గించుకొనుటకును మీ రొనర్చు తీవ్రప్రయ
త్నములే మిమ్ము నోపండితమ్మన్యులారా! మఱింత జరారుజమరణ
భీకరముఖ సామీప్యమునకు నడుపుచుంట కని పెట్టరేలనో శ్రోత్రియ
మ్మన్యులారా! మీరు స్వార్థపరులై కామ్యకర్మము లొనర్చుట
మీ గోతులు మీరే త్రవ్వుకొనుట మిమ్ము బంధించు త్రాళ్ళుమీరే

తెచ్చుకొంట మీాతోడిపాటి జనులతో సమానముగా సకలభోగం
బులు వంతుపంచుకొని యనుభవింప నెంచకున్నంతకాలమును మీా
రరిషడ్వర్గమునకులోనై స్వాభిమానము న్వీడువని యంతవఱకును
మీా శ్రౌత స్మార్త కర్మకలాపమంతయును మీాకే కంఠపాశమై తప్పక
మిమ్మిహపరములకు దవ్వుకావింపక మానదుమానదు. వంట తెలియ
నంతకాలము చెప్పా లుపయోగించుకొనకున్నంత వఱకును పట్టణ
ములు భవనములు నిర్మించుకొనకున్న యన్నాళ్ళును ధనధాన్యదార
సంగ్రహముచేసికొనుట తెలియకున్నంత వఱకును నాగరభోగముల
కలవడకున్నంతవఱకును రేలుంబవళ్ళు ఋతువుల మార్పుమాత్రమే
కనిపెట్టుచు దుంపలు కాయ లాకులు పండ్లు మాత్రమే తిని మంచినీరు
మాత్రమే త్రాగి బ్రతుకుచుం దములోం దాము విరోధపడ కన్యోన్య
ప్రేమానురాగములతో నొకరి యాహార నిద్రా విహార సౌఖ్యమున
కింకొక రెంతమాత్ర మడ్డుదగులక నేల దున్నుకొని పండించు
కొనుట తెలియక ధనధాన్యసంగ్రహోపాయము తెలియక కులగోత్ర
మతాభిమాన మొకింతయును లేక చదువు వ్రాంత లన నేమో యెఱుం
గక జాతిభేదమెంచక స్త్రీలు గర్భిణులై కన్నపిల్లలకుం బాల్గుడిపి
యశనపిపాసలు తీర్పందగిన దుంపలు కాయలు పండ్లు మంచినీరు
తెచ్చుకొను సామర్థ్యము కలిగినంతవఱకుం బెంచి విడుచుటయును
కొండగుహలు పొదలు చెట్లు తొఱ్ఱలు మఱి యెండ గాలివానల
బాధలనుండి తమ్ముం గాపాడుకొనం జాలిన సహజసిద్ధములగు
మఱుంగులనుండి మనుష్యులు స్త్రీపురుషు లందఱును సమాన వేష
భాషలతో సమాననిద్రాహారవిహారసౌఖ్యములతోం బరస్పర ప్రేమాను
రాగముల నన్యోన్యసాహాయ్యము చేసికొను చున్నంతకాలమే
మనుష్యు లనందగియున్నారు. అట్టికాలమే కృతయుగము. పరస్పర
ద్వేషముతో స్వార్థపరులైనవారు మనుష్యధర్మమునుండి భ్రష్టులై

యిహాపరములకు దూరమైన యధమాధమ దుష్టజంతువులుగాని మనుష్యు లెంతమాత్రమున్నారు. జనులందఱుం పరస్పర ప్రేమానురాగ బద్ధులై యన్యోన్య సహవాస సల్లాపసౌఖ్యముతో నిర్మల నిష్కపట హృదయములతో మాత్సర్యాగ్ని సంతప్తులుగాక సమాన నిద్రాహార విహారసుఖ మనుభవించుచుఁ జిరాయురారోగ్యపదవి ననుభవించుట కన్న జన్మమెత్తిన సార్థక్య మింకేది? అడవులలోను బర్వతములమీఁద జీవించెడి కోదుల కొండవాండ్ర నీతియు సత్యమును రవంతయున్నప్పక చదువు వ్రాఁత లెఱుఁగకుండియును నిష్కపటహృదయములతోఁ జిరాయురారోగ్యములతో దృఢదేహములతో హాయిగా బ్రతుకు వేళ గ్రహాచార వశమున ధూర్తనాగరిక సహవాసమున సౌకుమార్యమున కలవడి చెడుచుండుట కనిపెట్టుచున్నాముగదా!

## విశ్వకల్యాణ ప్రేమభావము

ఏడేండ్లలోపు బాల్యదశయందు మనుష్యు లెట్లున్నారో యేతలంపులు మఱెట్టి నమ్మకములు మఱెట్టి ప్రవర్తనము కలిగి యుందురో యేడేండ్ల వయసువఱకు మనుష్యులలో స్త్రీపురుషులకున్న నీతి యే మనుష్యులకు యావజ్జీవము కొనసాగఁదగిన ముఖ్యమానుష ధర్మము. ఏడేండ్ల వయస్సుపిదపఁ బ్రతికినకాలందిని మనుష్యులకు సత్సహవాసము దుస్సహవాసము భయమును గలుగును. భూతదయా పరులు సకలలోకోపకారపరాయణులుస్వార్థత్యాగులు నిర్మలాంతఃకరణులు కేవల శాకాహారులగు భాగవతుల సహవాసముసత్సహవాసము. దంభులు పశుమారణదారుణ కర్ములు కేవల స్వార్థపరులు జగద్ద్రోహులు వంచకులు కామక్రోధ లోభమోహ మదమత్సర నిర్మగ్న కపటదుష్ట హృదయులును శ్రౌతస్మార్త కామ్యకర్మపరులు తామసాహారులునగు ద్విజమ్మన్యుల సహవాసము దుస్సహవాసము. సహ

వాసముసఁ దలుచు సిరి యబ్బదుగాని చేఁడ యబ్బునను సామెతగాఁ బరమభాగవతధర్మ మంటదుగాని క్రూరదంభ శ్రౌతస్మార్తకపట నిష్ఠాధర్మమే యలవడును. అనాదికాలమునుండియును లోకోపకార పరాయణులు మిక్కిలి సాధులు. కేవల భగవత్సాహాయ్యమే సహజముగా నాసించి యేజంతువునైన న్బాధించ కన్యాపేక్షలేక జీవించు సాధుజంతువులు కేవల శాకాహారమున బ్రతుకుచుండెడు ప్రాణులు పురుగులలోఁ గంబళి పట్టుపురుగులు మొదలగునవి, పక్షులలో జిలుక కోయిల మొదలగునవి, మృగములలో మేఁక లేడి యావు మొదలగునవి, మనుష్యులలోఁ బరమహంసలు యతులు సన్యాసులు పరమ భాగవతులు మొదలగు సర్వజనసములు సర్వభూత దయాపరులు స్వార్థత్యాగులు "సర్వేజనాఃసుఖినోభవంతు" అనిశిష్టులను సేవించుచు దుష్టులకు దూరమగుచుఁ బాపాత్ముల నుపేక్షించుచు నిష్కపటుల నపేక్షించుచుండు సత్త్వగుణప్రధానులు, వేయేల! పుట్టిన ప్రాణులు పుట్టినట్లు కేవల దైవసృష్టి పద్ధతులను మాత్రమే యవలంబించిన మహాదమహజ్జీవు లందఱును లోకోపకారపరులే. దైవసృష్టి పద్ధతులకు వ్యతిరేకముగాఁ దమ విపరీతబుద్ధితో లేనిపోని కృత్రిమకల్పనములను శ్రౌతస్మార్తకర్మములను బన్నుకొని జాతిమతాభిమానములతోఁ బరస్పర ద్వేషములం గాట్లాడుకొని యపమృత్యువునకు లోనగు దుర్జనులు జగద్ద్రోహులై యిహపరములకు దవ్వగుచున్నారు.

"దేవాసురాః సంయత్తా ఆసన్" మాంసాశనులు వంచకులు స్వార్థపరులు ప్రాణిహింసకులయిన శ్రౌత స్మార్త క్రూరదంభ కామ్య కర్మము లాచరించువారు మనుష్యులలో రాక్షసులు. మఱియును కేవల శాకాహారులు సర్వభూత దయాపరులు నిష్కపటులు సర్వభూతసములు లోకోపకారపరాయణులు నగు పరమ భాగవతులు మనుష్యులలో దేవతలు. అనాదికాలమునుండియు నీలోకములో నీ

రాక్షసు లీ దేవతల న్బాధించుచున్నారు. మఱి దేవత లీ రాక్షసుల నుపేక్షించుచున్నారు. "అనాయాసేన మరణం, వినా దైన్యేన జీవనమ్, అనారాధిత గోవిందచరణస్య కుతో భవేత్" భగవంతుని దన నిర్మల హృత్పీఠమందుంచుకొని లోకోపకారము నొనర్చుటయే భగవదారాధన స్వరూపమని యొరుల సుఖపెట్టి తా సుఖపడుచు స్వభూతదయాపరుఁ డైన భాగవతుఁడు మాత్రమే యుభయలోకములం దరించునో కూళ సోమాసీ! చాలు చాలు నీ పశుమారణ దారుణ శ్రౌతస్మార్త దుష్ట కర్మకలాపమంతెయును నీ ధూర్త మనః సృష్టిగాని భగవత్సృష్టి కాదని నమ్ముకొని నీరాక్షస క్రూరకృత్య మింకనైన మానుకొనుము.

బ్రాహ్మణములకు స్వరనియమము లేదు. యథేష్ట స్వరమునఁ బఠించుకొన వచ్చుననియును "తస్య వా ఏతస్య యజుషో రస ఏవో పనిషత్" సర్వవేదముల సార ముపనిషత్తనియు "నహింస్యా త్సర్వ భూతాని" అని యుపనిషత్తు విధించుటచేతను "పశుమాలభేత" అను శ్రుతికి ఛాగాది జంతు విశసన మెంతమాత్ర మర్థము చెప్పఁ గూడదు కూడదు. సత్త్వరజస్తమోగుణాత్మకములగు జాగ్రత్స్వప్న సుషుప్త్యవ స్థల ప్రత్యక్షానుభవముకన్న నహంకార మమకారము లున్నంత వఱకు జగదుద్భవస్థితి వినాశకార్య విశేషములకు మూలకారణమని మఱెద్దియు న్లేదని నిశ్చయింపక తీరదు. ఇంతవఱకున్న స్మృతి విశే షమున జగత్కార్యములు తోఁచుచున్న నిఁక ముం దీ స్మృతి యే మగునో నిశ్చయింపశక్యముకాదు. భూతవర్తమాన కాలములందలి యనుభూతకార్యజ్ఞాన మొకింత కలదు. స్మృతికి గోచరమైనదంత యును నిక్కముగాని స్మృతికను వర్ణనముచే స్వార్థపరుఁడగు వంచ కుఁడు మూఢుల న్మెప్పించి స్వలాభము పొందుచుండునుగాని నిక్కప టుఁడు కేవల లోకోపకారపరాయణుఁ డైన భాగవతుఁడు స్వలాభ ముకై లేనిపోని టప్పాలుకొట్టి జనుల నెంతమాత్రము మోసపుచ్చఁడు

"పురుషశబ్దేనశిరః పాణ్యాద్యాకృతియుక్తో దేహోభిధీయతే - సచ దేహో బ్రహ్మాది స్తంబాంతో బహుప్రకారః" అను మాధవాచార్యోక్తి ప్రకారము బ్రహ్మాది స్తంభపర్యంతము నానావిధములైన పంచభూతాత్మక శరీరములకే పురుషశబ్దము వర్తించుటచేతఁ బౌరుషమనఁగాఁ బంచేంద్రియదృష్ట మంతయును బౌరుషవేద్యమే కదా? పంచేంద్రియాత్మక దేహముగల జీవుని ప్రత్యక్షానుభూత స్మృతిలోలేని పదార్థమంతయును లేనిపదార్థమే కాఁబట్టి ప్రత్యక్షానుభవములోఁ జేరని భూతభావికాలిక పదార్థములు గగనారవిందమువలె శశవిషాణముల మాడ్కి శబ్దమాత్రములుగాని యదార్థములని పిచ్చివారు మోసకాండ్రు తప్ప నిష్కపటాత్ములు బుద్ధిమంతులు నిశ్చయింప నొల్లరు. రెండువందలయేండ్ల క్రిందటికాలమున నావృద్ధప్రపితామహుఁడు పదియడుగుల పొడవైన సుందరుఁడై వేదవేదాంగవేత్తయై యెదువందలేండ్లు బ్రతికి యేన్గులను బంతులవలెఁ జేతమీటిన బ్రాహ్మణవీరుఁడని వ్రాసిన గ్రంథము చదువుకొనిగాని వంశపారంపర్యముగాఁ జెప్పబడుచున్న కథలు వినిగాని నిశ్చయముగా వాఁడే నాతాతయని నే నమ్మకొని పామరులను నమ్మించి బెదరించి నాతాత యంత గొప్పవాఁడు గనుక నన్నుఁగూడ మీరు మన్నించక తీఱదను పనికిమాలిన య్యెబాసిమొద్దు మఱుగుజ్జు చందమున "బ్రాహ్మణోఽస్యముఖమాసీత్" అను శ్రుతిప్రకారము నాది వసిష్ఠ గోత్రము నేను బ్రాహ్మణుఁడను నాతండ్రి తాతల యాచారమంతయును శ్రోత్రియాచారము కాఁబట్టి నేనుగూడ నర్థములను దండుకొని సోమయాజినై యీషణత్రయముల నగిలి క్రతుపురోడాశముల నొగ్గివ్వి యజ్ఞాచరణవ్యసనపరుఁడనై యేఁటేఁట మేఁకలఁ జంపెదనని వదరకు మో నామబ్రాహ్మణుఁడా! నీ నొప్పివంటిదే యితర దేహుల నొప్పియని ప్రత్యక్షముగా నీవు తెలిసికొనుచుండియును నిర్జీవగ్రంథములు ముసలమ్మ

చెప్పినకథలు నమ్ముకొని నీకుఁ బ్రత్యక్షముకాక శశవిషాణమువలె యసంభవ కార్యములగు బ్రాహ్మణాది వర్ణభేదముల స్వర్ణించి పామరులం బెదిరించి స్వార్థపరుఁడవై వంచకుఁడవై నీవు చెప్పిన దొకటిచేయున దొకటిగా లోకద్రోహివై నెనరుమాలి జంతువులనో దేవానాంప్రియుఁడా! దేవతలపేరుచెప్పి చంపి తినెదవా? నిన్ను జంపఁగల మానవులను వ్యాఘ్రాదిహింస్రములను నీప్రాణబంధువులను దేవతాప్రీతికై నీవు నమ్మిన శ్రౌతకల్పానుసార మేల మనుష్య పశువులం జంపి తినవో? నీప్రాణము నీసన్నిహితబంధువుల ప్రాణము నీకెంత బెల్లమో? కేవల స్వార్థపరతకన్న మతేజాతినీతులు నీకు లేనే లేవని తెలియు దుష్టవ్యసనాసక్త ప్రాణిహింసక శ్రోత్రియమ్మన్యుడా! చాలుచాలు నీయాజమాన్యము. పేనునకు పెద్దరికమిచ్చినం బెడత లెల్లం బడకొఱకెనను సామెతగా నధ్యయనవేత్తవని లోకులు నిన్ను మన్నించిన ఫలమా యిట్లు క్రూరశ్రౌతకల్పములం బన్ని క్రతు మిషన్జంతువులం జంపి నమలుచున్నావు? నీవా బ్రాహ్మణుఁడ విస్సీ పశుఘాతుకుఁడా యుండుండుమింకను వినుము "ఆనందో బ్రహ్మేతిజా నీయాత్"-ఒరులను సుఖపెట్టి నీవు సుఖపడుటయే నిక్కముగ బ్రాహ్మణ లక్షణమని తెలియవా? మనోబుద్ధి చిత్తాహంకారాత్మ కాంతఃకరణ చతుష్టయము త్రిగుణాత్మకమై యనిర్వచనమాయా రూపకమై జీవాత్మున కీజగద్రూపమున భ్రాంతిమూలమై యెండ మావుల జలమువలె మిథ్యయయ్యు న్స్వప్నమువలె నగపడుచున్న దనుట యనుమానోపమాన శాబ్దప్రమాణసిద్ధమైనప్పటికిఁ బ్రత్య క్షానుభవమే. నేనను స్మృతియును ఖేదమోదానుభవము నాశరీర మును నాకు వేఱుగానున్న జగమును నాకు యథార్థముగా ననుభ వించుచుంటచేత నాయీప్రత్యక్షానుభూతి ఖేదమోదములు నీజగత్తును సహేతుకముగా యుక్తికిట్టనందున నీ దేహాది సకలప్రపంచభ్రాంతి

మాత్రము మిథ్య. స్వప్నమువలె మృగతృష్ణికమాడ్కి వాస్తవము కాదని పైకి వేదాంతబోధచేయుచు నాయనుభవ మొకవిధము నాబోధ వేఱువిధముగా నుంటకూడ భ్రాంతికృతమని యేల యన రాదో? కాఁబట్టి యింద్రియ ప్రవృత్తిజ్ఞాన మున్నంతవఱ కనఁగా నాకు శరీరస్మృతి యున్నంతవఱకు నా జ్ఞప్తియును మఱి యాజ్ఞప్తి గ్రాహ్యమగు జగమును వాస్తవమే. "అహంబ్రహ్మాస్మి" నేనే బ్రహ్మము నాకంటె వేఱే పదార్థమే లేదీ పాంచభౌతికోపాధియును మఱి యీ సమస్త జగమును స్వప్నమువలె నెండమావులవలె మనోవిభ్రాంతి కల్పితములుగాని వాస్తవములు కావని భావించుకొనుటయు న్గూడ భ్రాంతిమూలమే యగునుగదా!

కాఁబట్టి యీ పనికిమాలిన సోమరిపోతుసన్యాసి మాటలు చాలించి పౌరుషముకన్న మఱి వేఱే పదార్థమే లేదని దృఢముగా నమ్మికొని యీ పౌరుషమునకుఁ దగినట్లు నిష్పాక్షికముగా ఫలము నొసఁగు భగవంతుఁడు ప్రత్యక్షముగాఁ ద్రయీమూర్తియై ద్వాదశాత్ముఁడై సర్వజగదుద్భవస్థితి వినాశమూలమై సకలకర్మసాక్షియై సర్వగ్రహరూపియై సర్వలోకబాంధవుఁడై సర్వలోకచక్షువై యచింత్యానంత మహిమాన్వితుఁడై త్రిభువన స్వరూపుఁడైన భగవంతుఁడీ సూర్యుఁడే దేవుఁడని ముమ్మాటికి న్విశ్వసించి సూర్యుని యంశమే యీ దేహస్మృతి యని యెంచుకొని పరోపకార మొనర్చుటయే యీ జన్మమునకు సార్థక్యమని సర్వభూతదయాపరుఁడవై యితర జీవుల సుఖపెట్టి నీతోడిపాటివారికి సాయపడి వారి యనుగ్రహమును స్నేహమును సంపాదించుకొని సుఖముగా నీ జీవనమును గడపుకొనుము మఱియును సకల భూతములును సర్వజీవులును నీ బ్రతుకు సౌఖ్యమును గాపాడునట్లు సంతతమును తేజోమయుఁడు ప్రత్యక్ష దేవుఁడగు సూర్యభగవానుల కహర్నిశము జేయెత్తి మ్రొక్కు-

చుండుము నీ కాపదలబ్బినపుడు నీ పౌరుషలోపమనియును నీప్రారబ్ధ దుష్కర్మఫలమనియును నీకు సంపద లభించినపుడు భగవదనుగ్రహ మనియును నీతోడిపాటివారలకు నీయెడఁగల యనురాగమే కారణ మని నిశ్చయించుకొని నీచిత్తమును సమాధాన పర్చుకొనుము. నీ వొప్పుకొన్న కురూపి నీకు సొగసగుటయు హాస్యము నెపమున నీవు ప్రేమించినవారు నిన్నుఁ దిట్టిన తిట్లు నిన్నుఁ గొట్టినకొట్లు నీకోరిన కోర్కెలగుట నీప్రత్యక్షానుభవమేకదా? స్వార్థపరతమాని పరోప కారమునకై పాటుపడుచుఁ గాపట్యము న్దొలఁగి మహాప్రభూ! నీకన్న మఱి దిక్కులేదు రక్షించు రక్షించుమని ప్రతిక్షణమునుజ్ఞానస్వరూ పుఁడై ప్రత్యక్షదేవుఁడగు సూర్యనారాయణునకు మ్రొక్కుచుంట కన్న నీవు చేయవలసిన యజ్ఞములుగాని జపములుగాని మఱే యాచారములయినఁ గాని లేవో శ్రోత్రియుమ్మన్యుఁడా! శిక్షక వ్యాకరణఛాందస నైరుక్తిక జ్యోతిష్కులతో నాకెద్దియు న్పనిలేదు గాని యోపశుమారణదారుణ కర్ముఁడా! యోదంభ శ్రౌతస్మార్త కర్ముతుఁడా' నీకుఁ దప్పక భూతదయయును సకలజన సమ్మతాచారణ విధానమును బోధించి నిన్నొప్పించి నిన్నుఁ గేవల భాగవతునిఁ జేసిన గాని నాచదువు నేర్పున ఫలమేమియో? కవినైన సార్థక్యమేమియో? ఇంత కష్టపడి గ్రంథము రచించిన సాఫల్యమేమియో?

తన యూహాను బరుల కెఱిఁగించుటమాత్రమే వాచి కాంగికా హార్యసాత్త్వికాభినయ ప్రయోజనము కాఁబట్టి సంజ్ఞామాత్రములైన రూపములకు దేశకాలపాత్రానుసారముగాఁ గలిగిన పద్ధతు లనిత్య ములు క్షణికములును సమయోచితముగా మార్పుచెందక తీఱనవి యును మూఁగవారు తమ యూహాలను దమ కంఠధ్వని విశేషముల కలవడిన వారలకుఁ దెలుపఁదగినట్లఱచెదరు. ఆమూఁగల కంఠధ్వని నలవాటునఁ దెలిసికొన్నవారలా కంఠధ్వనుల స్థాయివిశేషములంబట్టి

వారల యూహలు పోల్చి వారలకుఁ దగువిధమున నాచరించెదరు. మనుష్యులు శబ్దాద్యభినయవిశేషములచే నితరజంతువుల యూహలం దాము గుర్తించి తమ యూహల చొప్పున నితర జంతువులచే గ్రహింపచేయుచున్నారు. కాఁబట్టి ప్రాణులు పరస్పర మూహ తెల్పుకొను నామరూపాత్మక సంజ్ఞల కొక పద్ధతియు నొక నియమము నెంతమాత్ర మక్కరలేదు.

జగత్కారణమై భక్తపరాధీనమై సర్వజ్ఞమై సర్వశక్తియైన పదార్థమును దెల్పఁగలిగిన శబ్దరూపమెట్లున్ననేమి? హాయిగా బ్రతికించుగాలి యెట్టిదేశకాల పాత్రలం బుట్టిననేమి? అన్యులచే నెఱుఁగ శక్యముకాని తన యూహ నన్యులకుఁ దాఁ దెల్పఁగలిగిన నామరూపముల కన్యుల శిక్షావ్యాకరణ చ్ఛందోనిరుక్తి పద్ధతినియమములతోఁ బ్రయోజనమేమి? "ఏకశ్శబ్దః సమ్యగ్జ్ఞాతః సుష్ఠు సంప్రయుక్తః" అని భాష్యకారుని యుద్దేశము. శబ్దమనఁగా నూహ. ఒరుని యూహ సరిగాఁ దాఁ దెలిసికొనుటయుం దనయూహ సరిగా నితరులకుఁ దెల్పుటయును దన మనస్సంతుష్టి నొదవించునని తాత్పర్యము. శబ్దబ్రహ్మమనియు నాదబ్రహ్మమనియును బల్కుటచే సర్వజగదాత్మకమై సర్వజగత్కారణమై నామరూపాత్మకమై వాచికాంగికాహార్యసాత్త్వికాభినయవిశేషమంతయును శబ్దరూపమనియే పతంజలి తాత్పర్యము. కాఁబట్టి "ఏకశ్శబ్దః" అను భాష్యము హాయిగా బ్రతుకుటకై ప్రతిజంతువు నూహించుచున్నదనియును తన బ్రతుకు సౌఖ్యము సమకూర్చుకొనుటకై తన యూహ ప్రవర్తించుచున్నదనియును బ్రతిజనుఁడు తెలిసికొని యొరుఁ సుఖపెట్టి తాసుఖపడవలయునని "అథశబ్దానుశాసనమ్" అని ముందుగా "అథ" అను శబ్దమును బ్రయోగించెను "అ"అనువర్ణ మించుమించు ప్రతిభాషలో మొదట నుచ్చరింపఁబడుటకుఁ గారణ మచ్చుల కెల్ల "అ" అను నచ్చేవైఖరీ

మూలము. అంబ, అల్ల, అక్క మొదలగు "అ" అను నచ్చుతోఁ బ్రతి జంతు కంఠస్వరమును బ్రవర్తిలుచున్నది. కంఠస్వరముచేతను మఱి యవయవవిన్యాసాకార విశేషముచేత ననఁగా నామరూపాత్మక చతుర్విధాభినయముచేత నన్ని జంతువు లన్యోన్య మూహ తెల్పుకొనుచున్నవి. అ మొదలగు నచ్చుల కన్యోన్యభేదమును కకారాది వ్యంజనములును మనుష్యు లన్యోన్యోహానివిదేనమునకై పన్నుకొనియట్టి కల్పిత ధ్వని విశేషములకు శిక్షావ్యాకరణ చ్ఛందోనిరుక్తములని సంజ్ఞ లేర్పరచుకొన్నారు. మఱియు సూర్యోదయాస్తమయముల యవధి సూర్యచంద్రగ్రహణముల రీతియును ఆమావాస్యా పూర్ణిమల కొంచెమైనను దోఁచక సంపూర్ణ బింబములం గ్రమముఁగఁ గన్పట్టు చంద్రు నరసియును ఋతు విశేషములం బట్టియుఁ జ్యోతిష శ్రౌత స్మార్తకర్మ పద్ధతు లేర్పఱచుకొనుచున్నారు మఱియును బాల్యమున సుషుప్త్యవస్థయు యౌవనమున జాగ్రదవస్థయును వార్ధకమున స్వప్నావస్థయును బొందుచున్నట్లు సకల జీవులు కన్పట్టుచున్నారు. జ్యోతిష శ్రౌతి విధానములచేఁ బ్రతికూల దైవము నడ్డుకొనుటకును సకలాభీష్ట కార్యసిద్ధిని సమాకూర్చుకొనుటకు మనుష్యులు తమ పౌరుషముపయోగించుకొనుచున్నారు. కేవల స్వార్థపరతకై కాక లోకోపకారముకై మాత్రము మానవు లొనర్చు సకల కర్మములు సకలవేద శాస్త్ర సమ్మతములే సమ్మతములే. ఆహార నిద్రావిహార సంపూర్ణ భోగము తా ననుభవించి పరులచే ననుభవింప జేయు శక్తి తగ్గిన కొలంది నీ వేదవేదాంగ పద్ధతులు పనికి మాలిన కూఁతలు వ్రాఁతలు సోమరిమాటలు సోదె లాకాశపంచాంగములు మొదలగు కొఱమాలిన కులమతాచార పద్ధతులు మొదలగు వార్ధకలక్షణము లన్నియును బొడచూపుచున్నవి. బాల్యము దాఁటి వయసు ముదిరిన కొలంది నిద్రాహార విహారసౌఖ్యమును సంపాదించుకొనుటకై చేయు

పురుష ప్రయత్నము తప్ప మనుష్యులు భూతభవిష్య జ్జన్మములం గూర్చియు నతీంద్రియ స్వర్గనరకములం గూర్చియుం గులమతాచార ప్రవర్తక శ్రౌత స్మార్తాది కర్మములన్నియు నుబుసుపోని మంగలి పిల్లి తల గొఱుగుటవలె మిక్కిలి వ్యర్థ కల్పనములు. తన యొక్కయుం బరుల యొక్కయు నిద్రాహార విహార సౌఖ్యమునకై పాటుపడుట మాత్ర మీ బ్రతుకున నవశ్యకర్తవ్యమగు పని. తనకుం గాని పరులకుం గాని యీ బ్రతుకు నందలి నిద్రాహార విహారసౌఖ్యముం జెఱచు సకల విద్యలును సకల శ్రౌత స్మార్త కర్మములు వివిధకుల మతాచార పద్ధతులును వృథాపురుష ప్రయత్నము లని ఘంటాపథముగాం జాటి ప్రతి మనుష్యుడుం దనతోడిపాటివారికి బోధింపవలయును. బాల్యమున సుషుప్త్యవస్థయు యౌవనమున జాగ్రదవస్థయును వార్ధకమున స్వప్నావస్థయును సకల ప్రాణు లనుభవించుటచేత సుషుప్తి యందు ప్రత్యక్షాది ప్రమాణ చతుష్టయ బోధ యొనర్చు శక్తి యుండదు. యౌవనమున స్వపరనిద్రా విహార సౌఖ్యమునకై మాత్రమే త్రికరణము లుపయోగించుకొనుటచేత వేదశాస్త్రములు చదువు కొనుటకుం గాని ప్రవచించుటకుం గాని సమయము చిక్కదు. వార్ధకమున నెట్టి పాటుపడుటకైనను శక్తి చాలదు. మఱియును వార్ధకదశ పరాధీనమగుటచేత వేదశాస్త్రములు బోధించుకొనుటకుం గాని పరులకు బోధించుటకుం గాని దేహమనఃపాటవము బొత్తుగా క్షీణించును. కాంబట్టి కేవల తపస్సామర్థ్యముచేత బుద్ధిస్వరూపులగు వ్యాసాదిమునులు బోధించిన వేదశాస్త్రములు ప్రాకృతులగు మనుష్యులు గ్రహింపంజాలక స్వార్థపరులగుటచేత, దమ లాభముమాత్ర మాసించి లోకోపకారము కసింతయు దలంపక సర్వజనసమ్మతముకాని యభిప్రాయములను వేదశాస్త్రములందుం దమ యిష్టానుసారము గ్రహించి యన్యోన్య మతద్వేషములతోం గాట్లాడి తన్నుకొని యిహాపరముల దూరమగుచుంట కేవల కలికాల చేష్టిత మనకతీఱదు,

లోకుల ప్రవర్తనము కాలవశమున మాఱుచుండును. వేసవి యందుఁ దాపము శీతకాలమునఁ జలిచే దేహధర్మములుఁ చేష్టలు మాఱుట స్వభావమైనట్లు కృత త్రేత ద్వాపర కలియుగములందు మానవధర్మము తార్మాఱగుచుండును, నాల్గుయుగములకుఁ దగునట్లు మునులు ధర్మములను బోధించిరి. "కలౌ పారాశరః స్మృతిః" అనుటచేఁ బరాశరముని చెప్పిన ధర్మముమాత్రమే కలికాలమం దనుసరింపదగినది. సకలధర్మ వివర్జితమగు కలియుగమునందలి జనులుతరించు మార్గముచెప్పుచున్నానని పరాశర మహర్షి "దానమేవ కలౌయుగే" అనియును దానమనఁగా బరోపకార మొనర్చుట మాత్రమే కలి జనుల కవశ్య కర్తవ్యమనియును "పశుమాలభేత" అను వేదచోదిత క్రమవిధులకుఁ గలికాలము పనికిరాకుంటచేత వైశ్వదేవము చేసికొని యతిథిగావచ్చిన యే యధమజాతివానికైనను మఱెట్టి పాపాత్మునకైనను "అన్నస్య క్షుధితం పాత్రమ్" అని యొరుల నన్నపానాదులను సుఖపెట్టి భూమి సేవ్యము చేసికొనుటయే ముఖ్య జీవనవృత్తి చేసికొని స్త్రీ పునర్వివాహము నంగీకరించి సత్సంపర్కము శ్రేయమని సులభములగు ప్రాయశ్చిత్తములచే వ్యభిచార నివృత్తి యగునని భగవన్నామ సంకీర్తనముకన్నఁ గలికాలమున వేఱే తరించుటకు దారి లేదని బోధించెను. ఇంతకు నక్షత్రాది ఖగోళముల సంగతి కూలంకషముగాఁ దెలసికొని "ఇదమిత్థమ్" అని రూపింపశక్యము కానట్లు వేదశాస్త్ర ప్రవర్తకులగు మునుల మతమును యథార్థముగాఁ ప్రాకృతజనులు తెలిసికొని తాము నడిచి యొరుల నడిపింప నొకింతయును సమర్థులుకారు. మోఁచేతి కంకణమున కద్దమేలా ? పరుల సుఖముఁ గోరిన నదప్ప నీకు సౌఖ్య మబ్బదని నీ కూహవచ్చినది మొదలు నీ స్వానుభవమేకదా ? కాఁబట్టి యొరులను సుఖపెట్టి నీవు సుఖముగా బ్రతుకుము. స్వర్గనరకాది గగనారవింద చింత నీకేల ? వేదవేదాం

గాడి విద్యలు వ్రాతలలో గలవుగాని నీ బ్రతుకు సౌఖ్యమున కుపయో గించు తెలివితేటలు లోకుల ప్రవర్తనమునుండియే నీ కబ్బుచున్నవి. కష్టపడి భూమిని దున్నుకొని పండించుకొనుము. పండినపంట నీతోడిపాటిజనులతో వంతుపంచుకొని వారితో గలిసిమెలిసి సుఖముగా ననుభవించుము. ఈతిబాధలనుండి కాపాడుమనియు నారోగ్యముగా జిరజీవనసౌఖ్యము దయచేయుమనియును ప్రత్యక్షదైవముగు భాస్కరునకు మ్రొక్కుచుండు మంతకన్న నీవు చేయవలసిన కార్యములు నీ బ్రతుకున మఱిలేవు. అక్కరమాలిన చదువుసందెలు నోములు వ్రతములు నామములు మడిమైలలు జాతినీతులు మతభేదములు వంచకులగు స్వార్థపరులు సోమరులు మాత్రము పన్నిన పన్నికలని దృఢముగా విశ్వసించి లోకోపకారముగా నడుచుకొని సర్వభూత దయాపరుడవై నీజన్మమును సఫలము కావించుకొను మోకూళసోమాసీ ! పొమ్ము మఱెన్నండును బళుహింస చేయక తిన్నగా బ్రతుకుము నీవు పఠించునవి వేదములుకావు నీవాచరించు నాచరణము వేదవేదాంగచోదితముకాదు.నిత్యము లపౌరుషేయములు నగువేదములు నీవంటి ప్రాకృత మూర్ఖ మర్త్యుల నోళ్ళ మలయునా? నీకు బుద్ధిలేదా? యతీంద్రియములు నిత్యము లపౌరుషేయములాత్మైకవేద్యము లశరీరను లు బ్రహ్మస్వరూపములగు వేదములు నీ యకారాద్యచ్చులలోను గకారాది హల్లులలోను నీపదవాక్యములలోని నీ మర్త్య తుచ్ఛాంగ విన్యాసములలో నిముడునా ? యద్దములో గొండ యిమిడి ప్రతిఫలించునట్లు ముంతనీటిలో సూర్యబింబ మిమిడి తోచునట్లు బ్రహ్మాత్మకమగు వేదజ్ఞానము నీ మనస్సునం బ్రతిబింబించి నప్పటి కాకొండను మఱి యాసూర్యుని నీ వంటజాలనట్లు మఱి యా రెండింటిని నీ బ్రతుకున నుపయోగించుకొనజాలనట్లు వేదములనుగాని మునిప్రణీతములయిన వేదాంగములను గాని నీ వెంత

మాత్రము నీ బ్రతుకున నుపయోగించుకొన నేరవు నీబుద్ధియెడం బ్రతిఫలించు భగవత్స్వరూపమగు వేదవేదాంగ విద్యామహిమను గూర్చి నీ కతీతముగా దవ్వుల నగపడుసూర్యునకు నీవు మ్రొక్కునట్లు అచి త్క్షవైభవ మహిమాస్పదమగు వేదవేదాంగ విద్యను సంతతము ధ్యానించుకొనుచు నీ బ్రతుకు నిహపరములం దరింపఁజేయుట కావిద్యారూపుఁడగు త్రయిమూర్తిని వేడుకొనుచు భూతదయాఃరుఁడవై స్వార్థపరతమాని లోకోపకారమునకై పాటుపడుము. మూఢావస్థతో జన్మించి మూఢావస్థలో లయమగుచున్నాఁడే దేహి - నడుమ స్వప్న జాగరములవంటి దీ బ్రతుకునందలి జనన మరణములయొక్క మధ్యావస్థ. యహంకార మమకారములున్నంతవఱకుఁ బురుషప్రయత్నము మానలేము. మఱియీ పురుషప్రయత్నము చేసిన సార్థక్యములేదు. తెలియకుండ లేము. తెలిసినలాభములేదు. స్వప్న మంశ వలె జాగ్రద్దశయందు సకల కార్యముల వశతగాఁ గాలవశమునఁ బౌరుషము నకుఁ బ్రేరేపకమైన విధివశమున జరుగుచుంట సకలజనులకుం బ్రత్యక్షానుభవమేకదా ? కాఁబట్టి యేపనియైన చేయుటగాని మానుటఁగాని ప్రాణుల వశముకాదు సుఖజీవనము లెల్లప్రాణుల పేక్షించుట సహజము. ఆజీవనసౌఖ్యము తనతోడిపాటిఁ జీవులతో దాఁ బ్రేమానురాగములతోఁ గలిసిమెలిసి యున్నంగాని తన కబ్బకుంట దేహధారులలో ముఖ్యముగా మనుష్యునకుఁ బ్రతిదిన ప్రత్యక్షానుభవమే కదా ? పరోపకారబుద్ధియును సర్వభూతదయయును జిరాయురారోగ్యములను నీ కిచ్చుని ప్రత్యక్షభగవంతుఁ డగు సూర్యున కహర్దివము మ్రొక్కుచుండుము. సమస్త వేదశాస్త్రముల యభిప్రాయ మిద్దియే యని విశ్వసించుము. వెఱ్ఱికి వేవిధాలన్నట్లు మర్త్యులు వ్యవహరించు వేదశాస్త్రములకు స్గర్మములకు హద్దున్నే !"

“అ” అను నక్షరమున కనేకార్థములు మఱొక్కొక్క యర్థమున కొక్కొక్కవర్ణ మొక్కొక్క యధిదేవత యొక్కొక్క యర్చనవిధాన మొక్కొక్క మర్మవిశేషము. సప్తకోటి మహామంత్రములు లోకోపకారమునకై పాటుపడలేని తుంటరి సోమరిపోతు మోసగాండ్రు పన్నిన మంత్ర యంత్ర తంత్రము లిన్నన్నికావు. అడవిలోఁ బసులఁ గాచుకొనుచు జీవించు గొల్లనిపాటి వివేకమో శ్రోత్రియమ్మన్యుఁడా! నీకు నిశ్చయముగా లేదు. నీవు వల్లించునవి నిక్కముగా వేదశాస్త్రములు కావు. అద్దములోని ధనమువూట నీవెట్లుపయోగించుకోలేవో నీహృదయమున దోఁచు నాత్మైక వేదశాస్త్రజ్ఞానమును నీవట్లుపయోగించికొనలేవు. అవాఙ్మనస గోచరమా వేదవిద్య. వేదము నీ పోటి యుచ్చారణమున కెంతమాత్రమును రాదు. వేదము ననుసరించి నీ మర్త్యదేహముగాని నీ యల్పజ్ఞానముగాని వ్యవహరింపఁ జాలదు. వేయేల నీవు చదువు లనుకొన్నవి వాస్తవముగాఁ జదువులు కానేకావు. అగ్గి ముట్టుకొన్నం జుఱుకుననీ ప్రత్యక్షానుభవమే చాలు ననుమానోపమాన శబ్దము లేల? “ఇషేత్వా” అను వివిధవేదములు మఱి వేదాంగములు నీయచ్చులు హల్లులు పదములు వాక్యములు నానావిధభాషలు గ్రంథములు వ్రాఁతలు చతుర్విధాభినయ విశేషములు పౌరుషకల్పితములు కృత్రిమములు మఱియు ననిత్యములు స్వప్నవికారములు మదవికారములవలెం బంచభూత సంయోగ వియోగ విశేష సముద్భూత దైహిక వికారచేష్టలుగాని పంచభూతములవలె వాస్తవములుకావు పంచభూత సంయోగ వియోగ విశేషములగు దైహిక చేష్టావికారములు మృగతృష్ణికాఁ జలమువలె స్వప్నప్రపంచమువలె నీడవలె మిథ్యలుగాని వాస్తవములు శాశ్వతములు నెంతమాత్రముకావు. నీ దేహము నీ బ్రతుకు నీవేదములు నీజ్ఞానకర్మములు పరవశములని నమ్ముకొని నిష్కపటముగా లోపల నొకటి

పైకొకటి యగపర్చు కిచ్చకము మోసము దంభవేషములు మాని నీ దేహసౌఖ్యముకై నీవు తంటాలుపడుచున్నావుకనుక నొరులయెడ నీవెట్లునటించిన నీకోరినసుఖ మబ్బునో యట్లు నడుచుకొనుటకై నీ పౌరుషము లుపయోగించుకొను నీప్రయత్నము సఫలముకావించి నీబ్రతుకు హాయినిచ్చుటకై భక్తవత్సలుఁ డగు భగవంతుని నిర్మల హృదయముతో వేడుకొనుచుండు మోదంభసోమయాజీ! "శునిచైవ శ్వపాకేచపండితాః సమదర్శినః" అనుభగవద్వాక్యము నరసి లోకోపకారముగా నడుచుకొని సుఖమున నీ బ్రతుకు వెళ్ళబుచ్చుకొనుము. లేనిపోని వేదవేదాంగ దంభకమార్గాచారముల నింకనైనఁ గట్టిపెట్టుకొని నీతోడిపాటి మనుష్యులతోఁ బ్రేమానురాగములఁ గలిసిమెలసి వారలను సుఖపెట్టి నీవు సుఖపడు.

మనుష్యులలో నొకనికన్న నొకఁడు గొప్పకాఁడు కొద్దికాఁడు. చీమలన్నియుం జీమలే దోమలన్నియుం దోమలే గోఁతులన్నియుం గోఁతులే మనుష్యులందఱు న్మనుష్యులే నీకెందుకీ వెఱ్ఱి నీ తోడిపాటి మనుష్యులకన్న నీకు విశేష మెద్దియును లేదు. కుళ్ళాయియు నంగియు నంటుపోగులు ధరించు నప్పటికిం దిమ్మఁడు తిమ్మఁడేగా? ఇంకొక విశేష మట్లలంకృతమగు కోఁతిని దక్కిన కోఁతులు ద్వేషించి తమ మందలోఁ జేరనీక బాధించినట్లు నీవు బ్రాహ్మణుఁడ వనియును వేదవేత్త వనియు శ్రోత్రియుఁడ వనూచానుఁడ వనియును నిద్రాహార విహారసౌఖ్య మందఱివలె నాసించియుం బైకి నిష్ఠనగపర్చుట కసహ్యించి క్రమక్రమముగా నీతోడిపాటి మానవులు తమ సంఘము లోనికి నిన్నుఁ జేరనీక తన్నితగిలివేయక మానరు. ఊరక కొన్ను కూర్చుండినీవు శ్రేష్ఠుఁడవని చెప్పుకొనుచు జనుల యసహ్యమున కేల పాలయ్యెదవో శ్రోత్రియమ్మన్యుఁడా తాఁ జెడినకోఁతి వనమంతయుం జెఱచె నను సామెతగా వేద వేదాంగవేత్తవను నహంకార మమకార

ములతో నీవు చెడి మనుష్యులకు మతద్వేషములు కల్పించి చెఱచు చున్నావు. నీ కన్ననో కూళసోమాసీ! పులిమేలు పాముమేలు మఱెట్టి క్రూరజంతువైన మేలు. ఆక్రూరజంతువులు చేయు హింస కన్న నీవు చేయు హింస కోటియింతలు మెండు. ఆ క్రూరజంతువులు చేయుబాధ మిక్కిలి కొంచెముగాని నీ వొనర్చు భూతద్రోహమునకు మేరలేదు. నీవేమో దివ్యజ్ఞానము కలవానివలె నీ స్వార్థపరత న్మాటు పఱ్చి పైకి దంభవేషముననుంటచే నీ బోధలను విశ్వసించుకొన్న మూఢులు భ్రాంతులు బాలురు సకలదేశంబులలోని మనుష్య లంద ఱును బరస్పర మతవిద్వేషములతో నన్యోన్యహింసకావించుకొనుచుం దమ జీవిత సౌఖ్యమును వృథా చెడఁగొట్టుకొనుచున్నారా? ఇంతకును నీ వేదశాస్త్ర జ్ఞానబోధయును నీ స్వార్థపరతయును నీ ధూర్తదంభ వేషమును నీ జ్ఞానలవదుర్విదగ్ధతయును నీ జాతి మతభేదము న్గదా కారణము? నీవు బ్రాహ్మణుండవా? యితరుడు కాఁడా? టోపీ పెట్టు కొన్న కోఁతి తక్కినకోఁతులలో వశిష్ఠా? అయ్యో! బుద్ధిమాలిన ఛాందసుఁడా! మనుష్యులందఱును సమానులే. యన్యోన్యము న్గలసి మెలసి హాయిగా బ్రతికినకాలము కృతయుగము. మనుష్యులలోఁ బరస్పరైకమత్యానురాగములు చెడ్డకొలంది నిట్లు భూతహింస మెండై కలికాలము ముదురుచున్నది. చెట్టు చచ్చెడికాలమునకు మురుగు పిందెలవలె మనుష్యులలోఁ బరస్పర ద్వేషకారణములగు జాతి నీతులు ప్రబలుచుంట 'రామరామ' యోషంభయాజులూ! నీతప్పు న్గాదు. నిన్వెక్కిరించు నాతప్పున్గాదు. కలికాలకృత్య మేమిచేయుదు నహంకార మమకారము లున్నదనుక జనులందఱితోఁ బరస్పరాను రాగములతో భూతదయతో బ్రతుకుఁడని బోధించు నాపురుష ప్రయత్నము కొనసాగదని తెలిసియుండియు నిట్లు వనరుచుంట నా విధి.

అఆలు, కఖాలు, బ్రాహ్మణశూద్రులు స్వర్గనరకములు పశు హింసక క్రతువులు మంత్రబ్రాహ్మణములు శ్రౌతస్మార్త కర్మములు నిద్రాహార విహారసౌఖ్య మాసించి ధంభవేషము లూని వీరన్య మతస్థులతోఁ దెచ్చుకొను తంటాలు కాళిదాసునికైన వర్ణింప నలవియే? ఇతరులకన్నఁ దానెక్కువవాఁ డనుకొంట పౌరుషహీన గుణము తనకును దక్కిన మనుష్యులకును భేదమెద్దియును లేదని తెలిసికొనుటయే నిక్కముగాఁ బౌరుషలక్షణము జిహ్వ కొకరుచి పుఱ్ఱెకొక గుణము మఱెవనిముక్కు వానికిఁ దిన్నన యెవనికంపు వానికింపు మఱియు నెవని వెఱ్ఱి వానికానందమన్నట్లొకొక్క దేశ ములో నొకొక్క గ్రామములో నొకొక్క కుటుంబములో బ్రతి జనునకు రూపమందు కంఠధ్వనియందు నూహయందు వ్రాఁతయందు నడువడియందు నొకని పోల్కి యింకొకని కుండదు. అయినప్పటికి నానాదేశముల మనుష్యులందఱికిని జావుపుట్టువు లాఁకలిదప్పికలు ఖేద మోదములు చైతన్యము పాంచభౌతిక శరీరము పంచేంద్రియప్రవృత్తి యును దక్కిన జంతువులకువలె సమానములగుట వాస్తవము. ఆర్యున కొక ప్రాణము మ్లేచ్ఛునకొక ప్రాణమును వేఱువేఱుగ నుండునా? ఆర్యునకువలె మ్లేచ్ఛున కూపిరి తీసుకొనుట యాఁకలిదప్పికలు గొనుట పాంచభౌతిక శరీరధారణము జనన మరణములు సుఖజీవితాశయు నుండుట సహజసిద్ధములు సమానగుణములే కదా? జాగ్రత్స్వప్న జాగ్రత్సుషుప్త్యవస్థ లార్యమ్లేచ్ఛులకుభయులకునుసమానములే.మఱి యార్యులును మ్లేచ్ఛులు నుభయులును మనుష్యజాతిలోనివారేకదా? భాష లలంకారములు మతము లాచారము లలవాట్లు భిన్నభిన్నము లయినప్పటి కాహారనిద్రావిహారసౌఖ్య సంపాదకోపాయములు వేఱై నప్పటికి నానాదేశములు కాలమానానుసారులయిశీతోష్ణతలువేఱుగుట చేతను భోజనపదార్థములు తొడవులు మఱికొన్ని నిద్రాహారవిహార

సంతృప్తి జనకవస్తువిశేషములు వేఱైనప్పటికిని కులాచారములు వావి వర్తనములు భగవదారాధన విధానములు తీర్థవ్రత విశేషములు భేదించినప్పటికిని యథార్థముగా నార్యుల కున్మ్లేచ్ఛులకు మనుష్యధర్మ మొక్కటియేకదా ? మానవధర్మమునకుఁ బశుధర్మమునకును భేద మెందుకేదో? పశువులన్యోన్యసాహాయ్య మొనర్చుకొని యన్యోన్య క్షేమసమాచారముల నేదేశమందుం దున్నప్పటికిని భాషావిశేషణాది సంజ్ఞలచేఁ దెల్పుకొని పరస్పరమూహా లెఱిగించుకొని భూతభవిష్య ద్వర్తమానకాలోప యోగములుగా నిండ్లు మొదలగు నిరవులను భూమిని సేవ్యము చేసికొని భోజనపదార్థములను బండించి సంగ్ర హించి యన్యోన్య మందించుకొను వాణిజ్యవిధానమును శీతోష్ణ గుణోపద్రవములనుండి తప్పించుకొను నెరవులును మనుష్యులవలెఁ గలిగియున్నట్లు తోఁచదు. సరియే మనుష్య లన్యోన్యముం దమ సంగతియే తాము కనిపెట్టఁ జాలనపుడు తక్కిన జంతువుల సంగతి యేమో యెట్లు తెలియగలరు ? నిక్కముగా నేది యెట్లున్నను హాయిగా మనుష్యుఁడు బ్రతుకఁదలంచుట సకలజనులకు బ్రత్యక్షాను భవసిద్ధముకదా? బాల్యము గడిచి లోకానుభవము తనకుఁ గలిగిన కొలందిని దన తోడిపాటి వారలే సాధనసామగ్రిని సంపాదించుకొని తమ నిద్రాహారవిహార సౌఖ్య మందుచున్నారో యట్టి జీవనోపాయ ములను బ్రతి దేహధారియును వెదకుచుండుట సహజగుణము కదా ? సహవాసముంబట్టి నిద్రాహారవిహార సౌఖ్యసంపాదక సాధనములను దన కూహవచ్చిన మొదలు ప్రతిజనుఁడు వెదకుటకు మొదలిడును. స్వతంత్రముగా వస్తుతత్త్వవిచారణముచేయఁగల సామర్థ్యము తనకబ్బు వఱకును మనుష్యుడు తన మప్పుడుబుద్ధినిమాత్రమే వినియోగించు కొని తన నిద్రాహార విహారసౌఖ్యమును స్వదేశ కులాచారముల ననుసరించి సంపాదించుకొనును. ఎపుడు స్వతంత్రముగా వస్తుతత్త్వ

విచారణ మొనర్చు సామర్థ్య మబ్బునో యపుడు సర్వజనానుకూల మును సకల లోకసామాన్యమును సకల లోకోపకారకమును సర్వ భూతదయాపరము నగు మతము నిర్ణయించి లోకులందఱిచేఁ దన మతము సహేతుకమని యొప్పించి స్వార్థత్యాగియై సర్వజనసముఁడై సర్వభూత దయాపరుఁడై సర్వలోకోపకార పరాయణుఁడై సర్వజన వందితుఁడై సర్వలోక క్షేమంకరముగా గ్రంథములు వ్రాసి బోధించి ముక్తినొందఁ బరఁగును. అట్టి తత్త్వవేత్తలు లోకోపకార పరాయణులు సర్వజ్ఞులే గౌతమవ్యాసాది మునులందఱును స్వార్థపరతమాని కేవల లోకోపకారమునకై మాత్రమే పాటుపడువారు స్వాధీనేంద్రియులై శాశ్వత సంతుష్టి స్వరూపమగు కైవల్యానందపదవి నోలలాడుచు బరమాత్మలో నైక్యమై సంసారముం దరించెదరు.

“వార్తికమితి-సూత్రేఽనుక్తదురుక్త చింతాకరత్వం వార్తిక త్వమ్”అను భాష్యవాక్యాను సారముగా శ్రుతులందు లేని యర్థము లను శ్రౌత స్మార్త కల్పములం బన్ని “అహింసా పరమోధర్మః” అని మాత్రమే బోధించెడు శ్రుతుల కనర్థము చేసి మాంసాశన క్రూర కర్ములగు నధునాతన శ్రోత్రియమ్మన్యులు నరమేధాశ్వమేధ గోమే దాది పశుమేధాది వధములు మనుష్యులను గుఱ్ఱములను గోవులను మేఁకలు మొదలగు పశువులను గట్టి చంపి డొక్క చీల్చి యొక విధ ములగు ప్రేవులం బెరికి యగ్గిలో వేల్చుట యని వివిధ క్రియా కలాప మును శ్రౌతకల్పమనియును వేదచోదితమనియును బ్రస్తుతకాల మందుఁ జౌకగా దొరకు సాధు జంతువులగు మేఁకలం జంపుటయే ముఖ్యమనియును మూఢుల నమ్మించి ధూర్తులై స్వార్థపరులై యధ్వర్యు దంభవేషములతో షట్కర్మ నిరతులమనియు దమ పొట్ట కూటికై జీవహింస చేయుచుంట యెంత ఘోరము? క్రతుమిషనైన జీవహింస చేయు క్రూరులను శిక్షించెద మను బౌద్ధ రాజ పరిపాల నముం దేమైరో యీ క్రూరాధ్వర్యులు? మనుష్యులకు శాకాహారము ముఖ్యము మఱి మాంసాశనము గౌణము. దుర్మార్గులు క్రూరులు

గతానుగతిక ప్రవర్తనముచే నలవాటు కావించుకొన్న దుర్వ్యసనము గాని మాంసాశన మాఁకలి దీర్చుటకును మఱియు నారోగ్య మిచ్చుటకును సాత్త్వికాహారమగు శాకాహారమువలె నంత ముఖ్యావసరము కాదు. దుష్టవ్యసనాసక్తులయి జగ దపకారకముగా మద్యమాంసముల చవిమఱిగిన క్రూరులు మనుష్యులవంటి రాక్షసులుగాని మనుష్యు లెంత మాత్రము న్గారు. సర్వభూత దయతో సకలలోక రంజనులైన జనులు మాత్రమే మనుష్యు లనఁదగుదురు. కూళమానిసి యితరులఁ జంపఁగలఁడు గాని మృతులం బునర్జీవులుగాఁ జేయఁగలఁడా? తన్నొరులు చంపుట కొప్పుకొనఁ గలఁడా? దుష్ట వ్యసనముల కలవడిన వివేక హీనుఁడు తానా వ్యసనముల కడవడుట కేదియో నెపము పన్ని తన యుక్తికిఁ దనవంటి దుష్టవ్యసనాసక్తులు శ్రుతి స్మృతులం దనాఁగాఁ దోఁపిన దుర్వచనములం బ్రమాణములు చూపకుండునా? వేయేల భూత దయ మాని మాంసాశనుఁడై మఱెట్టి మిషచేత నైనం బ్రాణులం జంపు వాఁడు లోక ద్రోహి యగు రాక్షసుఁడు గాని మనుష్యుఁ డెంత మాత్రము న్గానేరఁడు. ఎట్టి మిషచేత నైనప్పటికి మనుష్యుఁ డనఁ దగిన వాఁ డితర ప్రాణులం జంపడు. మఱియు నాత్మహత్య కావించుకొను తనకు గాని యితర ప్రాణులకు గాని వధను గావించుకొను రాక్షస పిశాచ కృత్యము గాని నిక్కముగా మానవ కృత్య మెంత మాత్రము న్గాదు. ఏ దేశమున వసించి నప్పటికి నేజాతి గలిగినప్పటికి మఱి యే యాచారమనుసరించి నప్పటికి మఱి యే మతమవలంబించి నప్పటికి మనుష్యులు భూత దయాపరులై యే మిషనైనం బ్రాణి హింస చేయకుంటయే యుత్తమ మనుష్య ధర్మము. సాత్త్విక శాకాహారమును గొనుట యన్నపానము లందు మితముగా నున్నపుడు జగ దుపకారక బుద్ధియు సకల భూతదయయును శరీరారోగ్యమును వివేకమును దప్పక మానవుల కబ్బును. మాంసాశనమును మఱియుం జిత్తభ్రమకరమగు నమిత పానమును లోకమున కపకారము చేయించు క్రౌర్య హేతువులై ప్రాణిహింసం జేయించక మానవు. మనుష్యులు

తమ తెలివి తేట లుపయోగపర్చుకొని క్రూర జంతువుల యిరవు లందును మఱియూషర క్షేత్రములందు నెంతమాత్రము వసింప కన్యోన్యమైత్రి గొని సమాన భోగస్వాతంత్ర్యముతో నేక కుటుంబము లోని వారివలెఁ బరస్పర ప్రేమాను రాగములతో బ్రతుకవలయు ననియే కేవల జగ దుపకారపరులగు ఋషుల ముఖ్య తాత్పర్యము. కాఁబట్టి సమస్త వేదశాస్త్ర సారము సకల భూత దయయును మనుష్యుల కన్యోన్యానురాగమును బోధించుటయే యని యెల్లరుం దెలిసికొనవలయును.

పాణిని చేసిన 3992 సూత్రములందుఁ దప్పులు పట్టుచుఁ గాత్యాయనుఁడు 10000 దోషము లుద్ఘాటించుచు 4000 వార్తికము లొనర్చుట కోర్వక పతంజలి కాత్యాయన వార్తికములను ఖండించుచు బాణినిమునిని సమర్థించుచు స్వయముగాఁ దాసిష్టులను విరచించెను. పాణిని సూత్రములను వివరించుటయును గాత్యాయనుని వార్తికములం దఱచుచుంటయును బతంజలి యొనర్చిన వ్యాకరణ మహాభాష్య ప్రయోజనము. కావునఁ బశుహింసను ప్రతిపాదించు నట్లు తోఁచు శ్రౌత కల్పమును ఖండించుట కొఱకు మఱియు సుపనిషత్సారభూతమగు "నహింస్యాత్సర్వభూతాని-అహింసాపరమో ధర్మః" అను వాక్యములను సమర్థించుట కొఱకు నిష్టిరూపముగా నీ గ్రంథము రచింపబడెనని ప్రాజ్ఞు లెఱుంగవలయును.

"అరణ్యాన్మనుష్యే"అను పాణిని సూత్రములకు "పథ్యధ్యాయ న్యాయ విహార మనుష్య హస్తిష్వితి వక్తవ్యమ్-వాగోమయేషు" అను కాత్యాయన వార్తికములు, "అత్యల్ప మిద ముక్తమ్-వాగో మయేష్వితి వక్తవ్యమ్" అను పతంజలి భాష్యము. పాణిని తన సూత్రము చేత వార్తికకార భాష్యకారుల యూహాలన్నియును గతార్థములగునని యూహింపక కాని మఱి వార్తిక భాష్యకారు లెఱిఁగిన శబ్దములు తా నెఱుఁగకుంటచేఁ గాని కొండవీటిసీమ చేఁదత్రాళ్ళ వంటి దీర్ఘ సూత్రములు చేసిన పాణిని యీ సూత్ర మింత హ్రస్వము

కావించెనా? మొట్టమొదట నవ్యక్త నాదమును దమకుఁ దోచిన ట్లెల్ల వర్ణాత్మకముగాఁ గల్పించి వేదములనుట యొక తప్పు. మఱి యా వేదాంగములని తమ యిచ్చకు వచ్చిన ట్లెల్ల వ్యాకరణాది షడంగములఁ బన్నుట రెండవ తప్పు. మఱియును శిష్టాచారమని తమ తమ మతానుసారముగా స్మార్త కర్మముల నియమించుట మూఁడవ తప్పు. ఆహా సృష్టిలో మనుష్యులకన్న విపరీత బుద్ధికల జంతువు లింకెవ్వియు న్గావుకదా? అరిషడ్వర్గమునకు లోనై పరుల జెఱచి తాము చెడుచున్నారు కదా? నాతోడిపాటి దేహధారులని యహంకార మమకార బద్ధుఁడనై నారాయణునకుఁ దప్పఁ దక్కిన పాంచభౌతిక జగమంతయును మిథ్యయని దృఢమతి న్గానక యీలోక మంతయు మనోభ్రమ మూలమని మానము న్వహింపనేర కిట్లు గ్రంథము నేను వ్రాయుట పై మూఁడు తప్పులకన్న వేయి రెట్లు పెద్దతప్పు.

## దైవపౌరుషప్రతిపత్తి

ఇదిగో నిజ మిప్పటికిఁ దేలెను పౌరుషముతప్పు. దైవమే యొప్పు. దైవమునకుఁ బౌరుషము లొంగక తీఱదు. గనుకను మఱి యును గాలి నిప్పు నీరు మన్నుల వికారముల సృష్టి స్థితి నాశముల కాకాశమే మూలమైనట్లే పౌరుషమున కెల్ల దైవమే మూలము. దైవమే వాస్తవము. మఱియు పౌరుషమంతయు కలవలె మనో విభ్రాంతి మూలమును మిథ్యయును గాని నిశ్చయముగా సత్య మెంత మాత్రము న్గాదు. "ఊరకున్నవాఁడే యుత్తముయోగిరా విశ్వదాభిరామ వినురవేమ"

ఇది శ్రీ మదజ్ఝాడాదిభట్ల నారాయణదాస విరచితమగు
జగజ్జ్యోతియందు శబ్దశిద్ధి నిర్వచనము

—o—

# జగజ్జ్యోతి

## ఆఱవ ప్రకాశము

### పంచమశబ్ద మర్యాద

మంత్రబ్రాహ్మణాత్మక వేదముల నాది కాలమునుండియు ననాది సంప్రదాయానుశ్రుతములై యనూచానోపదిష్టములై యీలోకమున గ్రంథసందర్భమున రవంతయు న్స్మారకుచ్చారణమున మాత్ర మనేక శాఖాభేదముల వివిధములై తోఁచుచున్నవి. మొట్టమొదట వేదము లుపదేశించిన మనుష్యునిఁ దొలుదొల్తఁ బొడమిన మనువును గనిపెట్ట వలె. మొట్టమొదట జగత్కార్యముల నరసి గ్రహాగతులను శిష్యుల కుపదేశించిన మనుజునిపోల్కి నిర్ణయింప నసాధ్యము కనుకను వేద వాక్యము లపౌరు షేయములును నిత్యములును బృథివ్యప్తేజోవాయు పరిణామాధారమగు నాకాశమువలెఁ గేవలశబ్దగుణకములనీ సిద్ధాంతీక రింపక తీరదు. వేదవాక్కు లపౌరుషేయములుగాని వేదాంగములు మాత్రము పౌరుషేయము లనిత్యములుం గల్పితము లనకతీరదు. కాఁబట్టి మంత్రబ్రాహ్మణాత్మక వేదాధ్యయనము గురూపదిష్ట మార్గ మున నొనర్చుటమాత్రమే మర్త్యున కపూర్వ స్వర్గఫలహేతువగును గాని వేదాంగములని పురుషకల్పితములయిన శిక్షావ్యాకరణ చ్ఛందో జ్యోతిష నిరుక్త కల్పవిధానములచేత శ్రౌతస్మార్త క్రియాకలాప ములం గూటికొఱకై యీపణ్త్రయబద్ధులను ధూర్తశ్రోత్రియమ్మ న్యులు పీడించి హింసాకృత్యముల చేయింపఁ దగదు తగదు. మంత్ర బ్రాహ్మణాత్మక వేదవాక్యములను మాత్రము గురూపదిష్టమార్గమున బఠించినఁ జాలును. వేదవాక్కు లపౌరు షేయములు నిత్యములుగాని వేదాంగ వాక్కులు నిత్యముం బౌరుషేయమే కనుకను సర్వజన

సములు సర్వభూతదయాపరులగు మన్వాది మహర్షులు జంతుహింస నే నెపముననైనం జేయఁగూడదని బొత్తుగా నిషేధించుటచేతను మను ష్యుల పూర్వ స్వర్గసౌఖ్యమునకై జంతుహింసా విహీనములయిన కర్మములు దేశకాల పాత్రోచితములుగా వేదాంగ చోదితములని శ్రౌత స్మార్తకర్మ లెట్టి నియమములతోఁ జేసికొన్నను జేసికొన వచ్చును. వేదాధ్యయనమువల్ల మాత్ర మభీష్ట స్వర్గసుఖము తప్పక లభించును. జంతు హింస రవ్వంతయును జేయక కేవల దేవతా ప్రీతి కొఱకు మాత్రమే దేశకాల పాత్రోచితములగు కేవల సాత్త్విక యజ్ఞ కర్మము లొనర్చుటమనుష్యులకవశ్యక ర్తవ్యమని సిద్ధాంతీకరింపవలెను. దైవ సంప్రీతికై చేయవలసిన యజ్ఞకర్మము తనతోడి పాటిజనుల స్సంతోష పెట్టుటకన్న వే ఱెద్దియు న్లేదు. మనుష్యులలో జాతి నీతులు కులాచారములు వావి వరుసలు నిహపర తారకములుగా సర్వజ్ఞులగు మునులు లోకసంగ్రహార్థమై దేశకాల పాత్రోచితము లుగా నేర్పరచిరి వానగురిపించుట దైవకృత్యము మఱియా నీటి నుప యోగించుకొనుట కేవల పురుషప్రయత్న సాధ్యము. మంత్రబ్రాహ్మ ణాత్మక వేదము సముద్రఘోషవలె నఖండ శబ్ద విశేషస్వరూపమా యఖండ శబ్దమును సులభ పఠనమునకై మునులు సుప్తిఙ న్త పదము లుగాఁ బ్రకృతి ప్రత్యయము లేర్పరచి సులభధారణయోగ్యములగు నిల్పుల నల్పించి మఱపు రాకుండుటకై వేదాంగ షట్కముం బన్ని నిత్య సందర్భము చెడనీడక గొప్పమేధావంతు స్సంస్కరించి వేద శబ్ద పఠన ధారణ సామర్థ్య మభివృద్ధి చెందు నలవాటు మప్పి యహ ర్నిశము వేదామ్నాయమునఁ బ్రమాదము రాని విధమునఁ బఠన పాఠనకాలముల నియమించి దేహారోగ్యము నంత స్వరము చెడని విధ ముగాస్నానపానాన్న సంధ్యావందనాగ్ని హోత్రోపాసనాది విధులం దాము నేర్పిన ప్రకారము నడువఁగల మనుష్యులకు ద్విజులని పేరు పెట్టిరి.

వేదశబ్దపఠన మొనర్పజాలసి యల్ప మేధావంతుల నా ద్విజ శుశ్రూషకై నియమించి శూద్రులని పేరుపెట్టి సంపూర్ణ బుద్ధిమంతులు బ్రాహ్మణులనియుం బుద్ధియు న్మేధయుం దగ్గుచున్న కొలంది క్షత్రియులు వైశ్యులు శూద్రులుం బంచములని మనుష్యులకైదు జాతులేర్పరచి మనుష్యులకుఁ బంచజనులని సం కేత మిడిరి. దేవతల న్స్వాధీనపర్చుకొనఁ గల్గిన బుద్ధిమంతులు ద్విజులు. మఱి యట్టి ద్విజుల నన్నివిధముల న్గాపాడఁగల యోగ్యులు శూద్రులు. మఱి శూద్రులకు మిక్కిలి సహాకారులైన మనుష్యులు పంచములు. కాబట్టి బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్ర పంచములను నైదు జాతుల నలరారు మనుష్యులు స్వభావములగు బుభుక్షా పిపాసల న్దీర్చు పంచేంద్రియప్రవృత్తులవలె జీవాత్మ నుభయలోకములందరింపఁ జేయుచున్నారు.

మేము గొప్ప మేమేగొప్పయని యీ బ్రహ్మక్షత్ర వైశ్య శూద్ర పంచమజాతులైదును దమలోదాము కలహించుకొనుట కడుపుతో నల్గిన పంచేంద్రియముల తీరునఁ గోరి తమకుఁ దామే చేటు తెచ్చుకొనుటవంటిది కదా! బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రపంచములు ప్రత్యేక మొకరిపని కొకరు నిర్వహింపఁజాలరు గనుక నీయైదు జాతులవారు స్వార్థపరత మాని యహంకార మమకారము లుడిగి యైకమత్యముతోఁ దమతమ నియతమర్యాద నతిక్రమింపక పరస్పర ప్రేమానురాగములతోఁ గలిసిమెలసి యిహపరముల న్సంపూర్ణముగాఁ దరింపఁగల్గిన కాలమే కృతయుగము పుణ్యయుగము సత్యయుగ మాతికాల మనంబడును. ఈ యైదుజాతుల మనుష్యులలో సహజమర్యాదలు తప్పిన కొలందిం బాపిష్ఠ క్రూరకలికాలము ముదురుచు రాఁగారాఁగా మనుష్య లిహపరములకు రెండింటికిం జెడి తాపత్రయాగ్ని బాధలం దప్పించుకొననేరక ఘోరాపారసంసార దుఃఖాబ్ధిన్మున్గి నిత్య నరకబాధలం బొరలుచుందు రిద్దియే నిక్కముగ నకలముని సమ్మతసిద్ధాంతము.

"పంచజనా వై మనుష్యాః" అను శ్రుతి ప్రకారము పంచభూతములు పంచతారాగ్రహములు పంచేంద్రియములు క్రమముగా బంచీకృత సత్త్వరజస్తమోగుణమయములై యాత్మునకు కుపాధిరూపములై యుద్భవస్థితి నాశవిశేషముల నిహపర కష్టసుఖ స్వరూపక సంసారమునుం బరమాత్ముఁడగు నారాయణుని యిచ్ఛాక్రియా జ్ఞాన శక్తి లీలామూలమునఁ బ్రవర్తిల్లుచుఁ బరమార్థమును బోధించు కవి బ్రాహ్మణుడు. జ్ఞానసుఖభోగము లనుభవించు గురుఁడు క్షత్రియుఁడు సర్వధన సంగ్రహ మొనర్చు సరస్వతీమూర్తి బుధుఁడు వైశ్యుడుఁ శరీరసత్త్వము నన్నేల న్యాగుపర్చు కుజుఁడు శూద్రుడు. కలి గురు బుధకుజగ్రహాత్మక బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రుల న్సుఖపెట్టుటకై ఫలవత్ప్రదేశములను విడిచి ప్రాంతారణ్యముల నష్టపడు దుఃఖస్వరూపక శనిపంచముఁడు. మఱియును శబ్దగుణకాకాశము బ్రాహ్మణుఁడు. శ్రోత్రము - స్పర్శగుణకవాయువు త్వక్కు-క్షత్రియుఁడు - రూపగుణకాగ్ని చక్షువు వైశ్యుఁడు రసగుణక జలమురసనము శూద్రుఁడు గంధగుణకపృథివిఘ్రాణము పంచముఁడు. కనుక సత్త్వరజస్తమో గుణాత్మక ప్రకృతి పంచజనాత్మక మనుష్యరూపమై నిరుపాధికుఁడగు పరమాత్ముని సేవించు జీవాత్మ కుపాధి యగుచున్నది. పంచతారాగ్రహములు పంచభూతములు పంచేంద్రియములు పంచతన్మాత్రములు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్ర పంచములు బరస్పర భేదములు గల సమాన మర్యాదతో నొప్పారుచు భగవత్సేవ నొనరించుటకై సర్వ జంగమ స్థావర ప్రాణులందీ బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్ర పంచమ జాతు లలరుచున్నవి. ఈయైదు జాతుల గుణము లొక్క మనుష్యులందేగాక పాంచ భౌతికములగు సమస్త చేతనాచేతన పదార్థముల న్వెలయుచున్నవి. "ఆత్మైవేదగ్ం సర్వమ్" అను తీరున నారాయణుఁడు కాని పదార్థమేదియున్లేదు. ప్రతిపాంచభౌతికోపాధికి

న్వ్యాక్పాణిపాదపాయూస్థల ననంతవిధకర్మములం బంచీకృత గుణ విశేషంబుల నవరసాత్మకములై స్థూల సూక్ష్మ దశావిశేషంబుల బ్రహ్మ క్షత్రివైశ్య శూద్ర పంచమాత్మక పంచ విధజాతి విశేషా నంతభేదముల న్సకల జంగమస్థావరాత్మప్రాణులు న్సకల జడ చేతన పదార్థములు న్నిర్గుణ పరమాత్ముని యచింత్య లీలా మహిమాతిశయ మున నస్వతంత్రములై పరవశములై యభినయ చాతుర్విధ్యముం బ్రకటించుచున్నవి. తనకు శరీరస్మృతి యున్నంతవఱ కహంకార మమకారము లున్నంత దనుకఁ దనకంటె వేఱుగా వివిధవిశేషము లతోఁడి సకల జగమును దన దేహమనకున్ జ్ఞప్తికి న్భూత భవిష్య ద్వర్తమాన దశావిశేషములు మఱియుం దన స్థూల సూక్ష్మోపాధుల యొక్క సద్భవస్థితి నాశకారణము లుండక తీరదు కనుకఁ గామ్య కర్మము లొనర్చు సంసారులు తమ యనాది కులాగత సంప్రదాయా చార మర్యాద లతిక్రమించి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర పంచమ జాతులు శుద్ధములై సంకరము కాకున్నంతకాలము కృత యుగ మనం బరఁగి ప్రాణిహింస దొలఁగి లోకసంగ్రహార్థమైమాత్రమే ప్రవర్తిల్లుచుం బరస్పర ప్రేమానురాగ బద్ధములై శ్రీకృష్ణ పాంచ జన్యాఖ్య శంఖనాద బ్రహ్మ వివృత జగదాత్మకాభినయ చాతుర్విధ్య మునఁ బరమ శివ స్వరూపములై సకల చేతనా చేతన పదార్థము లలరారుచుండెను. ఎందు కీ డొంకతిరుగు డనాదికాలమునుండియుం దేశకాల పాత్రానుసారముగా సకల జనసములు సర్వజ్ఞులగు గౌతమ వ్యాసాది మహామునులు నానాదేశంబుల న్నానానామరూప విశేషో పాధులం దాల్చి మనుష్యుల కనాది సంప్రదాయానుసారముగా వేద శాస్త్రములచే నిహపర తారక ధర్మంబులు బోధించిరి. సకల జనులకుం బరస్పర ప్రేమానురాగముఁ బుట్టించు నడువడి బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర పంచమజాతులం బరఁగుటచేతం బంచ జనులనం బరఁ

గిన మనుష్యుల కుచితముగా మునులేర్పరచిన ధర్మము. సకల జన సమ్మతముగా సర్వలోక హితముగా సంచరించిన మనుష్యుఁడు శుద్ధ జాతి సముత్పన్నుఁడు, లోకము ద్వేషించిన స్వార్థైకపరుఁడగు మనుష్యుఁడు సంకరజాతివాఁడు. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర పంచము జాతు లయిదుజాతులును యథా శాస్త్రములయిన శుద్ధ జాతులే. శుద్ధ జాతి కల మనుష్యుఁడు సర్వభూత దయాపరుఁడై సూనృత వ్రతుఁడై సకలలోకోపకారపరాయణుఁడై సర్వజన విహిత ప్రవర్తనమున బ్రతికి యిహాపరములం దరించును. మఱియును సంకర జాతుఁడగు మనుష్యుఁడు ప్రాణి హింసారతుఁడై లోకవిద్విష్టుఁడై స్వార్థైకపరుఁడై యనృత వాదియై కూళయై యుభయలోకములకుం జెడును.

"సర్వమాత్మైవ ఖలు కంకేనపశ్యేత్" అంతయు న్వాసుదేవ పరబ్రహ్మమే బ్రహ్మముకన్న వేఱు వస్తువు లేనప్పుడు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర పంచములను మనుష్యులందు జాతి భేదము లెంచనేల? యాకాశమున కాకార విశేషములు నిర్దేశించునట్లు జ్ఞాతృ జ్ఞేయ జ్ఞాన స్వరూపుఁడైన నారాయణుఁడు సహజలీలచేఁ దనకుఁ దా బద్ధునివలె ముక్తుని మాఁడ్కి స్వయము బంధ మోక్షములు కల్పించుకొని శృంగార హాస్య కరుణాద్భుత వీరరౌద్ర బీభత్స భయానకరసాస్వాదానంద పరవశత జొక్కుచుంట సహజము. జీవాత్ముఁడై కార్య స్వరూపుఁడై వ్యక్తస్వరూపుఁడై యజ్ఞుఁడై యస్వతంత్రుఁడై సంచరించుచుఁ బరమాత్ముఁడై కారణస్వరూపుఁడై యవ్యక్తుఁడై ప్రాజ్ఞుఁడై సర్వస్వతంత్రుఁడై ముక్తుఁ డగుచుంట పరమాత్మునకు సహజ నాట్యలీలలు. ఈ నిర్గుణపరమార్థతత్త్వము న్మునులు సాధన చతుష్టయ సంపదఁగల ముముక్షువులకు మాత్రమే యుపదేశించిరి. మఱి పరమార్థము నెఱిఁగిన మహాత్ములు కేవల శాంతరస మయులై "వల్మీ

కార్థ నిమగ్నపీవరతనుః" అని కాళిదాసుఁడు వర్ణించిన తీరునఁ బరమ ముని యోగ సమాధినిత్యానందమునం జొక్కియుండును. అట్టిపరమ మునుల యున్కింగూర్చియుం బరమాత్మ తత్త్వముఁ గూర్చియును జ్ఞాన కాండమను వేదమండలి యుపనిషద్వాక్యములు ముముక్షువులం గూర్చియు జాతి మతాచార ధర్మముఁ సంసారులఁ గూర్చియు స్మనులు వేదశాస్త్ర గ్రంథ స్వరూపలై యుం బరమభాగవతులై సంసరించు సజ్జన స్వరూపులై "తస్మా ద్విద్వాన్ ప్రేవవదేత్ వీవ నృత్యేత్" అను విధివాక్యాను సారముగా నిహపర సంతారకులై వాచికాంగికాహార్య సాత్త్వికాభినయముల నటించుచుం బామరుల కిహపరలోక సంతారణ మార్గంబు లెఱింగించుచున్నారు.

## నా ట్య వే ద వై ఖ రి

శ్రవ్యములయి నామమనంబరఁగి కేవలధ్వన్యాత్మకమై షడ్జాది సప్తస్వరాత్మకమైన శబ్దమును వర్ణాత్మకమై సంస్కృతాపభ్రంశాది భాషాత్మకశబ్దమును వాచికాభినయ విశేషములం బ్రకటించుచు దృశ్యములయిరూపమనంబరఁగు నాంగికాహార్యసాత్త్వికాభినయముల న్మొత్తముపై వినిపించఁదగిన ధ్వన్యాత్మకవర్ణాత్మకశబ్దము వాచికాభి నయము నామమనంబడును. కవి యగపర్చఁదగు నాంగికాహార్యసాత్త్వి కాభినయము రూపమనంబడును. సర్వలోకరంజనముగాఁ జతుర్విధాభి నయములం బ్రయోగించి యొరుల సుఖపెట్టి తాసుఖపడు సజ్జనుఁడే "తస్మాద్విద్వాన్నీవనృత్యేత్" అని శ్రుతివిద్వాంసుఁడని పేర్కొన్న మనుష్యగంధర్వుఁడు మనుష్యులలో సకలలోకరంజనముగాఁ జతు ర్విధాభినయముల నటించు సంగీతవిద్వాంసులగు పరమభాగవతు లీయుగములందైన సృష్ట్యాదికాలమునుండియుం బేర్కొనంబడిన వారు. ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుకశౌనక

భీష్మద్రోణాచార్యులు కర్ణుండు ధర్మజుండు బలి విభీషణ నామములం బదునాల్గు భువనములందు బదుసల్వుఁ డెకంటె నెక్కాలమునందైన నెక్కువసంఖ్య గల జీవు లుండఁబోరు. ఒకలోకము న్వెలిఁగింప నొక్కసూర్యునివలె పదునాల్గు భువనములం దొకొక్కకాలమున నొకొక్క విద్వాంసుని కన్న నెక్కువుగా నుండరు. సకలలోక బాంధవుఁడు జగచ్చక్షువు నగు సూర్యునివలె సకలజన సముఁడు సర్వభూతదయాపరుఁడు సకలలోక రంజనముగాఁ జతుర్విధాభినయముచేయు పరమభాగవతుఁడు "తస్మాద్విద్వాన్" అని శ్రుతి పేర్కొన్న సంగీతవిద్వాంసుఁ డొక్కనికన్న నెక్కువుగా నెక్కాలమం దేలోకమందైన నుండఁ బోఁడు "రసో వై సః" అను విధమున నవరసాత్మకుఁడై నవరసాస్వాద నానందపరవశుఁడై సకలజనరంజక నవరసాత్మక చతుర్విధాభినయ నాట్యవిద్వాంసుఁడైన పరమభాగవతుఁడే ప్రత్యక్షసగుణబ్రహ్మము. సూర్యబింబమువలె సకలజనవిదితుఁడయ్యు నవిజ్ఞాత నిజతత్త్వుఁడై లోకము ననుసరించుచుండును. జగద్రక్షకుఁడగు నారాయణుఁ డమృతుఁడు కేవల దయామయుఁడై సవితృమండలమధ్యవర్తియై "తస్మాద్విద్వాన్" అని శ్రుతి పేర్కొన్న చతుర్విధాభినయ విద్వాంసునకు మాత్రమే గమ్యుఁ డగును. పెక్కేల, చతుర్విధాభినయ విద్యయే పరమాత్ముఁ డగు నారాయణుఁడు. మఱి యావిద్యం బ్రకటించు జీవుఁడే "తస్మాద్విద్వాన్" అని శ్రుతి పేర్కొన్న సర్వజనరంజకుఁడై పరమభాగవతుఁడైన సంగీతవిద్వాంసుఁడు, నామరూపాత్మకమగు జగమంతయు జతుర్విధాభినయమయమే అవ్యక్తపరమాత్ముఁ డగు నారాయణునిఁ గూర్చి తెల్పు నభినయములు వేదశాస్త్రములు. పంచ భూతములును మనుష్యులచేతఁ దెలియ నలవికాని తత్త్వముల నల రారు స్వర్గ మర్త్య పాతాళలోక విచిత్రపదార్థ విశేషనామరూపము లన్నియును వ్యక్తములగు వాసుదేవప్రద్యుమ్నానిరుద్ధ సంకర్షణ

వ్యూహాత్మక నారాయణమూర్తులగు ఖగోళ భూగోళ విశేషముల సర్వజనరంజనముగాఁ దెల్పు నభినయములు. "తస్మాద్విద్వాన్" అని శ్రుతి పేర్కొనిన నాట్యవిద్వాంసుని సంసారజీవనచర్య లన్నియును ఇహాపరములం దరింపఁగల మనుష్యులు తప్పక దృఢపౌరుషముతోఁ జమతో సంచరించు విద్వాంసుఁడగు పరమభాగవతునిం బోల్చి సేవించినయెడలం దాముగూడ విద్వాంసులై సర్వజనసములై సర్వభూత దయాపరులై సర్వజనరంజకులై యొరులం దరింపఁజేసి తప్పక తాము తరించఁగలరు తరించఁగలరు.

సత్త్వరజస్తమోగుణ ప్రవృత్తి నివృత్తులకుఁ గారణమగు నారాయణుఁడే యీ సమస్త జగత్సృష్టి స్థితి నాశ హేతువనియును మఱి యీపరమాత్మునికన్న సత్యపదార్థ మెద్దియును లేనే లేదనియును స్వార్థపరతమాని సర్వభూత దయాపరుఁడై సర్వలోకోపకార పరాయణుఁడై తన బ్రతుకు నంతయుం దనతోడి పాటి జనులకు రంజకమగునట్లు కావించుమని యీ శ్రీకృష్ణపరమాత్మ నహర్నిశమును వేఁడుకొను మనుష్యుఁడు పరమభాగవతుఁ డనిపించుకొని తాఁ దరిచి యొరులం దరింపఁజేయును, తరింపఁజేయును. దీనశరణ్యుఁడు సంశ్రిత భక్తవత్సలుఁ డగు దేవుఁడు సర్వభూత దయావంతుఁడై సకలజన రంజకుఁడైన తన భక్తునకు సకలాభీష్ట సంపద లలరించి తనలోఁ జేర్చుకొని నిత్యానందపదవి నోలలాడించును. మనుష్యుఁ డుభయ లోకములం దరించుటకు భగవద్భక్తికన్న వేఱుసాధన మింకెద్దియు న్లేదు లేదు. "యాదృశీభావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ" యనుటచేత సకలజగ దుద్భవస్థితి లయకారణమగు నారాయణుఁడు సంశ్రితాభీష్టదాయకుఁడై సకలజన కర్మసాక్షియై సకలకర్మఫలదాయకుఁడై సర్వలోకాధారుఁడై సర్వాంతర్యామియై నిర్మలాంతరంగులగు పరమ భాగవతులకు హృదయాకాశ జ్యోతిస్స్వరూపమునఁ బ్రత్యక్షుఁడై

నిత్యుఁడై నిరంజనుఁడై నిర్గుణుఁడయ్యు సగుణునివలె నసంగుఁడయ్యు సంసారివోల్కి జగన్నాటకమును సహజలీలచే సూత్రధారునివలె నడిపించుచున్నాఁడని మిక్కిలి దృఢముగా నమ్మికొని శరీరమునకు భూమివలె బ్రతుకుఁనంతకు నాదేవుఁడే యాధారమని యాప్తవాక్య ప్రమాణైక శరణ్యుఁడై సకలజన సమ్మతముగాఁ జతుర్విధాభినయ ప్రయోగమునం దాఁదరించి తనతోడిపాటిజనులఁదరింపఁజేయఁగలుగు మంచిమార్గమునఁ దన బ్రతుకు న్గొనసాగించుమని నవవిధ భక్తిమార్గముల న్భగవంతుని భజించు పరమభాగవతుఁడే నిక్కముగా "తస్మాద్విద్వాన్ ప్రేవవదేత్ - పీవన్నృత్యేత్ - దానకామా అస్మైప్రజా భవంతి" అనుతీరున వాచికాంగికాహార్య సాత్త్వికాభినయ విశారదుఁడగు విద్వాంసుఁడై సకలజన ప్రేమానురాగాస్వాదుఁడై యభీష్టైహికాముష్మిక సంపదల నొరుల సుఖింపఁజేసి తా సుఖించును. నామరూపాత్మకములగు నాటపాటమాటలం ద్రికరణశుద్ధిగా సకలజన రంజకములగు పనుల న్గావించు విద్వాంసున కభీష్టాన్నవస్త్రము లిచ్చి యప్పరమభాగవతు నాబాలగోపాల మాదరింతు రాదరింతురు. తన తోడిపాటి జనుల ప్రేమానురాగములం ద్రికరణశుద్ధిగా మంచి నడువడిచేత సంపాదించుకొనఁ జాలని మనుష్యుఁడు పశువుకన్న మిక్కిలి హీనుఁడే నిక్కముగా నిహమునఁ దిన్నఁబడని యభాగ్యునిం దయామయుఁ డగు దేవుఁడుంగూడ నుపేక్షించు నుపేక్షించు న్గాన నట్టి జనసమ్మతుఁడు కాని చెడుగొట్టునకుఁ బరలోక సౌఖ్యముకూడ చేకూరదు చేకూరదు. "అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభమ్" అను తీరున తనతోడిపాటి జనుల మేలుగోరువానికిఁ దప్పక మేలు చేకూరును. కాఁబట్టి విద్వాంసుఁ డనఁదగు మానవుఁడు పరమభాగవతుఁడైన నవవిధభక్తిమార్గముల న్భగవంతుని భజించుచుం దనతోడిపాటి జనులంద ఱాభగవత్స్వరూపులేయని త్రికరణశుద్ధిగా

నమ్మికొని "సతాంకేనాపి కార్యేణ లోకస్యారాధనం వ్రతమ్" అను మహాకవి వాక్యానుసారముగా మాతృదేశ సేవ నేమఱక సర్వజన సమ్మతమగు నడువడిం దన బ్రతుకు కొనసాగించుమని భగవంతుని నిష్కాముఁడై నిష్కపటవేషమునంది తానిననిశము గీర్తించుచుండును.

"బ్రాహ్మణేన వేదోఽధ్యేతవ్యః" అనుటచేత మంత్రబ్రాహ్మణాత్మకమగు వేదముఁ గురూపదిష్టనియతోచ్చారణ శిక్షాపద్ధతిం దప్పక బ్రాహ్మణుఁడు పఠించవలసినది. అపౌరుషేయమును నిత్యమునగు వేదము సముద్రఘోషవలెఁ గేవల మొక యఖండశబ్దమాత్రమే కాని మనుష్యు లుచ్చరింపసాధ్యమగు సంస్కృతాపభ్రంశాదిభాషా పద సమూహ మెంతమాత్రము గానేకాదు. కాఁబట్టియే వేదశబ్దమునకు ఛందస్సనియును స్మృతిపురాణేతిహాస సమూహమున కార్షమనియును సంస్కృతప్రాకృతాపభ్రంశాది వ్యావహారిక శబ్దసమూహమునకు భాషయనియును వైయాకరణమునికృతసంకేతములు ప్రకటింపఁబడుచున్నవి. కేవల పారలౌకికములగు శ్రుతిస్మృతిపురాణేతిహాసములు సాధనచతుష్టయసంపన్నులగు ముముక్షువులకు మాత్రమే యుద్దేశింపఁబడినవి కావున సంసారుల కెంతమాత్రము శ్రుతిస్మృతిపురాణేతిహాసములం గూర్చినచర్చ గగనారవింద జిజ్ఞాసవలె వ్యర్థమగుటయే కాక పని చేటునకుఁ గూడ మూలము. అన్నబుభుక్షునకు నీరపిపాసునకును గావలసిన యన్నపానములు సమకూర్చుకొనుట ప్రస్తుత కర్తవ్యములుగాని యన్నపానముల సృష్టికారణమును గూర్చి చర్చించుచుం బస్తుండి యాఁకలిదప్పికలచే భాధపడుట మిక్కిలి తెల్వి మాలినపనికాదా? స్వరమండలీ శాస్త్రసంప్రదాయమును మఱియును శ్రౌతస్మార్త కర్మతంత్రమును "యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాః దేవాయజ్ఞమకుర్వన్త బ్రాహ్మణేన నిష్కారణంషడంగవేదోఽధ్యే

తవ్యః" అని సాధనచతుష్టయ సంపన్నులై భూసురు లనంబడఁదగిన ముముక్షులుం గృతార్థులగు దేవతలకుమాత్రమే వేదవేదాంగములు విధింపఁబడినవి కాని నిద్రాహారవిహారైక తత్పరులగు సంసారుల కెంత మాత్రము వేదశాస్త్రముల కట్టుబాట్లతో నెంతమాత్రమైన నవసరము లేనేలేదు. స్వార్థైకపరాయణులగు మోసకాండ్రు తమ తోడి పాటి జనుల కష్టేష్టము లెంచక సర్వజ్ఞు లతీంద్రియద్రష్టలు సకల జనసములు సర్వభూతదయాపరులగు మునులు లోకసంగ్రహార్థమై సమస్తజను లన్యోన్యప్రేమానురాగములతో నేకీభవించి హాయిగా దేశకాలపాత్రోచితముగా బ్రతుకుటకై యేర్పర్చిన కులజాతి మతా చారముల కెల్ల నపార్థములు కావించియాషాఢభూతులవలె నటించుచు జనులకెల్లఁ బరస్పర మతకలహములు పెట్టి తామే మో విద్వాంసులవలె వేత్తలవలె ననూచానులవలె శ్రోత్రియులవలెనాచార్యులవలెఁ గనులు మిటకరించుచు రుద్రాక్షపిల్లులవలె మున్యైక వేద్యమగు పరమార్థ తత్త్వముం బోధించుచు నొరుల సోమరిపోతుల నావించి తాము సోమరులై యొరులఁ జెఱచి తాము తీసికొన్న గోతులం దామే కూలుచున్నారు. సకలజనులకుం బరస్పరప్రేమానురాగములు పుట్టి పఁజాలని యాచారము వేదశాస్త్రచోదిత మెంత మాత్రము న్గానేకాదు. "సర్వేజనాః సుఖినోభవంతు" అని నిష్కపటము గాఁగోరని మనుష్యునకే జాతిమర్యాదలు న్లేనేలేవు. తనతోడిపాటి జనులతోఁ గలసిమెలసి పొంది పొసఁగి ప్రేమానురాగములతో సంచరించక పరస్పర కలహకారణ మగు చెనటిమానవుఁడు మునులు. విధించిన బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర పంచమజాతుల నెద్దానిం జేరని దుర్జనుఁడుగాని "పంచజనావై మనుష్యాః" అను విధమునం బంచజనుఁ డెంతమాత్రము న్గాఁడు కాఁడు. తనతోడిపాటి జనులకన్నఁ దాశ్రేష్ఠుఁడనని చెప్పుకొనువాఁడు బొత్తిగా వెఱ్ఱివాఁడైన న్గావలెను

లేక మిక్కిలి మోసకాఁడైనను గావలెనుగాని వాస్తవముగా సజ్జనుఁడుం బండితుఁ డెంతమాత్రమున్గానేకాఁడు. తనతోడివారి జనుల ప్రేమానురాగములకుఁ బాత్రుఁడై సకలజనసమ్మతముగా బ్రతుక నేర్చినవాఁడే విద్వాంసుఁడు. "తస్మాద్విద్వాన్ ప్రేవవదేత్ పీవన్నృత్యేత్ దానకామా అస్మైప్రజాభవంతి"అను తీరున వేషభాషల నకల జనరంజకుఁడైనవాఁడే విద్వాంసుఁడు కనుక నట్టి సజ్జనుని మనుష్యులు గాని దేవతలుగాని తప్ప కభీష్టసంపదలిచ్చి యాదరింతురు.

నవరసాత్మకములగు వేషభాషలలోనే నాట్యవేద స్వరూపములగు వాచికాంగికాహార్య సాత్త్వికాభినయములు సంసారమున జనులందఱిచేతను వ్యవహరింపఁబడుచున్నవి. అఖండపౌరుషేయ నిత్య వేదశబ్దమున కనంతసంఖ్యాకములయిన ప్రకృతిప్రత్యయము లేర్పర్చి పదసమూహముగా నొనర్చి మనుష్యులకు దేశకాలపాత్రోచితములగు జాతికుల మతాచారముల బోధింపఁదగు నర్థమిచ్చు వాక్యస్వరూపముగా శిక్షావ్యాకరణచ్ఛందోజ్యోతిషనిరుక్తకల్ప శాస్త్రపద్ధతుల ప్రకారము నిర్మించి యనాదియును లనాదిలోక వ్యవహారసంగ్రహార్థమై శ్రౌతస్మార్తకర్మములను స్మృతిపురాణేతి హాసమూలమునం గూడ దేఁటతెల్లమగునట్లు కులమతాచారములం గల్పించిరి. జగమెప్పుడు సృజింపఁబడెనో యప్పుడే వేదవేదాంగ పురాణాద్యష్టాదశ విద్యల నోధించు వైఖరికూడ మనులచేతఁ గల్పింపఁబడెను. ఈ సమస్త చరాచర జగత్సృష్టిస్థితిలయములకు మూలములగు నచింత్యవైభవములగు శక్తులే యీ వేదవేదాంగాద్యష్టాదశ విద్యలం బోధించు నపౌరుషేయశబ్ద సమూహముగా మూర్తీభవించి లోకసంరక్షకులు మహాత్ములు గామరూపులగు గౌతమవ్యాసాది మహామునుల రూపమున నవతరించి దేశకాలపాత్రోచితముగా లోకుల కుపదేశించెనని సిద్ధాం

తీకరింపవచ్చును. భూతహింస కావింపనీక లోకుల కన్యోన్య ప్రేమాను రాగంబులం బుట్టించుటయే సకలవేదశాస్త్ర ప్రవృత్తి ప్రయోజనములు.

## జీవాత్మ పరమార్థము

"ఆత్మావై పుత్రనామాసి-ఆత్మజః - పితృపితామహ ప్రపితా మహావసురుద్రాదిత్యరూపాః" మనుష్యాదిపురుషజంతువు తనజాతి యైనదానిం గూడి గుణరూపములం దనంబోలిన పిల్లలంగనుట స్వభావసిద్ధ మగుటచేతను దనకుం బుట్టినపిల్ల లాత్మజులను సంజ్ఞ నందుటచేతను దండ్రియుం దాతయు ముత్తాతయును గ్రమముగా సూక్ష్మశరీర లింగశరీర తేజశ్శరీరములతో శరీరముం దాల్పంగల స్థితి తోను శరీరమును దాల్చు కోరికతోను కేవలానందమయ తేజో రూపముతోను గ్రమముగాం దాపత్రయముతోం బితృరూపముతో పాంచభౌతికస్థూలోపాధిగాం బరిణమించందగినసూక్ష్మోపాధినల్లాడుచు నాధ్యాత్మిక తాపముం దొలంగి యాధిభౌతికాధిదైవిక తాపములతో శరీరపాటవము లేకుండియును దీవ్రభోగేచ్ఛ గల వృద్ధునివలె లింగో పాధి నొగులుచు "రుదిర్ రోదనే" యనుటం బట్టి రోదనముచేయు రుద్రుండై పితామహరూపమున నల్లాడుచుం బాంచభౌతికోపాధి లేకుం టచే నశరీరుండై నిర్గుణుండై కేవలానందమయ తేజస్స్వరూపుండై యాదిత్యరూపమునం బ్రకాశించు దేవుండై లోకబాంధవుండై సకల జగత్సృష్టిస్థితి సంహారకారణమై "అగ్నిముఖావై దేవాః" అనునట్లు బ్రహ్మవిష్ణు మహేశ్వరదేవతా త్రిమూర్తి ముఖజగజ్జ్యోతియై సర్వ జగత్సాక్షియై సర్వలోకప్రకాశుండై సర్వజగత్ప్రత్యక్షముగ శాశ్వత పరబ్రహ్మస్వరూపమున వెలుంగుచున్నాండు. తనతండ్రి తనతాత తనముత్తాతవఱకే తనకు సంబంధించినవారు కనుక నాబ్దికములందు ముత్తాత తలిదండ్రుల్లు స్మరింపంబడకుండ్రు. సముద్రమునం దొకవ్వు

తరంగము లనంతసంఖ్యాకము లనంతవికారములం బుట్టి పెరిఁగి మఱి
యాసముద్రమునం దేలయమగుచుండు-సముద్రము నీరే తరంగమునీరే-
సముద్రమునందలి భూతభవిష్యద్వర్తమాన కాలికతరంగము లన్నియు
నొండొంట భేదము కలిగియు వస్తుభేదము లేక యుద్భవస్థితి వినాశ
కోపాధ్యాకారముల న్మాత్రము నానావిధములయిన తెరంగున నశరీరు
లగు జీవాత్మలు త్రైకాలికోద్భవస్థితి నాశ కోపాధుల ననంతజన్మము
లెత్తుచుండియుం బరమాత్మకుం దమకు వస్తుభేదమేదియు న్లేక త్రిగుణా
మయోపాధ్యాకార విశేషముల స్సముద్రమునకు భిన్నములై తోఁచు
తరంగములవలె మదూర్మిప్రకారములం భిన్నులై భూతభవిష్యద్వర్త
మాన జన్మపరంపరాత్మక సంసార తాపత్రయాగ్నిం బొరలుచున్నట్లు
జ్ఞానమున వ్యవహారదశ ననుభవించుచున్నారు. సాలెపురుగు తన
యందలి పదార్థవిశేషమునే దారముగాఁ బైకిఁ దీసి మఱలఁ దన
లోనికే తోడుకొనుచందమున నారాయణుఁడు నిజలీలచే స్వప్రకా
శాత్మక త్రిభువనాత్మక పాంచభౌతికోపాధి న్వెలిబుచ్చి మఱలఁ దన
యందే లయము కావించుకొనుచున్నాఁడు.

అహంకార మమకారాత్మక వ్యావహారికమగు విపరీతదృష్టిచే
ననాద్యజ్ఞానోపాధిఁ దాపత్రయమునఁ గుందు జీవాత్ముఁడు తనకంటే
వేఱుగ జగముంట ద్వైత బుద్ధిచేత వసురుద్రాదిత్య రూపముల
సృష్టి స్థితిలయములం బ్రాపించుచు భూత భవిష్యద్వర్తమాన జన్మ
పరం పరల ననుసరించుచున్నాఁడు. జీవుఁడు గత జన్మమునందు
వసువు. వర్తమానజన్మమునందు రుద్రుడు. కొట్టకొనకు భవిష్యజ్జన్మ
మున నాదిత్యుఁడు. తమోగుణ ప్రధానమగు భూతకాలమున వసువులై
రజోగుణ ప్రధానమగు వర్తమానకాలమున రుద్రుఁడై సత్త్వగుణ
ప్రధానమగు భవిష్యత్కాలమున నాదిత్యుఁడగు సుషుప్తి స్వప్న
జాగ్రద్దశ లనుభవించుచు "ఆనందాదేవ-ఇమాని భూతానిజాయన్తే"

అను తీరుగా భూతభవిష్యద్వర్తమానకాలిక జన్మపరంపరల నవరసా స్వాదనానంద పరవశుడై "రసోవై సః" "ఆనందో బ్రహ్మేతి విజానీయాత్" అను తీరునం దా స్వాయముగ రసాత్మకానంద మయుం డయ్యు సహజ లీలచే "లీలాయతీవధ్యాయతీవ" అను తీరునం బా చభౌతికోపాధి బద్ధుడైన ట్లుత్పత్తిస్థితి నాశములందుచున్నట్లు శృంగార హాస్య కరుణ వీర శాంత బీభత్స రౌద్రాద్భుత భయానక రసానందములం జొక్కుచుండును. కోరి స్వయము బద్ధునివలె ముక్తుని మాడ్కి నాటలాడుకొనుచుండు నిద్దియే పరమార్థము పరమార్థము. త్రిగుణాత్మక శరీరస్మృతియు దేహస్మృతిం బట్టి తెలిసికొన స్వకీయ స్వప్న జాగ్ర ద్విషయములు జాతులు నీతులు కులములు మతము లాచార మయములయిన శ్రౌతస్మార్త కలాపవిధానము వేయేల, సకలేంద్రియ దృష్ట వస్తువులు సకలానుభూత పదార్థములు లోకసేవ్యుడు భక్తవత్సలుండు సకల జీవ కర్మఫల దాయియు సచ్చిదానంద లక్షణుండగు నారాయణుండు సకల భువన చక్షువు కర్మసాక్షి లోకబాంధవుండై ప్రత్యక్షము సకల జన చర్మజ్ఞాన చక్షు విషయ భూతుండగు ద్వాదశాత్మయు త్రిమూర్తియును సులభ కైవల్యమార్గభూతుం డగు సూర్యనారాయణుండై సూర్యనారాయణుడే వెలయుచున్నాడు.

"ఏషా యుక్తపరావతః సూర్యస్యోదయనా దధి। శతంగ దేభిః సుభగోషా ఇయం వియాత్యభి మానుషాన్" "ఈ మంత్రములో నుదాత్త స్వర విశేషములందే పైగీతలు గలవో యా యక్షరము లు మిక్కిలి ప్రధానములు కావుననే మిక్కిలి స్పష్టముగాను దీర్ఘరగా నుచ్చరింపం దగినవి మఱియు ననుదాత్త విశేషములం దెల్ప

క్రింది గీతలు గల యక్షరము లంతప్రస్ఫుటముగ నుచ్చరింపరాదు కను కనే మెల్లగా నుచ్చరింపఁ దగినవి. మనుష్యుల కెల్ల వంద్యుఁడై సకల జగత్సృష్టి మూలమైన ప్రభాతకాంతి నే సూర్యుఁడు వెల్లడించు చున్నాఁడో యట్టి సూర్యనారాయణమూర్తి కన్న మనుష్యులకు సకల చతుర్వర్గ ఫలదాతయు సకల మనుష్యవంద్యుఁడు మఱి లేఁడని శ్రుతి భాష్య సిద్ధాంతము కడు సమంజసము సమంజసము. "నమ స్కార ప్రియః సూర్యః" అనుటచేత మిక్కిలి మనకుఁగూర్చు సూర్యు న కేప్రొమొక్కిన ప్రమొక్క నొల్లని వానికి సంసార తాపత్రయ దావాగ్ను లార వారవు.

శరీర జ్ఞప్తి యున్నంతవఱకు జీవాత్మున కతని జ్ఞప్తియే సమస్తపాంచభౌతికభూతభవిష్యద్వర్తమానపదార్థస్వరూపమైమూర్తీ భవించును. లేనిపదార్థవు తెలంపునకేరాదు. తలంపునకుఁ దోఁచిన పదార్థము భూత భవిష్యద్వర్తమానకాలంబుల న్వాస్తవముగా నుండక మానదు. కాబట్టి భూత భవిష్య జ్జన్మముల ననుభూతము లయినవి మఱి యనుభవించఁ దగినవి వర్తమానమున ననుభవించు చున్నవి యాదృచ్ఛికముగా నాకస్మికముగాను మఱియుం బ్రయత్న పూర్వకముగాను గోరినవి కొన్నియుం గోరనివి కొన్నియు ననుభవింప సాధ్యము లయినవి కొన్నియు ననుభవింప నెన్నటికి నసాధ్యము లయి కొన్నియు న్విన్నవి కొన్నియుం గన్నవి కొన్నియు రుచి చూడనివి కొన్నియు పిచ్చి పిచ్చిగా నూహ గల్పించుకొన్నవి కొన్నియును మొత్తము మీఁద మనస్సునకుఁ దట్టిన పదార్థము లన్నియును జ్ఞప్తి రూపములే కనుకను జ్ఞప్తి నిక్కముగాఁ బృథివ్యప్తేజోవాయువులం దోఁచు నాకాశమువంటి దగుటచేతను జీవాత్మునిచే ననుభూతములగు విషయము నిక్కముగా సదసద్విలక్షణా నిర్వాచ్యమాయామయములు కనుక సత్యములని కాని లేక యసత్యములని కాని "ఇద మిత్థమ్"

అని నిశ్చయించుటకు వీలులేదు. "విజ్ఞాతార మరేకో విజానీయాత్" అను తీరున నన్నిటి నని పెట్టి జ్ఞప్తిని గూర్చి తెలిసికొనుట యసంభవము. జ్ఞప్తియే తనకుఁ దా వేఱయి తన స్థితిం దాఁ దెలిసికొనునని బ్రహ్మజ్ఞానులగు మును లెఱుఁగ నగును గాని సంసార బద్ధులగు జీవాత్ములకు నిక్కముగాఁ దమ జ్ఞప్తి తమ కెంత వాస్తవముగాఁ దోఁచునో అంతవాస్తవముగా భూత భవిష్యద్వర్తమాన పదార్థములన్నియు ననుభవమునకు వచ్చిన వన్నియును యథార్థములను కొనక తీఱదు. కనుకఁ బెద్ద లేర్పరచిన స్వర్గనరక హేతువులగు జన్మకర్మములు కులజాతి మర్యాదలన్నియును వాస్తవములే దృఢ విశ్వాసముతో పెద్ద లేర్పర్చిన పద్ధతుల ననుసరించి మనుష్యులు పౌరుషముతో నిహపరములు సాధించుకొనవలెను. సాధించుకొనవలెను.

సప్త సూర్యకిరణములు సప్తవాయుసఖముఖముల సప్తగ్రహచార వశమున సప్త స్వరాత్మక శబ్దబ్రహ్మ వివృత స్వరూపములై నిషాద - మ్లేచ్ఛ - పంచమ - శూద్ర - వైశ్య - క్షత్రియ - బ్రాహ్మణజాతి సప్తకసంజ్ఞతోఁ జేతనాచేతన పదార్థము లన్నియును సప్తర్షులచే సప్తర్ష్యాధోలోక వ్యవహారసంగ్రహార్థమై సప్తసామముల నుపదేశింపఁబడినవి. కాలక్రమమున దేశకాలపాత్రానుసారముగాఁ గులగుణ జాత్యాచారాది మర్యాదలు తార్మాఱగుచుంట సహజసిద్ధము. అనాది సంప్రదాయానుసారముగాఁ బ్రవర్తించుచున్న మానవజాతి మర్యాద లన్నియు దేశకాల పాత్రానుసారముగా స్థూల కార్య వ్యక్తదశ న్మాఱుచుండియును సూక్ష్మకారణావ్యక్తదశం బరమాణువులవలె నిత్యములయి మాఱకున్నవియే. కాఁబట్టి యష్టాదశ విద్యారహస్యము లెఱిఁగి వర్తమానకాలమున స్వార్థపరతమాని సకల లోకోపకార పరాయణులై సర్వభూత దయాపరులై ప్రవర్తించుచున్న సజ్జనుల యుపదేశముం బ్రదికరణశుద్ధిగా నమ్మికొని నిజకుల

క్రమాగతాచారముల హద్దుదాఁటక సద్గృహస్థులయి సంసారులు తమ తమ జీవితకాలము లిహాపరసంతారకములుగాఁ గేవల పురుష ప్రయత్న మూఁతగాఁగొని విహిత ధర్మమార్గము తప్పక తమతోడి పాటి జనుల న్సుఖపెట్టి తాము సుఖించు నడువడి నవలంబించుట తప్పనివిధి తప్పనివిధి. తప్పులుచేసి దిద్దుకొనుచు ననాదికాలము నుండియు ననంతజన్మము లెత్తుచుఁ దుట్టతుదకు బ్రహ్మప్రళయమున జీవులందఱు న్ముక్తులు కాకమానరుగాని లోకోపకారబుద్ధిం దమ పురుషప్రయత్నముచేత మనుష్య మర్యాద నతిక్రమింపని ధర్మాత్ములు ఘోరసంసార దుఃఖముం బునర్జన్మముచే నులల ననుభవింపఁ జేయు పూర్వజన్మార్జిత పాపకర్మము నిశ్శేషముగా నశించిపోవుట చేత రుజాజరామరణముల నుదాసీనులై యుపేక్షించి సంతతనారాయణధ్యాన పరాయణులై జీవన్ముక్తు లగుచున్నారు.

## ఆ స్తి క్య ప్ర బో ధ ము

సప్తజాతులతోనున్న మనుష్యులు "తానావకోనపంచాశత్-తన్యతే విస్తార్యత ఇతితానః" అను విధమున సప్తర్షులచేత విస్తరింపఁ బడి $7 \times 7 = 49$ నలువదితొమ్మిది గోత్రముల నుద్భవించిరి. తూర్పు హద్దునం గిరాతులుం బడమటి హద్దున యవనులు దక్షిణము హద్దున సముద్రము నుత్తరము హద్దు హిమాగ మనఁగా నపరిమితముగా లోఁతు దప్పుల నాద్యంతములు తెలియరాక దట్టముగా గడ్డకట్టిన మంచుదిబ్బయు న్గల భూవలయమునకు భారతవర్షమని సంజ్ఞ. నిజ కర్మానుసారము నానాయోనుల నుద్భవించి పాపపుణ్యము లనుభవించు శరీరధారుల కందఱికి భరతులను సంజ్ఞ. మఱి యట్లు నిజకర్మ ఫలము న్నానాదేహధారులై యనంత సంఖ్యాకములగు భూతభవిష్య ద్వర్తమానములం బ్రారబ్ధ సంచితాగామి కర్మఫల మనుభవించుచు

"చక్రనేమిక్రమేణ" అను విధమునం బరివ్రతచర్వణ వర్తనులై సంస రించు జీవులు నిషాదమ్లేచ్ఛపంచమ శూద్రవైశ్యక్షత్రియబ్రాహ్మణ జాతులతో దేహయాత్ర నడపుకొనందగిన పృథివికిం గర్మభూమి యనియుం భారతవర్షమనియు సంజ్ఞలు. "ఆర్యావర్తః పుణ్య భూమి ర్మధ్యం వింధ్యహిమాగయోః" మృచ్ఛిలామయమయి జంగమస్థావర ప్రాణికోటితో నిండిన వస్తువు కొండ. జంగమస్థావర ప్రాణులుంట కెంతమాత్రము నీవులుకాక కేవలముం గడ్డకట్టిన మంచు దిబ్బకే హిమవత్పర్వతమనియును హిమాగమనియుం బేర్లుకాని శిఖర మున మాత్రము మంచు ఘనీభవించిన కొండహిమాగము కానేరదు. కాంబట్టి వింధ్యపర్వతమే యున్నతశిఖరముల మంచుగడ్డ కట్టియుంట చేతను "అస్త్యుత్తరస్యాందిశి దేవతాత్మా హిమాలయోనామనగాధి రాజః పూర్వాపరౌ వారినిధీవిగాహ్య స్థితః పృథివ్యా ఇవమాన దండః" అని మహాకవి వర్ణించినతీరుగా మేరువునకు దక్షిణముగానున్న భూమికంతకును భరతవర్షమేయని పురాణోక్తమగుటచేతను వింధ్య పర్వతమునకు దక్షిణముగానున్న దండకాటవి రాక్షస సంచారప్రదే శముగాని మనుష్య నివాసార్హము కాదని రామాయణమునం బేర్కొనంబడుట చేతను భరతవర్షము మధ్యభాగమే కర్మభూమియని యును మఱి యక్కర్మభూమియొక్క మధ్యభాగమున హిమవంత మునకు త్తరమునమానససరోవరమును కైలాసమును కుబేరపురియుం గలవనియు దక్షిణమున లంకయుం బశ్చిమమున సిద్ధపురియుం దూర్పున నమరావతీపురియు నుత్తరమున నలకాపురియు గలవని పురాణప్రసిద్ధము. జ్యోతిశ్శాస్త్ర ప్రసిద్ధమగుటచేతను "అనంతం హ్యుత్తరాపథమ్" అను తీరునం గొలత చెప్ప నలవికాని యుత్తర సముద్రమునకే హిమాలయసంజ్ఞ చెల్లును. మఱియు నతిశయోక్తి చేత వింధ్యపర్వతమునకే హిమవత్పర్వతమని ప్రసిద్ధికలిగెం గాని

యుత్తరసముద్రము తప్పఁ బృథివిలో నింకొక ప్రదేశము హిమాగ
మనియును హిమాలయమనియును హిమవంతమనియుం బేర్కొనఁ
బడుట గౌణముగాని వాస్తవము కానేకాదు, వింధ్య కుత్తరమునం
బుణ్యభూమి కల దద్దానికే యార్యావర్తమని రెండవపేరు మఱి యా
యార్యావర్తమున నున్న మనుష్యులకే బ్రహ్మ క్షత్రియ వైశ్య
శూద్ర సంజ్ఞలతో నున్న మనుష్యులే యార్యు లనం దగుదురు.
జంగమస్థావర ప్రాణులతో మెండుకొని శిఖరముల నసాధారణముగా
మంచుగడ్డ గట్టి సప్తధాతు మయమయి హిమవంతుని పేర్కొనం
బడిన కొండ వింధ్యపర్వతమే. వాస్తవముగా రాయిరప్పలుగాని చెట్టు
చేమలుగాని జంగమప్రాణు లెవ్వియు గాని నిల్చుట కవకాశ
మేమాత్రము లేని యచ్చపుమంచుదిబ్బయగు నుత్తరసముద్రమునకె
హిమాగ సంజ్ఞ చెల్లును. సహజముగా శరీరమందలి జఠరాగ్నికిఁ
దోహద మొనర్చి మదద్రవ్యమునలెఁ గల్లసుఖమును హెచ్చించు
నుష్ణత్వము కలిగియుండుటచేత వింధ్యకుత్తరమందున్న యార్యులు
కాలక్రమముగాఁ గ్రొత్త యొక వింత వేఁడి యొక రుచి యను
సామెతగా నుష్ణత్వ వ్యసనపరులై వింధ్యపర్వతమునకు దక్షిణమం
దున్న రాక్షస భూమిని నివాసమున కలవడి వేఁడిరుచి మరిఁగినకొలది
దక్షిణసముద్ర ద్వీపముల రాక్షసవృత్తి నవలంబించి మనుష్యజాతి
మర్యాదలం దొలంగినారు. మొట్టమొదట వింధ్యకు దక్షిణప్రాంతమున
నివసించిన మనుష్యులు తమ తొల్లింటివాఁడు కన్బట్టి తమ నివాస
ప్రదేశముల కుత్తరమగు వింధ్యపర్వతమునే హిమాలయ పర్వత
మనియుం దమ ప్రాచీన సంప్రదాయమున వింధ్యోత్తర ప్రదేశమునం
గల యార్య సంకేతిత నదీపర్వతవనగ్రామములకెల్ల గంగాసరయూత్ర
నైమిశాయోధ్యాది నామముల న్వింధ్యకు దక్షిణప్రదేశములంద
తొంటి మర్యాద న్నిల్పుకొంటకై పేర్లుపెట్టుచు నాయార్యులే

తామనియుం జెప్పుకొను "ఇంటిపేరు కస్తూరివారు ఇల్లు పేడకంపు" అన్న సామెతగా నార్యధర్మములగు సత్యదయలఁ బరస్పర ప్రేమానురాగముల న్రొఱఁగి స్వార్థపరులై రాక్షసులయి పరస్పర ద్వేషముల న్గలమునకై గ్రుద్దులాడుచు నశ్వర భోగవ్యసనపరులై బుద్ధిహీనులై విభ్రాంతులై దీపపుముక్కుఫురుగువలెఁ గామాగ్నిం బొలయుచున్నారు. నిక్కముగా నియత మర్యాద నతిక్రమించి దక్షిణమునఁ దమకుఁ బోరాదని యేర్పఱ్చిన వింధ్యపర్వతము న్గడచి దక్షిణయానాత్మక సంసార వ్యసనపరులై కృత్రిమ జాతినామము లూని యుష్ణతత్త్వ మదమున కలవడినకొలంది రాక్షసకృత్యములకుఁ జొచ్చి లంకవఱకు వ్యాపించి కేవలమున్ రాక్షసులై చెడినవారు మొట్టమొదట వింధ్యోత్తర పుణ్యభూమిని వాస్తవముగా బ్రహ్మక్షత్ర వైశ్యశూద్ర జాతి మర్యాదల స్నిష్టులై యుభయలోకములం దరించిన యార్య మనుష్యులెకదా! వింధ్యోత్తర పుణ్యభూమి నివాసము పుణ్యయుగమం బుణ్యకర్మ ఫలానుభవము న్లభించుట ప్రాచీనార్య మనుష్యుల మంచి యదృష్టము. ఉత్తరసముద్రమునకు హిమగ మను పేరు పుట్టుపేరు. మఱి యా యుత్తరసముద్రమునకు దక్షిణప్రాంతభూమియందు బుణ్యయుగమున "తపఃఫలంకృతయుగే" అను విధమునఁ గేవల తపోధనులు శిష్టులు నార్యులను పేరంబరఁగిన మనుష్యులు కాలవశమున దక్షిణ దిక్కునకుఁ దరుముకొని మంచు ఘనీభవించిన శిఖరముల న్మిన్నంటు వింధ్యపర్వతమువఱకును వ్యాపించిన భరతఖండముయొక్క హద్దుదాఁటి త్రేత ద్వాపరయుగములవఱకు వింధ్యపర్వత దక్షిణ ప్రాంతమునందలి నదీతీరముల వసించి తమతాతలు వసించిన భరత ఖండమున కుత్తరమం దున్న హిమాలయము పేరే యంతవఱకుం దమ పూర్వులు వింధ్య యని పేరుపెట్టిన వింధ్యపర్వతమునకుఁ దమ పూర్వుల గౌరవమును స్మరించుటకై పెట్టుకొని తమపెద్దలు వసించిన

ప్రదేశముల గంగా యమునాది నామములం బరఁగిన నదుల పేర్లును మఱి కాశీ మథురా ప్రయాగాది పత్తనముల పేర్లును వింధ్య యను క్రూరనామము తొలఁగించి హిమవంతమని చల్లనిపేరునఁ దాము పిలుచుకొన్న భారతవర్షమునందలి భరతఖండమునకు దక్షిణపు హద్దయిన వింధ్యపర్వతముయొక్క దక్షిణప్రాంతమున వసించి కలి ముదిరినకొలంది దక్షిణసముద్రతీరము దక్షిణసముద్రము నందలి ద్వీపముల నాశ్రయించి యాప్రదేశములందుఁగూడ నదీపర్వతపత్తనములకు హిమాలయ గంగా కాశ్యాదినామములం దమపెద్దల గౌరవము స్మరించుకొనుటకై స్థాపించుకొని తమ పెద్దలయొక్క యహింసా స్త్రిక్య సత్యవయులన్దొ అఁగియుం దామార్యుల మనియుం జాతుర్వర్ణ్యుల మనియుం జెప్పుకొనుచున్నారు.

ప్రతియుగమునకుం దొస్మింద్రు మనువులు సప్తఋలను నింద్రాది దిక్పాలురు వేదశాస్త్రములు కాలమానములు వర్ణవ్యవస్థలు జంగమస్థావర ప్రాణిదేహాకార గుణచేష్టాది విశేషములు సూర్య చంద్రాది గ్రహగతు లశ్విన్యాది నక్షత్రములు మేషాదిరాసులు వసంతాది ఋతువులు వేయేల బ్రహ్మాది దేవతామూర్తులు దిగ్దేశ దిక్పతులు సకల నామరూపములు గూడ మాయామేయ శక్తి మహిమం దార్మాఱగుచుండును గావున నొక్కప్పుడు సముద్రముగా నున్నచో టరణ్యముగా నరణ్యము జలాశయముగాఁ జడము చేతనముగాఁదూర్పు పడమరగాఁ బడమరతూర్పుగా వేసవి వానకాలముగా వానకాలము మండువేసవిగాఁ గొండనల్లపూసగా నల్లపూసకొండగా నిజము కల్ల కల్ల నిజముగా నార్యుఁడు మ్లేచ్ఛుఁడుగా మ్లేచ్ఛుఁ డార్యుఁడుగా మంచి చెడ్డగాఁ జెడ్డ మంచిగాఁ బ్రకృతివశుఁ డగు జీవునకుఁ గన్పట్టక మానదు కావుననే పురాణ మతమున జంబు ద్వీపాది సప్తద్వీపముల న్భూగోళము వెలయుచుండునని లవణసము

ద్రాది సప్త సముద్రములను సప్తద్వీపములం జుట్టుకొని యుండు ననియు
న్మేరుపర్వత మీభూమికి మధ్య నున్నదనియు న్మేరుపర్వతమునకుఁ
గ్రింద నతలాది సప్త పాతాళములును మేరుపర్వత శిఖరమున భూరాది
సప్తోర్ధ్వలోకములు గలవనియును మేరుశిఖరము స్వర్గలోకమనియును
మేరుపర్వత నితంబ ప్రాంతము మర్త్యలోక మనియును మేరు
పర్వతముయొక్క క్రిందిభాగము పాతాళలోక మనియును సూర్యాది
ఖగోళములు మేరువుచుట్టుం దిరుగుచుండు ననియును గ్రహగతివిశేష
ములం బట్టి పాంచభౌతిక మర్త్యలోకమును మఱియు మర్త్యలోక
పదార్థములుం బ్రతిక్షణము న్మారుచుండు ననియు మఱి యీ జగ
దుద్భవస్థితి వినాశ కారణము పరమాత్మునకుఁ గూడ నవేద్యమనియు
న్నిరూపింపఁ బడెను.

ప్రమాణములం బట్టి యథార్థ వస్తుజ్ఞానము లభించునుగదా?
పౌరుషజ్ఞాన కీర్తులు భూతదయయు సత్య శౌచములు బుణ్యభూమి
న్నివసించు శిష్టజన చాతుర్వర్ణ్య సహజ ధర్మములు. భూతదయయు
సత్యముం బరస్పర ప్రేమానురాగము లాస్తిక్యములేని కేవల
స్వార్థైక తత్పర ధూర్త మానవులు మనుష్యజాతిలోనే పరిగణింపఁ
బడ రట్టివారు తమ కులగోత్రములు వర్ణించుకొంట ఘోరకలికాల
విచిత్ర చేష్టితముగాని విశ్వసనీయము కాదు. ముత్తైదువునకు పసుపు
బొట్టులవలె సజ్జనులకు మాత్రమే కులాచారములు భూషణములు.
తమ పెద్దలనాఁటి మర్యాద నతిక్రమింపక "అఋణః శ్శుచిః" అను
తీరున వేదశాస్త్రజ్ఞాన మిరువది నాలుగేండ్లలోపగు కైశోరమును
వయస్సున బ్రహ్మచారియయి ఋషుల ఋణమును, ధర్మపత్నియందు
సంతానముం గని లోకసమ్మత ప్రవర్తనముగా నలువది తొమ్మిదేండ్ల
లోపగు తారుణ్యమును వయసున గృహస్థై పితృదేవతల
ఋణమును, నవవిధ భక్తి మార్గముల సర్వభూత దయాపరుఁడై

యిరువదియేండ్లలోపగు మధ్య వయస్సున సద్వ్రత యజ్ఞ నిష్ఠుఁడై దేవతల ఋణమును, దీర్చుకొన్న మనుష్యుఁడే యఋణియై శుచియుం గృతకృత్యుఁడనంబడు నీ విధముగా ఋణవిముక్తుఁడై కృతకృత్యుఁడగు మనుష్యుఁడే యార్యుఁడు మఱియు వాని జీవితకాలమే కృతయుగము, ఋణబద్ధుఁడై యశుచియై యభాగ్యుఁడైన మనుష్యుఁడే మ్లేచ్ఛుఁడు మఱి వాని జీవితకాలమే కలియుగము, ఋణవిముక్తుఁడే కులగోత్ర మర్యాదవంతుఁడు మఱియును ఋణబద్ధుఁడే జాతినీతి మర్యాదాహీనుఁడు. అప్పంతయుఁదీర్చుకొన్నవాఁడే బ్రాహ్మణుఁడు. మూఁడుపాళ్ళప్పు తెగగొట్టుకొన్నవాఁడు క్షత్రియుఁడు సగమప్పు తీర్చుకొన్నవాఁడు వైశ్యుఁ డప్పులోనొక్కపాలుమాత్రమే తీర్చుకొన్నవాఁడు శూద్రు డప్పులలో మున్గియు నప్పుతీర్చుకొనుటకై యహర్దివముం బ్రయత్నించువాఁడు పంచముఁ డప్పు తీర్చుకొనుటకై ప్రయత్నము చేయునట్లు నటించు కపటి మ్లేచ్ఛుఁడు. మఱి కోరి ప్రయత్నపూర్వముగా నప్పుగవేసినవాఁడు నిషాదుఁడు. బ్రాహ్మణుఁడుత్తమోత్తముఁడు. క్షత్రియుఁడు మధ్యముఁడు, వైశ్యుఁ డధమోత్తముఁడు, శూద్రుఁ డధమాధమోత్తముఁడు, పంచముఁ డధముఁడు, మ్లేచ్ఛ డధమాధముఁడు, నిషాదుఁడు మనుష్య పశువు.

నిక్కముగా నుత్తమ మనుష్య ధర్మము సర్వలోకోపకారక ప్రవర్తనమే. మఱి యట్టి సకల లోకోపకారక ప్రవర్తనము నామరూపముల నభినయ చాతుర్విధముచేత విద్వాంసుఁడు ప్రకటింపవలయును విద్యలన్నియును జతుర్విధాభినయ బోధకములే, హితముగా మితముగా స్ఫుటముగా నిష్కాపట్యముగా నాంగికాభినయమొనర్చుచు సమయోచితముగా సంగిత మెఱిఁగి యొరులు సమ్మతించు తీరున వినయ విధేయత లగపర్చి లజ్జాశీల జుగుప్సా భయకంప దైన్యము లెంత మాత్రముం దోఁపనీక నిజమర్యాదం దప్పక దనకంటె

పెద్దలతోడను ప్రేమానురాగ జనకముగ సమవయస్కులతోడను మంచి నొవ్వధించుచుం బిన్నలతోడను రసానుకూలములగు నుదాత్తానుదాత్త స్వరయుక్తముగా సందర్భ శుద్ధిగల సుప్రసిద్ధ భావలం బల్కవలయును. దేశకాలపాత్రానుసారముగా జనరంజకముగా గీత నృత్యవాద్యములం గ్రొత్త క్రొత్త స్వకల్పిత మార్గముల నవలంబించవలయును "తగిన వేషంబు, తను దాన పొగడుకొనమి। నొచ్చియును గీడువల్కమి, యిచ్చి పగవ। కుక్క తన కెంత గడువకయున్న పథము। తప్పకుండుట నడువడి కొప్పం జేయు" అను రీతిగా సంసారులు ప్రవర్తించి యుభయలోకములం దరించవలెను.

పరమాత్ముండు నారాయణుండు వాసుదేవప్రద్యుమ్నానిరుద్ధ సంకర్షణ వ్యూహాత్మక బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రజాతులన్ జరాయుజాండజస్వేదజోద్భిజ్జ ప్రాణివిశేషంబుల న్విశ్వమయుండై ప్రకాశించుచున్నాండు. కాంబట్టి బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్ర జాతులు నాల్గు స్సమానగౌరవము కలవే. షడ్జాదిసప్తస్వరవిశేషము లన్నింటితో శ్రుతివెలయునట్లు శ్వేతాది సప్తవర్ణవిశేషములన్నియుం జేరి సూర్యకిరణమై ప్రకాశించువిధమున నిషాదమ్లేచ్ఛ పంచమశూద్ర వైశ్యక్షత్రియ బ్రాహ్మణజాతి సప్తకవిశేషములతో దేవుండే విశ్వరూపుండై నవరసాత్మకుండై నవరసికుండై సంసారబంధమోక్షముల నాటాడుకొనుచున్నాండు. "కామిగాక మోక్షగామికాండు" "ప్రారబ్ధకర్మణాంభోగాదేవక్షయః" అను తీరున సంసారబద్ధుండైన న్గాని జీవుండు ముక్తుండుకానేరండు. స్వకర్మముకుడువక తీఱదుకనుక దేశకాలపాత్రోచితముగా ననాది సంప్రదాయసిద్ధముగా వచ్చుచున్న కులజాతి మతాచారముల న్దోడిపాటి జనులకు మిగుల సమ్మతముగా మనుష్యులందఱు నవలంబించి స్వధర్మమును నడుపుకొనవలయు. "స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మోభయావహః" అను తీరున నిషాద

మ్లేచ్ఛ్వంచమ శూ ద్రవైశ్యక్షత్రియ బ్రాహ్మణకులజాతిమతాభి మానములతో వ్యవహరించు మనుష్యులందఱుం దమతమ నియత ధర్మముల న్విడనాడఁదగదు లేగదు. స్వకులమతాచారముం దప్పిన వాఁడెల్ల సంకరుఁడు స్థలభ్రష్టే యగును.

ఎద్దియైన నొక్కతీరైన మధ్యసంజ్ఞక నాదముచేయునపు డుప యోగించు నూరుపుగాలికన్న హెచ్చుగాఁ గంఠనాళవాయువు న్వెలి పుచ్చినకొలఁదిఁ దామొట్టమొదట నొక్కతీరుగాఁ బల్కిన మధ్య స్థాయినాదము తారస్థాయినాదమయి దూరశ్రావ్య మగుచుండును. మఱి యా మంద్రస్థాయి నాదమున కుపయోగించిన కంఠనాళ వాయువుం దగ్గించినకొలఁది స్మంద్రస్థాయి నాదమై మెల్లగా వినం బడును. కాఁబట్టి మధ్యస్థాయి నాధారశ్రుతిగా నేర్పర్చుకొని కంఠ నాళవాయువును షడ్జాదిసప్తస్వరముల కొలతవఱకును హెచ్చించి బల్కిన స్వర ముదాత్తము మఱి యాతీరు కొలత తప్పక యాధార శ్రుతికి తగ్గి పల్కిన షడ్జాదిస్వరసప్తక మనుదాత్తము. మఱియు నుదాత్తానుదాత్తస్వర సమ్మేళనవిశేషము స్వరితస్వరము. విలంబ మధ్య ద్రుతకాలము లనుదాత్తానుదాత్త స్వరితవిశేషములచేత శ్రవణ మనోహరములుదాఁ బల్కు ధ్వనులకు నడునడుమ నాగావించు కాల విశ్రాంతిరచనా సందర్భవిశేషము లయ యనంబడును. తినునప్పు డుపయోగించు నన్నకబళములకు మధ్య నే కబళ మాస్వాదించిన పిమ్మట యెంత యవకాశ కాలము గడవనిచ్చి తిరిగి యెంత కబళము నోటి కందీయవలయునో యట్టి విశ్రాంతి సమయసందర్భ కాలరచనా విశేషమునకే "క్రియాంతర్వర్తికాలోలయః" అను తీరున స్వర ముచ్చరించినపిమ్మట నెంతకాలమాఁగిమఱేస్వర ముచ్చరింపవలయునో అట్టి విశ్రాంతిసమయమునకు లయయని సంకేతము. విశ్రాంతికాల విశేషాత్మకమగు లయ నెఱుంగని మనుష్యుఁడు జనరంజకుఁ డెంత

మాత్రము న్గానేరఁడు. మఱి యొరుల సుఖపెట్టఁజాలఁడు మఱి తా సుఖింపనేరఁడు కాఁబట్టి, అట్టి "అరసికేషు కవిత్వనివేదనం శిరసిమా లిఖమాలిఖ" అను తీరున సంగీతగోష్ఠులకన్న కూళపసరమైనఁ గొంత మేలు, ఏ యాహారమెంత తిన్నవాఁ డెంతసేపు నిద్రనొవ్విశ్రాంతి చెంద వలయునో యా తెన్ను తెలిసినవాని కా యాహార ముపయోగించిన సార్థక్యముగునుగదా? ఏపని చేసినతరువాత నెంతకాలము మాఁగినపిదప నట్లాపనిం గొనసాగించవలయునో యాసంగతి తెలిసికొను వాఁడే చతుర్విధాభినయ ప్రయోగదక్షుఁడగు విద్వాంసుఁ డనంబడును. కాలనియమము తప్పక కొలతప్రకారము హద్దుమీఱక యాఁగవలసి నంతసే పాగుచు సకల లోకోపకారముకొఱకు మాత్రమే ధర్మకథ నము నందు మాత్రమే సకల జనక్షేమ మెట్లు చేకూరునో యట్టి సాధనబోధనమందు మాత్రమే యపరాధులను క్షమించు సమ యమునందు మాత్రమే బాలవృద్ధ రోగార్తుల న్గాపాడునప్పుడు మాత్రమే భగవంతునిఁ బ్రార్థించునప్పుడు మాత్రమే దుర్జనుల శిక్షించు నపుడు మాత్రమే ప్రజోపయోగకరములగు పనుల నెఱవేర్చునపుడుమాత్రమే సత్యదానధర్మ దయాప్రసంగములందు మాత్రమే స్వకులోచిత మర్యాద న్నిలుపుకొను సమయమందు మాత్రమే మంచి మనుష్యుల వాచికాంగికాహార్య సాత్త్వికాభినయ ప్రయోగము వెల్లడింపఁబడును. చెనఁటులగు దుర్జను లొనర్చు సకల విధాభినయములు లోకకంటకములై యప్రయోగములై వ్యర్థములై దుర్వినియోగము లగును.

ధర్మపత్ని ఋతుమతియై పుత్రార్థ మింగిత మెఱిఁగి తనపతి యెడ న్గాన్పించు శృంగారరసము, తన పిల్లయెడ నగపర్చు వాత్సల్య రసము, తన భర్త క్షేమమునకై దైవముం బ్రార్థించు నపుడు భక్తి రసము, బంధువుల యెడ నగపర్చు నాదరణ రసము, నతిథి సత్కార

మందు శాంతరసము పేదసాదలయెడ న్గరుణారసము తన పెనిమిటికిం
దగినంత సేవచేయుటకై తన కోరినంత శక్తి చాలకుంటకై బీభత్స
రసము, తన పెనిమిటిం బీడించు దుష్కాలముపై రౌద్రరసము
ఆకస్మిక భవిష్యల్లోకాపవాద శంకచేత భయానకరసము పతి
వ్రతలం బీడించుటకై యముఁ డగ్గినంటు మిడుతవలెం దిగురుచుటకై
హాస్యరసము న్వెల్లడించుచుం జతుర్విధాభినయము లొనర్చును.
మఱియును "మహాజనోయేన గతఃసపంథాః" అను తీరునం దన
తోడిపాటి పిన్నపెద్ద లందఱు నేమార్గ మవలంబించి నడుచు
చున్నారో యట్టిదారినే సజ్జనుఁడు "వేదవేదాంగ వేత్తాపిలోకా
చారం సలంఘయేత్" అను తీరు ననుసరించి యెంతమాత్రముం
జెడుత్రోవ ద్రొక్కక "అస్వర్గ్యం జనవిద్విష్టం ధర్మమప్యాచరే
న్నహి" అను తీరునకలజన సమ్మతముకాని చతుర్విధాభినయాత్మక
మగు మనోవాక్కాయ కర్మములం దలపెట్టనైనఁ గూడదు కూడదు.
తన పెద్దలకన్నఁగాని తనతోడిపాటి జనులకన్న గాని తా నేవిషయ
మందైన నధికుఁడనని గాని సమానుఁడనని గాని విఱ్ఱవీఁగక వినయ
విధేయతలతోఁ దనతోడిపాటిజనుల యనుగ్రహమునే మఱింతమఱింత
యెక్కువగు తీరునఁ జీవితకాలమంతయును సంపాదించుకొనుట
మనుష్యునకుఁ దొడ్డ బుద్ధి, దొడ్డ బుద్ధి.

జగద్రక్షకుఁడగు భగవంతుని కథలను, దానవీరులు ధర్మ
వీరులునై లోకోపకార మొనర్చిన యెఱుక గల మహానుభావుల
సచ్చరిత్రముల న్మృదు మధుర పద సందర్భరచనా విశేషములతో
నారోగ్యకరములు సమస్త నీతిబోధకములు సాంసారిక కష్టాపనోద
కము లాబాలగోపాల జన చిత్తరంజకములగు మాటలం బాటల
నాటలం బ్రత్యహముం దేశకాల పాత్రోచితములగు వేషములన్వినో
దముల న్నిష్కపటులై విహరించిన పుణ్యాత్ములకుం దన్నతిండి యెఱు
గును మఱి హాయిగా నిద్రపట్టును.

లోకసంగ్రహార్థమై దేశకాల పాత్రానుసారముగా సంసారులగు మనుష్యులకు జాతులు వర్ణాశ్రమ ధర్మములు వానివరుసలు వ్యవహారపద్ధతులు న్యాయమార్గములు మఱియు సకలోచిత ధర్మములు మతములు సర్వజ్ఞులగు మునులు వేదశాస్త్ర ముఖముల ననాదికాలమునుండియు నుపదేశించిరి. వాస్తవముగాఁ బరమాత్మ స్వరూపక శబ్దబ్రహ్మము కేవల మొక వ్యక్తియే కనుక శబ్దమునకుఁ గాని చైతన్యమునకుఁగాని యేజాతియు న్లేదు ఉపాధివశమున ననంత జంగమస్థావర ప్రాణిసమూహముల నగపట్టు కేవల పరమాత్ముఁడు నానావ్యక్తుల న్మాయోపాధి వశమున నగపట్టుటచేతఁ గేవలుఁ డగు నాత్మునకు జాతి కల్పితమయినది. వ్యక్తి వాస్తవము వ్యక్తి సమూహమునందుఁ గల్పితమగు జాతి కృత్రిమము జీవాత్మ వ్యక్తి-మఱియు జీవాత్ముఁడే యుపాధిఁబట్టి వ్యక్తీకరించు చున్నాఁడో యట్టిపంచీకృత మాయోపాధి జాతి కాఁబట్టి యాత్మునకు జాతిలేదుగాని యాత్ముఁడు వ్యక్తీకరించుట కవకాశ మిచ్చు శరీరము పంచభూతముల సమ్మేళనమున నగలిగె ననుక నట్టిదేహమునకే జాతి కల్పింపఁ బడెను. "అశరీరమాత్మా" అనుటచేతఁ గేవల శబ్దబ్రహ్మాత్మకుఁడైన జీవుఁడు కేవలుఁడే కనుకను మరి యుపాధివశమున వ్యక్తీకరించుట చేతను జీవాత్మునకు వ్యక్తి వాస్తవముగాని నానాప్రకారముల నగపట్టువిధముచే నేర్పడిన జాతికల్పితముగాని వాస్తవముకాదు నిరుపాధికుఁ డయిన శివుఁడు కేవల మొక వ్యక్తియే. శివునియొక్క వ్యక్తివంటి వ్యక్తులు మరి లేరుకనుక శివున కేజాతియు న్లేదు నిరుపాధిక పరమాత్మునకు జాతిలేదు సోపాధిక జీవాత్మునందే జాతి కల్పితమయ్యె ననఁగా నొక వాల్కిగానున్న పెక్కుపాధు లన్నింటికిం బామరబోధకై యొక విధమయిన నామరూపాత్మకమగు జాతి కల్పింపఁ బడెను. "వికారో నామధేయం మృత్తికేవేతి సత్యమ్"

నామరూపములును మఱి నామరూపములం బట్టి యేర్పడిన జాతియు న్గూఢ కల్పితములే మఱి వాస్తవములు కానేకావని యిందువలనఁ దేలిన ఫలితము. కాఁబట్టి లోకవ్యవహారము కొనసాగించుటకై పరమ కారుణికులైన యతీంద్రియ ద్రష్టలగు మునులు నానావిధోపాధుల స్వీకరించు విశ్వరూపుఁడైన దేవునకు నానావిధ నామములాకృతులు జాతులు కులములు గోత్రములు మొదలు నానావ్యవస్థలు వేదశాస్త్ర ముఖములం గల్పించిరి. కేవల తేజస్సున కేరంగు న్లేదు గాని యాతేజస్సే సోపాధిక మయినప్పుడు శ్వేతపీతాది నానావిధ కాంతుల స్వీకరించును. యెట్టని చాయకల నానావ్యక్తులన్నియు నెట్టజాతి వస్తువులని పేర్కొనంబడెను. కాఁబట్టి నామరూపములు గాని జాతివర్తనములుఁగాని యెవ్వియు న్లేని నిర్గుణుఁడగు నాత్మునకు బ్రహ్మాదిజాతులు లోకవ్యవహార ప్రవృత్తి బట్టి యనాదిగాఁ గల్పింపఁబడెను ప్రతివర్ణమున కనంతవిధ మొక యెఱువు పలువిధములు. బ్రాహ్మణజాతిలో ననేకవిధాంతర్జాతులు. బ్రాహ్మణులు గౌడులు ద్రావిడులని రెండు తెఱఁగులు-గౌడులు పంచవిధములు-ద్రావిడులుం బంచవిధములు ఈ తేవిధములలో నొక్కొక్కవిధమునందు లెక్కింప నలవికాని యన్నివిధములు మఱి యెందఱు మనుష్యులో మనుష్యునకొక్కొక్కజాతి యొకొక్క మనుష్యునకుం బ్రతిక్షణ మొక్కజాతి, కాఁబట్టి కులమునకై గ్రుద్దులాడక శాస్త్రీయమా యశాస్త్రీయమా యని వ్యర్థవాదము లొనరించక తనతోడిపాటిజనులు సమ్మతించిన జాతినీతు ●తిక్రమింపక సర్వజన సమ్మతముగా దేశకాల పాత్రానుసారముగా జనరంజకముగాఁ బల్కుచు నటించుటయే మనుష్యునకవశ్య కర్తవ్యము.

## మార్గదేశిప్రణయము

మధ్యస్థాయికిఁ గ్రిందుమీఁదుల ననుదాత్తోదాత్తములస్వల్ప స్వరవిశేషములకు వ్యవస్థయే లేదు. కాఁబట్టి యొకొక్కని సంగీత మొకొక్క విధము. పల్కుట పాడుట నటించు ప్రతిమనుష్యునకు వేఱువేఱుగా నుండును. కాఁబట్టి రాగమునకుఁ దాళములకు స్వరములకు శ్రుతులకు లయగతుల కొక్క నామరూపములు నిశ్చయింప నలవికాదు బ్రతికిన దూఱు; మాసినది మందు కంటి కింపైనది సొగసు, చెవికింపైనది పాట; నల్వురు సమ్మతించినది మాట; కావునం జనరంజకమగు చతుర్విధాభినయ ప్రయోగము సకల వేదశాస్త్ర సమ్మతమునయియు జనులందుఁ బరస్పరమైత్రి నలరించువిధమున నిజకుల జాతిమర్యాదల స్నవరించుకొని దేశకాల పాత్రానుసారముగా వ్యవహరించుటయే సద్బుద్ధి లక్షణము, మార్గిదేశియని నోటిపల్కు, శరీరావయవ చాలనము, వేషము, భావప్రకటనమునను చతుర్విధాభినయములును ప్రత్యేకము రెండువిధములు. మార్గియను చతుర్విధాభినయాత్మక సంగీతము మంత్రబ్రాహ్మణాత్మక వేదమువలె నపౌరుషేయము, కేవల బ్రహ్మసృష్టమును మఱి యతీంద్రియ భరతాది మునీంద్రప్రయోగసాధ్యము కాఁబట్టి గాంధారగ్రామమువలె మార్గి సంగీతమునకు భూలోకమునందు వ్యవహారము లేనే లేదు. వాచి-కాంగి-కాహార్య-సాత్త్వికాభినయాత్మకమగు దేశీసంగీతమునకు మాత్రమే భూమియందు ప్రయోగప్రచారము కలదు. మంత్రబ్రాహ్మణాత్మక వేదమునకు వలె మార్గిసంగీతమున కనాది సంప్రదాయసిద్ధములగు నియమములు కలవు. మున్యుపదిష్టమార్గనియమముల ననుసరించి స్వరకాలస్థానప్రయత్న విశేషముల న్వేదము పఠించకపోయినను విధ్యుక్తమార్గమున శ్రౌతకర్మము నడింపించకపోయినను మనుష్యుకు స్వర్గఫలము రాదు సరేకదా స్మృతి యీలోకమున హాసకూడఁ

దప్పక కలుగును. వేదములు పఠించుటకును శ్రౌతకర్మము నాచరించుటకును సర్వజ్ఞులగు మునులు తప్పఁ గించిజ్ఞులగు మనుష్యు లెంతమాత్రమును బనికిరారు పనికిరారు. కావుననే మంత్రబ్రాహ్మణాత్మకమగు వేదము లుచ్చరించుటకుఁ గాని విధ్యుక్తముగా వేదచోదిత శ్రౌతకర్మమును నడిపించుటకుఁ గాని మనుష్యులు పనికిరారని నిశ్చయించియే ఋగ్యజుస్సామాథర్వవేదముల నుండి వాచికాంగికాహార్యసాత్త్వికాభినయాత్మక గాంధర్వవేదమును బంచజనులగు మనుష్యు లుభయలోకములం దరించుటకై "తస్మాద్విద్వాన్ ప్రేవవదేత్ -వీవన్నృత్యేత్" అను శ్రుతింబట్టి మునులకై మార్గసంగీతమును సంసారుల కొఱకు దేశిసంగీతము ననాదికాలము నుండియు నీశ్వరసృష్టములై వెలయుచున్నవి. కాఁబట్టి దేశిసంగీతమునకుఁ గావలసిన ముఖ్యలక్షణము దేశకాల పాత్రానుసారముగా జనరంజక మగుటయే. కాఁబట్టి దేశభాషలకుఁ గాని పాటలకుఁగాని ఘనతతసుషిరానద్ధాత్మక చతుర్విధవాద్యమునకుఁ గాని నృత్యమునకుఁ గాని మఱెట్టి మనోవాక్కాయ కర్మములకుఁ గాని లోకరంజనము కావించుటకన్న వేఱే శాస్త్రీయనియము మెద్దియు ననవసరము. ముమ్మాటికిం బనికిరాదు, పనికిరాదు, పనికేరాదు. నాది శాస్త్రీయమైన పనియితరులది కాదు నాది శ్రేష్ఠమైన కులము నాది వేదచోదితకర్మ మితరులది కాదు, కాదని, యొరుల న్నిరసించి తన కులగుణజాతి మర్యాదలుతన తోడిపాటివారి కున్న కులగుణజాతి మర్యాదలకన్న శ్రేష్ఠములని చెప్పుకొను మనుష్యుఁడు నిక్కముగా దుర్జనుఁడుగాని వాస్తవముగా సజ్జనుఁ డెంతమాత్రము న్గానేకాఁడు. సజ్జనుఁడు తనతోడిపాటి జనుల చెంత మిక్కిలి యడఁకువయును వినయవిధేయతల నగపర్చి వారి ప్రేమానురాగముల స్సంపాదించుకొనును. మఱి దుర్జనుఁడు తన తోటిపాటివారి కన్న తానేమో గొప్పఁవాడనని విఱ్ఱవీగుచుం డుటకు సకల జనులతో ద్వేషపడి యుభయలోకభ్రష్టుఁ డగును.

మార్గి సంగీత రూపమగు మంత్రబ్రాహ్మణాత్మక వేదాక్షరములు పదములు వాక్యములును యథోపదిష్టములును యథా శ్రుతములుగా నాంగికాభినయ మొనర్చుచు ననాది సంప్రదాయ సిద్ధములగు స్వరకాలస్థాన ప్రయత్న నియమములు తప్పక పఠింపవలెను, మఱియును శ్రౌతవిధి ప్రకార మాగ్న్యాధాది యాజక సప్తదశకముచితవేషముల నధ్వరక్రియా కలాపము స్స్వర్గ ఫలాప్తికై యథావిధిగా ననాది సంప్రదాయ పద్ధతు లతిక్రమింపక నడిచి నడిపింపక తీరదుగాని వ్యావహారిక దేశభాషతో వైదిక శబ్దముల కెంత మాత్రము స్సంబంధము లేని విధమున దేశకాలపాత్రోచితముగాఁ బ్రత్యహము నానావిధముల మాఱుచున్న దేశిసంగీతముతో మునుల చేత మాత్రము ప్రయోగింపఁ దగిన మార్గిసంగీతముతో నొక్కింతయు స్సంబంధము లేనే లేదు "ప్రకృత మను సరామః పాయసం భక్షయామః" అను తీరున ప్రస్తుతము తనతోడిపాటి వారల కెట్లు రంజనమగునో యాత్రోవ ననుసరించుట కన్న దేశి సంగీతమునకు మఱి వేఱే నియమమే యవసరములేదు. వర్తమానజనులను రంజింపఁ జేయుటకై పూర్వకాల నియమములం దప్పి క్రొత్త క్రొత్త వింత త్రోవలను ద్రొక్కుట దేశి సంగీతమున కొకభూషణమే కానిదూషణ మెంత మాత్రము గ్గానే కాదు. సభ కొలంది నభినయించి యా సభను రంజింపఁ జేయవలసినది. పండితులకుఁ దగిన రీతిగా వార లెట్లు రంజిల్లెదరో యట్టి నియమములుం బద్ధతుల ననుసరించి చతుర్విధాభినయములం బ్రయోగించవలెను. రాజుగారు విచ్చేయుచున్నారని మోడ్పు చేతులతో భయభక్తి విశ్వాసములం జెంగటి ప్రాజ్ఞులతోఁ బల్కవలెను. పోండి పోండి దూరముగా దబ్బునఁ బోండని రాజుగారివై పగదర్చి పామరుల న్నెదిరించవలెను. సంస్కృతభాష నెఱింగిన వారితో సంస్కృతమును దేశభాషచే రంజిల్లువారికి దేశభాషను

బూర్వ నియమిత పద్ధతుల కుల్లసిల్లువారి కట్టి నియమముతోను మతేనియమము లెఱుంగనివా రెట్లు సంతోషించెదరో యాతీరుగా నభినయించవలెను. "ఆచార్యాః సమ మిచ్ఛంతి । పదచ్ఛేదంతు పండితాః । స్త్రియో మాధుర్య మిచ్ఛన్తి విక్రుష్ట మితరే జనాః" అని నారదర్షి పలికినట్లు తనతోడిపాటి జనులలో నెవ్వరి కెట్లు రుచ్యమగునో యా తెన్నెఱింగి యింగితజ్ఞుఁడై నామరూప ప్రకటనము కావించవలయును. దేశభాషలకుఁగాని దేశి సంగీతమునకుఁగాని మంత్ర బ్రాహ్మణాత్మక వేదమువలెఁ గాని శ్రౌత కర్మమునకువలెఁ గాని యే నియమములం బాటింపనక్కఱలేదు. నానావిధ దేశభాషలు మాట్లాడుకొను కోట్లకొలంది జనులందఱి న్సామాన్యముగా నిహపరమార్గముల నోధించుటకై స్వరకాలస్థాన ప్రయత్నోచ్చారణ నియమములతో ననాదిగా నేర్పర్చఁబడిన భాష సంస్కృత భాషయన పేర్కొనఁబడును. మొత్తముపై నూఱు వివిధ దేశభాషల న్మాటాడుకొను పెక్కు జనపదముల జనులందఱ్ఱి కానూఱుభాషలను శుద్ధికావించి వ్యవహారముం బరమార్థము గూడ బోధించు విధమైన నొక సంస్కృతభాష యనాది సంప్రదాయసిద్ధముగా నేర్పడియున్నది. నవ ద్వీపాత్మకమయిన భారతవర్షమందు నవవ్యాకరణములచే సంస్కృతములయిన తొమ్మిది సంస్కృతభాషలు దేవనాగర్యాది సంజ్ఞలన్వలయు తొమ్మిది లిపులచేత గ్రంథములందుమాత్రమే ప్రకటింపఁబడియున్నవి. ఆచార్యులుం బండితులు కూడ గమతమ యూహలం బూర్వనియమములు తప్పక గ్రంథములు కావించెదరు. మంత్ర బ్రాహ్మణాత్మక వేదశబ్దమునకు వలె సంస్కృతభాషలకుఁ గూడఁ బ్రాచీన సంప్రదాయసిద్ధములగు పద్ధతులతోఁ బఠనపాఠన గ్రంథ రచనావిశేష నియమములు శిక్షావ్యాకరణచ్ఛన్దోజ్యోతిషకల్పనిరుక్త విధులనియును సంస్కృతభాషకు సర్వసాధారణ లోక వ్యవహార

సంగ్రహార్థమై కులమర్యాదలవలె ననుసరింపక తీఱదు గాని తత్సమ
తద్భవదేశ్యగ్రామ్యాపభ్రంశము లనం బడు దేశభాషలన్నియు దేశ
కాలపాత్రానుసారముగాఁ బ్రతి దశకమున న్మాఱక తీరదు. దేశ
భాషలకుఁ బ్రస్తుత లోకరంజనమునకు విరుద్ధమగు పూర్వ నియత
పద్ధతు లెవ్వియు న్గూడదు కూడదు. దేశాచారములందు దేశభాష
లందును బ్రాఁత పద్ధతులు జనసామాన్యముగాఁ గొంత కాలమునకు
వెగటులగును. మఱి క్రొత్త వింత యాచారములును బద్ధతులుం దల
చూపి జనుల నుల్లాసపఱ్చును. వర్తమానకాలమందలి జనులందఱికి
న్సామాన్యముగానే వేషభాషలు రుచించునో యావిధముగా "వస్త్రేణ
వపుషా వాచా విద్యయా విభవేనచ" అను తీరునఁ బ్రస్తుతకాలము
నందు దనతోడిపాటిజనుల యభిరుచి ననుసరించి దేశ భాషలను
దేశి సంగీతమును బ్రయోగించి బుద్ధిమంతుఁ డొరుల నుల్లసింపఁ జేసి
యొరుల వలన నాదరింపఁ బడుచున్నాఁడు, "ఊరందరి దొకత్రోవ
యుల్లిపిచ్చుక దొకత్రోవ" అను సామెతగా వర్తమానకాలో
చిత వేష భాషల న్మానుకొని తా నొక్కఁడే శ్రేష్ఠుఁడు ననుకొని
పిచ్చిపట్టుదలతోఁ దెలిసీ తెలియక పూర్వాచారముల ననుసరించి జన
విద్వేషమును గొనితెచ్చిపెట్టుకొను వైదికమ్మన్యుఁ డిహపరములకు
రెండింటికిం జెడక మానఁడు మానఁడు.

"దారు వీణా గాత్ర వీణా ద్వేవీణే గానజాతిషు । సామికీగాత్ర
వీణాతు తస్యాః శ్రుణుత లక్షణమ్" అనుటచేత కేవల వర్ణాత్మక
శబ్దవిశేషములగు వేదవేదాంగ ద్వ్యష్టాదశ విద్యలయొక్క పఠన
పాఠనములకై మాత్రమే గాత్ర వీణయని పిల్వఁబడిన మనుష్య కంఠ
ధ్వని నుపయోగించవలసినది. దారు వీణ యనఁగా కఱ్ఱతంత్రులు

మొదలగు నచేతనములగు కృత్రిమ యంత్రములచేత వర్ణాత్మకము లగు పదవాక్యము స్పష్టముగా నర్థము భావము రసమును బ్రచు రించున ట్లుచ్చరింపఁ బడనేరవు కాఁబట్టి ఘనసుషి రానద్ధ తతనాద్య రూపకములగు యంత్రములు కంఠధ్వని ననుకరించుటకై మాత్రమే కృత్రిమరూపముల నేర్పర్చఁబడినవి గీతానుకారి వాద్యమును వాద్యానుకారి నృత్యము- కంఠధ్వని ననుసరించి చతుర్విధవాద్యము లుండవలసినది. వాద్యము ననుసరించి నృత్యము జరుగవలసినది. "సామికీగాత్రవీణా" అని యనుటచేత వర్ణాత్మకమై సుప్తిఙంతముల చేతఁబొడమిన "రామః" అను మొదలగు పదములను మఱి యట్టి నామాఖ్యాత పదములచే నిర్మింపఁబడిన వాక్యములను బ్రస్ఫుట ముగా నర్థము న్భావమును రసమును వెల్లడింపఁగలిగినది కంఠధ్వని స్వరూపకమగు గాత్రవీణ యొక్కటియే వీణ యనఁగా షడ్జాది స్వర మయమగు స్వరమండలి న్వెల్లడింపఁగలిగిన యుపాధివిశేషము "నవనవరసోన్మేష శాలినీ ప్రతిభా" యనునట్లు స్వరస్థానకాల ప్రయత్న విశేషములతో రసానుకూలముగాఁ దెలువు శ్రుతిలయల న్సంపూర్ణముగాఁ బ్రకటించుంశక్తి వాస్తవముగా దైవసృష్టమగు గాత్రవీణకే చెల్లును కృత్రిమ యంత్రమగు దారువీణ కేవలము న్గాత్రవీణ ననుకరించుటకై మాత్రమే యుపయోగించు నప్పుడేగాని స్వతంత్రముగా వర్ణాత్మక వాఙ్మయప్రయోగమున కెంత మాత్రముం బనికిరాదు. "అతోగీతం ప్రధానత్వాత్" అని గీతవాద్య నృత్య లయలను నాల్గింటి మొత్తమైన సంగీతమును గూర్చి చెప్పిన శాస్త్రమందు సంగీతమందలి ప్రాముఖ్యమైన గాత్రవీణా విశేషమే మొట్టమొదట వివరింపఁబడెను. కాలు లేనివానికి మఱగాలువలె గాత్ర ముపయోగింపఁ జాలనివాఁడు జంత్ర ముపయోగించుకొనును. న్వాయముగా నోటిమాటల నన యూహాం తెలుప నవకాశమ్ము

లేనపుడు వ్రాంత మొదలగు సంజ్ఞ లుపయోగించుకొనునట్లు గాత్రవీణ యుపయోగింపఁ జాలనపుడు యంత్రవీణ నుపయోగించుకొనును "వీణ శబ్దే" అనుటచేత ధ్వనిచేయు వస్తువు వీణ యనిపించుకొనును. మొత్తముపై నామరూపములచేత నూహ ప్రకటించు పదార్థవిశేష మంతయును వీణియయే. సర్వజగముం జతుర్విధాభినయాత్మకమే, కను నిజ్జగమంతయును చేతనాత్మక గాత్రవీణయును జడాత్మకదార వీణయునుగా గాత్రవీణా దారువీణోభయ వీణాత్మకమైన ప్రపంచమై మహానటుఁడు శివుని లీలాతాండవాత్మకమై, త్రిగుణాత్మకమై నవరస మయమయి యానందమయమయి సృష్టిస్థితి లయముల నొప్పారు చున్నది.

## వేదశాస్త్ర ప్రమాణబుద్ధి

షడ్జస్వర ముచ్చరించి యంతకంటె హెచ్చుస్థాయిగా ఋషభ స్వరమును బల్కునపుడుగాని లేక తగ్గుగా నిషాదస్వర ముచ్చరించు నపుడు గాని ముందుకు హెచ్చుగాఁగాని వెనుకకుఁ దగ్గుగాఁగాని కప్పవలెఁ దాఁటఁగూడదు. పామువలె వెనుకకుఁగాని ముందుకుఁగాని ప్రాఁకవలయు ననఁగా స్వరమునుండి స్వరమునకు హెచ్చునపుడుగాని తగ్గునపు డెగబ్రాఁకుటగాని జారుటగాని శాస్త్రసంప్రదాయ సిద్ధము వెనుకకుఁగాని ముందునకుఁగానియుదాత్తానుదాత్త శ్రుతులం బ్రకటించు నపుడు కప్పదాఁటులు వేసినవు డాస్వర మంత శ్రవణ రంజకము కానేరదని నారదముని మతము. ఉదాత్తము - అనుదాత్తము - స్వరితము - ప్రచితము - నిఘాతము - ఈయైదును హెచ్చుతగ్గులుగా స్వరము నుచ్చరించు విధులు. ఉదాత్తస్వరితములు దీప్తియను సంజ్ఞగల జాతిచే నుచ్చరింపవలయును. అనుదాత్త ప్రచిత నిఘాతములు మృదు జాతి నుచ్చరింపవలయును. దీప్తియను జాతి స్వరోచ్చారణమునందు

మృదుజాతి కోమలస్వరోచ్చారణమందు నుపయోగింపవలసినది. వేదములం బఠించునపుడు మార్గసంగీతమును మాత్రమే యథా శాస్త్రసంప్రదాయ పద్ధతుల ననుసరించి స్వరమండలి నుపయోగించి నియతముగా నాంగికాభినయము చేయవలసినది. దేశిసంగీత మటంగా గీతవాద్య నృత్య లయలను దేశకాల పాత్రోచితముగా జనరంజనము గావించుటకన్న మతేవిధమయిన శాస్త్రసంప్రదాయ పద్ధతులతో నెంతమాత్ర మవసరము లేనేలేదు.

ఋగ్యజుస్సామాథర్వవేదముల కొఱకై మాత్రమే శిక్షా వ్యాకరణ చ్ఛందోజ్యోతిష నిరుక్త కల్పములను వేదాంగ పద్ధతు లుపయోగించవలసినది. వ్యావహారికములగు సంస్కృతాపభ్రంశ భాషావిశేషములను యథేష్టముగా జనరంజకముగాఁ బరస్పరాభి ప్రాయము స్పష్టముగా వెల్లడించుకొనుటకన్న మతేప్రాచీన మునికృత శాస్త్రనియమము లనుసరించినయెడల జనులకు మంచికిబదులు కీడు కాకమానదు. వేదములును వేదాంగములుం గేవల పరమార్థ సంపాదనమాత్ర ప్రయోజనములుగాని, లోకవ్యవహారమున కెంత మాత్రముం బనికిరాకుంటయేగాక, సాధన చతుష్టయ సంపన్నులు గాని ప్రాకృత జనులు వేదవేదాంగ నియమము లవలంబించినపు డుభయలోక భ్రష్టులు కాకతీరదు తీరదు. వేదవేదాంగవేత్తలగు మునులు లోకవ్యవహారమునకై యుభయలోక తారకములగు స్మృతుల ద్దేశకాల పాత్రోచితములుగా నుపదేశించిరి. మనుష్యుల కెంతమాత్రము స్సంబంధించవుకనుకనే వేదము లపౌరుషేయములని ప్రతిపాదింపఁబడినవి. మునులు దివ్యులుగాని పాంచభౌతికోపాధికలవా రెంతమాత్రము న్గానేకారు. మునులకు మాత్రమే వేదవేదాంగము లుద్దిష్టములయినవిగాని ప్రాకృతజనుల కెంతమాత్రము న్గానేకాదు. "శ్రుతేరివార్థం స్మృతి రన్వగచ్ఛత్" అనునట్లు వేదముల

యభిప్రాయము ననుసరించియే మునులు స్మృతులను లోకవ్యవహారము నడిపించుటకై కల్పించిరి. కాఁబట్టి లోకవ్యవహార సంగ్రహార్థమై దేశకాల పాత్రోచితముగా సర్వజనులకుం బరస్పరమైత్రి పుట్టించుటయే ముఖ్యప్రయోజనముగా సర్వజ్ఞులగు మునులు ప్రచురించిన స్మృతు లనుసరించి సంసారు లుభయలోకములం దరింపఁగలరు. "యజ్ఞేనస్వర్గమకురుత" సర్వలోకోపకారకమగు నహింసావ్రతముకన్న స్వర్గము సంపాదించుకొనఁ దగిన యజ్ఞకర్మ మింకెద్దియును లేదు. దైవభక్తిని బుట్టించి పరోపకారబుద్ధి నభివృద్ధికావించుటకై దేవతలకు విగ్రహములు కల్పించే దేవాలయములందుఁ బ్రతిష్ఠించినట్లు జనుల కందఱికిం బరస్పరానురాగముం బుట్టించి సకలజనులకు మనస్సంతుష్టి నభివృద్ధికావించుట కొఱకై "ఇషేత్వోర్జేత్వా" మొదలగు వేదవాక్యముల సర్వజ్ఞులుం బరమకారుణికులైన మునులు వెల్లడించిరి.

అవ్యక్తము న్నిత్యము కనుకనే యపౌరుషేయ మనంబడినది వేదశబ్దము. లోకమున జనులు వినుటకు సాధ్యమైన "ఇషేత్వోర్జేత్వా" మొదలగు వైదికశబ్దము దేవతకుఁ బ్రతికృతిగా నేర్పర్పఁబడిన విగ్రహమువలెఁ గృత్రిమపౌరుష కల్పితముగాని యపౌరుషేయము నిత్యము నెంతమాత్రము గానే కాదు. కాఁబట్టి లోకమందుచ్చరింపఁబడు వేదశబ్దము లన్నియును వ్యావహారికములగు సంస్కృతాపభ్రంశాది భాషలవలెఁ గృత్రిమములుం బౌరుషేయము లేగాని యపౌరుషేయముల న్నిత్యములు గానే కావు. వెయ్యేల, పరోపకారముగాఁ దన తోడిపాటి జనులకు సమ్మతముగా నడుచుకొనని మనుష్యుఁడు పఠించినవి శ్రుతిస్మృతులు కావు, లోకోపకారముగా నడువని కేవల కుక్షింభరుఁడు స్వార్థైకపరుఁడు వేదశాస్త్రముల న్దంభుఁడై

యుపదేశించుచు వంచకుఁడై జాతినీతులు కలవానివలెఁ దేనెపూసిన కత్తివలెఁ బయోముఖ విషకుంభమువలె గోముఖ వ్యాఘ్రమువలె లోకులకు హాని చేయుచున్నాఁడు లోకోపకారముగాఁ బ్రవర్తించు సర్వ భూతదయాపరునకు మాత్రము తప్ప మనుష్యులలో జాతినీతి మర్యాదలు మఱెవ్వనికి న్లేవు "కార్యాత్మికా వైఖరీ" కాఁబట్టి మనుష్యులు పఠించు వేదములు వైఖరీరూపములు కావున ననిత్యములుం గృత్రిమములుం బౌరుషేయములే. "ప్రయోగోత్పత్త్యశాస్త్రత్వాత్ శబ్దేషు నవ్యవస్థాస్యాత్" అనుపూర్వమీమాంసాసూత్రముం బట్టి శిక్షాదివేదషడంగపఠన నియమములు భస్మహోమములవలె వ్యర్థప్రలపితములు. కావున నవ్యక్త శబ్దస్వరూపములగు పరాపశ్యన్తీ మధ్యమశబ్దములే సాధువులుగాని నిక్కముగా వైఖరి వ్యర్థప్రలాపమే కావున వేదవేదాంగము లన్నియును బరమార్థసత్యములు కావు. కాఁబట్టి సకలజనరంజక మగు నామరూపప్రకటన మాత్ర మొనర్చుటయే బుద్ధిమంతుల లక్షణము. ఋగ్యజుస్సామత్రయీవిద్య కంటె భిన్నములగు వ్యాకరణాది బౌద్ధ సాంఖ్యయోగ పాంచరాత్ర పాశుపతవిద్య లన్నియును స్మృతులలోఁ జేరి యనిత్యములు వ్యావహారికములు బౌరు షేయములే యైయున్నవి. ఇతిహాసములు పురాణములు కూడ మను వసిష్ఠస్మృతులవలె స్మృతులలోఁ జేరినవే. వేదవిరుద్ధములు వేదాంగాది విద్యలలోఁ బ్రతిపాదింపఁబడిన యంశము లన్నియు ననాదరణీయములే. కాఁబట్టి వేదమందుఁ జెప్పఁబడని ప్రాయశ్చిత్తములు వైదికకర్మములం దాకస్మికములగు తుమ్ముట దగ్గుట మొదలగు నపవిత్రకార్యములకు విధించెడి ప్రాయశ్చిత్తములయి మడిమైలల విషయమై చెప్పెడు స్మృతులు జాత్యాచారములు విధించు స్మృతులు వర్ణాశ్రమధర్మములు విధించుస్మృతులు పాత్రాపాత్రములు విధించు స్మృతులు ప్రాయశ్చిత్త విధానము లన్నియును మొత్తముపై మంత్ర

బ్రాహ్మణాత్మక మగు వేదముతప్ప తక్కిన విద్యలన్నియు ననిత్యములుం బౌరుషేయములుం గనుక నట్టి శాస్త్రపద్ధతులలో వేద విరుద్ధములగు పద్ధతులన్నియు నాచరణీయ విధు లెంతమాత్రము న్గానే కావు. అనాది సంప్రదాయసిద్ధముగాఁ బఠనపాఠనముల న్మాఱక నేఁటి వఱకు వ్యవహరింపఁబడుచున్న మంత్రబ్రాహ్మణాత్మక వేదమునకు విరుద్ధములగు స్మృతిపురాణేతిహాసాదివిద్య లన్నియు ధర్మవిధ్యుక్తములు కానేకావు. "అనంతావై వేదాః" అనుటచేత వేదత్రయి యందు చెప్పఁబడని యాచారములు వర్తమానకాలమందు ఖిలములై కేవలమును స్మృతికర్తలగు మన్వాదిమునులకు మాత్రమే విదితములు కావున ఋగ్యజుస్సామంత్ర బ్రాహ్మణాత్మకములు ప్రస్తుతము వాఁడుకలో లేని వేదమూలము వేదాంగాదీతర విద్యాస్మృత్యుక్తము లని యవలంబింపఁ గూడదు కూడదు. జగత్సృష్టికి మూలమగు వేదము లోకముకంటె భిన్నము కాకున్నను సకలజనులుం బరస్పరానురాగమున నిహపరములం దరించు మార్గమును మాత్రమే బోధించు చోదనాలక్షణము మాత్రమే సకలజనావశ్య కర్తవ్యధర్మమని సిద్ధాంతీకరించక తీరదు.

పిక-నేను-తామరస-పీలు మొదలగు కొన్ని శబ్దములకు వేద మందలి యర్థమునకు వేఱుగా మ్లేచ్ఛభాషయం దర్థములు కలవు. కావున నిక్క మాలోచించి చూడఁగా ననాదికాలము నుండియును గొన్ని యంశముల న్గొంద ఱొకనిం బోలి మఱొక్కఁడున్నప్పటికిని గాలవశముచేత నెవనిమట్టుకు వాఁడు తక్కినవానికంటె భిన్నుఁడు కాకమానఁడు. కావుననే "శ్రుతయశ్చభిన్నాః స్మృతయశ్చభిన్నా మహాఋషీణాంమతయశ్చభిన్నాః" అనుటచేతఁ బ్రతి మనుష్యునిమతమునకుఁ దగునట్లు వేదశాస్త్రములున్నవి. వేదశాస్త్ర విరుద్ధమగు సృష్టియే లేదు. కాఁబట్టి లోకమందు జరిగెడు సమస్తక్రియలు వాస్తవముగా

వేదసమ్మతములే వేదవిరుద్ధవస్తువు లుండనేయుండవు. కాఁబట్టి పంచేంద్రియగ్రాహ్యములగు పదార్థము లన్నియును వాస్తవములే మఱియును వేదచోదితధర్మములే. వేదములందు చెప్పఁబడని పదార్థము లు లోకములో లేనేలేవు మఱియు లోకములో నున్న సంగతులన్నియు వేదములోఁ జెప్పఁబడినవే కాఁబట్టి లోకములోఁ దప్పు లేనేలేదు. "వేదాన్సంస్మార్య ధాతాయథాపూర్వమకల్పయత్" అనుటచేత నీ ప్రపంచమంతయుం జోదనాలక్షణ ధర్మస్వరూపమే కనుకనే "శునిచైవశ్వపాకేచపండితాః సమదర్శనః వాసుదేవః సర్వమితి సమహాత్మాసుదుర్లభః ఆత్మైవేదగ్ంసర్వమ్" అని తెలిసిన బుద్ధిమంతులు సర్వజననములై రాగద్వేషములు లేక జీవన్ముక్తులై బ్రహ్మానందాబ్ధి నోలలాడుచుందురు. "జ్ఞానలవ దుర్విదగ్ధం బ్రహ్మాపి నరం నరంజయతి' అను తీరునఁ దెలిసీతెలియని మనుష్యులకు మాత్రమే హేయాదేయ ద్వైతభేదజ్ఞానము బాధించు చుండును. కనుక నట్టి సంసారులకు మాత్రమే యీ యష్టాదశవిద్య లుపదేశింపఁబడినవి "నాద్వైతజ్ఞానవతః కర్మాణివిధీయన్తే" అను తీరున బుద్ధిమంతులకు బుద్ధిగఱపుట సూర్యునకు దివ్వె వెల్గు చూపుటవలె వ్యర్థశ్రమము కావున నీ యష్టాదశవిద్యలు భ్రమమోహహతులగు సంసారి జనులకు మాత్రమే యుదిష్టములు కావున "ఉష్ణముష్ణేన శీతలమ్" అను తీరుగాఁ గల్లలగు నష్టాదశవిద్యలుఁకల్ల జనులకు మాత్రమే నిక్కములగుచున్నవి. "మాయామాత్ర మిదం విశ్వమద్వైతం పరమార్థతః బ్రహ్మసత్యం జగన్మిథ్యా"అను తీరుగా నాత్మతత్త్వజ్ఞునకుఁ దనకంటె వేఱుగా జగమే తోఁచదుగనుక నట్టి జీవన్ముక్తునకు విధినిషేధశాస్త్రబోధ గగనారవింద వర్ణనమువలె వ్యర్థము, కావున మిథ్యయగు జగమునఁ దోఁచు వేదశాస్త్రములన్నియును మిథ్యలే యైనప్పటికి నగటె లగ్నిం బ్రజ్వరిల్లఁజేసి లోకోపకారకమగు వంటక

ములం బన్ని మఱి యా యగ్నితోనే రూపుమాసిన చందమున నీ యష్టాదశవిద్యలు జనులకుఁ బరమార్థబుద్ధి నిచ్చి యా జనుల యుపాధులతోనే తాముకూడ నశించుచుండునని తెలిసిన మునులు వేదశాస్త్రములు పరమార్థసంపాదన సాధనములుగా ననాదికాలము నుండియు నుపదేశించుచున్నారు. కాఁబట్టి యష్టాదశ విద్యారహస్యవేత్తలగు కోవిదులుమాత్రమే "పదార్థతత్త్వ జ్ఞానాన్నిఃశ్రేయసావాప్తిః"అను తీరున భక్తిజ్ఞాన వైరాగ్యములంది జీవన్ముక్తులగుచున్నారు. "ఆత్మావాఅరే జ్ఞాతవ్యోమన్తవ్యో నిదిధ్యాసితవ్యః" అను తీరుగా విద్యల నెఱిఁగి ధర్మమాచరించి లోకులం దరింపించి తాఁ దరించువాఁడే నిక్కముగాఁ బుట్టిన సార్థక్యము. కాఁబట్టి వ్యర్థవితర్కమున మిథ్యాదృష్టి వహించక సర్వసాధుజనోపకారక మగు ధర్మమార్గముం బోధించు వేదశాస్త్రాప్తవాక్య ప్రమాణైక శరణ్యులయిన జనులుమాత్రమే మనుష్యు లనందగినవారలై యొరులం దరింపించి తాము తరింతురు తరింతురు. సాధుజనోపకారకమగు పనియంతయును వేదశాస్త్రసమ్మతమే. మోచేతి కంకణమున కద్దమేలా యను సామెతగా సజ్జనసంతోషకరమగు పనికి వేదశాస్త్రప్రమాణ మరయ నేలా ? వేదశాస్త్రము లన్నియును సజ్జనరంజక క్రియారూపముగా మూర్తీభవించుచున్నవి. సర్వజనులకుం బరస్పర ప్రేమానురాగములం బుట్టించు విధమంతయు న్వేదశాస్త్రవిహితమే. జనుల కన్యోన్య ద్వేషమును బుట్టించు విధమంతయును వేదశాస్త్ర ధర్మవిరుద్ధమే.

మంత్రబ్రాహ్మణాత్మకశబ్దముతప్పఁ దక్కినవేదాంగషట్కాది సకల శబ్దములుం బౌరుషేయము లవైదికములు మ్లేచ్ఛితము లపభ్రంశ వ్యావహారికభాషాపదములే. దేవతలువిగ్రహముల న్దెలుపఁ బడినట్లు పరమార్థము ఇషేత్వాది వైదిక శబ్దముల న్మూర్తీభవింపఁ బడుటచేత మంత్ర బ్రాహ్మణాత్మక వేదభాషయుం గూడ లౌకిక

భావవలె నపభ్రంశమే. కావున వైఖరీ శబ్ద విధానమంతయు ననఁగా ఛందో భాషాత్మక వాఙ్మయ మంతయు ననిత్యముం బౌరుషేయముం దుచ్ఛము స్మృత్యమేకాని నిక్కముగా నపౌరుషేయ మెంతమాత్రము న్గానేకాదు. ఆకాశము దిక్కాలం బృధివ్యప్తేజో వాయ్వాత్మక సమస్తవవుస్తువులం దంతట నంతర్బహిఃపూర్ణమై మఱి సర్వలోకముల కాధారమయ్యు నతీంద్రియమై యనిర్దిష్టమై యున్న తీరున నాద బ్రహ్మము సర్వజగదంతర్బహిఃపూర్ణమై సర్వచ్ఛందోభాషావాఙ్మ యమున కంతకు నాధార మైనప్పటికిం ద్రయాతీతమై యనిర్దిష్టమై నిత్యమై సత్యమై దివ్యమై యపౌరుషేయమై సర్వజనాపరోక్షాను భూతమై విష్ణుస్వరూపమై దిగ్దేశకాలానవచ్ఛిన్న స్వయం ప్రకాశమై వెలయుచున్నది. కాఁబట్టి యాకాశమే సర్వజన ప్రత్యక్ష దేవుఁడు, దేవుఁడు. భావనం బట్టి జగ మంతట నాకసమే నిండియున్నప్పటికి జగమునుండి యాకసమును వేఱుచేసి యగపర్చ వీలులేనట్లు నాద బ్రహ్మమే జగమంతట నిండియున్నప్పటికిం దచ్ఛబ్ద వాచ్యమగు నప్పర మాత్మను జగమునుండి వేఱుచేసి చూపింప శక్యముకాదు. కావున వాఙ్మయ మంతయును వేదమే యైనప్పటి కిద్ది వైదిక శబ్దమని నిర్దే శింప నలవికాదు. కాఁబట్టి యే యే దేశ జను లేయే శబ్దములను వేదములని భావించుకొనుచున్నారో వారివారి కా శబ్దములే క్రింది మీఁదులు కుడి యెడమలు ముందు వెనుకలుగాఁ దోఁచుదిక్కులవలెఁ దోఁచుచున్నవి. "చోదనా లక్షణోధర్మః" అను సూత్రమందలి చోదనమను పదమునకు వేద విహిత కర్మ మర్థము. మొత్తముపై వేదమనఁగా యథార్థ వస్తు బోధక జ్ఞానమగు ప్రమితి "ప్రమితి విష యాః పదార్థాః" అనుటచేత వివేకమువల్ల సత్యాసత్య వస్తుజ్ఞానము కలిగి మనుష్యులు సకల లోకోపకారకమగు సత్కర్మము నాచరించి తాము తరించి తమతోడిపాటి జనుల నిహపరంబులం ధరింపఁ జేయఁ

గలరు. మఱియుం బరమార్థముం బోధించు వాచికాంగికాహార్య సాత్త్వికాభినయ చతుష్టయమే ఋగ్యజుస్సామాథర్వణ వేద చతుష్టయమని తేలిన ఫలితార్థము. వాచికాభినయ స్వరూపమే స్వరకాల స్థాన ప్రయత్న జన్య వైఖరీ శబ్దమంతయును, శ్రుతి స్మృతి పురాణేతిహాస కావ్యాది వాఙ్మయ మంతయు నై యున్నదని సిద్ధాంతీకరింపవలయును వలయును. "అర్థస్తు విధిశేషత్వాద్యథాలోకే" అను పూర్వమీమాంసా సూత్రమును బట్టియు "యథాలోక స్తథా వేదః" అను నార్యోక్తిం బట్టియు లోకములో నాడుకొనుచున్న భాషా ప్రపంచమంతయును మఱి లోకములో నున్న మనుష్యుల నడువళ్ళన్నియును వేదములో నున్నవియే, మఱియుం బురాణోక్తములగు సప్తకోటి మహామంత్రములు స్మృతి యా మంత్రములం బట్టి పుట్టిన యపరిమిత సంఖ్యాకములగు నుపమంత్రములును ననుసరించియే భూతభవిష్యద్వర్తమానకాల మనుష్యుల యాచారములు ప్రవర్తిల్లుచుండును గావున లోకములో నందఱు మనుష్యు లాస్తికులే గాని నాస్తికు లెవ్వరు న్లేరు తమ తమ మతముల సరిపడని వార లొకరి నొకరు కిట్టక నాస్తికులనియుం బాషండులనియు న్నిందించుకొనుచున్నారు గాని వాస్తవముగా భగవంతుని సృష్టిలోఁ జేఱినవారందఱు న్భాగవతులే "హరిమయము కాని వస్తువు పరమాణువు లేదు" అను భాగవతోక్తిం బట్టి లోకమంతయును వేదోక్తమే మఱియుఁ జనుల యాచారము లన్నియు వేద విధ్యుక్తధర్మములే మఱియును వేదమందుఁ జెప్పఁబడనివియు మఱియు దైవకల్పితములు కానియవియును లోకమందే కర్మలయినను బ్రవర్తిల్లనే ప్రవర్తిల్లవు కాఁబట్టి "వాసుదేవః సర్వమితి సమహాత్మా సుదుర్లభః" అను తీరున మంచివారికి లోకమంతయును మంచిగానే తోఁచును. "సంశయాత్మా వినశ్యతి" అనునట్లు ఇదాయదాయని వితర్కము కలవాఁడు నిశ్చయాత్మ కాఁడే నుభయలోక భ్రష్టు కాకమానఁడు, మానఁడు.

"శూర్పేణజుహోతి" దేవతలకు హవిస్సు చేటతో సమర్పించవలయును, హవిర్ముఖ్యకారణము చేట యనుటలో హవిస్సు వంటచేఁగలుగునుగాని చేటవలనఁ బుట్టదైనప్పటికి దేవతా హవిర్దానమునకుఁ జేట ముఖ్యసాధనముగా వేదము ప్రతిపాదించుచున్నది. వేదము ప్రభు సమ్మితము, వేద మెందు కిట్లు ప్రతిపాదించవలయుననిగాని వేదవిధి యసందర్భమనిగాని యనరాదు. వేదవిధిని తర్కింపరాదు. ప్రభునాజ్ఞానుసారము నడచుకొనవలయునుగాని ప్రభు వేల యిట్లాజ్ఞాపించెనని ప్రభునాజ్ఞ తర్కింపఁగూడదు. వేదచోదిత విధినిషేధములను సర్వజ్ఞులయిన మునులు జగదుపకారమునకై స్మృతిముఖమున వెల్లడించిరి. కావున "మహాజనో యేన గతఃసపంధా" అను తీరున మును లాచార్యులుం గేవల లోకోపకార పరాయణులు వేదవేదాంగవేత్తలగు పెద్దల యుపదేశము నమ్ముకొని నడుచుకొన్నజను లుభయ లోకములం దరించెదరు. ఆప్తోపదేశము నమ్మక స్వతంత్రించి యెంత తర్కించుకొన్న నెంతటి తెల్విగలవాఁడైనను శ్రేయోమార్గము నగఁ జాలక తప్పత్రోవంబడిచెడక మానఁడు. "అగ్నిర్మూర్ధా" అనుమంత్రము "మూర్ధాగ్ని" అని తలక్రిందు చేసినప్పటి కర్థము చెడకున్నట్లు మార్చి పఠింపరాదు యథాస్థితిగా మంత్రము పఠించినప్పుడే మంత్ర పఠనలాభ ముండును. మంత్రపదము లర్థము చెడదని తారుమారుగాఁ బఠింపఁగా లాభమునకు మాఱుగా నష్టము కలుగకతీరదు. కాఁబట్టి "వాక్యనియమాత్" అని ముని ప్రతిపాదించెను "అగ్నిదగ్నీన్విహర బర్హిస్తృణీతే" అను మంత్రమున కోయగ్నీధ్రుఁడా యగ్నులచెంత విహరించుచు బర్హిస్సుల నన్నఅపుమని యర్థ మీవిధి యాయగ్నీధ్రున కామంత్రము న్వినకముందే తెలిసినప్పటి కామంత్రము న్వినకతీరదిందువలన వేదార్థ విచారణ మనావశ్యకమనియును గేవల పఠనము మాత్రమే వేదమంత్రమునకు ముఖ్యప్రయోజనము. శబ్దజ్ఞానము

సంపాదించుకొనుటకై యర్థ మెఱుంగక కేవల వేదమంత్ర పఠనము కావించువాఁడు గంధపుచెక్కల నోమోయు గాడిదయని పెద్దలు శబ్ద జ్ఞానము లేనివానిని గర్హించిరి కాని వారి ముఖ్యాభిప్రాయము కేవల వేదమంత్ర పఠనము మాత్రమే ముఖ్య పుణ్యజనక హేతువనియే పండిత సిద్ధాంతము "అవిద్యమానవచనాత్" లేనివస్తువులం గూర్చి వేదము చెప్పుటచేత నగుఁగా "చత్వారి శృంగాత్రయో అస్య పాదాః" అనియును "ఓషధే త్రాయస్వ" అని యచేతన పదార్థము లను సంబోధించుట చేతను వేదమంత్రముల కర్థ మేద్దియును నిర్దేశింప వీలుకాదు కనుకఁ గేవలము వేదము లన్యథాకాక గురూపదేశముగాఁ బఠించుటచేత మాత్రమే యపూర్వ స్వర్గ ఫల మబ్బును గాని నిక్క ముగా వేదార్థము తెలిసికొనుటకుఁ గాని వేద మిట్లు విధించుచున్న దని శ్రౌత కర్మము లాచరించుటకుఁ గాని మనుష్యులు సమర్థులు కానే కారు. మేఘగర్జితమువలెఁ గేవల ధ్వన్యాత్మకమగు వేదశబ్దము నిక్క ముగా నే యర్థమును గాని మఱే కర్మమును గాని తెల్పనే తెల్పదు. మునులు లోకోపకారమునకై శిక్షా వ్యాకరణాది స్మృతి మూల మున వేదార్థమును మఱి వైదిక కర్మములను గల్పించిరని పండిత సిద్ధాంతము, "శ్యేనేనయతజేత పశునాయజేత" డేఁగను జంపిగాని పశు వును జంపిగాని యజ్ఞము చేయవలయు నని యర్థము చెప్పఁదగదు, మఱి యా రెండు మంత్రములు పఠించు వానికి మొదటి మంత్రము డేఁగవలె వాని శత్రువులం జంపుననియును రెండవ మంత్రము మేఁక మొదలగు పశువులవలెఁ బాలిచ్చి పోషించుననియు నభిప్రాయ మిచ్చు చున్నవి. కాఁబట్టి దృఢ ధారణోపాయముగా జ్ఞప్తి సాధనముగా మేధను నిల్పుకొనుటకై వాక్కులకు ప్రకృతి ప్రత్యయ విభాగమును బదచ్ఛేద పాదయతి ప్రాసశబ్దాలంకార నియమము నుదాత్తాది స్వర హ్రస్వాది కాలవ్యంజనాద్యక్షరాను నాసికాది ప్రయత్ననియమ

మును లోక వ్యవహారము నడుపుటకై ధర్మ సంగ్రహార్థమై పదార్థ తత్త్వబోధకై నిరుక్త జ్యోతిష కల్పములు కల్పితము లయినవి గాని వాస్తవము ఋగ్యజు స్సామవేద మంత్రములు సముద్రఘోషవంటి యొక యఖండ శబ్దము జగత్సృష్టితోనే సహజముగాఁ బొడమి యాకాశమువలె నిత్య నిర్వికారమై యనాదిసంప్రదాయముగా గురు పరం పరోప దిష్టమయి వచ్చుచున్నది. కాఁబట్టి మంత్రము పఠన మాత్రముచేతనే స్వర్గదాయకమగుచున్నది. శిక్షాది వేదాంగ షట్కము వేదత్రయీ దృఢ ధారణమునకై త్రోవయందు క్రోశాది దూరమును దెల్పు రాళ్ళవలెఁ బామర బోధకములుగాఁ గల్పితము లయిన గుఱుతులు, మంత్రము లెస్సగా ధారణమైన పిమ్మట భోజనమైన పిమ్మట విస్తరాకువలె వేదాంగ షట్కము నవలఁద్రోయవలసినదే, యథార్థజ్ఞాన మబ్బిన పిమ్మట సకల వేదశాస్త్ర విహితాచారములతోను మఱి సకల వర్ణాశ్రమాచార ధర్మములతో నిసుమంతయుం బ్రయోజనము లేదు కనుకనే "నాద్వైత వతః కర్మాణి విధీయన్తే" యను నాచార్యోక్తి ప్రవర్తిల్లెను. అపౌరుషేయ శబ్దమునకుఁ బౌరుషేయములగు శిక్షాది శాస్త్రము లెంతమాత్రము న్వివేచింపఁజాలవు చాలవు. తక్కిన మనుష్యులవలె శ్రోత్రియులు కూడ భ్రాంతులేకాని యథార్థ వేత్తలగు మునులు కానేరరు.

## సమతాస్థితి

"చోదనా లక్షణోధర్మః" అను వాక్యమునఁ జోదనాశబ్దమునకు స్వర్గ మర్థము మఱియు ధర్మ శబ్దమునకు స్వర్గమును బొందించు సాధన మర్థము. మఱియును స్వర్గ మనఁగా జననమరణాత్మక సంసార దుఃఖములేని స్థితి. అహంకార మమకారాత్మకమగు స్వార్థపరతయే సకల సంసారదుఃఖమునకు ముఖ్యకారణముకావునస్వార్థపరతయొక్క-

లేమియే స్వర్గస్వరూపము. అభీష్టఫలము సిద్ధించుటకై నకోర్కె-
భావన యనిపించుకొనును. శబ్దముల కన్నింటి కర్థము లన్నియును
భావనంబట్టియే వెల్లడింపఁబడు చున్నవి. కాఁబట్టి "యాదృశీభావనా
య్యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అను నట్లు తన భావనానుసారార్థముల
కనుగుణములగు పదములు మఱి తత్పదార్థానుసారముగా నభీష్టా
పూర్వ స్వర్గఫలమును మఱి శబ్దాత్మకవేదమును వివరించు వేదపదం
గములును కృత్రిమకల్పనములు జావునఁ బురుష ప్రయత్న కృత
ములే గాని పంచభూతములవలె సహజములు కావు కావున నహం
కార మమకారాత్మక సంసారమంతయును భ్రాంత భావనాజన్యమే
గాని నిత్యా పౌరుషేయ ప్రకృతి పురుషులవలె నెంత మాత్రము
స్సహజ సిద్ధము కానేకాదు. కనుకనే వేదశాస్త్రము లన్నియును
లోకవ్యవహార ధర్మసంగ్రహార్థమై మునులు పన్నినబన్నికలే కాఁబట్టి
యొరుల సుఖపెట్టినంగాని తనకు సుఖము దక్కదు గనుక దేశకాల
పాత్రాను సారముగా వాచికాంగికాహార్య, సాత్త్వికాభినయము
లొనర్చి లోకరంజనము కావించి హాయిగాఁ దన బ్రతుకు న్గొన
సాగించుకొను నుపాయములను శ్రుతిస్మృతి ముఖముల స్సర్వజ్ఞులగు
మునులు దేహధారుల కనాదికాలమునుండియు బోధింపఁ జొచ్చిరి.
కాఁబట్టి వేదశాస్త్రముల కవిరోధములగు తెన్నుల న్దన బుద్ధి నరసి
లోకరంజనము లగు చతుర్విధాభినయము లొనర్చు మనుష్యుని
జన్మము సార్థకము. అట్టిసర్వభూత దయాపరుఁడు సకలలోక రంజకుఁ
డగు మనుష్యుఁడే ముమ్మాటికిం కృతార్థుఁడు కృతార్థుఁడు.

"యాదృశీభావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అను విధమున
గాఢముగాఁ దలంచిన తలంపునుబట్టి జగత్కార్యము లన్నియును
జరుగుచుండును. నిక్కముగా మనోభావనమే నిఖిల జగద్రూపముగాఁ
బరిణమించుచున్నది. ఈ భావనము పశుభావనమనియు వీరభావన

మనియును దివ్యభావన మనియును మూఁడు విధములు. పశుభావన మనఁగా వేదశాస్త్రజ్ఞానము. వీరభావనమనఁగా ధర్మాచరణము. దివ్యభావమనఁగా నష్టైశ్వర్య సంపాదకయోగము. ఈ మూఁడు భావనలచేతను బుద్ధిమంతుఁడగు మనుష్యుఁడు ధర్మార్థ కామమోక్ష ములను చతుర్విధ పురుషార్థములను సంపాదించుకొని కృతార్థుఁ డగును. "గీతిషుసామాఖ్యా" అను పూర్వమీమాంసా సూత్రమును బట్టి నామరూపాత్మకజగత్క్రియారూప మంతయునుజతుర్విధాభినయా త్మక సంగీతరూపమైభగవత్సంతుష్టికై మంత్రరూపముగావినియోగపడు చున్నది. "గీతేనప్రీయతేదేవః" అను పురాణోక్తిచేత సర్వభూత సంతోషదాయకములగు నామరూపాత్మక చతుర్విధాభినయాత్మకము లైన వేదమంత్రము లన్నియును భగవత్ప్రీతికొఱకై సకలజనరంజక ములగు తీరున నామరూప విశేషము లన్నియును సజ్జను లుపయో గించెదరు. మును లందఱును సకల వేదశాస్త్రములను సర్వజనోప కారముకొఱకై యుపదేశించిరి. వేయేల, లోకోపకారపరాయణులగు సజ్జనుల త్రోవ కడ్డుతగులు క్రూరకర్మముల వేదశాస్త్రము లెంత మాత్రము నొప్పుకొనవనే బోధింపవు. జీవహింసను స్వార్థపరులగు ధూర్త జను లాచరించుచు "పశునాయజేత" అను మంత్రమున యజ్ఞమునకు జంతువులం జంపవలయునని శ్రుతుల కపార్థము చెప్పుచున్నారు. "జాతిః" అను సూత్రమునుబట్టి "అగ్నిః బ్రాహ్మణః" బ్రాహ్మణుఁ డగ్ని యన్నట్లు వేదశాస్త్రములందు జీవహింసను ప్రతిపాదించు శబ్దము లన్నియును గౌణము లర్థవాదమాత్రములే కాని నిశ్చయ ముగా వాస్తవములు కానేకావు. అపూర్వము న ననుభూతమగు పదార్థమును భావించుటయే లేటస్థించదు కాఁబట్టి యపూర్వమగు స్వర్గమును "స్వర్గకామోయజేత" అనునప్పుడు స్వర్గమనఁగా సంసార సౌఖ్యమే కాని యలౌకిక మననుభూతమగు గగనారవింద ప్రాయమగు

ధూ ర్తజనకల్పిత పరలోకసౌఖ్యము కానేకాదు. గతజన్మములు భావి జన్మములు స్వర్గనరకములు దేవతలకు విగ్రహములవలె లోకోప కారక కర్మములను హెచ్చరించుటకై మాత్రమే పామరబోధకై మునులు వేదశాస్త్రములం బ్రతిపాదించిరి. వాస్తవముగా "మన ఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అను రీతిగా మనో భావనముకన్న వాస్తవమగు పదార్థము ముమ్మాటికిని లేనే లేదు. నామరూపాత్మక జగమంతయును సచ్చిదానందలక్షణ పరబ్రహ్మ మును నిక్కముగా మనోభావనాత్మకమే. అపూర్వఫలమగు స్వర్గ లాభమునకై మంత్రపఠనమాత్రమే ముఖ్యము. యజ్ఞాది శ్రౌతకర్మము గౌణముగాని నిక్కముగా భోజనమునకుఁ బరిషేచనమువలె నావ చారికముగాని యవశ్యకర్తవ్య మెంతమాత్రము న్గాదు. నాద బ్రహ్మముయొక్క ప్రతిఫలము మంత్రబ్రాహ్మణాత్మ వేదము కనుక నిక్కముగా వేదశబ్దములు పౌరుషేయము లనిత్యములు నీడలవలెఁ జీకటివలె మిథ్యలుగాని యెంతమాత్రము న్వాస్తవములు కావు.

ఛందోబద్ధము ఋక్కు కేవల వచనరూపము యజుస్సు గీతి రూపము సామమని వేదములు ముత్త్రివిధములుగా విభజింపఁబడినవి కాని నిక్కముగా ఋగ్యజు స్సామ మంత్రములు మూఁడును శ్రవ్యశబ్ద ములుం దేవతా ప్రీతికై యుద్దిష్టములు కావున సంగీతాంతర్భూత ములే. సంగీత మనఁగా శ్రోతృజన చిత్తరంజకమే కాని నిక్కముగా త్రికరణ క్లేశకారణ శ్రౌతకర్మ చోదక నామరూప విశేష మెంత మాత్రము న్గాదు. కాఁబట్టి జగ దుపకారకములగు సత్య దయా శౌచముల కడ్డము లగు పశుహింసాది క్రూరకర్మములను విధించు శ్రౌత కర్మము సర్వజ్ఞులగు మునుల కేమాత్రమేని స్వర్తింపఁ బడఁ దగినది సంసారుల కెంత మాత్రము న్దగదు తగదు. "అహింసా పరమో ధర్మః" అను లోకోపకారక మగు స్వార్థత్యాగముచేతఁ

ప్రజానురాగమును సంపాదించుకొని యిహపరములం దరించు సాధనముగా మునులచేత వేదత్రయి కల్పింపఁబడెను. కనుక వేద మపౌరుషేయమనియు నిత్యమనియుం బ్రహ్మాత్మకమనియును జెప్పెడి శ్రుతిస్మృతు లన్నియు నర్థవాదములుగాని యథార్థములుకావు. శిక్షానుసారముగా వేద మభ్యసించువాఁడు స్వార్థపరుఁడై జనులను బాధించు సంసారమునకు దవ్వగును గావున సకలజనరంజక సంగీతాత్మక వేదనాదబ్రహ్మోపాసన మావశ్యకర్తవ్యమని మునులచేఁ బ్రతిపాదింపఁబడెను. నాదబ్రహ్మ తన్మయుఁడగువాఁ డొడలు మఱచి పాడుచాడుచుండునుగనుక స్వార్థపరతచేతఁ గూడుగుడ్డలకొఱకుగాని మఱి యితర భోగములకైకాని యొరుల న్బాధింపనేరఁడు కావున "గీతస్ప్రీయుతే దేవ" అను విధముగా నాదబ్రహ్మోపాసకుఁడు లోకరంజకుఁడై లోకమయుఁడైన దేవునియొక్క యనుగ్రహమునకుఁ బాత్రుఁడై పరమభాగవతుఁడై యిహపరములం దరించును దరించును.

"శబ్దాన్తరే కర్మభేదః కృతానుబద్ధిత్వాత్" అనుటచేత యజతి-దదాతి- జుహోతి యను కర్మరూపములగు నీమూఁడు భావనలందు స్వార్థత్యాగమే విధింపఁబడుచున్నది. కనుక వేద మను భావన గుఱ్ఱమెక్కి సంసారాటవి ద్దాఁటవలయును. "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అనుటఁబట్టి స్వార్థత్యాగముచేఁ జిత్తశుద్ధి కావించుకొని కేవల లోకోపకారకములగు సత్యాదయలనే సంతతమును భావించుకొనుటయే పరమభాగవత ధర్మము. జీవహింస చేయుటయే సంసారము. స్వార్థత్యాగమే మోక్షము "త్యాగేనైకే అమృతత్వమానశుః" అనుటచేత సకల లోకానుగ్రహ సంపాదన హేతువగు స్వార్థత్యాగమును హెచ్చరించు వేదనాదబ్రహ్మోపాసనమే పరమభాగవత ధర్మము. పరమభాగవత ధర్మమగు పరోప

కారక ప్రవర్తనముం దెల్పు నామరూపాత్మక క్రియలన్నియును వేద స్వరూపములే. సకల జనానురాగమును సంపాదించుకొనుటకన్న స్వర్గము మఱివేఱేలేదు. పెక్కేలా- స్థూలసూక్ష్మరూపమగు నీజగముకన్న వేఱేపదార్థ మెద్దియు నైనలేదు. ఈజగత్తుయొక్క సూక్ష్మకారణ స్థితియే దైవము స్వర్గమును యథార్థముం బరమార్థమునువాస్తవమును మఱియు నీస్థూలజగమే కార్యమునుమిథ్యయును ప్రతిఫలితమును విపరీతమును భ్రాంతికల్పితమును స్వార్థపర తాత్మక తృష్ణాప్రకోపిత సంసార క్లేశజనకమును గావునస్వార్థపరతమాని సకల జనోపకారముగా నడుచుకొని తనతోడిపాటి జనుల యనుగ్రహమును సంపాదించుకొనుటచేత సుఖముగా బ్రతుకు నుపాయమునే వేదశాస్త్రముఖముల న్సూక్ష్మదృష్టిగల భగవత్కవులయిన వ్యాసాదిమహర్షులు బోధించిరి. కాఁబట్టి వేదశాస్త్రములయొక్క ముఖసారము లోకోపకారక ప్రవర్తనము నభివృద్ధి కావించు సత్యాదయల ననుసరించి మనుష్యులు పరమభాగవతులై సకలజనరంజకులై యిహపరములం దరి చేరుటయే. వేదశాస్త్రములందు ప్రతిశబ్దమునఁ బ్రత్యక్షరమున ఫలితార్థము లోకోపకార మెఱిఁగించు సాధనవిశేషమే కావున వేద శాస్త్రములకు సకలజనరంజక క్రియ నొసఁగు నంశమునే ప్రతిపాదించు నర్థముకన్న నితరమగు నర్థము చెప్పువాఁ డెంతమాత్రముం బండితుఁడు కానేరఁడు ఇంత డొంకతిరుగుడేలా ? వేదము పౌరుషేయము కానీ లేక యపౌరుషేయము కానీ నిత్యముకాని లేక యనిత్యముకానీ ఖండవాక్యముకానీ లేక యఖండశబ్దముకానీ యర్థవంతముకానీ లేక డిత్థ డవిత్థాది శబ్దములట్లు కేవల ధ్వనిమాత్రమై యేయర్థమును సూచింపకపోనీ కారణము కానీ లేక కార్యముకానీ యెవ్విధముగా నేదేశవాసులచే నెట్లైన నుచ్చరింపఁబడనీ ఆదిమధ్యాంత కాలాతీతముకానీ లేక సృష్టిస్థితినాశముల జెందనీ వర్తమానకాలమందే

శబ్దసమూహము వేదమని యే యే దేశప్రజలచేత వ్యవహరింపఁబడు చున్నదో యట్టి శబ్దసమూహ మంతయును మొత్తముపై లోకోప కారాక ప్రవర్తనమును సకలభూతదయను సూనృతమును మఱి యిహపరలోక సంతరణోపాయమును దల్లిదండ్రులు పిల్లలకువలె మనుష్యుల కంపఱికి న్విహితమును మాత్రమే యుపదేశించు నభి ప్రాయ మిచ్చుచున్నదని బుద్ధిమంతులు తప్పక గ్రహింపవలయును. మఱియు ననాదికాలమునుండియును నానావిధ శాస్త్రరూపముగా భవిష్యజ్జనులకు భయసంతారక ధర్మమార్గమును నామరూపాత్మక ముగా విని కని నేర్చుకొనఁదగిన రీతిగా మునులనియు సర్వజ్ఞులనియు నతీంద్రియ ద్రష్టలగు ఋషులనియు న్మేటి కవిశిఖామణులనియుం బేర్కొనఁబడిన వివిధజనులు తమపిల్లలకు సహజప్రేమచేతఁ దెల్పిన మంచి యంతయును వర్తమానమున శాస్త్ర మనంబడుచున్నది. మఱెద్ది యెట్లున్నను వర్తమాన భావికాలోపయోగకరములు సకల లోకోపకారకములగు ప్రాచీన శాస్త్రపద్ధతుల నేర్చుకొని ప్రాచీనుల కంటెఁ గ్రొత్తక్రొత్త మార్గముల నగనిపెట్టఁ జాలిన బుద్ధిమంతులు లోకోపకారకములగు తీరుగా నానాశాస్త్రముల దేశకాల పాత్రోచి తములుగాసరిపెట్టుకొనుట ప్రస్తుతమున నవశ్యకర్తవ్యము కర్తవ్యము. వేదశాస్త్రములు గాలివంటివి - యేజనుఁ డెంతగాలిం బీల్చుకొని జీవించఁగలఁడో యాసంగతి వానికే తెలియును గనుక బ్రకృత కాలమునకుఁ దగినవిధముగా వేదశాస్త్రపద్ధతు లన్నియును స్వభావ ముగా వ్యవహరింపఁబడుచునే యున్నవి యూపిరి తీసికొనుట స్వభావ మయినట్లు తన కెద్ది సౌఖ్యకరమో యా మార్గమును వెదకుకొనుట ప్రతి జంతువునకును సహజ ధర్మమే. దేశకాల పాత్రానుసారముగా నేది యెట్లు జరుగవలయునో యట్లే జరుగుచుంట యంతయును వేద శాస్త్ర చోదితమే. భూత వర్తమాన భవిష్య జ్జగత్క్రియలన్నియును

వేదశాస్త్ర చోదితములే నిక్కముగా వేదశాస్త్ర విరుద్ధముగా నేపని
యును భూత భవిష్యద్వర్తమానకాలములందు జరుగనే జరుగదు.
కాఁబట్టి వేదశాస్త్రము లనఁగా సకల జగత్కార్యములకు న్గారణమగు
దైవమే.

"దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతుదైవతమ్ తన్మంత్రం
బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమదేవతా" అను శ్లోకమునందు
మంత్రమనఁగా యథార్థజ్ఞానము, యథార్థజ్ఞానము గల దేహి
బ్రాహ్మణ శబ్దవాచ్యుఁడు యథార్థజ్ఞానము గలిగిన ఫలము భూత
భవిష్యత్కాలచింత యొక్కింతయును లేకుంట "ఎప్పటి కెయ్యది
ప్రస్తుత మప్పటి కా మాటలాడి యన్యుల మనసుల్ నొప్పింపక తా
నొవ్వక తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు సుమతీ" అనునట్లు తన
సౌఖ్యముకై తన తోడిపాటిజనుల యనుగ్రహమునకుఁ బాత్రుఁడై
యొరులను సుఖపెట్టి తా సుఖపడు నుపాయము మంత్రమనఁబడు నట్టి
మంత్రోపాసనము చేయునట్టి సుమతియే బ్రాహ్మణుఁ డనంబడఁ
దగును తనతోడిపాటిజనుల యనుగ్రహమునకుఁ దాఁ బాత్రుఁ
డైనంగాని తన కోరినసుఖము లభించ నేరదని తెలిసికొనఁజాలని
జనుఁడే యబ్రాహ్మణుఁడైన కుమతి. అట్టి యజ్ఞానుల బ్రాహ్మణులు
తమ కెద్ది హితమో మఱెద్ది యహితమో యాసంగతి తెలిసికొన
సమర్థులు గాక పిల్ల కాయలవలె వ్యవహరించు జనులకై, తల్లిదండ్రుల
వలెఁ బ్రాచీన వేదశాస్త్రపద్ధతులు ప్రవర్తిల్లుచున్నవి. జీవితేచ్ఛ
యును దన కెద్దియో యథార్థము తెలిసిన దనుకొనుటయును యోగ
మునకు భంగకరము లగునని యోగశాస్త్రము చెప్పుచున్నది.
"యోగశ్చిత్తవృత్తి నిరోధః" అనఁగాఁ గడచిన సంగతిగాని రాబోవు
సంగతి గూర్చి గాని తలంచకుండ, అట్లు చిత్తవృత్తి నిరోధము
గావించుకొన సమర్థుఁడగు యోగి యెందున్నాఁడో యమ్మహాత్మునకే

మంత్రము స్వాధీనముగునట్టి యోగియే నిక్కువు బ్రాహ్మణుఁడు. తక్కిన జనులందఱును బిల్లకాయలవలె దమ మంచిచెడ్డలు తా మెఱుఁగని యబ్రాహ్మణు లనఁదగిన జ్ఞానలవదుర్విదగ్ధులే కావునసట్టి జనులకు "బాలానాం సుఖబోధాయ" అను తీరున నేర్పిన చొప్పున నడుచుకొను బుద్ధిమంతుల కిహాపరసంతరణోపాయమును బిల్లలకుఁ దల్లిదండ్రులవలె వేదశాస్త్రిముఖములం బ్రాచీను లనాదిసంప్రదాయ పారంపర్యముగా బోధించుచుంట లోకస్వభావము స్వభావము. ఈ పనివలన నేను సుఖపడినాను నీవుకూడ నిట్లు చేయుము నీకుఁగూడ సుఖము చేకూరునేమో మచ్చు చూడమని తల్లిదండ్రులు తమ కూర్మి పిల్లలకువలె నిష్కపటమగు సహజప్రేమతోఁ దామెఱింగిన యిహాపర సంతరణోపాయము గేవల పరోపకారమునకై మాత్రమే జనుల కుపదేశించు మహాత్ములే బ్రాహ్మణులు. అట్టి బ్రాహ్మణుని బ్రాహ్మణుఁడే గుర్తింపఁగలఁడు. "నాగస్వరముపాట నాగుఁబామెర్గు తుంగదబ్బునఁ దిరుగు తుట్టెమెఱుఁగు జ్ఞానియెఱుఁగు సుజ్ఞానుల మఱుఁగు అజ్ఞాని యేమెఱుఁగు వారిదాసు తెఱఁగు" అను తీరుగా లోకోపకారపరాయణత లేక కేవల స్వార్థపరులైన సంసారులు నేతి బీరకాయలవలె నామబ్రాహ్మణులు గాని నిక్కువుబ్రాహ్మణులుం బరమార్థజ్ఞులు స్మంత్రవిదు లెంతమాత్రము న్గారుకారు. లోకములో స్వార్థపరత్వాని కేవల లోకోపకారమునకై మాత్రమే బ్రతికెడు వారుత్తములు. "ఉత్తముండు హితముచేసి యూరకుండు మధ్యముండు హితముచేసి మాఱువెదకు అధముఁ డొరుచేయు హితమైన నణఁచిపుచ్చు హితమునకు నెగ్గునేయువాఁ డెవ్వఁడగును." అను విధమున నుత్తములు లోకమందు మిక్కిలి యరుదు. ఇంతేగాక "ఉప్పు కప్పురంబు నొక్కపోల్కిగ నుండు చూడఁజూడ రుచులజాడ వేఱు పురుషులందుఁ బుణ్యపురుషులు వేఱయా విశ్వదాభిరామ వినరవేమ"

అను తీరుగా స్వార్థపరత యించుకయును లేక కేవల లోకోప కారార్థమై మాత్రమే బ్రతికెడు సత్పురుషులను గుర్తింపఁగలవారు సత్పురుషులై యుండకతీఱదు. కనుకఁ గేవల స్వార్థపరులగు సంసారులలోఁ గేవల లోకోపకారపరాయణు లెవ్వరో దేవునకే యెఱుక. లోకమునకు వేఱుగా దేవుఁడను పదార్థము కలదా యను శంకకు నిక్కముగా సమాధానము కేవల మనుమానశబ్దప్రమాణైకగమ్యమే తనకుఁ దలిదండ్రు లనుమానశబ్దములచేతనున్నట్లొప్పుకొనక తీఱనట్లే మాత్రమైన వివేకము కలవాఁడైనను గారణము లేక కార్యము కలుగనేరదని తెలిసికొనక మానఁడు. కాఁబట్టి జగత్కార్యమునకు దేవుఁడు కారణమని బుద్ధిమంతులు మాత్రము నిశ్చయించుకొనుచున్నారు. నిక్కముగా మంచిచెడ్డలు తలంపునఁ దప్పఁ బైఁగా లేవు కనుక "యదృశీభావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అను రీతిగా నెవఁడెద్ది మంచి యనుకొనుచున్నాఁడో వాని కది మంచి మంచిచెడ్డలు మనఃకల్పితములుగాని నిక్కముగా వాస్తవములు కావు "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను శ్రుతిచొప్పున యోగసమాధి నలరారు ముని కవాఙ్మనసగోచర మాత్మైకవేద్యమగు వాసుదేవ పరబ్రహ్మతత్త్వము కన్న "యత్రనాన్యత్పశ్యతినాన్యచ్ఛృణోతినాన్యద్విజానాతిసభూమా" యను తీరుగా బ్రహ్మవిన్మతప్ప సంసారము తోఁచనే తోఁచదు. తోఁచనందుకు సుషుప్త్యవస్థ కొంత తార్కాణము.

ఏ భాష యే దేశమం దనాదిగా వ్యవహరింపఁబడుచుండునో యా భాషలోని సామెతలే యా భాషలోని మాట్లాడుకొను జనులకు నిక్కముగా శ్రుతి స్మృతులు - లోక వ్యవహారములో లేక కేవలము గ్రంథములందు మాత్రమే వ్రాయఁబడిన భాషలం దున్న శ్రుతిస్మృతులద్దములోని యర్థమువలె లోక వ్యవహార యోగ్యములు కావు. "హేమా హేమీ లేటఁబడి కొట్టుకొని పోవుచుండఁగా వెంపలికంప

నా తెలివేమన్నది-"తా నొకటి తలంచిన దైవ మొకటి చేయును-తినక రుచి చొఱక లోఁతు తెలియదు. చేసికొన్నది కుడువకతీఱదు. విత్తొకటి మొక్కొకటియు మొలచునా అడుగుతేగాని అమ్మనా పెట్టదు. అత్తా యొకింటి కోడలే, మామా యొకింటి యల్లుఁడే, ఇంటి పేరు కస్తూరివారు యిల్లు పేఁడకంపు, ఊరందఱి దొకదారి ఉల్లి పిచ్చుక దొకదారి. కన్నగాఁడు కత్తి మఱచునా-కూడాడితే కుండాడును-ఆఁకలి రుచెఱుఁగదు నిద్ర సుఖమెఱుఁగదు -"చదువుకొన్నవాని కన్న చాకలివాఁడు నయము". ఈ మొదలగు దేశభాషల యందలి సామెతలే సహజముగా ననాది సిద్ధములయిన ప్రాఁజదువులు కేవల గ్రాంథిక భాషాత్మకమయి గురు ముఖమునఁ జిరకాలము నియమ పూర్వకముగా నభ్యసించిన సంస్కృత వాఙ్మయమగు వేదమంత యును లోక వ్యవహారదూరమై యింద్రియ దృష్టమయ్యు సుఖగోళము వలె దురవగాహ్యము దుష్ప్రాప్యము కేవల మునిజనైకవేద్యము న్గావున "నక్కెడ దేవలోకమేడ" యను సామెతగాఁ బ్రాకృత జనులకు రవంతయును న్గొఱకావు-మఱియును శ్రౌత కర్మము సాధన చతుష్టయ సంపన్నులగు ముముక్షులకు మాత్రమే యుపదిష్టమైనది గాని సంసారుల కెంతమాత్రము న్గాదు. ఈ బ్రతుకులొ నొరుల సుఖపెట్టిన న్గాని తనకు సుఖము చేకూరదు గనుక నప్రత్యక్షములగు స్వర్గ నరకములఁ గూర్చి వృథా చింతన్ బ్రొద్దు పుచ్చక తనతోడి పాటి జనులకు సమ్మతముగా నడుచుకొని సుఖముగాఁ బ్రతిమనుష్యుఁడును దేహయాత్ర జరుపుకొనుటకన్న నవశ్యకర్తవ్య మింకేకార్యము న్గాదు కాదు నిద్రాశన సౌఖ్యము తప్పఁ జీవులకు వాస్తవముగా నాసించఁ దగిన యవశ్య కార్య మిం కెద్దియు న్గాదు కాదు. కడుపారఁ దినుటయున్గన్నార నిద్రించుటయును దప్ప బ్రతుకునకుఁ గావలసిన ముఖ్యాంశ మింకెద్దియు న్గాదు, తినుటయును నిద్రించుటయును

బ్రతుకున కవశ్య కర్తవ్య కార్యములు మఱి తక్కిన వను లన్నియు సంసారమునఁ గాలక్షేపమున కుబుసుపోఁగొట్టుకొనుటకు మాత్రమే ప్రయోజనములగుం గాని బ్రతుకున కవసరము లెంతమాత్రమున్నావు. జీవులకుఁ దనంతఁ గలిగి వదల్చుకొన శక్యము కాని గుణమే దైవ లబ్ధమగు స్వభావము. "నైజగుణంబులు మాన నేర్చునే" అన్నట్లు బ్రతుకు నిల్పుకొనుటకు మూలకారణములగు నిద్రాహారములుఁ కంఠమునఁ బ్రాణము లున్న దనుక నెద్దియో విధముగ నెఱవేర్చుకొనక తీరదు. నిద్రాహారముల కన్న జీవితమున కింకొక స్వరూప మెద్దియు న్లేదు. కావలసిన నిద్రాహార ప్రాప్తికై సహజముగానెల్ల జీవులుం బాటుపడుచునే యున్నారు.

"పథ్యాశీ వ్యాయామీ స్త్రీషుజితాత్మా నరో నరోగీస్యాత్ - యది మనసా వచసా చ ప్రద్రుహ్యాతి నసర్వభూతేభ్యః" అను నుపదేశ వాక్య మాదేయ హేయ వస్తు జ్ఞాన మొకింతయు న్లేని యర్భకులను గురించి మాత్రమే కాని లోక జ్ఞానము గల వయోవంతుల కెంత మాత్రము న్గాదు. "స్త్రీషు జితాత్మా" అనుచో స్త్రీ శబ్దము నకు సంభోగ మర్థము పథ్యాశీ వ్యాయామీ స్త్రీషు జిత్మానరోగీస్యాత్ అని యెలజవ్వనముగల జనులఁ గూర్చియును "యది మనసా వచసాచ ప్రద్రహ్యాతి న సర్వభూతేభ్యో నరోగీస్యాత్" అని ప్రౌఢ వయస్కులను గురించియును వైద్యశాస్త్ర మారోగ్య సుఖదీర్ఘ జీవన ముఖ్య సాధన సులభ నిద్రాహార-లాభ ప్రాప్త్యుపాయ ముపదేశించెను. వేయేల, వేదశాస్త్రములన్నియును గించిజ్ఞులగు జీవులకు సుఖదీర్ఘ జీవన సాధనము తప్ప మరే సంగతియుఁజెప్పనే చెప్పలేదు. బ్రతుకున కవశ్యములగు హేయాదేయములం బ్రాణులు బాగుగఁ దెలిసికొననేరరు. కాని స్వభావముగా నిద్రాహారసౌఖ్యము కోరక మానరు. దేహధారణమునకు నిద్రాశనములు మాత్రమే ముఖ్య

ములు గాని తక్కిన పనులన్నింటిలో సులభ సుఖ నిద్రాశన సంపాదన సాధనములగు కార్యములు మాత్రమే సంపూర్ణానుభవముగల సర్వజ్ఞమునులు వేదశాస్త్రముఖములఁ బిల్లలకుఁ దల్లిదండ్రులవలె హేయాదేయ వస్తువిశేషము లుపదేశించిరి. నిద్రాహారములు సహజసిద్ధములు మఱియు స్వాహారము సంసర్గజన్యమగు కృత్రిమచేష్టగాని నిక్కముగా నిద్రాశనములవలె సహజసిద్ధముగాని లేక బ్రతుకు నిల్పుకొనుట కావశ్యకముగాని యెంతమాత్రము న్గాదు. నిద్రాశన సౌఖ్యమునకుఁ దోడ్పడఁజాలని మనోవాక్కాయకర్మము లన్నియును హేయకార్యముల న్నిషేధశాస్త్రముచేతను నిద్రాశన సౌఖ్యాభివృద్ధి కావించు నాదేయకార్యములను విధిశాస్త్రముచేతను సంపూర్ణానుభవము సర్వజ్ఞతయు నాస్వార్థత్యాగమునుగల పరమకారుణికులు లోకోపకారపరాయణులగు ప్రాచీనకవుల గ్రంథముల నుపదేశించిరి. నిద్రాహారములకు విహారమును, విహారమునకు నిద్రాశనములుం బరస్పర కారణములు కాకతీరదు "యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య" అను భగవద్వాక్యానుసారముగా నాహారమును నిద్రావిహారములు జరుగును. సాత్త్విక రాజస తామసాహారములకుఁ దగునట్లు నిద్రావిహార చేష్టావిశేషములు పొడచూపుచుండును. రాజస తామసాహారసేవకులగు దుర్జనుల నిద్రావిహార ప్రవృత్తు లాధివ్యాధులం బ్రబలింపఁజేసి క్రమముగా నల్పాయుః కారణములగును. "స్వయంతీర్ణాః పరాం స్తారయన్తి" అను తీరున సాత్త్వికాశనముఁజేయు సుజనులు సంతుష్టాంతరంగులై నిరోగులై పరోపకార నిద్రావిహారములం జిరజీవన సౌఖ్య మనుభవించెదరు. శ్రౌతస్మార్తకలాప మంతయు నియమిత సాత్త్వికాశనమును మాత్రమే విధించుచున్నది. సాత్త్వికాశనముచేత స్వపరోపకారకమగు సత్త్వగుణ మభివృద్ధియై సకలరోగహేతువగు విషయభోగవాంఛ న్దొలఁగించి సంతుష్టాంతరంగుల న్గావించి యారో

గ్యమగా బ్రతుకం బొడిగించి స్వార్థపరత న్నాన్సి తప్ప కిహపరముల నరింపఁజేయును, దరింపఁజేయును. "హితభుఙ్మితభుక్" అను తీరున నియమిత సాత్త్వికాశనపరులు సుప్రసన్నేంద్రియులై యొరులసుఖపెట్టి తప్ప కాధివ్యాధు లంటక సుఖముగాఁ జిరము బ్రతికెదరనియే సర్వజ్ఞులగు మునులు మనుజు లందఱికి సత్య దయా శౌచ ముఖ్య హేతువగు సాత్త్వికాశనమును మాత్రమే విధించిరి-యజ్ఞమందు మాత్రమే పశుహింస చేయవలయునని "పశు మాలభేత" అని శ్రుతి నుపదేశించిరి. యజ్ఞ మనఁగా సజ్జనుల కుపకారము కావించు కర్మస్వరూపమగు ధర్మము. సాధులోకమును హింసింపఁ బ్రవర్తించు కేవల స్వార్థపర క్రూరప్రాణులు పశువు లనంబడుదురు. "యాగమందు న్భావింప యుద్ధమందుం జావంగాలేని చెడుగుచావుం జావే" అనునట్లు స్వార్థపరత న్నాని పరోపకారపరాయణులగు సజ్జనుల కుపద్రవము కావించు కపటక్రూర మానవుల న్గడతేర్చుటకొఱకు సృష్టియు న్దైశ్వర్యమంతయును గరుణామయుఁ డగు దేవుఁడే యని నిశ్చిత దృఢమనస్కయోగమందుఁ గాంచి యొడలిం దొఱఁగు జనుఁడే నిక్కముగా సుకృతి. తనపాటుకై జంతుహింస చేయఁగూడదు. కేవలముం బరోపకారముకై మాత్రమే చేసినహింస యవశ్యాచరణీయ ధర్మమేయని "పశుమాలభేత" అను శ్రుతియొక్క యభిప్రాయము.

ఏకాలమున కెట్లు జరుగవలయునో యట్లు జరుగకతీఱదు. "అక్కన్న విన్న సంధ్యా మావన్న విన్న సంధ్యా" అన్న ట్లీవేద శాస్త్రోపదేశ మెందుకు పిలువనిపేరంటకమని యింతమాత్రము సర్వజ్ఞులగు ఋషు లెఱుంగరా వేదశాస్త్రగ్రంథము లుపదేశించిరి? "పూర్వజన్మకృత పాపం వ్యాధిరూపేణబాధతే, తచ్ఛాంతిరౌషధైర్దానైర్జప హోమార్చనాదిభిః" అనునట్లు స్వకర్మానుసారముగాఁ దమకు లభించు కష్టముల న్దాఁటుకొనునుపాయము తెలిసీ తెలియని మానవు

తెలుగరుకనుకఁ గేవల లోకోపకారపరాయణులుం ద్రికాలవేత్త
లగు మును లాగామిసంచితప్రారబ్ధకర్మల నడ్పించుకొని నిశ్శ్రే
యసమును జేరుటకై వేదశాస్త్రముఖముల నిహపర సంతరణోపాయ
ముపదేశించి శ్రౌతస్మార్తకర్మకలాపము న్దేశకాల పాత్రోచితముగా
నాచార్యరూపముల ధర్మమార్గము నం దాము నడిచి తముతోడివారి
వారలనెడపి తాము తరించి యొరులఁ దరింపజేసిరి.

శ్రౌతస్మార్తకర్మము లన్నియు నైహిలౌకికములే. పారలౌకిక
కర్మము భూమస్థితియగు బ్రహ్మసమాధియగు నని విశ్వాసమున
మాత్రమే తెలిసికొనఁదగినది. కేవలాత్మాశ్రయము మున్నైకవేద్య
మగు పరలోకచింత సంసారులకు వండనింటి గ్నిబాధ యన్నట్లనవసర
శ్రమహేతువు. కాఁబట్టి జనుఁడు తా సుఖపడి యొరుల సుఖపెట్టు
నుపాయమును మాత్రము శ్రుతిస్మృతు లుపదేశించుచున్నవి.
కాఁబట్టి వేదశాస్త్రపద్ధతుల ప్రకారము బ్రహ్మచర్య గార్హస్థ్య
వానప్రస్థ సన్న్యాసాశ్రమ ధర్మముల నిర్వర్తించుకొని మనుష్యు
లుభయలోకముల దరింపవలయును వేదశాస్త్రము లన్నిటికి న్దేశ
కాల పాత్రానుసారముగా నాచార్యులు వివిధాభిప్రాయముల నెల్పు
చున్నారు. కనుక వర్తమాన కాలోపయోగముగా లోకోపకారము
గావించు తీరునఁ దమతమ పూర్వాచారములను బుద్ధిమంతులు దిద్దు
కొనుచు నొరులం దరింపఁజేసి తాము తరించఁగలరు.

"విష్ణుం యజతి విష్ణుర్యష్టవ్యః" అను వాక్యములు విష్ణువుం
బూజించుచున్నాఁడు. విష్ణువు పూజింపఁబడఁదగునను నీరెండు భిన్నార్థ
ముల కభిప్రాయ మొక్కటియే. కనుక దేశకాల పాత్రానుసారముగా
వర్తమానమున మార్చుకొనఁబడిన యాచారములు పూర్వాచారము
లకు భిన్నము లెంతమాత్రము కానేరవు కానేరవు. "సప్తదశ ప్రాజా
పత్యం పశుమాల భేత-ఆధ్వర్యసప్తదశకమ్-సప్తదశకం పశులిఙ్గమ్"

అని పదేడు సంఖ్యగాఁ జెప్పఁబడిన పదార్థసప్తదశకమును దేవతార్ప ణము కావించవలయు-పంచభూతములు-పంచేంద్రియములు - పంచ తన్మాత్రములు-మనస్సు-నాత్మయను గలిసి పదేడు యజ్ఞద్రవ్యము లగుచున్నవి. ఈ పదేంటిని లోకోపకారమునకై వినియోగించుటయే యజ్ఞమొనరించుట యని సకల శ్రౌతకర్మములం దేలిన ఫలితార్థము. "దధ్నా జుహోతి-పశునాయజతే" అనునెడ పాలు నేయి పెరుఁగు మొదలయిన ద్రవ్యము లగ్నిలో వ్రేల్చఁబడినపుడు కలిగిన పొగ బీల్చిన జనుల కారోగ్యము కలుగుననియుం ద్రికరణశుద్ధిగా లోకోప కారకధర్మమను పశువును దేవతలకు సమర్పించఁబడినపుడు నిర్వాణ మబ్బుననియును శ్రుతుల ముఖ్య తాత్పర్యము. వేయేల, శ్రౌతస్మార్త కర్మము లన్నియు నాధివ్యాధుల న్మాన్పుట కేర్పడిన యాయుర్వేద సారభూతమే. వేదశాస్త్రము లన్నియు సంసారరోగము న్గుదుర్చు కొను నుపాయములకన్న వేఱు బోధింపనే బోధింపకున్నవని బుద్ధి మంతులు తెలిసికొనుచున్నారు. "దధ్నేంద్రియకామో జుహు యాత్" వీర్యపుష్టిని గోరువాఁ డగ్నిలోఁ బెరుఁగుపోసి యాపొగను బీల్చవలయునని కాని లేక పెరుఁగును ద్రాగి జఠరాగ్నిం బుష్టిచేసి కొనవలయునని కాని యాయుర్వేదపద్ధతిగా నర్థముచెప్పక తీఱదు" ఘృతయాయుర్ఘృతేన వర్ధతేబుద్ధిరధిజ్వరమ్'అను భాష్యవాక్యములం బట్టి నేయి త్రాగినవాని కాయుర్వృద్ధియు బుద్ధివికాసముం గల్గును. పెరుఁగు తిన్నవానికి మదనజ్వర హేతువగు నింద్రియపుష్టి కలుగునని యును సకల శ్రౌతస్మార్తక్రియాకలాప మంతయును "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్" అన్నట్లు లోకోపకార మొనర్చి తరించుటకు సాధనమైన తన శరీరమును మనస్సు నాధివ్యాధి వంటనివిధముగా దైవప్రార్థనా రూపమగు ఋక్సామవేదములచేతఁ దన మనస్సును యజుర్వేదముచేతఁ దన శరీరమును స్వాస్థ్యముగా నుంచుకొని "స్వయం

తీర్ణాః పరాంస్తారయంతి" సత్ప్రవర్తనముచేత బుద్ధిమంతులు తాము తరించి తమతోడివారలనుఁ దరింపఁజేయుటకన్న "పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే తచ్ఛాంతి రౌషధైర్ధానైర్జపహోమాదిభిః సదా" అను తీరున సహజానాది స్వకర్మానుభవముకై తాను ధరించకతీఱని శరీరమును ముఖ్యముగా మనుష్యజన్మమెత్తిన జీవుఁడాద్యంతములు లేక సంసరించకతప్పదు కనుక లోకుల ద్వేషించి దుఃఖరూపమయిన నరకము పాల్గాక లోకులం బ్రేమించి సుఖరూపకమయిన స్వర్గఫల మనుభవించుకొనుట దొడ్డబుద్ధియని వేదమాతయగు గాయత్రీమంత్రము "ధియో యోనః ప్రచోదయాత్" అని చాటుచున్నది.

జీవులకు సంసారబంధము త్రికాలముం దెన్నఁడుం దప్పదు తప్పదు. మోక్ష మను మాట కుందేటికొమ్మనుశబ్దమువలె మిథ్యాకల్పనము బ్రతుకులో నొరుల సుఖపెట్టి తాసుఖపడుటయే స్వర్గాపవర్గములు. జనకంటకుఁడై బాధపడుటయే నరకదుఃఖము. "తెనుఁగెఱుఁగని సంస్కృతంబు తెల్లమెఱుఁగున్" అన నిహలోకమునే సాధించనేరనివాఁడు పరలోకము నెట్లు సాధించగలఁడు? బ్రహ్మచర్యము సరిగా నడిపినవాఁడే గృహస్థు కాఁదగును. గార్హస్థ్యము న్సరిగా నడిపినవాఁడే వానప్రస్థుఁడు కాఁదగును. వానప్రస్థము న్సరిగా నడిపినవాఁడేసన్న్యాసి కాఁదగును. స్థూలసూక్ష్మకారణ శరీరత్రితయ ప్రళయావస్థయందుఁ గాని జీవునకు సుఖదుఃఖాత్మక త్రిగుణమయ సంసారబంధ విమోచనము కలుగనేరదని శ్రుతులు "సాక్షీచేతాః కేవలో నిర్గుణశ్చ బ్రహ్మవిదాప్నోతిపరమ్ త్యాగేనైకే అమృతత్వమానశుః" అని కేవల నిర్గుణజీవాత్మకు మాత్రమే నిత్యశుద్ధబుద్ధముక్తపరమాత్మ సామ్యమును బోధించుచున్నవి. మెల్లెక్కుచు గ్రమక్రమముగా స్వాభిలషిత సౌధశిఖరమున విశ్రాంతిసుఖ మనుభ

వింపఁగలిగిన ట్లాద్యంతములు లేని సంసారములో స్వకర్మానుసార ముగాఁ బుణ్యపాపఫలరూపక సుఖదుఃఖము ననుభవించుచు వేదశాస్త్ర విహితపద్ధతు లనుసరించి యాశ్రమధర్మముల నడుచుకొనుచువర్త మాన సుఖదుఃఖములు పూర్వకర్మజనితఫలములని తెలిసికొనుచు లోకోపకార మొనర్చుట పుణ్యము మఱి యా పుణ్యమునకు సుఖము ఫలము మఱియును లోకద్రోహము చేయుట పాపము మఱి యా పాపమునకు దుఃఖము ఫలమనియును స్వానుభవ సాక్ష్యప్రమాణము చేతనే యెఱుఁగుచుం బాపప్రద్రోవం దప్పించుకొనుచుం బుణ్య మార్గమున నడచుకొను బుద్ధిశాలి క్రమక్రమముగా సంసారబంధము సడలి సడలి బొత్తుగా బిగి తప్పి శరీరత్రితయము యొక్క యగణిత సంఖ్యాకసామర్థ్యము రానురానుశూన్యప్రాయమగుటచేత జీవన్ముక్తి సుఖ మబ్బును. "కామి గాక మోక్షగామి కాఁడు" అను తీరున వేద శాస్త్రశిష్ట పూర్వాచారానుసారముగా దేశకాల పాత్రోచితముగా సర్వజనసమ్మతముగా బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థధర్మకామి యైనంగాని నిర్గుణాద్వైత మోక్షసంపద యెవ్వనికి నశక్యముకాదు. ధర్మము నాచరించనివాని కర్థము చేకూరద దర్థమున్నవానికిఁ గాని కోర్కె చెల్లఁబోదు. కోర్కె తీఱినవానికిఁ గాని నిత్యసంతృప్తి స్వరూపమగు మోక్షానందము చేకూరదు. కాఁబట్టియే సర్వజ్ఞులుం బరమకారుణికులయిన మహర్షులు వేదశాస్త్ర ముఖముల సంసారుల కెల్ల బాల్య యౌవన వార్ధకోచితములయిన వర్ణాశ్రమ ధర్మముల దేశకాలపాత్రానుసారముగానుపదేశించిరి. "సంస్కారశ్చ ప్రకరణే కర్మశబ్దాత్ అర్థవాదోపపత్తేశ్చ" అను పూర్వ మీమాంసాసూత్ర ములంబట్టి శ్రౌతస్మార్తకర్మము లన్నియు సర్వప్రాణుల దయతో నుల్లసింపఁజేయుచు మనుష్యుఁ డిహపరసౌఖ్యమును సంపాదించు కొనఁదగిన వేడుకచేష్టలు గాని హింసాకృత్యము లెంతమాత్రము కానేకావు.

"వాయవ్యం శ్వేత మాలభేత భూతి కామః సౌర్యంచరుంని ర్వపేత బ్రహ్మవర్చసకామః వత్స మాలభేత" అను నపుడు పశువుం జంపి వప యగ్నిలో వ్రేల్చుట యర్థము కాదు "భూతి కామః" దేహారోగ్యమునకై "వాయవ్యమ్" ఊపిరికోశము "శ్వేతమ్" నవ నీతము తినుటచే "ఆలభేత" పోషించుకొనవలయును. "బ్రహ్మ వర్చస కామః" కాయక్లేశమును సహించుకొను సామర్థ్యమును సంపాదించికొను టకై "సౌర్య చరుం నిర్వపేత" ఎండకోర్చి పనిపాట్లు చేసికొనవల యును. "వత్సమాల భేత-వత్సాని కాంతాని వశవః "ఆవుపా లెక్కు వగాఁ బిదుకుకొనఁ దలంచిన వాఁ డాయావులేగ నాయావుచెంగట దువ్వుచు ముద్దాడుచు నాయావుచే నాకించుచు లాలించుకొనవలయు నేల ననఁగా "పశవః" తల్లులు "వత్సాని కాంతాని" పిల్ల స్నేహ ముగాఁ బ్రేమించుచుంటచేతను కనుక నిట్లు జంతుహింసరవంతయు జరుగకుండు విధమున మనుష్యుఁడు తన యారోగ్యము నెల్లవిధముల న్గాపాడుకొనుటకై యుపయోగించుకొను చికిత్సా విశేషముల "తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జప హోమాదిభిః సదా" అను నట్లు సకల శ్రౌత స్మార్త కర్మము లన్నియును సర్వోపకారక మగు ప్రవర్తనమునే ప్రోత్సాహ పర్చుచున్నవి. వేదశాస్త్రము లన్నియు నాధివ్యాధి విశేషాత్మక సంసారరోగము న్గుదుర్చు చికిత్సా స్వరూప ములే-దుర్జన సహవాసమున దుర్వ్యసనములకు లోఁబడిన దుష్టమాన వులు వంచకులై కేవల స్వార్థపరులై "పశు మాలభేత" అను శ్రుతి పాలు కావలసినవాఁ డావు మొదలగు నాఁడుపసరములను మఱి యా జంతువుల వత్సములను మిక్కిలి ముద్దుగాఁ బోషించుకొనవలసిన దను నర్థము చెప్పి పశుపాలన కర్మము కావింపక మద్యమాంస సంభోగ వ్యసనపరులై జీవహింస కావించుచు వంచకులై శ్రౌత

స్మార్త కర్మముల నదయమాలి క్రూరమార్గముల న్వినియోగించుచు నధ్వర్యులమని విఱ్ఱవీఁగుచు మూఢులం బెదరించి తిని త్రాగి క్రొవ్వి తాము చెడుటయేగాక యితరుల న్గూడ నిహపర భ్రష్టుల న్గావించుచున్నారు.

సకల జనోపకారముగా బాహ్యేంద్రియ ప్రచారము చేయుట బాహ్యయజ్ఞము మఱియు మనస్సు నిశ్చలము చేసికొనుట యంతర్యజ్ఞము. బాహ్యాంతర్యజ్ఞ విశేష నిర్వర్తకములే సకల శ్రౌతస్మార్త కర్మము లన్నియును భూతదయలేనివాని కిహపరసౌఖ్యము కలుగదు. కలుగదు. దేశకాలపాత్రానుసారముగాఁ దనతోడిపాటివారల యనుగ్రహమును సంపాదించుకొని బ్రతుకును హాయిగాఁ గడుపుకొనుటకై స్వపరోపకారముగాఁ బరమ భాగవతుఁ డగు సజ్జను డొనర్చు కర్మము లన్నియును శ్రుతి స్మృతి చోదిత శ్రౌతస్మార్త వివిధవిహిత కర్మములే. లోకోపకారప్రవర్తనముగల మానుష్యుఁడే సకలవేద శాస్త్ర విధివిహిత కర్మ నిష్ఠుఁడని సిద్ధాంతము సిద్ధాంతము, అత్యుత్కటైః పాప పుణ్యై రిహైవ ఫల మశ్నుతే” జన ద్వేషియగు పాపికిఁ గష్టము జనానురాగి యగు పుణ్యాత్మునకు సుఖము చెడ్డకుఁ జెడ్డ మంచికి మంచి యును దప్ప కీ లోకమునందే యమితమైనపుడు ఫలించక మానదు.

“వసంతే బ్రాహ్మణోఽగ్నిసాదధీత-గ్రీష్మే రాజన్యః - శరది వైశ్యః” క్రమముగా సత్త్వరజ స్తమోగుణమయి వసంతర్తువునఁ బొడమి గ్రీష్మర్తువునఁ బ్రజ్వరిల్లి శీతకాలమున నడంగు నగ్ని, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య నామములం దాల్చుచున్నది. సత్త్వగుణప్రధానమైన జ్ఞానమునకు బ్రాహ్మణాగ్ని యనియును రజోగుణ ప్రధానమయిన జ్ఞానము క్షత్రియాగ్ని యనియును దమోగుణ ప్రధానమైన తెల్వి వైశ్యాగ్నియు నను పేర్లం బరఁగుచున్నది. కేవల సత్త్వగుణము

బ్రాహ్మణ శబ్ద వాచ్యము. కేవల రజోగుణము క్షత్రియశబ్దవాచ్యము. మఱి కేవల తమోగుణము వైశ్య శబ్ద వాచ్యము, త్రిగుణ సమ్మేళన విశేషము శూద్ర శబ్ద వాచ్యము. కేవల సత్త్వగుణమైనం గేవల రజోగుణమైనం గేవల తమోగుణమైనను జ్ఞానము మిక్కిలి శుద్ధమై యానందదాయక మగును. మఱియుం ద్రిగుణములు పరస్పర సమ్మేళన మున సాంకర్యము చెందుటచేత జ్ఞానము శుద్ధము కానేరక కలంకనీటి వలె సంసార హేతువై కర్మ స్వరూపమై దుఃఖానుభవ స్వరూప "శుచ శోకే-శోచ్యత ఇతి శూద్రః"అను వ్యుత్పత్త్యర్థానుసారముగా శూద్ర శబ్దవాచ్య మగుచున్నది. కాబట్టి త్రిగుణ సాంకర్య జన్య మగు నీ జగమంతయును శూద్ర శబ్ద వాచ్యమే. అనఁగా విశుద్ధ జ్ఞాని కాని జీవుఁడు కర్మబద్ధుఁడై భ్రాంతుఁడై శూద్రుఁడై మిథ్యా జగమును వాస్తవముగా నెంచుకొని దుఃఖపడుచున్నాఁడని శ్రుత్యభి ప్రాయము. "వసంతే బ్రాహ్మణ ముపనయీత-గ్రీష్మే రాజన్యమ్ - శరది వైశ్యమ్" జాగ్రత్స్వప్న సుషుప్తి దశల స్సత్త్వ రజ స్తమో గుణముల న్వలయుచు విశ్వనామమున బ్రాహ్మణుఁడై తైజసనామ మున క్షత్రియుఁడై ప్రాజ్ఞనామమున వైశ్యుఁడై మఱి సంకరావ స్థానుభవముచేత కేవల స్థితి యెద్దియు నందక విశ్వ తైజస ప్రాజ్ఞ నామసాంకర్యమనఁగా నిర్దేశింప నలవి కాక నిల్కడలేక యనాది స్వకర్మ ప్రకృతిబద్ధుఁడై భ్రాంతుఁడై సంసారదుఃఖ మనుభవించు జీవుఁడు శూద్రుఁ డగుచున్నాఁడు. కాబట్టి సంసారు లందఱును కేవ లము శూద్రులే కాని విశ్వ తైజస ప్రాజ్ఞ శబ్ద వాచ్యులగు విశుద్ధ గుణులగు బ్రహ్మ క్షత్రియవైశ్యు లెంతమాత్రము గానేరారు. శుద్ధజాతి గుణ మానందమును సంకరజాతికి దుఃఖమును లక్షణము కనుక స్వకర్మబద్ధులై భ్రాంతులై గుణ సాంకర్యముచేత సంసరించు జను లందఱును శూద్రులే కాని బ్రాహ్మణులు కాని క్షత్రియులు కాని వైశ్యులు కాని యెంతమాత్రము గారు.

నిజ ధర్మమునుండి జాతిపోనీక నడుపు వ్రత ముపనయన మనఁబడును. మఱి యుపనయన మనఁగా విశుద్ధ నిశ్చల జ్ఞానైక గమ్యమగు కేవల లోకోపకారక ధర్మనిష్ఠ కనుక మిథ్యా జ్ఞానకల్పిత స్వార్థైకపరత మానుకొని కేవల లోకోపకారముకై మాత్రమే బ్రతుకు నుపయోగించుకొనుటకై పట్టిన దీక్షకే బ్రహ్మజ్ఞానమనియు నుపనయనమనియు వేదవిహితకర్మనిష్ఠయనియుం బేర్లు తగును. స్వార్థపరులై కేవలోదరంభరులై సంసరించు ప్రాకృతజనుల [ఉ]పనయనము పిల్లి చాంద్రాయణ వ్రతమే. ప్రాకృతులగు మనుష్యుల [కుపనయ]నమే మిథ్యారూపమైనపుడు వేదచోదిత ధర్మనిష్ఠ కుదురుట శశవిషాణము వలె నసంభవము. "కలౌ నక్షత్రియాః సన్తి కలౌ నో వైశ్య జాతయః" కలి యనఁగా ననిత్య సుఖదుఃఖాత్మక ప్రపంచ మట్టి సంసారకారణ ప్రపంచములోఁ గేవల రజోగుణ ప్రధానులయిన క్షత్రియ శబ్ద వాచ్యులగు మనుష్యులుగాని కేవల తమోగుణ ప్రధానులయిన వైశ్యజాతిమానవులు గాని లేరనఁగా గేవల సత్త్వగుణ ప్రధానులగు బ్రాహ్మణజాతి కలదనుట ఈ సంసారములో "నాలూ లేదు చూలూ లేదు కొడుకు పేరు సోమలింగ" మన్నట్లు కాదా? కాఁబట్టి స్వకర్మాను సారముగ సంసారబద్ధుఁడై సుఖదుఃఖము లనుభవించు ప్రతి జీవుఁ డే దేహము ధరించనీ యే యే కర్మ మొనరించనీ యెట్లు ప్రవర్తించనీ దుఃఖపర్యవసాన మగు బ్రతుకున సంకర గుణాత్మక శూద్రనామమునకుఁ దప్ప విశుద్ధ గుణాత్మకోపనయనార్హ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య నామముల కెద్దానికైనం దగఁడు. "బ్రహ్మ విదాప్నోతి పరమ్-బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి" అను తీరుగా సాధనచతుష్టయ సంపన్నుఁడు తప్ప నితరుఁ డెవ్వడు న్దన బ్రతుకున న్నిజముగా నాత్మజ్ఞానజనకమూల మగు నుపనయన మనంబడు శ్రౌత కర్మ కెంతమాత్రము న్దగఁడు, వేదశాస్త్రము లన్నియును పారలౌకిక



కైవల్యానంద కారణమగు దైవభక్తి బ్రహ్మజ్ఞానము వైరాగ్యములను మాత్రమే బోధించుచున్నవి గాని మనుష్యులకు వారి వారిలోఁ గల తారతమ్యమును గొప్ప కొద్దులను జెప్పనే చెప్పవు. యేల, వేదాధ్యయనము శ్రౌతకర్మానుష్ఠానము న్సాధనచతుష్టయ సంపన్నులగు పరమార్థచింత గల ముముక్షువులకు మాత్రమే యుద్దేశింపఁ బడెను గాని సంసారుల కెంత మాత్రము న్గాదు. కాఁబట్టి సంసారు లందఱును దుఃఖ మనుభవించుటకై పుట్టిన శూద్రులే "శూద్ర మక్షర సంయుక్తం దూరతః పరివర్జయేత్" అనఁగా మేము జ్ఞానానంద లక్షణము లున్న ద్విజులమని చెప్పుకొను మనుష్యుల ముఖమైనం జూడఁ గూడదని యభిప్రాయము.

## వేదశాస్త్రాద్వైత ప్రసంగము

కామ్యములు నిషిద్ధములని రెండువిధముల కర్మములను లోకోపకారమునకై వేదకర్మకాండ స్వరూపక వేదము బోధించుచున్నది. జ్ఞానకాండ రూపకమగు వేదము కేవల నైష్కర్మ్యముం బోధించుచున్నది. మొత్తముపై వేదమందలి కర్మకాండము స్వర్గ సాధనము మఱి జ్ఞానకాండ మపవర్గసాధనము. కర్మకాండము సంసారులకును జ్ఞానకాండము సన్న్యాసులకుం బ్రత్యేకము నుద్దిష్టములయినవి. "యోవృష్టి కామోయోఽన్నాద్య కామోయః స్వర్గకామః స్వసౌభరేణాస్తువీత" డప్పితీర్చుకొనుట కాఁకలిం దీర్చుకొనుటకూ శయన సౌఖ్యము పొందుటకుం గోరువాఁడు హిత మిత మృదు వినయాలాపములచేత సర్వజన హృదయరంజనము కావించుకొనవలయునని శ్రుతి తాత్పర్యము. స్వర్గ మనఁగా బ్రతుకునకవశ్యమగు నిద్రాహార విహార సౌఖ్యము. అపవర్గ మనఁగా సుఖదుఃఖములు రెండునంటకేకోర్కెయు లేని తటస్థలక్షణము. స్వర్గకాములకై కర్మకాండమును మఱి ముము

కైవల్యానంద కారణమగు దైవభక్తి బ్రహ్మజ్ఞానము వైరాగ్యము లను మాత్రమే బోధించుచున్నవి గాని మనుష్యులకు వారి వారిలోఁ గల తారతమ్యమును గొప్ప కొద్దులను జెప్పనే చెప్పవు. వేదాల, వేదాధ్యయనము శ్రౌతకర్మానుష్ఠానము సాధనచతుష్టయ సంపన్ను లగు పరమార్థచింత గల ముముక్షువులకు మాత్రమే యుద్దేశింపఁ బడెను గాని సంసారుల కెంత మాత్రము న్గాదు. కాఁబట్టి సంసారు లందఱును దుఃఖ మనుభవించుటకై పుట్టిన శూద్రులే "శూద్ర మక్షర సంయుక్తం దూరతః పరివర్జయేత్" అనఁగా మేము జ్ఞానానంద లక్షణము లున్న ద్విజులమని చెప్పకొను మనుష్యుల ముఖమైనం జూడఁ గూడదని యభిప్రాయము.

## వేదశాస్త్రాద్వైత ప్రసంగము

కామ్యములు నిషిద్ధములని రెండువిధముల కర్మములను లోకోపకారమునకై వేదకర్మకాండ స్వరూపక వేదము బోధించు చున్నది. జ్ఞానకాండ రూపకమగు వేదము కేవల నైష్కర్మ్యముం బోధించుచున్నది. మొత్తముపై వేదమందలి కర్మకాండము స్వర్గ సాధనము మఱి జ్ఞానకాండ మపవర్గసాధనము.కర్మకాండము సంసారు లకును జ్ఞానకాండము సన్న్యాసులకుం బ్రత్యేకము నుద్దిష్టములయినవి. "యోవృష్టి కామోయోఽన్నాద్యకామోయః స్వర్గకామః స్సనోభ రేణాస్తువీత" దప్పితీర్చుకొనుట కాఁకలిం దీర్చుకొనుటకూ శయన సౌఖ్యము పొందుటకుం గోరువాఁడు హితమిత మృదు వినయాలాప ములచేత సర్వజన హృదయరంజనము కావించుకొనవలయునని శ్రుతి తాత్పర్యము. స్వర్గ మనఁగా బ్రతుకునకవశ్యమగు నిద్రాహార విహార సౌఖ్యము. అపవర్గ మనఁగా సుఖదుఃఖములు రెండునంటకేకోర్కెయు లేని తటస్థలక్షణము. స్వర్గకాములకై కర్మకాండమును మఱి ముము

క్షువులకై జ్ఞానకాండమును వేదము బోధించుచున్నది. సౌభర మనఁగాఁ బురుషప్రయత్నము. స్వర్గమునకుఁ బురుషప్రయత్నము చేయకతీరదు. మఱి యపవర్గమున కే ప్రయత్నమైన నవసరములేదు. కాఁబట్టి వేదశాస్త్రము లన్నియును మనుష్యులు సుఖముగా బ్రతుకు తెన్నునఁ జేయఁదగిన పురుషప్రయత్నమును మాత్రమే బోధించు చున్నవి. మొత్తముపై ధర్మార్థకామమోక్షములను పురుషార్థము లను సాధించుకొనుటకై తగిన పురుషప్రయత్నము నేయేవిధముగా నేయేమనుష్యులు దేశకాలపాత్రానుసారముగా నొనర్చవలయునో యాయామార్గముల నేసర్వజ్ఞులయిన మునులు నానావిధ శ్రౌతస్మార్త ధర్మకర్మములను శ్రుతిస్మృతిముఖముల నుపదేశించిరి.

తమ ప్రయత్నములు విఫలము లయినప్పుడును బంచభూత ప్రవృత్తి తమకోరికల న్వ్యర్థము కావించి తాముకోరినట్లుండకపోవుటచేత ను దమయింద్రియములు తమతలంపులు నద్దమ యిష్టమునకుఁ బ్రతి ఘటించి తమ్ము న్బాధించినప్పుడు దమతోడివారు తమ్ము ద్వేషించి బాధపెట్టునపుడును తమకోరిన నిద్రాహారవిహారసౌఖ్యము చేకూర నప్పుడును తమ యిచ్ఛానుసారముగాఁ దమ బ్రతుకు కొనసాగ నప్పుడు ముఖ్యముగా మనుష్యులు తమదుఃఖములను దొలఁగించుకొని శాశ్వతానందమును బొందుట కుపాయమును వెదకెదరు. అట్టి మన స్సంతుష్టి గలిగించుటకై దేశకాల పాత్రానుసారముగాఁ దమతమ యనుభవము నభిరుచిం బట్టి కాలము గడిపిన పెద్ద లనాదికాలము నుండియుం దమతమ దేశములం బారంపర్యముగా నుపదేశింపఁబడు చున్న యిహపర సంతరణోపాయము మత మనఁబడుచున్నది. ఈమతము దేశకాల పాత్రానుసారముగా ననంతవిధముల నున్నది. ఒకమతముకన్న నొకమతముగాని యొక మనుష్యునికన్న నింకొక మనుష్యుఁడుగాని యొకవస్తువుకన్న నింకొక వస్తువుగాని నిక్కముగా

మేలున్గాదు కీడునుంగాదు గొప్పకాదు కొద్దికాదు హేయమున్గాదు మఱి యాదేయమున్గాదు. "సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" అనఁగా బుద్ధిమంతులగువారికిఁ దమ మనస్సాక్షియే తామవలంబించియుభయలోకములం దరించు మతము నవలంబింప నొప్పించు ప్రమాణ మగుచున్నది. మాది మంచిమతము మీది చెడ్డమతము మేము బుద్ధిమంతులము మీరు బుద్ధిహీనులు మేము నాగరికులము మీరు మోటువారు మేము భాగ్యవంతులము మీరు దరిద్రులు మేము సుఖవంతులము మీరు కష్టజీవులు మేము పుణ్యాత్ములము మీరు పాపాత్ములు మాకు వైకుంఠము మీకు నరకము మావేదశాస్త్రములు సరియైనవి మీవేదశాస్త్రము లబద్ధములు మీకును మాకును సరిపడదని పెద్దల యుపదేశము సరిగాఁ దెలిసికొననేరక ప్రతిక్షణమును వ్యవస్థ నొందుచున్న దేశకాల పాత్రములం బట్టి నడుచుకొనక తీరని బ్రతుకు తీపియునోర్వ గేచ్ఛయుం దీర్ఘసంసారవశమున వ్యసనబద్ధులయి యుపే క్షింపనేరక యనాది సంస్కారముచేతఁ గర్మబద్ధులయి స్వకర్మాను సారముగా సుఖదుఃఖము లనుభవించుచున్నారు. పుణ్యపాప కార్మాను సారమయి సుఖదుఃఖాత్మకమయిన యస్వతంత్రపు బ్రతుకునందలి కష్టసుఖము లూపిరి యున్నంతవఱ కెట్టిమతము నవలబించినను దప్పవు తప్పవు. నిద్రాహారవిహార ప్రాయమగు నీబ్రతుకునందలి కష్ట సుఖములు కావడికుండలు. వేసవిం దపింపకతీరదు. శీతాకాలమందు వడఁకకతీరదు, శీతాతపబాధల నుష్ణశీతల వస్తుసేవచేత సరిపర్చు నుపాయము వెదకుకొనుట యెల్లశరీరధారులకు స్వభావమే తమ కెద్దికష్టమో యెద్దిసుఖమో యేప్రాణిమట్టు కాప్రాణి సహజముగా దెలియు. పరులు నేర్పకముంకు సహజపాండిత్యముచేతనే ప్రతి దేహియుఁ దన యుచ్ఛ్వాస నిశ్వాసము లెట్లు సరిపెట్టుకొనఁచుండునో

మఱి తన యూపిరిబిగబట్టుకొని బాధపడుటకు స్వభావముగా నెట్లొప్పు చుండునో పరులు తనకుఁ దన యూపిరి తీసికొనుటకును గ్రుక్కమింగు టకు నెట్లు నేర్పనవసరములేదో యాతీరుగానే యీ బ్రతుకునఁ దట స్థించు చున్న కష్టసుఖము లన్నియు సహజములే.

ఎండఱుజీవులలో యన్నివిధముల బ్రతుకుస్వభావములు-పసుపు సున్నము గలిసినపుడు పసుపుయొక్క పచ్చనిరంగును సున్నము యొక్క తెల్లనిరంగును రెండు గలసి యెఱ్ఱనిరంగుగా మాఱిన తీరున శబ్దస్పర్శరూపరసగంధగుణములతో నున్న యాకాశవాయ్వగ్నిజల పృథువులను పంచభూతముల సహజసమ్మేళన విశేషములచేతం బాంచ భౌతికగుణముల ననిపెట్టు చైతన్యమనంబడు తెలివి బొడముచున్నది మఱి యట్టి తెల్వి ప్రవర్తిల్లినంతవఱ కా పాంచభౌతికశరీరము జీవ చ్ఛరీర మగుచున్నది- యా తెల్వి పంచభూతముల సమ్మేళన విశేష విధానముం బట్టి స్థూలసూక్ష్మ వ్యక్తావ్యక్తదశ లందుచున్నది, ఆ తెలివి వ్యక్తముగా నున్నపుడు జీవచ్ఛరీరమనియు నా తెల్వి యవ్యక్త మగునపుడు మృతకళేబర మనంబడుచున్నది. వాస్తవముగా పసుపు నకుఁ గాని సున్నమునకుఁ గాని యెఱుపురంగు వ్యక్తీకరించుట సహ జము కానప్పటికిం బసుపుసున్నముల పరస్పరసమ్మేళన విశేషముచేతఁ బొడమి మఱియు నాపసుపుసున్నముల పరస్పర విశ్లేష విశేషముచేత నా రెంటి యందే యవ్యక్తదశ నంతరించిన తీరుగా నీ బ్రతుకు తెల్వి యంతయు నేపంచభూతముల పరస్పరసమ్మేళన విశేషముచేత వ్యక్తీ కరించెనో యట్టి పంచభూతముల పరస్పరవిశ్లేష విశేషానుసారముగా నా పంచభూతములందే యవ్యక్తమయి మృతకళేబరమున నవ్యక్త మయి యంతర్ధాన మగుచుండును. వ్యక్తావ్యక్తాత్మక పాంచభౌతిక స్వరూపుఁడై ప్రవృత్తి నివృత్తిస్వభావములం ద్రిగుణాత్మకుఁడై జాగ్రత్స్వప్నసుషుప్తుల గ్రీడించుచుంట వాసుదేవునకు స్వభావము.

"వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః" అను భగవ ద్వ్యాఖ్యానుసారముగాను "మాయామాత్రమిదం విశ్వమద్వైతం పర మార్థతః" అని శ్రుతింబట్టియును మదనుభవతర్కములం బట్టియుం జావుపుట్టువులు కష్టసుఖములు స్వప్నముం బసువుల కూడిక న్గలుగు నెత్తురంగువలె వ్యక్తీకరించిన యవ్యక్తతత్త్వమయిన నారాయణుని కన్న వేఱేవస్తువును యథార్థము కాదుకాదు. విశ్వము సత్యమే. విష్ణుదేవుండును సత్యమే "సదేవేదమగ్ర ఆసీత్కథమసతః సజ్జాయేత" అనునట్లును "హరిరేవ జగజ్జగదేవ హరిః హరితో జగతో నహిభిన్న తనుః" అనునట్లును "పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్" అను శ్రుతిప్రకారముగా దేవునికన్న నింకొక వస్తువే లేదు. మఱియును భూతభవిష్యద్వర్తమానములగు జగత్కార్యము లన్ని యును సకలకార్యకారణమును వాసుదేవుండే. ఉపచయాపచయాస్త రాళావస్థాత్మక పుం స్త్రీ నపుంలింగ విశేషముల నుద్భవస్థితి నాశము లను "సాక్షీచేతాః కేవలో నిర్గుణశ్చ" అను తీరుగా నొకప్పుడు సగు ణుండై తనకుం దా వేఱై నానారూపుల స్ఫురించుచు మఱొకప్పుడు నిర్గుణుండై నిర్లిప్తుండై సాక్షిమాత్రుండై యాత్మానందుండగు చున్నాఁడా వాసుదేవుండే-యీసూర్యుండీచంద్రుండీనమస్తగ్రహము లీ చుక్కలీజగమంతయును నీవును నేను వాఁడు నద్దియును మనః ప్రవృత్తిజన్య భూతభవిష్యద్వర్తమానకాల పదార్థము లన్నియును స్థూలసూక్ష్మ వ్యక్తావ్యక్త దశావిశేషభేదములం దోఁచుచున్నవి. కాని వాస్తవము జగతుయొక్క యుద్భవస్థితి నాశములు స్థూల సూక్ష్మ వ్యక్తావ్యక్త దశలన్నియు మ్మనోవికారములు నిర్విషయ మనస్సు వాసుదేవుండు కారణము సవిషయమనస్సు జగము కార్యము కార్యకారణములకు సూర్యునకు సూర్యకిరణములకువలె నామరూప భేదమేగాని నిక్కముగా వస్తుభేదము లేదు. అంతయును దేవుండే

యెందు కిట్లు కొట్లాడుకొని యుద్ధము న్గనుఁగొన్న పిచ్చుకవలెనీ నీడ నీవు చూచుకొని భ్రమించెదవు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను తీరుగా దేవునికన్న వేఱు వస్తువు లేనేలేదు. "యాదృశీభావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అను తీరుగా లాభనష్టములు రెండును సంకల్పవశములే వ్యవహారదశయందు సంకల్పాత్మక మగు మనస్సే జ్ఞేయజ్ఞానజ్ఞాతృరూపము లగుచున్నది. మఱియుం బరమార్థదశయందు కేవల సచ్చిదానంద లక్షణ పరబ్రహ్మ సమాధియోగ సుఖనిద్రా పరవశమగుచున్నది.

ఎందుకీ తెలిసీ తెలియని మెట్టవేదాంత చర్చ. పాటుపడి నీతోడిపాటి జనుల న్సుఖపెట్టి నీవు హాయిగాఁ గోరినన్నాళ్ళు బ్రతుకు కొనసాగించుకొనుటకై తెలిసీ తెలియని పిల్లకాయవంటినీకు హేయా దేయ వస్తువుల న్వేదశాస్త్రముఖముల న్సర్వజ్ఞులయిన పెద్ద లనాది కాలానుభవమున నారితేఱిన వారలై తల్లిదండ్రులు తమ పిల్లలకు వలెఁ గర్తవ్యాకర్తవ్యముల నెఱిఁగించుచున్నారు. కాఁబట్టి నీ జ్ఞాన లవ దుర్విదగ్ధతాహంకార గర్వము న్మానుకొని పెద్దల న్సేవించి కృతకృత్యుఁడవుకమ్ము. పెద్ద లుపదేశించిన శిష్టాచారముల న్నీవు నడచినకొలంది న్నిజముం బరమార్థతత్త్వము నీయంతట నీకే బోధ పడి కృతార్థుఁడవు కాఁగలవు. కావున నిట్లు వేదశాస్త్రరహస్యములు కేవలలోకోపకార తత్పరత న్వివరింప నీ వ్రాఁత ప్రవర్తింప వలసి వచ్చెను. వాసుదేవుఁడే "తత్సృష్ట్వా తదేవాను ప్రవిశ్య" అను తీరున విశ్వరూపుఁడై సత్త్వరజస్తమోగుణముల నీ జగన్నాటకమును నాటక సూత్రధారుఁడును, నటీనటులును సకల వేషములును నాటక ద్రష్టలుం దానేయై నవరసములం బుట్టించుచు రసాస్వాదన మొనర్చుచు రసాత్మకుఁడై తా నొక్కఁడే పెక్కురూపులై సృష్టి స్థితి నాశము లందుచుం నిర్నిద్రుఁడయ్యు నిద్రితునివలె నిర్గుణుఁ డయ్యు సగుణుని

మాడ్కి సర్వజ్ఞుఁడయ్యుం గించిజ్ఞునివలె నిత్యతృప్తుఁడయ్యు కోరిక కలవానివలె నిత్యముక్తుఁడయ్యు నబద్ధ ప్రసబద్ధునివలెఁ గ్రీడించుచుండుట యాపరమాత్మునకు సహజ ప్రవృత్తిలీలలు కనుక- "భవితవ్యం భవత్యేవ యద్భావ్యం తద్భవిష్యతి" అను విధమున "కానున్నది కాకపోదు కలదుచెన్నా" అను తీరుగా ననంతవిధముల నీ జగన్నాటకము జరుగుచున్నదని గురుకటాక్షమున బోధింపఁబడిన జీవుఁడు "ప్రకృతిః కర్త్రీ పురుషః పద్మపత్రాంబువన్నిర్లిప్తః" అను కపిలముని బోధను సరిగా గ్రహించి యీజగమంతయును స్వప్నమువలె దృఢముగా భావించి యాత్మజ్ఞప్రజ్ఞుఁడై యమనస్కయోగమున నచలుండయి శివుఁడై "మద్భక్తా మాం సమాయాన్తి" అను భగవద్వాక్యానుసారముగా నిర్గుణపరబ్రహ్మమగు వాసుదేవునే నవవిధ భక్తిమార్గములం భజించుచు కేవలము భగవద్భజనైక తత్పరుడయి సంసార మంతయు స్వప్నమనియుం భ్రాంతిజన్యము నెండమావుల వలె మిథ్యయు స్వమనః ప్రతిబింబమనియు దృఢముగా విశ్వసించి "సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ" అను తీరుగా నావాసుదేవ పరబ్రహ్మమందే కేవల భక్తియోగముచేత లయముచెంది నిత్యకైవల్యానంద పదవి నోలలాడుచుండును.

"ద్వాసుపర్ణా వేకః స్వాదుపిప్పల మత్త్యనోఽన్యఽనశ్నన్నభిచాకశీతి" అనుటచేత జీవాత్మ పరమాత్మలను రెండుపక్షులలో సగుణుఁడు జీవాత్మ. నిర్గుణుఁడు పరమాత్మ. సగుణుఁడైన జీవాత్మ జాగ్రత్స్వప్న దశలందు "లీలాయతీవధ్యాయతీవ" అనున ట్లహంకార మమకారములచేత బద్ధుఁడై కోర్కెయను ఫల మనుభవించుచున్నాఁడు. మఱియుం బరమాత్ముఁడు నిర్గుణుఁడు కావున నేకోర్కెయును లేని నమాధ్యవస్థ నున్నాఁడు. నిత్యతృప్తుఁడై యేకోర్కెయును లేకమఱే యనుభవమును లేకున్న పరమాత్ముఁడను పక్షి సహవాసము

జీవాత్ముఁ డను పక్షికి "తదాసంపన్నో భవతి" అనునట్లు సుషుప్తిదశ యందుఁ లభించినవుడా పరమాత్మునివలె నిర్గుణుఁడై యేకోర్కెయును లేక మఱే ఫలానుభవము ననుభవించక సంతృప్తుఁడై శాంతుఁ డగు చున్నాఁడు. నిత్యసంతృప్తుఁడై సమాధిసుషుప్తిదశ నేకోర్కెయును లేకున్నప్పు డాత్ముఁ డను పక్షి పరమాత్ముఁడనియును జాగ్రత్స్వప్న దశలందు కోర్కె ననుభవించునపుడు జీవాత్ముఁ డనియును సంజ్ఞలం జేర్కొనఁబడుచున్నాఁడు. అనఁగా నొక్క యాత్ముఁడే సగుణుఁడై క్రీడించునపుడు జీవాత్ముఁడై తనంతఁదాను సహజ లీలచేతం బెక్కు రూపుల స్వపరసవిశేషము ననుభవించు చాడుకొనుచున్నాఁడు. మఱియు నాయాత్ముఁడే నిర్గుణుఁడై తనయాటఁ జాలించుకొని శాంతుఁడై యేకోర్కెయును లేక "యత్రనాన్యత్పశ్యతినాన్యచ్ఛృణోతినాన్యద్విజానాతిసభూమా" అన్నట్లు కేవల సుషుప్తి సమాధి యోగనిద్రాముద్రితుఁడై బ్రహ్మానందపరవశుఁ డగుచున్నాఁడు. సగుణుఁడై సంసరించుటయును నిర్గుణుఁడై ముక్తుఁడౌచుంటయు నాత్మునకు సహజలీలలుగాని వాస్తవముగా నాత్మునకు బంధమోక్షములు రెండును లేవు లేవు ముమ్మాటికి న్లేనే లేవని బోధించు వైయాసిక జగద్గురు శంకరాచార్య మతసిద్ధాంత మొక్కటియే యుక్తియుక్తము స్వథార్థానుభవ ప్రత్యక్ష ప్రమాణసిద్ధమును తక్కిన మునిమతము లన్నియుం బామరబోధకొఱకై దేవతలు ప్రతిమాస్వరూపములం దెల్పఁబడినట్లు వివిధ ద్వైతభావములచేత జగద్గురు బోధితమగు వ్యాససిద్ధాంతమునే దృఢపర్చుచున్నవి. జగద్గురు శంకరాచార్యబోధ సూర్యునివంటిది. తక్కిన మతగురువుల బోధ లన్నియును సూర్యునివలనఁగలిగిన తేజస్సులవంటివి. సరియే, యాజగద్గురు,ని బోధచేత నెవ్వరు కేవలాద్వైత బ్రహ్మానందపదవి ననుభవించుచున్నారోగాని యట్టి యద్వైతమతమ్ము నవలంబించుకొను శక్తి సాధన

చతుష్టయ సంపన్నులగు ముముక్షువులకుఁ దప్ప సంసారబద్ధులగు ప్రాకృతజనుల కెంతమాత్ర మబ్బదు. కనుక నభీష్టసుఖ మనుభవించఁ గోరిన జనులు కేవల లోకోపకారపరాయణులై భక్తపరాధీనుఁడును దీనబాంధవుఁడును దయాసముద్రుఁ డగు నీశ్వరుని నవవిధ భక్తి మార్గముల సేవించకతీరదు. భగవద్భక్తి లేని దురదృష్టవంతులకు నిశ్శ్రేయసానందము కలుగదు కలుగదు. "నకర్మణా న ప్రజయా న ధనేన త్యాగే నైకేఅమృతత్వ మానశుః" శ్రౌతస్మార్తకర్మము లాచరించుటచేతను గాని సకలభోగము లనుభవించుటచేతఁగాని దార పుత్రాది విభవమును సంపాదించుకొనుట చేతఁగాని సంసారదుఃఖ ముపశమించనే యుపశమించదు. "తాపత్రయాభీల దావాగ్ను లాఱునే విష్ణుసేవామృతవృష్టి లేక" అన్నట్లు సంతతమును జిత్తము భగవదాయత్తముచేసినం దప్ప మఱెట్లైనను నీసంసారదుఃఖము శాంతించదు. ముమ్మాటికి శాంతించనే శాంతించదు.

"బుద్ధిస్తాత్కాలికీ జ్ఞేయా మతి రాగామిగోచరా బుద్ధిం నవ నవోన్మేషశాలినీం ప్రతిభాం విదుః" వర్తమానవస్తు యథార్థతత్త్వ మును గనిపెట్టఁగలిగిన తెలివి బుద్ధి యనంబడు. మఱి యాబుద్ధి భవిష్యద్వస్తు యథార్థతత్త్వము గనిపెట్టగలిగినపుడు మతి యనఁబడు మఱి యా బుద్ధియే భూతభవిష్య ద్వర్తమానములను స్ఫుటముగాఁ దెలిసికొనఁ గల్గెనేని ప్రతిభ యనిపించుకొను చున్నది. తత్త్వము న్సరిగాఁ దెలిసికొని యక్కార్య మెట్లుకలిగెనో యట్టి కారణతత్త్వ మును సరిగా నెరింగినవాఁడు బుద్ధిమంతుఁడు. పంచేంద్రియములు సరిగాఁ బనిచేయుచున్నప్పుడు బుద్ధి పొడుమును. శరీరమారోగ్యముగా స్వస్థతతో నున్నప్పుడు వస్తుతత్త్వ వివేకములు కలుగును. శరీరమారో గ్యముగ నుంటకు దైవపౌరుషములు రెండును సమానకారణములే. బుద్ధిగ్రాహ్య వస్తుగుణానుసారముగాఁ బ్రవర్తింపఁగల్గుట కేవల పురుష

ప్రయత్న సాధ్యము. బుద్ధి బొత్తిగా గ్రహింపఁజాలని యతీంద్రియ
కారణమువల్లఁ గల్గు కార్యములు కేవల దైవసాధ్యములు. తల్లి
గర్భమునందు మిక్కిలి యవ్యక్తదశలోఁ దన బాహ్యాంతరేంద్రియ
ప్రవృత్తి యెట్లున్న నపుడు వస్తుతత్త్వవిచారణ సామర్థ్యము
గల యవ్యక్త దశ తన బాహ్యేంద్రియ ప్రవృత్తి వ్యక్త దశకు
హేతువగుచున్నదో యట్టి హేతువే దైవస్వరూపము - మోచేతి
కంకణమున కద్దమేలా యన్నట్లిప్పటి తన పంచేంద్రియ
ప్రవృత్తికి నిశ్చయముగాఁ దన పురుషప్రయత్నమే కారణమని వేఱే
నొక్క వక్కాణింపనక్కఱ లేదు. తన పురుషప్రయత్నానుసారముగా
సుఖదుఃఖానుభవమును దాఁ బొందుచుంట సకల జనప్రత్యక్షాను
భవమే కదా? మఱియును ఖగోళగతుల కతీంద్రియకారణము దైవ
కృత్యము. ఇంద్రియసాధ్య ప్రత్యక్షానుభూతకారణ మంతయుం
బురుషప్రయత్నజన్యమే. శరీరస్మృతి వ్యక్తముగా నున్నంతవఱకు
జాగ్రద్దశ న్దనకు హేయాదేయవస్తు చింత తప్పదుగా? శరీరస్మృతి
సన్నగిల్లి యవ్యక్తమైనకొలదిం సుషుప్తిదశ న్దన హేయాదేయ
వస్తుచింత బొత్తిగాఁ దనకు లేదన్న సంగతి సకలజను లెఱింగిన
సంగతియేకదా? కాఁబట్టి జాగ్రద్దశ న్దనకుఁ బ్రత్యక్షమగు వ్యవహార
మంతయును బౌరుషస్వరూపమే మఱియును దన సుషుప్తిదశ న్దనకు
బరోక్షమయిన మిగులంతయును దైవస్వరూపమే. జాగ్రత్సుషుప్తి
దశలు రెండు నన్యోన్యప్రవర్తక కారణములు కాకతీఱవని తెలిసికొన
గలవాఁడు బుద్ధిమంతుఁడు. తన జాగ్రద్దశయందు స్వకర్మానుసార
ముగా ఫలము కలుగుట ప్రతి జనునకుం బ్రత్యక్షానుభవమే కదా ?
కాఁబట్టి తన జ్ఞప్తికి రానంత సూక్ష్మదశలోఁ దన కర్మఫలముండుట
చేతఁ దన సుషుప్తిదశయందుఁ దా ననుభవించిన స్వకర్మఫల మిట్టి
దని తాఁ జెప్పఁజాలకున్నంత మాత్రమునఁ దన పురుషప్రయత్నము
తన సుషుప్తిదశలో నెద్దియును లేదనువాఁడు బుద్ధిహీనుఁడు. జాగ్ర

ద్దశనుండి సుషుప్తిని మఱియు స్వప్నషుప్తిదశనుండి జాగ్రత్తును దాఁ బొందుచుంట సర్వజనసాధారణ ప్రత్యక్షానుభవమేకదా ? కనుక జాగ్రత్స్వషుప్తిదశలు రెండును స్వకర్మఫలములే యని సిద్ధాంతీక రింపకతీరదు. జాగ్రద్దశాస్వరూపమగు పౌరుషమును సుషుప్తి దశా స్వరూపమగు దైవమును నిక్కముగా దైవపౌరుషములు రెండును స్వకర్మమూలములే. కాబట్టి దైవపౌరుషములు రెండు ననాది సంసారజనకమగు కర్మఫలమును జాగ్రద్దశయం దెఱింగియు సుషుప్తి నెఱుఁగకయు నే దేహధారియు ననుభవించకతీరదు. స్వార్థపరత మాని కేవల లోకోపకారపరాయణుఁ డగు సజ్జనుని చిత్తము జాగ్ర ద్దశయందుఁగూడ సుషుప్తి దశయందువలెనే స్వకర్మఫలమును విస్మృతి చెందించును గనుక నట్టి సజ్జనుఁడు జీవన్ముక్తుఁడై సుఖదుఃఖ పుణ్య పాప హేతుభూతమై ప్రతిక్షణము ప్రగొత్త యగుచున్న శరీరమును ధరించుచు నంసరించు చుండియు నట్టి తన దేహమునందు సర్పము తావిడిచిన పొరయం దభిమానము లేక చరించునట్లు తన క్షణిక దేహమందలి యభిమానము బొత్తిగా విడుచుకొనుటచేత స్వకర్మ ఫలమును బొత్తిగా నుపేక్షించి యతీంద్రియ ద్రష్టయైన ఋషిగా మాఱి నిష్కర్ముఁడై యహంకార మమకారముల నొదఁగి రాగ ద్వేషములు రెండును లేక యజ్ఞానులకు సంసారివలెఁ గన్పట్టు చున్నాఁడు కాని వాస్తవముగా "సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ" అను తీరుగా "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అనునట్లు నిత్యతృప్తుఁడై సర్వజనసముఁడై సర్వభూత దయామయుఁడై ప్రత్యక్షదేవుఁడై "ధియో యోనః ప్రచోదయాత్" అనునట్లు తన తోడిపాటిజనుల కెల్ల బుద్ధి గఱపుచున్నాఁడు.

"కర్మ సాక్షీ దినేశః కర్మరూపీజనార్దనః" అనుటచేత దైవ పౌరుషాత్మకోభయ కర్మమును భగవత్స్వరూపములే. పౌరుష మొండ

వంటిది. దైవము సూర్యబింబమువంటిది. సూర్యబింబమునకు మఱి యద్దాని కాంతికి వస్తుభేదము లేకున్నను వ్యావహారిక నామభేదములు పామర బోధకై కల్పితములయినట్లు దైవపౌరుష కర్మములకు రెండింటికి న్భేదము లేకున్నను నామభేదము లోకవ్యవహారార్థమై కల్పింపఁబడెను. కాలత్రయమును దెడ తెగక తిరుగు సంసారమును సుడి స్వకర్మ వశుఁడై త్రిప్పబడుచు స్థిర విశ్రాంతికై దేవులాడుచున్న ప్రాణి పురుష ప్రయత్నముచేత లోకోపకార మొనర్చుటకై దృఢసంకల్పము చేసి కేవల లోకోపకారమునకై మాత్రమే త్రికరణశుద్ధిగా ప్రయత్నము చేసినపుడు సహజముగా సంసారమను సుడి నవశుడై యెట్లు జీవుఁడు త్రిప్పబడుచున్నాఁడో యట్లే ప్రశమిత సకల సంసార భ్రముఁడై దైవ సహాయముచేత స్వవశుఁడై యభీష్ట విశ్రాంతి నైవల్యానంద పదవినోలలాడునని పెద్దలు మున్నాటి కేర్పరచిన సత్య సిద్ధాంతము సిద్ధాంతము. నిద్రవహార విహార సౌఖ్యమునకై పురుష ప్రయత్నముచేసిన స్నరే లేకమానిన స్నరే గాని పరమార్థ సంపాదనముకై పురుషప్రయత్నము తప్పక చేయక తీరదని జగద్గురు వుపదేశించెను. "ఉద్యమేన వినా రాజన్న సిధ్యన్తిహి పౌరుషాః! నహి సింహస్య సుప్తస్య ప్రవిశన్తి ముఖే మృగాః" అన్నట్లే శాంతికై పురుషప్రయత్నమును మిక్కిలి దృఢముగాఁ జేసి జాగరూకుఁడై స్థిర బుద్ధితో లోకోపకారముగాఁ బ్రవర్తించిన పరమభాగవతునిం దప్పక వాసుదేవుఁ డనుగ్రహించి సంసారసముద్రము న్దాఁటింపక మానఁడు. కోరికలం గోరుచుంటయును గోర్కుల న్నెఱవేర్చుకొనుటకై ప్రయత్నించుటయు నెట్లు పురుషునకు స్వభావమో యట్లే లోకోపకార పరాయణులగు తన భక్తుల కోర్కె లీడేర్చుట భగవంతునియొక్క స్వభావము స్వభావము.

ఊపిరి తీసికొనుట స్పర్శేన్ద్రియ ప్రవృత్తియు న్మాత్రమే భూపతనమైన పిదప శిశువునకుఁ గోరికయుంటఁ వెల్లడింపబడుచున్నది.

ఆ శిశు వేడ్చుటం బట్టి పాలు మొదలగు ద్రవపదార్థ మా శిశువు నోటం బోసినపుడు మ్రింగుటయు న్గాన్పించుచున్నది కాంబట్టి పిల్లకు నేర్పకయే స్వభావముగా నూపిరి తీసుకొనుట—కదలుటయును గల్గిన చేష్టలు. గ్రుక్క మ్రింగుట యాహారము కుడుపుటచేత మప్పంబడిన యాగంతుక చేష్టయే. తల్లి గర్భమున నున్నపుడా శిశువుయొక్క శరీరము తల్లి తిన్న యన్నమే మన్నుకుండరూపమునం బరిణమించి నట్లు పరిణమించెను. అన్నము పంచభూత సమ్మేళ విశేషమే. కాంబట్టి పంచభూతములయొక్క యొక విధమైన సమ్మేళన విశేషమే శరీర ముగాం బరిణమించి పుట్టి పెరుగుచుం దిరిగి యా పంచభూతములందే మంటివికారములు మన్నునందువలె నణంగుచున్నవి. కాంబట్టి బాహ్యాంతరేంద్రియ ప్రవృత్తు లన్నియుం బాంచభౌతిక వికారములే కావునం బంచభూతముల పరస్పర సమ్మేళన వియోగ విశేషముల వ్యక్తావ్యక్త దశలందుచు స్థూలసూక్ష్మస్థితులందుచున్నవి. కాంబట్టి కారణకార్యములుం బీజవృక్షములుం బ్రవృత్తినివృత్తు లుద్భవస్థితి నాశములు స్సత్త్వరజస్తమోగుణ విశేషముల న్గల్గు జాగ్రత్స్వప్న సుషుప్తు లన్నియు న్వేయేల యీ సమస్త జగత్కారణ కార్యకలాప మంతయును రేవగళ్ళవలెం బరస్పరకారణములయి యన్యోన్యాను స్యూతములయి ప్రవృత్తినివృత్తి దశల నాది మధ్యాంత రహితము లయి యవిచ్ఛిన్న సంసారచక్రముగాం బరిణమించుచు జ్ఞేయజ్ఞాన జ్ఞాతృరూపమయి శాశ్వత వాసుదేవపరబ్రహ్మమై యున్నది. శబ్దమును శ్రవణేంద్రియము మాత్రమే గ్రహించం గల్గును గాని తక్కిన యింద్రియములు గ్రహించం జాలకుండుటకుం గారణము శబ్దమునకును శ్రవణేంద్రియమునకును వస్తుభేదము రవంతయు న్లేకుండుటయే. కాంబట్టి జ్ఞేయజ్ఞాన జ్ఞాతలకు నామభేదమేగాని వస్తుభేదము లేనే లేదు. జగమంతయును జ్ఞేయజ్ఞాన జ్ఞాతృత్రితయ రూపుండైన యొక్క వాసు

దేవుఁడే "మాతా రామో మత్పితా రామచంద్రో భ్రాతా రామో మత్సఖా రాఘవేంద్రః.........నైవ జానే" నజానే అను జగద్గురు వాక్యముం బట్టి యాత్మకన్న వేఱే యథార్థ వస్తు వింకొక్కటి లేనే లేదు. సరే "మహాఋషీణా మ్మతయశ్చ భిన్నాః" ఇదమిత్థమ్మని నిరూపింప శక్యముగాక యందీయందకుండు వస్తువిచార మీమెట్ట వేదాంతిఁ మిటుండగాఁ దనకుమాలినధర్మము మొదలుచెడ్డబేరము లేదుగా? కాఁబట్టి స్వార్థపరతం బట్టియే లోకులను మంచి చేసికొన వలసి వచ్చెను. నిష్కామునకు లోకముతో నేమిపని? కాఁబట్టికోర్కి కలవాఁ డొరుల న్గొల్వక తన కోర్కె నెఱవేర్చుకొనఁజాలఁడు. తాఁ గోరిన నిద్రాహార విహారసౌఖ్యము లభించుటకై తగిన ప్రయత్నము చేయుచుఁ దన కబ్బినంత సౌఖ్యముచేత నెట్లోతృప్తిపడుచు దిన దిన ప్రవర్ధమాన తృష్ణాపరవశుఁడైన మనుష్యుఁడు సంసరింపక తీఱదు. పిల్లలకుం బెద్దలవలెఁ బరమకారుణికులైన మునులు ప్రాకృతజనులకు వేదశాస్త్రముఖములం జేసిన యుపదేశమును బాటించి బుద్ధిమంతుఁడు దేశకాల పాత్రానుసారముగాఁ బ్రవర్తించి యిహపరముల న్దరించు చున్నాఁడు.

"సర్వమాత్మైవ ఖలు కంకేనపశ్యేత్" ఈ జగమంతయును దేవుఁడే కదా? యిది-యది నే నను భేదబుద్ధి ప్రవర్తింపఁగలుగు టెట్లను ప్రశ్నప్రకార మీలోకమందలి యన్నిమతములు మఱి సకల వ్యవహారములు నెల్ల యాచారములుం బ్రవర్తనములును యథా శాస్త్రముగానే జరిగినవి జరుగుచున్నవి. మఱియుం జరుగఁబోవు చున్నవి. "కానున్నది కాకపోదు కందలచెన్నా" కాఁబట్టి యీవేద శాస్త్ర ప్రసంగములు మఱి యీ వితర్కము లీపూర్వపక్షము లీసిద్ధాంతము లీభేదవాదము లీయుపదేశము లీవ్రాఁత లన్నియు నుబుసుపోని మంగలి పిల్లితల గొఱుగుటలే "ఊరకున్న వాఁడే

యుత్తమ యోగిరా విశ్వదాభిరామ వినురవేమ" అన్నట్లు "అహం బ్రహ్మాస్మి పురుష ఏ వేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యమ్" అని నిశ్చయ జ్ఞానము కలవాఁ డులుకఁడు పలుకఁడు క్రుంగఁడు పొంగఁడు తెలిసియుం దెలియఁడు మఱి యట్టి జీవన్ముక్తుఁడు సమలోష్టకాంచనుఁడు సమశత్రుమిత్రుఁడుం ద్రిగుణాతీతుఁడై నిర్లిప్తుఁడై బంధమోక్షములు సుఖదుఃఖములుం బుణ్యపాపములెవ్వియు నంటకుండియుం బిల్ల కాయవలె సంకల్పమూర్తియై యాత్మతృప్తుఁడై యేకోరైయు నేకున్నప్పటికిం గోర్కెకలవానివలె నిర్గుణుఁడైనప్పటికి సగుణునివలె ముక్తుఁడైనప్పటికి బద్ధునివలె స్థూలసూక్ష్మకారణ దేహాతీతుఁడైనప్పటికి స్మఱి యింద్రియాతీతుఁడైన తురీయుఁడైనప్పటికి విశ్వతైజస ప్రాజ్ఞావస్థాధీనునివలె సకారణముగా స్వభావముగా బ్రహ్మానందరసావిష్టుఁడై "తస్మాద్విద్వాన్నైవదేత్ - వీవ నృత్యేత్" అను శ్రుతిప్రకారము చతుర్విధాభినయ నవరసాస్వాదన మొనర్చుచుం బిచ్చివాఁడని కొందఱు నేత్రాసి యని కొందఱుం బిశాచమని కొందఱు జడ్డివాఁడని కొందఱు నోమసకాఁడని కొందఱుం బనికిమాలిన సోఁజిపోతని కొందఱు సిగ్గులేని మొండిబండ యని కొందఱు చేతకాని త్రువ్వయని కొందఱు నపుంసకుఁడని కొందఱుం దెలిసిన మూర్ఖుఁడని కొందఱు లోకజ్ఞానములేని మొద్దుపశువని కొందఱు తెలిసీ తెలియని చపలుఁడని కొందఱు నిర్భాగ్యుఁడని కొందఱుం బోగరుపోతని కొందఱు గొంటెయని గొందఱు ప్రాతిగుండెయని కొందఱు పీఁడాకజాతి కోఁతి యని కొందఱు స్వేవలస్వార్థపరుఁడు సకలలోక వంచకుఁడని కొందఱు నేమో యదొక వ్యక్తియని కొందఱు వానికర్మము వానిది మనకేల వానిజోలి యని కొందఱును జ్ఞానహీనుఁడని కొందఱును సర్వజ్ఞుఁడని కొందఱు మహాత్ముఁడని కొందరు జీవన్ముక్తుఁడని కొందఱుం బరమభాగవతోత్తముఁడని

కొందఱవతారపురుషుఁడని కొందఱుం బుంభావసరస్వతియని కొందఱుం బరమసాధువని కొందఱుం బ్రత్యక్షదైవమని కొందఱు న్ననుచు నెవరి యెవరి బుద్ధికోలంది నెవ్వారు వారు తనుగూర్చి దూషణ భూషణంబులు చేయుచుండ "లీలావతీధ్యాయతీవ" అన్నట్లు శృంగారహాస్యకరుణ వీరశాంత భయానక రౌద్రాద్భుత బీభత్స రసముల న్నటించు మహానటుఁ డెవ్వఁడో యుగమున కొక్కఁడుంట మిక్కిలి యరుదు. మఱట్టి జీవన్ముక్తునిం బోల్చి త్రికరణశుద్ధిగా బ్రేమించి సేవించు సద్భక్తవంతులుం గూడ మఱింత యరుదు. నిత్య సత్యానంద వస్తువునకు న్సరి యీ పామరలోకమునకుం జాలదవ్వు. మొత్తము జనులందఱును సంసారబద్ధులు న్విపరీతబుద్ధులు నహంకార మమకార దూషితులై "పిల్లకాకి కేమితెలియునురా యుండవింటి దెబ్బ" అన్నట్లు పెంకెబుడుతలవంటి తెలిసీ తెలియని భ్రాంతచిత్తులే యని తెలిసిన సర్వజ్ఞులగు ప్రాచీన మునులు తల్లిదండ్రులు పిల్లలకు వలె చిన్నని బ్రతుకుత్రోవ వేదశాస్త్రముఖముల నుపదేశింపవలసి వచ్చెను.

"అష్టవర్షా భవేత్కన్యా నవవర్షాతురోహిణీ, దశవర్షా భవేద్గౌరీ, అతఊర్ధ్వం రజస్వలా" అనఁగా నెన్మిదేండ్లవయసు కన్యాత్వము గల్గియుండును. "కముకాంతౌ" కన్యాత్వ మనఁగా కామకేళి యందలి కుతూహలము మొలకయెత్తఁదగినస్థితి. "రుహసముద్భవే" రోహిణి యనఁగా సంభోగక్రియాసామర్థ్య మంకురించినస్థితి "గృవిశరణే" గౌరి యనఁగా నెడతెగని యథేష్ట సంభోగానంద పారవశ్యముచేఁ దనివితీఱని యింద్రియ విజృంభణస్థితి. "రంజ్ రాగే - వలచ్ ప్రత్యయః" రజస్వల యనఁగా మన్మథకేళి నోలలాడి తన్విగొని మఱికొంతసేవువఱకు న్నట్టుపడి యడంగి మితమైన సంభోగశక్తిగల స్థితి- ఆఁకలి ఛలి యెఱుఁగదు నిద్రసుఖ మెఱుఁగ దన్న. నెన్మిదేండ్ల

మొదలుకొని పదేండ్లు దాటువఱకున్న వయసుమాత్రమే చాపల్య మెఱుంగక సంభోగసామర్థ్యము స్త్రీవ్యక్తికి సంపూర్ణమై కన్న మిన్ను గానక తనకన్న వేఱులోకముంట తెలియక యచ్చిన్న ప్రవాహరూపమున నుబికి పొంగి పొర్లిపడుచుండును. కనుక నట్టి యెన్మిదేండ్లవయసు మొదలుకొని పదేండ్లవయసు దాటకముందే స్త్రీ వివాహిత యగునేని సంపూర్ణ సంభోగసామర్థ్యము కొఱంత వడకుంటచేత నాసతి చిత్తచాపల్యములేక పాతివ్రత్యమును నిల్పుకొనం దగిన మనోదార్ఢ్యమామరణాంతమువఱకు నిల్పుకొనం గల్గును. పదేండ్లవయసు మించి రజస్వల యనంబడిన స్త్రీ సంభోగవాంఛచేతం జిత్తము ద్రవించి పదనెక్కి మెత్తపడుటచేత సంభోగసౌఖ్య మొక వ్యసనముగా మరగి వ్యసనాయత్త చిత్తచాపల్యముచేత మనోదార్ఢ్యము కొఱంతపడి మర్యాద న్గాపాడుకొనంజాలదు. వచ్చీరాని వయసు సంభోగమునకు మఱి యంటీయంటని మనసు సంసారమునకుం గోరనికోర్కెలుం బెట్టని సొమ్ములు కదా? ఎన్మిదేండ్లకుం గామబీజము కన్నియయై మొలకెత్తందగిన స్థితిలో నుండును. తొమ్మిదేండ్లకు రోహిణియై మొలకెత్తును. పదేండ్లకు గౌరియై చిగురించును. పిమ్మట రజస్వలయై పుష్పించును. మఱియుం బదునొకండు మొదలు పదునాఱేండ్ల యీడువఱకు బాలయై ఫలించుచుండును. పదునెన్మిదేండ్ల శ్యామయై లేజవ్వనముదాటి ఋతువుతప్పకపూచి కాచి ఫలించుచు నిఱువదినాల్గేండ్లకు మహిళయై కన్యారోహిణీ గౌరీ రజస్వలాబాలా శ్యామాస్థితుల యనుభవ పాండిత్యమున ముదిరి యేవయసున నెట్లు ప్రవర్తించిన నెట్లు సుఖింపవచ్చునో యాయుపాయములు తనకంటెం బిన్నలకు బోధింపంగల సామర్థ్యము కలిగి ప్రస్ఫుట లోకజ్ఞానముతో సంసారము జరుపుకొనం గల్గును. ఇఱువదినాల్గు మొదలుకొని నలువది యెన్మిదేండ్ల యీడువఱకు లోలయైసకలలోకవ్యవహారముల నుభయ

లోకతారకముగాఁ దా నడిచి యొరుల నడిపించి కులమర్యాదల నరిగఁ గాపాడుకొని మంచి యిల్లాలను ప్రసిద్ధిం బొంది వృద్ధయై పుణ్యలోకముం దాఁజేరుటయే కాక తనభర్త యెట్టివాఁడైనను వానిం గూడఁ దనయొద్దకు రప్పించుకొని కైవల్యానందపదవి నోలలాడు దివ్యశక్తియై శాశ్వత జ్యోతిఃస్వరూపిణియై సర్వజగత్కారణమై ప్రకాశించుచుండును. కనుకనే "నష్టేమృతే ప్రవ్రజితేక్లీబేచ పతితే పతౌ, పంచస్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే" అని పరాశర ముని ధర్మ ముపదేశించెను.

ఎన్మిదేండ్ల కుపనయనము గావించి యా వటునిచేత బ్రహ్మచర్యము చేయించుచు నీలోపుగా వానికిం బన్నెండవ యేఁటఁ బెండ్లి కావించునెడఁ గన్యను పదేనవయేఁట రోహిణినిం బనునెన్మిదవయేఁట గౌరిని మాత్రమే వివాహము చేయవలయును. గర్భాధానము కాక ముందు పరాశరుఁడు చెప్పిన యెదాపదలలో నెవ్వరైనా యా బ్రహ్మచారికిఁ గాని వధువునకుఁగాని తటస్థించినప్పుడు పునర్వివాహములు తప్పక చేసితీరవలయును. మఱియును గర్భాధాన మైనపిదప భర్త న్గోలుపోయిన స్త్రీ భార్య న్గోలుపోయిన పురుషునిమాత్రమే మఱియుం భార్య న్గోలుపోయిన పురుషుఁడు భర్త న్గోలుపోయిన స్త్రీనిమాత్రమే నిజేచ్ఛానుసారముగాఁ బెండ్లి చేసికొనవచ్చును. ఎన్మిదేండ్లు మొదలు కొని పదేండ్ల యీడు దాఁటువఱకు స్త్రీకిఁ దొలుసారిగాని మలిసారిగాని జరిగిన పెండ్లి విధ్యుక్తము గనుక నట్టి దంపతులు శ్రౌతస్మార్త కర్మముల కన్నింటికిఁ దగినవారుని. గర్భాధాన మయినపిదప జరిగిన పునర్భూవిధురుల పునర్వివాహము కాలకామ్యకర్మము కనుక శ్రౌతస్మార్తకర్మములకుం బనికిరాదు పనికిరాదు.

## యథాశాస్త్రవివాహప్రమేయము

"అనర్థకః ప్రతినిధిః" అను పూర్వ మీమాంసం బట్టి వైదిక ధర్మముల కెంతమాత్రముం బ్రహ్మచర్యమున్నడిపి గృహస్థయి భార్యాం

దాఁఱగిన పురుషుఁడు గర్భాధానమయినపిమ్మట భర్త న్గోలుపోయి
పునర్భువయిన స్త్రీతోఁ జేసికొన్న పెండ్లి కామ్యము న్లౌకికము న్గాని
విధ్యుక్తము న్వైదిక మెంతమాత్రము న్గానేరదు కానేరదు. అయి
నను మొత్తముపైఁ బరాశరమతము యథేష్టముగా నన్యోన్య ప్రేమాను
బద్ధులగు స్త్రీపురుషులు వెల్లడిగా నొండొరుం బెండ్లాడి దేశకాల
పాత్రానుసారముగాఁ దమ తోడిపాటిజనుల కేభాధయు న్లేనివిధమున
సకల లోకోపకారకమగు గృహస్థధర్మమును నడుపుమనుటయే గాన
తమ తోడిపాటిజనుల యర్థప్రాణముల కే చేడ్పాటును రానీక
యన్యోన్యానురాగము గల స్త్రీపురుషులు యథేష్టముగా దేశకాల
పాత్రానుసారముగాఁ గామోపశాంతి కావించుకొనుట యథాశాస్త్ర
వివాహమే యగును. స్త్రీపురుషు లన్యోన్య ప్రేమానుబద్ధులై లోకుల
యర్థప్రాణములకే యపాయము రానీక సుఖించుట జంతువులన్నిటి
కిని స్వభావముగా దైవ మేర్పర్చిన పద్ధతియే. ప్రాచీనపద్ధతులను వర్త
మాన దేశకాల పాత్రానుసారముగా సకల లోకోపకారముగా సరి
పుచ్చుకొనుటయే నిక్కముగా బుద్ధిమంతుల లక్షణము. బుద్ధిమంతుల
యొక్క మంచి నడువడి యెప్పుడును లోకోపకారమే చేయక
మానదు మానదు. కాఁబట్టి దేశకాలపాత్రానుసారముగాఁ బ్రాచీ
నాచారములను మార్చుకొని ప్రవర్తించు తగు మనుష్యుల న్దెలిసీ
తెలియని స్వార్థైకపరులు లోకద్రోహులు శిష్టాచారపరాయణ
మ్మన్యులు పూర్వాచారదూరులని దూషించి యుభయలోకభ్రష్టులు
కాకమానరు మానరు. వెఱ్ఱిమొఱ్ఱి తర్కము న్మాని యహంకార
మమకారము లుడిగి భక్తజనాధీనుఁడు దీనజనశరణ్యుఁడు దయా
సముద్రుఁ డచింత్యవైభవుఁడు నగు నారాయణుఁడు స్వార్థరహిత
లోకోపకారులను రక్షించుననుట రూఢి గాన వాసుదేవునే సేవింపుఁడు.
మఱియు మన పూర్వు లెన్నియో యోచించి దేశకాలానుసారముగా

వివాహ గర్భాధాన ముహూర్తము లేర్పర్చిరి. కాఁబట్టి మిక్కిలి యెండ వేఁడిమి సహింప శక్యముకాకున్న విన్ధ్యకు దక్షిణముగా నున్న సేతుసమీప దేశములలో గర్భాధానాది శుభ ముహూర్తములు పూర్వశిష్టాచారములు నడువక విధిలేదని జరిపించుట మిక్కిలి ఘోరము. కాఁబట్టి దేశకాల పాత్రానుసారముగా ప్రాచీనపద్ధతులను మార్చుకొని బుద్ధిమంతులు సుఖింపవలయుననియే లోకోపకార పరాయణులగు ఋషుల ముఖ్యాభిప్రాయము. మనుష్యులు జంతువులు మొదలగు దేహధారు లందఱు స్త్రీపురుషు లెల్లరు నమ తోఁడిపాటి జీవుల కే బాధయును రానీక ఖొత్తునఁ గలసిమెలసి శరీరారోగ్యము చెడని తీరున యథేష్ట కామోపభోగము లందుటయే దేహధారణ ఫలము. నిద్రాహార విహారసౌఖ్యము యథేష్టముగా ప్రాణిహింస మాత్రము రవంతయును జేయక దేహారోగ్యము చెడనీక జనులందఱు నమ చిత్తమువచ్చినట్లు స్త్రీపురుషు లన్యోన్య సంభోగ మనుభవించక తీఱదు. జగమునందు ప్రాణిహింస చేయకూడదు. జనులదందఱు నమ తమ నిద్రాహారవిహార సౌఖ్యము యథేష్టముగా బాహాటముగా ననుభవించవచ్చును.

ఇది శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాస విరచితమగు జగజ్జ్యోతి
యందు పంచమశబ్ద మర్యాద నిర్వచనము.

# జగజ్జ్యోతి

## ఏడవ ప్రకాశము

### దైవ పౌరుష నిర్ణయ విచారణ

భూతకాలమున దైవ పౌరుషముల వల్లఁ బ్రాపించిన కష్టసుఖముల నరసి తత్తత్కారణముల నాలోచించుకొని జరిగిన పను లెట్లు జరిగెనో బాగుగఁ బరిశీలించి దైవపౌరుషములవలన వచ్చు కష్టముల నుండి యెట్లు తప్పించుకొన్నారో యాసాధనములు ప్రకృతోపయోగముగా నట్టి కష్టములు తప్పించుకొనుటకై సాధనములు సిద్ధపర్చుకొని భవిష్యత్కాలమునకు దైవమువల్ల గల్గఁబోవు నీతిబాధలనుండి తప్పించుకొను వెరవులు సిద్ధపర్చుకొని సుఖించు మార్గములను దప్పక వర్తమానమునఁ బ్రవర్తిల్లుచుఁ బ్రమాదము రవంతయును రాని విధమున మిక్కిలి జాగరూకులై మనుష్యు లన్నివిధముల ధర్మార్థ కామ మోక్షములను పూరుషార్థములను సంపాదించుకొనుటయే మనుష్య జీవితమందలి ముఖ్య ప్రయోజనముకదా? మును లుపదేశించిన చతుర్వర్గ సాధనోపాయములను గురుముఖమున గ్రంథమూలమునను మిక్కిలి లెస్సగా నేర్చుకొని విద్యాభ్యాసపాటవముచేతఁ గేవల లోకోపకారపరాయణులై స్వార్థపరతమాని ప్రవర్తిల్లు శిష్టాచారానుసారముగా దృఢవ్రతులై నదుద్యమమునఁ దమ పురుష ప్రయత్నము కొనసాగించుటకై సర్వశక్తియైన భగవంతుని వేఁడుకొనుచుఁ బరమభాగవతుల నెట్లు కాపాడవలయునో యాతీరుగా దేవుఁడు రక్షించి యిహపర సౌఖ్యముల నందించు నందించును. భూత భవిష్యత్కాలముల నగు గతాగత కార్యముల నెఱిఁగిన

మునులు వేదశాస్త్రముఖముచే ప్రస్తుత వర్తమానోపయోగమైన ధర్మార్థకామమోక్ష సాధకములుగా నేర్పఱచియే యున్నారు. బుద్ధిమంతులయిన మనుష్యులమ్మనుల యుపదేశము దేశకాల పాత్రానుసారముగాఁ బ్రస్తుతకాలమున నుపయోగించుకొను నుపాయము భగవత్ప్రేరితులయి కేవల పరోపకార బుద్ధితోనే శిష్టాచారములు ప్రకృతోపయోగముగా నెట్లు మార్చుకొనవలయునో యా దారులు తా మాచరించి యొరులచే నాచరింపించుటకై మాత్రమే ప్రయోజనముగాఁ దమ జీవితకాలమును వినియోగించుచు వాచికాంగికాహార్య సాత్త్వికాభినయముల న్లోకులకుం బోధించుచున్నారు. సంతతమునూనృతాత్మక భగవన్నామసంకీర్తనఁ గావించుచు వాచికాభినయ మొనర్చు సజ్జనులు కొందఱు దేవతార్చనము పార్థివపూజ యజ్ఞములు సూర్య నమస్కారములు నాంగికాభినయము చేయుచుఁ గొందఱు, సప్త సంతాన ప్రతిష్ఠచే నాహార్యాభినయము చేయుచు నేకాదశీవ్రతపరాయణులై స్నానసంధ్యావందన త్రిపుండ్రధారణ శౌచనియమపరులైన పుణ్యాత్ములు కొందఱు, కేవల పరమహంసలై సర్వసములై సంతత మందస్మిత వదనారవిందులైన మునులు కొందఱును లోకమున నరుదుగా వెలయుచున్నారు. ఆ స్వార్థవిముఖులా లోకోపకార పరాయణులా సర్వభూత దయాపరులా సూనృతవ్రతులా జితేంద్రియులా పరమ భాగవతుల ప్రవర్తన ననుసరించి యమ్మహాత్ముల బోధ లాలించిన మానవు లిహపరములఁ దరింపఁ గలరు కలరు.

మునులకు దప్ప సంసారుల కూపిరి యున్నంత వఱకుఁ బదార్థ తత్త్వజ్ఞాననిరూఢి కలుగదు. భూతకాలము మఱవు వచ్చు నుత్తర క్షణ మెట్లు జరుగునో నిశ్చయింపఁ దరముకాదు. సంశయము బాధించక మానదు. దృఢ విశ్వాసము స్థిరము కాఁబోదు. యథార్థముగా వేదశాస్త్రతత్త్వముబోధపడదు. దైవోపహతులునస్వాధీనేంద్రియులు

కాలవశులు కావున సంసారమను పెనుసుడిం జిక్కుకొని తప్పించు కొను శక్తిలేక గ్రుడ్డివాని మార్గము చూపుమని బ్రతిమాలుకొను సంధునివలెఁ బరస్పర సహాయమును వేఁడుకొనుచు నాధివ్యాధులకు లోనై విఫలమనోరథులగుచున్నారు. మఱి యీ సంసారులలో సంచరించుచుండియు నెవ్వరోకొందఱు మాత్రము దైవ కృపకుఁ బాత్రులై స్వార్థపరత లేక కేవల లోకోపకారమునకై మాత్రమే తమ పురుష ప్రయత్నము కావించుచు సంతత సంతుష్టాంతరంగులై పరమభాగవతులై యిహపరముం దరించుచున్నారు. స్వసౌఖ్యమాసించక కేవలము పరోపకారమునకు మాత్రమే బ్రతుకు సజ్జనుల నడవడి సూర్యకాంతివలెఁ గేవల ధూర్త ఘూకములకుఁ దప్పఁ దక్కిన సకల జంతువుల దృష్టి నలరింపక మానదు. అట్టి లోకోపకారపరాయణులు ప్రస్తుతకాలోపయోగముగా ధర్మము లెట్లు మార్చుకొనవలయునో తమ వాచికాంగికాహార్య సాత్త్వికాభినయాత్మక సత్ప్రవర్తనముచేత సహార్దివమును బోధించుచునే యుందురు. ఆ పుణ్యాత్ము లొనర్చు చతుర్విధాభినయములు సకల వేదశాస్త్ర సమ్మతమును సర్వలోక హితకారియు నగు నగును.

'తత్త్వమసి శ్వేతకేతో' అను నుపనిషద్బోధను బట్టి వాస్తవముగా నీ కుద్భవస్థితి నాశములు లేనే లేవు. స్వప్న జగమువలె జాగ్రత్ప్రపంచము కూడ మిథ్య నీవు నిర్గుణుఁడవు శివుఁడవు "అహం బ్రహ్మాస్మి" యనునట్లు "అశరీరమాత్మా" అను వాక్యానుసారముగా సంకల్పవికల్ప శూన్యుఁ డాత్మ నీవేయనియు నీకు హేయాదేయము లేనే లేదు "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" అనియును వేదశాస్త్రానుసారముగ గురువులు నీకు బోధచేయుచున్నారు. కాని యా బోధ నీకు స్థిరపడునంతవఱకు నీకీ ద్వైతబుద్ధి యుండక తీరదు. నీ తల్లిదండ్రు లెవరో నిజముగా నీవు తల్లికడుపునఁ బుట్టితివో లేదో యా

సంగతి నీకుఁ బ్రత్యక్షానుభవము లేనప్పటికి ననుమాన ప్రమాణము చేత నీ కన్నుల యెదుటం దల్లిగర్భమునుండి పుట్టి పెరుఁగుచున్న పిల్లలను జూచి నీవు కూడ నా పిల్లలవలెఁ దల్లి గర్భమునఁ బుట్టితి వనియును నీ యెఱుకను మరణము పొందుచున్న జంతువులవలె నీకుఁ గూడ మరణము వచ్చునని యును గేవల నమ్మికచేతఁ గదా నీకు జనన మరణములు తప్పకున్నవని నిశ్చయించుకొనుచున్నావు? "శాస్త్రి దృష్టం గురోర్వాక్యంతృతీయంచాత్మ నిర్ణయః" గ్రంథములు చదువు కొనుటచేతను గురూపదేశముచేతను మఱియుం దన యనుభవ మును బట్టియుం బదార్థతత్త్వజ్ఞానము నెఱిఁగి "ఇద మిత్థమ్" అని యెన్నకైన నిశ్చయించుకొనుచున్నారుకదా? శాస్త్రిములు గురు వులు "అద్వైతం పరమార్థతః" అని యెంత బోధించినప్పటి కూపిరి యున్నంతవఱకు జాగ్రత్స్వప్న సుషుప్తిదశల ననుభవించుచు ప్రపంచ దృష్టిని సుఖదుఃఖాత్మక సంసార మనుభవించక తీఱదు. స్థూల సూక్ష్మ కారణదేహములు మూఁడును నశించక గాని కైవల్యా నందముం జీవుఁ డనుభవింప నేరఁడు. ఈ మూఁడు దేహము లున్న వఱకును దన సుఖమును బొందుటకును దనకష్టమును బోఁగొట్టుకొను టకును బురుషప్రయత్నము చేయక తీఱదు కాఁబట్టి ఆధ్యాత్మి కాధి భౌతి కాధిదైవికము లను తాపత్రయ విశేషములను దప్పించుకొను టకై ప్రయత్నము దేహస్మృతి యున్న వఱకు శక్తి కొలందిని సహజ ముగాఁ బ్రతిదేహియుం జేయుచునే యున్నాఁడు.

ప్రాణులకు స్వకర్మానుసారముగా వచ్చిన బుద్ధియొక్క హెచ్చుతగ్గు స్థితులం బట్టి కొందఱు త్వరగా మఱి కొంద ఱాలస్య ముగా ననాది సంసారసముద్రమును దాఁటుచు ముక్తులగుచున్నారు. కొంత శక్తితో నడువ నుంకించువారికిఁ గేలూఁతయిచ్చి వేగముగా నడిపించినట్లు ప్రాకృతు లల్పజ్ఞానులగు మనుష్యులకు వేదశాస్త్రి గురు

బోధలు కేలూఁత యిచ్చి త్వరగా సంసారసముద్రము న్దాటి చు
సాధనములయి సహజసిద్ధములయి దైవకృపచేత నీలోకమున ననాది
గానవిద్యతోనే కలిసివచ్చుచు కట్టెలతోఁ గలిసి యా కట్టెలను
రూపుమాపు నగ్నివలె విద్య యవిద్యను రూపుమాపి త్వరలోఁ గాని
యాలస్యముగాఁ గాని జీవుల నందఱి సంసారబంధ విముక్తుల
న్గావింపక తీఱదుతీఱదు. అవిద్యామూలమగు సంసారబంధము స్వభా
వముగా జీవుల కెట్లు వచ్చెనో యట్లే సహజముగా విద్యామూలమైన
మోక్షముగూడ కలుగకమానదు. మరణ మెన్నటికైన రాకతీరదని
తెలిసినప్పటికి మరణమును తప్పించుకొనుటకై సహజముగా పురుష
ప్రయత్నము చేయకతీఱదుగా? మరణము దైవికము. తన చావు
పుట్టువులు తనకుఁ బరోక్షములు. తన ప్రత్యక్షానుభవములో లేవు.
తన యుద్భవస్థితి నాశస్వరూపక భూతవర్తమాన భవిష్యత్కాలము
లందు జీవితకాలమంతయును దన స్థితిరూపక వర్తమానకాలమే.
తనకుజ్ఞప్తి రాకముందుఁగాని భవిష్యత్కాలమందుఁగాని తన సంగతి
యేమో తా నిశ్చయించి చెప్పఁజాలఁడుగదా? కాఁబట్టి తనకు దేహ
స్మృతి యున్నకాలమే మఱి యట్టి కాలమందుఁ దన యింద్రియ
గ్రాహ్యములగు పదార్థములుమాత్రమే తన యదార్థములు. తన
కింద్రియస్పృష్టములు కాని పదార్థములు శశవిషాణములు గగనార
వింద‌ములవలె నసంభవములు. నామమాత్రావశిష్టములుగాని
యథార్థములు కావు. తాఁ దన యింద్రియశక్తికొలఁది దన శరీర
స్మృతి యున్నవఱకు నని పెట్టుచున్న ద్రవ్యగుణకర్మ సామాన్యవిశేష
సమవాయా భావములను సప్త పదార్థములు "ప్రమితి విషయాః
పదార్థాః" ప్రమితి యనఁగా వస్తుతత్వమువివేచనము చేయఁగలుగు
శరీరస్మృతి పరిణామస్వరూపక నిశ్చయబుద్ధి విశేషము. తనకుఁ
బరోక్షమైన తన జననమరణదశ లెట్లుండునో మఱి ఈజగదుద్భవస్థితి

నాశ మూలమేదియో యాసంగతి వేదశాస్త్రము లెంత శోధించినను గురువు లెంత బోధించినను మఱెంత తల్లక్రిందుగాఁ దప మొనరించి నను నిశ్చయముగా నవిద్యామూలము పౌరుషస్వరూపమగు నీ శరీర జ్ఞప్తి కెంతమాత్రమును గ్రాహ్యము కాదుకాదు. కాఁబట్టి దైవ మన్న పదార్థమే శశవిషాషాణమువలె నసంభవము. ఈ దేహస్ఫూర్తి కేవల పౌరుషమయమే కావున నిట్టి దేహేంద్రియ జ్ఞప్తికి లోఁబడి స్పష్టమగు జగమంతయును బురుషకారమే కనుకనే సజ్జనులు "పరోప కారార్థ మిదం శరీరమ్"అని స్వార్థపరత మాని లోకోపకారముగా నడిచి కేవలము తమ మంచి నడువడిచేత తమ తోడిజనులకు లోకోపకారక ధర్మప్రవర్తనమును సూనృతవ్రతులై సర్వభూతదయా పరులై స్వార్థపరత యొక్కింతయు లేక నిత్యమన స్తృప్తి స్వరూప కైవల్యానందము సంఘటకుం బురుషప్రయత్నము కన్నమఱెద్దియును సాధనమే లేదని మనోవాక్కాయ కర్మముఁ ద్రికరణశుద్ధిగాఁ బ్రతి క్షణము లోకులకు వెల్లడించుచుం దమ మంచి ప్రయత్నము కొన సాగి లోకోపకారముగా ఫలించినపుడు కేవల దైవకృపయే యట్టి మంచికిఁ గారణమని తమ లోపలనే భగవన్మాహాత్మ్యమును మెచ్చు కొనుచుఁ దమ సదుద్యమము కొనసాగనపుడు తమ ప్రమాదాలస్య ములచేతను మఱియుం దమ పురుషప్రయత్న లోపముచేతను లోకు లకు సదుపాయము చేయలేకపోతిమని జాలిపడుచుందురు. కాని దుర్జనులవలెఁ దమ బుద్ధివిశేషముచేత జయమును మఱి దైవలోపము చేత నపజయమును గల్గునని యెంతమాత్రమును జాటరు. ఇంతేగాక నిక్కముగా లోకోపకారపరాయణులగుసజ్జనులు తమయంతరాత్మలో మాత్రము దైవమును బ్రతిక్షణమును ధ్యానించు చుండియును తాము దైవభక్తులమని కసింతయు న్లోకులకు వెల్లడి చేయనేచేయ కహర్నిశమును లోకోపకారమునకై మాత్రమే తమ జీవితమంతయును ధారపోసెదరు.

సుషుప్తిదశవంటి మోక్షమును మఱియును స్వప్నమువంటి చోదనా లక్షణధర్మమును గూర్చి సంసారులు స్వార్థత్యాగులై కేవల లోకోపకారపరాయణులైన సజ్జను లీసంసారమున నున్నారా? యేరీ యొక్కరైన నగపడరు? జీవితేచ్ఛయు నన్నపానముల స్వదేహ శరీరసౌఖ్యమును గలిగించికొనుటకు నిద్రాహారవిహారసౌఖ్య మనుభవించుటకు మాత్రమే సహజముగాఁ బాంచభౌతిక సచేతన శరీర ప్రవృత్తి కలుగుచున్నదికదా? శరీరజ్ఞప్తి లేనివానికి జగమే లేదు కాఁబట్టి యట్టిజనుఁడు సుషుప్తునివలె లోకోపకారముగాఁ బ్రవర్తింప నేరఁడు శరీరజ్ఞప్తి యున్నవాఁడు తన శరీరము నిలుపుకొనఁదగిన నిద్రాహారవిహార సౌఖ్యమును గావలసినంత సంపాదించు కొనుటకు మాత్రమే తన పురుషప్రయత్న మెంతవినియోగించినను జాలకుండును గదా యట్టి సంసారి స్వార్థపరత మానుకొనుట యస్వాభావికము మఱి యసంభవము. "స్వయం తీర్ణాః పరాంస్తారయంతి" అనునట్లు తా బ్రతికి యున్నపుడు గదా యితరుల బ్రతుకును గూర్చి యాలోచించఁగలఁడు. తా నొనర్చుఁ ల తన పురుషప్రయత్న మంతయును దన శరీర పోషణముకే చాలునపుడు తన బ్రతుకు మానుకొని యితరుల బ్రతుకుకై యెవ్వఁడైన బాటుపడవాఁ డున్నాఁడనుట బొత్తిగా వెఱ్ఱిమాట గగనారవిందమువలె నసంభవము కదా? కాని, లోకములోఁ దనసౌఖ్య మెఱుఁగక తనకు సుఖ మెట్లబ్బునో కష్ట మెట్లు వచ్చునో యాసంగతి తెలిసికొనక పసిపాపవలె వస్తువివేకము లేనివా ఱుండఱును సంసారులు, నిత్యానిత్య వస్తువివేకముగల జితేంద్రియులు సూనృతవ్రతులు కృతప్రతిజ్ఞులు తపోధనులు స్వార్థత్యాగులు లోకోపకారముకై పాటుపడుచుఁ గేవలము దేహధారణమునకై మాత్రమే లోకోపకారము చేయుటకు మాత్రమే తగినట్లు నిద్రాహార విహారముల నియమించి సర్వలోకోపకారముగాఁ దము యాత

జీవమును గడుపుచుం గోటి కొకరు స్వార్థత్యాగులై లోకోపకారము నకై తమ పౌరుషము న్వినియోగించువా రుంటయును గ్రహము లందు భాస్కరుఁ డధికకాంతిం బ్రకాశించు స్వభావమున వెలయు నట్లు స్వార్థపరతకన్న లోకోపకారపరాయణత యధికముగాఁ గల్గు పుణ్యాత్ముఁడు యుగమున కొకఁడైన గౌతమ వ్యాసులవలెఁ బ్రాచీనులలో శంకరాచార్య ప్రభృతులవలె నర్వాచీనులలో నుంటుటకూడ నసంభవ మనరాదు:

కాఁబట్టి లోకోపకారపరాయణులై పురుషప్రయత్నము గావించు పరమభాగవతుఁడగు సజ్జనుఁడు చుక్కలలోఁ జంద్రునివలె యుగమున కొకఁ డుండకతీఱదు. అట్టి కేవల లోకోపకారపరాయ ణుఁడై మూర్తిభూత ప్రత్యక్షదైవము నిద్రాహారవిహార తత్పరత లట్టి పుణ్యాత్మునియందు స్వార్థపరతంబట్టి యెంతమాత్రముం బ్రవర్తిల్ల నేరవు. ఒకరూపాయిలో కోటిభాగములలోఁ గోటియవ భాగము లెక్కలోమాత్రమే యుండునుగాని ప్రత్యక్షముగా ద్రవ్య రూపముగాఁ బొంద నసాధ్యమైనటు లాపుణ్యాత్ముని నిద్రాహార విహారములయందలి స్వార్థపరత శూన్యముగానే యెంచకతీఱదు. అమ్మహానుభావుఁడు కేవల లోకోపకారక ధర్మమూర్తియే యని సిద్ధాంతీకరింపక తీఱదు తీఱదు. లోకులందఱాపరమభాగవతుని బోధ చొప్పున నాచరించి యిహపరములం దరింపవలయును వలయును. తల్లిని బిల్ల యాశ్రయించి హేయాదేయ వస్తువివేకము న్సంపాదించు కొను విధమున వేదశాస్త్రములఁ జదువుకొని లోకోపకారప్రవర్తకు లగు పెద్దల నడువడిఁబట్టి మంచిచెడ్డలం బిన్న లెఱిఁగి యొరులను సుఖ పెట్టి తాము సుఖపడుటకై పురుషప్రయత్న మొనరించకతీఱదు.

ఆవగింజ కంటె కగపడుచున్నది దానిలో సగపాలు విభజిం చి చూడఁగలము మఱి యాసగపాలులోఁ బదాఱవభాగము న్గూడ నొక

విధమగు సూక్ష్మదర్శియగు నద్దము సాయముచేతఁ జూడఁగలముగాని యద్దాని నొక కోటిభాగములుగా విభజించుటకుఁగాని యట్టి సూక్ష్మతమ పరమాణు వున్నదని బుద్ధిచేత నిశ్చయింకవచ్చునుగాని పంచేంద్రియముల నేదానిచేతనైనఁ బరికింపశక్యముకానా ? ఇంద్రియాతీతమై యున్నమాత్రముచేత నావగించక ద్వ్యణుక త్ర్యణుక పరమాణువు లుండవని చెప్పవచ్చునా? యట్లేయింద్రియాతీతములగు పరమాణువులు లేవనరాదు. వాయుజలాగ్ని పృథ్వీభూతము లన్నియుఁ బరమాణు రూపముల చేరికచేతనే మహాద్రూపములై యింద్రియగ్రాహ్యము లగుచున్నవి. మహాద్రూపముననున్న యగ్నియొక్క మహాదుష్ణశక్తి పరమాణు రూపమున నున్న యగ్నికిఁ బరమాణూష్ణశక్తి యుండక తీఱునా ? కార్య మింద్రియ గ్రాహ్యము. కారణ మతీంద్రియము. కార్యము మహత్తు కారణ మణువు. ఈ జగత్కార్యమునకు దేవుఁడు కారణము. కార్యకారణములకు మహదణు దశాభేదముతప్ప వస్తుభేద మెద్దియును లేదు కాఁబట్టి "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితిశాంతి ఉపాసీత" అనియు "హరిరేవ జగజ్జగదేవహరిః" అనియును "పురుష ఏవేదగ్ంసర్వమ్" అనియును వేదశాస్త్రములు బోధించుచున్నవి. కనుకనే రాగద్వేషములను రెండింటిని దాటఁగి పరమభాగవతులు సర్వభూత సమ్మలై నిర్మలులై నిరహంకారులై సర్వభూత దయాపరులై శత్రు మిత్ర భేద మరయక సకల ప్రాణుల కుపకారకముగా స్వార్థపరత లేక మనోవాక్కాయకర్మములం ద్రికరణశుద్ధిగా లోకోపకారముకొఱకు మాత్రమే తమ జీవితము ధారవోయుచు సకల ప్రాణి సంరక్షణమునకై యన్నివిధములచేత మూర్తీభవించిన సత్యదయలవలె నీ సంసారమున సంచరించుచుందురు "ధియో యోనః ప్రచోదయాత్" అను గాయత్రీమంత్ర మా వివేకులయెడ సఫల మగుచున్నది. "వాసుదేవః సర్వమితి సమహాత్మా సుదుర్లభః" అను

భగవద్వ్యాఖ్యానుసారముగా నట్టి పరమభాగవతోత్తములు లోకమం దుంట గాని యుండినను లోకులచే గుఱుతింపబడుట గాని మిక్కిలి యరుదు. అతీంద్రియ వస్తు విచారణమువలె లోకాతీత పరమభాగ వతుల తలంపేల? ప్రస్తుత మింద్రియగ్రాహ్యములగు పదార్థములలో మనుష్యు లాదేయము లెవ్వి మఱి హేయము లెవ్వియో దేశకాల పాత్రోచితముగాఁ బరీక్షించి చెప్పఁ దగిన పండితులు నిరపేక్షులై సహజముగాబోధింపకమానరుమానరు. కావునవర్తమానకాలమునకుఁ బనికివచ్చిన విధముగా లోకులు తమ నిద్రాహార పద్ధతులను బరస్ప రానుకూలముగా మార్చుకొని యన్యోన్య ప్రేమానురాగములతో నిహాపరసౌఖ్యములఁ గైకొను విధ మెఱిఁగింపవలసియున్నది. ఏ కాల మున కేసంగతి యెట్లు జరుగవలయునో యట్లు జరుగక తీఱదని తెలిసి యును సర్వజ్ఞులయిన మునులు వేదశాస్త్రము లేల యుపదేశించిరో యని వివేకవంతు లాలోచించి పురుషప్రయత్నమునఁ బ్రమాదాల స్యములకు సందోసంగక నిస్పృతి ధర్మమార్గములఁ గన్పర్చిరి. పరమ ధర్మమునకును లోకవ్యవహారమునకు నాకాశమునకుం దక్కిన భూత ములకువలె భేదముదృశ్యాదృశ్యమైయున్నది. ఇహమునఁదిన్నగా సర్వ జనానుకూలముగా సంచరించిన వానికే యిహపరసౌఖ్యము కలదు. లోకుల యనుగ్రహమునకుఁ బాత్రుఁడు కాని దుర్జనున కిహాపర సౌఖ్యము లేదు. మఱి యాస్వార్థైకపరుఁ డుభయలోకములకుం జెడును.

## శబ్ద ప్రపంచ నిత్యోత్పత్తి

ధర్మార్థకామ మోక్షములను పురుషార్థములలో ధర్మము వేదశాస్త్రముల విచారణస్వరూపము. మోక్షము బ్రహ్మవిచారణ రూపము. "అథాతో ధర్మజిజ్ఞాసా - అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను ధర్మ బ్రహ్మజిజ్ఞాసలతో నీలోకవ్యవహారమునకు సంబంధ మేమియును

లేదు. ఆవగింజలో కోటియవభాగముయొక్క తత్త్వవిచారణమువలె నతీంద్రియద్రష్టలగు ఋషులకు మాత్రమే యాధర్మ బ్రహ్మవిచారణ ముతోఁ బనిగాని సంసారుల కర్థకామములను రెండు పురుషార్థముల విచారణముతోనే యవసరముగాని ధర్మమోక్షములను పురుషార్థ విచారణము తలకుఁ దగినపని. కాఁబట్టినిద్రాహార విహారసౌఖ్యమును సకలలోకానుకూలము సర్వజన సమ్మతము సంపాదించుకొనఁ దగిన వర్తమానకాలోచితమార్గమును వెదకుకొనవలసియున్నది. నిద్రాహార విహార సౌఖ్యమును లోకసమ్మతముగాఁ బొందుటకై చేయవలసిన చతుర్విధాభినయ విశేషము లెట్లుండవలయు ననఁగా - వాచికాభినయము గూర్చి-వాచికాభినయ మనఁగా నభిప్రాయము మనుష్యాది జంగమప్రాణుల నోటిపలుకుచేత నితరులకు వెల్లడించుట. నోటిపల్కున కంఠధ్వని అకంఠధ్వని శ్రుతి స్వరజాతి మూర్ఛనాత్మకముగాను మఱియు నచ్చులు హల్లులయొక్క వ్యవస్థగల కేవల వర్ణాత్మకము గాను వ్యవహరింపఁబడు చున్నది. వైఖరీ సంజ్ఞం బరగు మనుష్యుల కంఠధ్వని "అగ్నిమీళే పురోహితమ్" అని యుచ్చరింపఁబడు చతుర్వేదాత్మక శబ్దాత్మక చ్ఛందస్సనియును లౌకిక వ్యవహారోపయుక్తమగు "గౌః-అశ్వః భార్యా-పుత్రఃగృహమ్" ఈ మొదలగుశబ్ద ప్రపంచము భాషయనియు సంకేతితము లయినవి. మొత్తముపై మనుష్యాది జంగమప్రాణుల కంఠధ్వని దేవభాషయనియును దేశ భాషయనియును రెండు విధములు, సర్వభాషల కేశబ్దము వృక్షమునకు బీజమువలెఁ బుట్టిల్లో మఱియును సకల దేశభాషా విశేషము లే భాషలోనికి మార్చి కావలసిన యర్థము చెప్పుటకుఁ దగిన ప్రకృతి ప్రత్యయము లేర్పర్చఁ దగియుండునో నుతే శబ్దమాత్రము ప్రాణికృతమైనను మఱియు జడజన్యమైనను సహజమైనను కృత్రిమమైనను యంత్ర సంభూతమైనను గాత్ర సంభూతమైనను కేవలము శ్రుతిలయ

విశేషములం బట్టి యేయాధ్వని యేవస్తువులనుండి యే కారణముచేఁ గలుగుచున్నదో మఱి యాధ్వనియొక్క యభిప్రాయమెద్ది యో యాశబ్దము సజీవోపాధికమో లేక నిర్జీవ వస్తువునుండికలుగుచున్నదో యావిధమును సూలంకషముగా నేశ్రుతిలయ విశేషములు సచేతనా చేతన సకల వస్తు జన్య శబ్ద తత్త్వము నతీంద్రియ ద్రష్ట లెఱుంగు చున్నారో యట్టి స్వరకాల స్థాన ప్రయత్న విశేష సంభూతమగు ధ్వని దేవభాషయు సంస్కృతము శాస్త్రీయముగాఁబడును. లోకము లోని యన్ని శబ్దములు సంస్కృతభాషలోనికి మార్చి కావలసిన యర్థము చెప్పవచ్చును. కారణ మేమనఁగా భౌతికశాస్త్రముచేత ననంత సంఖ్యాకములైన సూర్యకిరణములకుఁ బ్రత్యేక మొక్క కిరణ మొక్కొక్క గుణము కల్గి తక్కిన కిరణములకన్న భిన్న జగత్కార్యములగుచున్నది. అరుణపీతాది సంజ్ఞల సూర్యకిరణముం దేడు రంగులని సులభ బోధకై చెప్పఁబడెను. మఱియును సూర్యునకు వేయి కిరణములని కూడ సులభ బోధకై యేర్పఱుపఁ బడెను. వాస్తవము తర్కించి చూడఁగా సూర్య కిరణము లనంత సంఖ్యాకములు మఱియు నొక్కొక్క కిరణ మొక్కొక్క గుణము కలిగి యొక్కొక్కవిధముగా జగమున నొక్కొక్క కార్యమునొదవించుచున్నది. పామర దృష్టికిసూర్యుఁడు జిబ్బివలె గుండ్రడగ బింబాకారమున మింట నగపడు చుదయాస్తమయముల నెఱ్ఱగాను నడుమింట మూసలోఁ ధళధళ(గరఁగుచున్న ధాతువువలెఁ గన్పట్టుచున్నాఁడు. నానా వర్ణ ములన్నొ త్తముపై లోకములోఁ బ్రచురింపఁబడు నెఱుపు పసుపు నీలి మొదలగు కొన్ని రంగులతో మఱియును లోకాతీతమగు కొన్ని రంగుల కూడికను సంధ్యారాగమున సూర్యకిరణము లగపఱచు చున్నవి. సూర్యకిరణమే యీ జగమునందలి సర్వజడచేతనాత్మక వస్తువుల నెద్దియో యొక వర్ణ విశేషమునఁ బ్రకాశింపఁజేయునట్లు

దేశభాష సంస్కృతము శాస్త్రీయభాష నాఁబరగి ధ్వన్యాత్మక వర్ణా
త్మక శబ్ద స్వరూపమై సకల బ్రహ్మాండభాండమున కాకాశమువలె
నంతర్బహిఃపూర్ణమై నిత్యమై సర్వజగత్కారణమై పరాపశ్యన్తీ
మధ్యమావైఖరీ మూలమైన నాదబ్రహ్మమే దేవభాష యనంబడును.

ఆ దేవభాషయొక్క మొదటి ప్రతినిధివికారము "అగ్నిమీళే
పురోహితమ్" అని చతుర్వేదాత్మకమై మానవుల వైఖరీ రూపమున
వ్యవహృతమగు శబ్దస్వరూపము ఛందస్సనియును మఱి యావేద
చతుష్టయము వివరించు శిక్షా వ్యాకరణ చ్ఛందో నిరుక్త జ్యోతిష
కల్పాత్మక వాఙ్మయము దేవభాషయనియును మఱియును వ్యాసాది
ముని విరచిత స్మృతి పురాణేతిహాసాది వాఙ్మయ మార్షయనియును,
కాళిదాసాది ప్రాకృత మనుష్య విరచిత రఘువంశాది కావ్యవాఙ్మ
యము కేవల భాషయనియును, లోకవ్యవహారమునకు మాత్రమే
యుపయుక్తమగు వాఙ్మయము ప్రాకృతమనియు, ననాదిసంప్ర
దాయసిద్ధ సంజ్ఞలం బరఁగుచున్నది. మనుష్యాది సకలజీవు లేయే
యభిప్రాయములతో నెట్లెట్లు పల్కుచున్నారో యాయాశబ్దవిశే
షము లతీంద్రియ ద్రష్టలగు మునుల కెఱుక కావుననే "మానిషాద
ప్రతిష్ఠాంత్వమగమః శాశ్వతీస్సమాః యత్క్రౌంచ మిథునాదేక
మవధీః కామమోహితమ్" అని వాల్మీకముని యార్షభాషం బల్కెను.
పురువులు సరీసృపములు పక్షులు మృగములు మనుష్యులు నానావిధ
జంగమస్థావర ప్రాణులగు స్థూలసూక్ష్మదేహు లందఱుం జేయు శబ్ద
ములకును జడవస్తుజన్య ధ్వనికిని దేశకాలపాత్రవిశేషస్థితి నెఱిఁగిన
యతీంద్రియద్రష్టలగు మును లీశబ్దస్వరూప మిద్ది యీశబ్దముయొక్క
యుత్పత్తిస్థాన మిద్ది యీశబ్దముయొక్క స్వరకాలస్థాన ప్రయత్న
స్వరూప మిద్ది యీశబ్దముయొక్క యభిప్రాయ మిద్ది ఈ శబ్ద
ప్రవృత్తికిఁ బ్రయోజన మిద్ది ఈశబ్దముయొక్క యుద్భవస్థితినాశముల

కారణ తత్త్వ మిద్ది యని యనంతసంఖ్యాక వేదశాస్త్రముఖముల
ననాదికాలమునుండియు సర్వజగ దుపకారపరాయణులై ప్రాకృత
జనులం దరింపఁజేయు నభిప్రాయముచేత జతుర్విధాభినయ విశేషముల
నెల్లడించిరి. పర్వతములుగాఁ బడియున్న యపరిమిత సంఖ్యాక
వేదరాశులలో బ్రహ్మదేవుఁడు లోకరక్షార్థమై మూఁడు పిడికిళ్ళ
మాత్రము తీసి ఋగ్యజుస్సామవేదములను పేర్లుపెట్టి ఋషులకుం
బంచి యిచ్చెనను పురాణోక్తి ననుసరించి "యథాలోక స్తథా
వేదః" లోకమే వేదము వేదమే లోకమందు జరుగుచున్న దంత
యును వేదమందుఁ జెప్పఁబడేయున్నది మఱి వేదమం దున్న విధ
మే లోకమందు జరుగుచున్నది. "ధాతాయథా పూర్వ మకల్పయత్"
వేదములను జ్ఞప్తిచేసుకొని వేదోక్తానుసారముగా బ్రహ్మదేవుఁ
డీజగమును సృజించె నను పురాణోక్తిప్రకారముగా నీజగత్తునందు
వినఁబడుచున్న నానావిధ శబ్దజాల మంతయుం వేదభాషయే "సర్వం
ఖల్విదం బ్రహ్మ-హరి రేవజగత్" అనుటచే దేవుఁడే యీజగ మంత
యును "యచ్చ కించి జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా, అంత
ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణఃస్థితః" అను శ్రుతింబట్టియు
దేవునికన్న వేఱేపదార్థ మీజగతి న్లేనప్పుడు దేవభాషకన్న వేఱే
భాష యీలోకమున లేదని సిద్ధాంత మేలచేయరాదు? కాఁబట్టి
దేవభాషనాఁబడు సంస్కృతభాషయే సకలలోక వ్యవహారభాషలను
ప్రాకృత దేశభాషల కెల్ల జనని యని పెద్దల సిద్ధాంతము. ఇంద్రియ
గ్రాహ్యమగు శబ్దమున కాకాశమున ఘటాకాశ పటాకాశ విభాగము
వలె దిక్కులకూర్ధ్వాధః ప్రాక్పశ్చిమాదివిభాగమువలె దేవభాషనాఁ
బరగిన యాకాశగుణమగు శబ్దమునకుఁ బ్రకృత వైకృతాపభ్రంశాది
విభాగములుం బ్రకృతిప్రత్యయములుం దదర్థవిశేషములం బరఁగు
నాచికాభినయము దేశకాల పాత్రోచితముగా ననాదికాలము

నుండియు ననేకవిధముల మాఱుపు చెందుచు లోకమున వ్యవహ రింపఁబడుచున్నది. సర్వజన సామాన్యముగా నభిప్రాయ మిచ్చు శబ్ద విశేషములు నవరసాత్మకములై మిక్కిలి పరిమిత సంఖ్యాకములై కేవల ధ్వన్యాత్మకములై యుదాత్తాది నానావిధ స్వరగ్రామతాన మూర్ఛనములతో నఖిలదేశములందు వ్యవహరింపఁబడు శబ్దవిశేష ములు సర్వదేశ భాషామూలమగు దేవభాషయు సంస్కృతభాషయు నాఁబడఁదగును. ఏ వాచికాభినయ విశేషము సామాన్యముగా సమస్త దేశజనుల కన్యోన్యాభిప్రాయ సూచనము కావించునో యాభాషయే దేవభాషయు సంస్కృతమునాఁ బరఁగును. సృష్టికర్తచేత సర్వజన సాధారణముగాఁ దత్తదభిప్రాయముఁ దెలియఁబడఁదగున ట్లే శబ్దము కేవల ధ్వన్యాత్మకముగాని వర్ణాత్మకముగాని యేర్పర్చఁబడెనో యట్టి శబ్దమునకే దేవభాష యనిగాని సంస్కృతభాష యనిగాని సంజ్ఞలను వహింపఁదగును. కేవల శ్రవణమాత్రముచే నితరుల యభిప్రాయ సూచన మేశబ్దము కావించునో యద్దియే సకలలోక సామాన్యభాష యగు దేవభాష యనియును సంస్కృతభాష యనందగును.

ఆకాశమువలె సర్వజన సంవేద్యమయి ఏ శబ్దము ప్రకృతి ప్రత్యయవిభాగ మేర్పాటుచేయుట కవకాశము లేదో ఏ శబ్దార్థము కేవల శ్రవణేంద్రియముచేతఁ దప్ప మఱే యింద్రియములచేత నైనను గ్రహింపశక్యము కాదో యట్టి సకలజనసామాన్య సంవేద్య మగు శబ్దమునకే దేవభాషయనియును సంస్కృత మనియుం బేర్లుఁ దగును. సర్వజనులకును సామాన్యముగాఁ బరస్పరాభిప్రాయములను దెల్పఁ జాలని "అగ్నిమీళే పురోహితమ్" శబ్దములును గ్రాంథికశబ్దములును తక్కిన వ్యావహారిక శబ్దములును దత్తద్దేశ కాల పాత్రానుసారముగా నుద్భవస్థితినాశముల నానావిధములుగాఁ బృథివ్యప్తేజో వాయు తత్త్వములు మాఱుచున్నట్లు మాఱుచున్న యనిత్యానర్థకానుకరణ

డిత్థాదిశబ్దములను దేవభాషా సంజ్ఞకు న్గాని సంస్కృత ప్రాకృతాప
భ్రంశవిశేషసంజ్ఞకుఁ గాని తగవు తగవు. తత్తద్దేశకాల పాత్రాను
సారముగా లోకులు తమలోఁదాము కల్పించుకొన్న ఘుణాక్షరముల
వలె నెట్లు గ్రహించిన వారి కట్లు నానావిధాగణిత భిన్నాభిప్రాయము
లిచ్చు కృత్రిమవాక్కులే యీ జనులందు వ్యవహరింపఁబడు వేద
శాస్త్రాత్మక గ్రాంథిక శబ్దజాలమును సంస్కృతప్రాకృతాది వాఙ్మయ
మంతయును ఏ శబ్దము తనకు స్థూలముగా మిక్కిలి స్ఫుటముగా
వినఁబడియును దన చిత్తమున కే వికార మొదవింపక మఱియుఁ
దా నితరులకుఁ దెల్పశక్యము కాకుండునో యట్టిశబ్దమే దేవభాష
మఱి యా శబ్దమే నిత్యనిర్గుణావ్యక్త సకలజగత్కారణమగు శబ్ద
బ్రహ్మము. పాంచభౌతిక శరీరోపాధిచేతఁ బంచేంద్రియముల శక్తి
కొలంది పంచభూతగుణములగు శబ్దస్పర్శరూపరసగంధముల సహజ
సామాన్యానుభవము సకల దేహధారులకుం దప్పదు. ఆర్యులైనను
మ్లేచ్ఛులయినను ద్విపాత్తులయినం జతుష్పాత్తులయినను జంగమ
స్థావర ప్రాణులకుఁ జైతన్యము సమానమే యగునట్లు వినుట తాఁకుట
చూచుట చవిగొనుట మూర్కొనుటయును సకల జంతుసామాన్య
సహజధర్మములే, ఆకాశమందుఁ బ్రాగాది దిగ్విభాగవిశేషములు
కృత్రిమములు వ్యావహారికములు వాస్తవములు కావు. "వాచారం
భణం వికారో నామధేయమ్" అను శ్రుత్యనుసారముగా సహజము
నిత్య మపౌరుషేయమగు నాకాశగుణమయిన శబ్దము శ్రోత్రేంద్రియ
గ్రాహ్య మగుటయే యాశబ్దముయొక్క వాస్తవతత్త్వము, ఆ శబ్ద
మునకు స్వరకాలస్థాన ప్రయత్నవిశేషస్థిత్యర్థము లనిత్యపౌరుషేయా
సత్యమిథ్యాకల్పిత కార్యములుగాని సకల జగన్నిదానా పౌరుషేయ
సహజవాస్తవ శబ్దబ్రహ్మతత్త్వముకాదు. సహజముగాసఁ బ్రకృతి
పురుషసంయోగమున జగత్సృష్టి యగునట్లు శ్రుతిలయల యోగం

మున శబ్దప్రపంచోత్పత్తి యగుచున్నది. కేవల నిర్గుణబ్రహ్మమందు నానావిధ నామరూపాత్మక జగత్తారోపితమైనట్లు కేవల నిర్గుణ నాద బ్రహ్మమునందు నానాప్రకృతి ప్రత్యయాత్మ శబ్దప్రపంచ మారోపిత మగుచున్నది. బ్రహ్మమునందు జగము- రజ్జువందు సర్పము- నాద మందు వైఖరియు నారోపితములు భ్రాంతికల్పితములుగాని వాస్తవ ములు కావు కావని పరమాప్తులగు గౌతమవ్యాసాదిమునుల మతము దృఢముగా నమ్మినపుణ్యాత్ము లుభయలోకములం దరించుచున్నారు పులుపు, తీపి, వగరు, చేదు ఒబ్బు, యుప్పులను వ్రడసములు తత్ద్దేశకాలపాత్రానుకూలోపాధికములుగాని వాస్తవములు కావు. ఒకరి పులు పింకొకరికిఁ దీపి యగున ట్లొకరికి హాయిగానున్న ధ్వని యింకొకరికిం గర్ణకఠోరము. ఒక్కరియన్న మింకొక్కరికి విషము కనుక శబ్దమునకుఁ బ్రకృతిప్రత్యయ నిర్ణయము ఉదాత్తాది స్వర నిర్ణయము భాషానిర్ణయమును భ్రాంతచేష్టములు గాని వివేకకృత్య ములు కావుకావు. కాఁబట్టి యేశబ్ద మే యర్థమున నుచ్చరించుటకుం బసినాఁటనుండియు సహవాసవశమున నలవాటుపడునో యట్టి శబ్దార్థ ములఁ గూర్చితన తోడిపాటి జను లేపద్ధతులు నిర్ణయించిరో యా పద్ధతుల ననుసరించి గ్రహించిన సంగతులు తన బుద్ధి కొలఁది నితరులకు జతుర్విధాభినయ విశేషముల నెఱిఁగించుటకుఁ బ్రయత్నించుట జంగమప్రాణులకు నైజము. ఒక్కనీటికే సముద్రము నది సరస్సునూయి కాలువ మొదలగు నామవిశేషము లారోపితము లయిన ట్లొక్క శబ్దమునకే స్వరకాల స్థానప్రయత్నవిశేష భాషా గ్రంథము లారోపితములయి లోకవ్యవహారమున కుపయోగించు చున్నవి. ఆర్యప్రాణమునకును మ్లేచ్ఛప్రాణమునకును వస్తుభేదము లేనట్లు శబ్దమునకు సంస్కృతాపభ్రంశ భేదము కృత్రిమముగాని వాస్తవము కాదు. ఎట్లు భావించిన నట్లు జగము తోఁచకమానదు.

వాస్తవముగాఁ దన కెవ్వఁడును శత్రువుం గాఁడు మిత్రము న్గాఁడు శత్రు మిత్రత్వ మహంకార మమకార భావనా కల్పిత ములు గాని వాస్తవములు కానట్లు శబ్ద మందలి సంస్కృతాప భ్రంశభేదములు కల్పితములును వ్యావహారిక సత్యములు గాని సహజములుం బారమార్థిక సత్యములు కావు. పురుషుడు లయ-ప్రకృతి శ్రుతి-ప్రకృతి పురుషుల సంపర్కము జగత్కార్య హేతువు. శ్రుతి లయల సంయోగము ధ్వనికార్య హేతువు శ్రుతి లయలు రెండు నిత్యము లవ్యక్త కారణములు పారమార్థిక సత్య ములు ధ్వని వ్యావహారిక సత్యము అనిత్యకార్యము. మొట్టమొదట క్షణకాల మాత్రము వినఁబడి వివరింపఁబడ శక్యముగాని ధ్వనికి శ్రుతి యని సంజ్ఞ అనేక సూక్ష్మధ్వను లొండొంట చేరుకొని వినఁ బడుటకుఁ దగిన స్థూలదశ నందఁదగిన యవకాశము లయనాఁబడును. "క్రియాంతర్మధ్యవర్తి కాలో లయః" బ్రహ్మమువలె నిర్గుణము లయ. ప్రకృతివలె సగుణము శ్రుతి "యద్దృశ్యమ్ తన్నశ్యమ్" కాఁబట్టి అమృత నిత్య సత్య పారమార్థిక వస్తుతత్త్వము నిత్యాసత్య వ్యావ హారికబుద్ధి విషయము కానేరదు "ప్రమితి విషయాః పదార్థాః" అను న్యాయ సూత్రము శాఖాచంద్రవత్తుగా బాలబోధకై యుపపాదింపఁ బడెను గాని మర్త్యా నిత్య బుద్ధికి నిత్యామృతత్వము నిర్ణయింప శక్యముకాదు. ఈజగత్కార్యమున కీశరీర హేతువగు తలిదండ్రుల వలెఁ బ్రకృతి పురుషులు కారణమని యనుమాన శబ్ద ప్రమాణ ములు మాత్రమే యాధారములు సరే, సుషుప్త్యవస్థ యనుభూత మయినప్పటికి సుషుప్తవస్థను గుఱించి "ఇదమిత్థమ్" అని యేసంగతి యును నిశ్చయింప శక్యము కానప్పుడా సుషుప్త్యవస్థా వర్ణనమునకు దొరఁకొనుట బొత్తిగా వ్యర్థమగు పిచ్చిపని. వర్ణింపశక్యముగా కను మాన శబ్దోభయ ప్రమాణ మాత్రైక గమ్యమగు పరమార్థ వస్తు

చింత మనకేల? ప్రత్యక్ష వ్యవహారములను గూర్చి హేయాదేయ
వస్తువిచారణ మొనర్చి లోకోపకారము కావించుటయే యీ బ్రతు
కున యుపయోగము. కాఁబట్టి దేశకాల పాత్రానుసారముగాఁ బ్రస్తు
తము లోకోపకారమగు రీతిం జతుర్విధాభినయ ప్రయోగనైపుణ్యము
తెలిసినంతవఱ కజ్ఞుల కుపదేశించుచు లోకోపకారముగా సజ్జనుఁడు
నడుచుటకై పూరుషోద్యమము చేయువలయును.

## పురుషార్థ చతుష్టయ జీవనస్థితి

స్వప్న జాగ్రద్దశా ప్రపంచానుభవమున కీదేహస్మృతియే
మూలకారణము. త్రిగుణాత్మకమగు శరీరస్మృతియే మూలప్రకృతి.
ఈ స్మృతి యను త్రిపురసుందరి నిర్గుణుఁడగు పరమపురుషునియందు
నిర్లిప్తమగు నాకాశమునఁ దక్కినభూత సంయోగ వియోగవిశేషము
వలె నధ్యస్తమైయున్న దను సాంఖ్యమతము మిక్కిలి సయుక్తిక
మనకతోఁచదు. "ప్రకృతిః కర్త్రీ పురుషః పద్మపత్రాంబువన్నిర్లిప్తః—
అసంగోహ్యయం పురుషః" అను సాంఖ్యసూత్రము నుపనిషద్వాక్య
మును బురస్కరించుకొని లోక రక్షాపరాయణుఁడై సర్వజ్ఞుఁడై
గౌతమబుద్ధుఁ డేమి యుపదేశించెనో యద్దియే సాక్షాచ్ఛివుఁడైన
జగద్గురు శంకరాచార్యుఁడు నుపదేశించెను. బుద్ధుఁడును శంకరుఁడును
ప్రతిపాదించిన తత్త్వ మొక్కటే. బుద్ధమతమునకును జగద్గురు
మతమునకును భేదము రవంతయును లేదుభయులును సర్వజ్ఞులే
సకలభూత దయాపరులే సకల లోకోపకార దీక్షావ్రతులే. ఆ యుభ
యుల బోధ స్వయముగా నాలించిన పుణ్యాత్ములా కాలమం దుండు
భాగ్యముఁ కలవా రగుటచే సుఖయలోకములం దరింపఁగల్గిరి. క్రమ
క్రమముగా నయ్యిద్దఱు మహాత్ముల యుపదేశములకు విపరీత
వ్యాఖ్యానము లొనర్చుకొని జ్ఞానలవదుర్విదగ్ధులు బౌద్ధుల మనియు

నద్వైతుల మనియుం జెప్పుకొనుచు స్వార్థపరులై భూతదయకు బదులు భూతహింస చేయు మతాచారములకుం గారణమైరి. తనకు ప్రత్యక్షమై ప్రత్యక్షోపమానాప్తవాక్య ప్రమాణత్రయగోచరము కాక లోకవ్యవహారమునకు రవంతయుం బనికిరాక పదివేలేండ్ల క్రిందట నున్న తన వృద్ధప్రపితామహుం డెట్టివాఁడో యని ప్రమాణమున వర్ణింపఁ దొరఁకొనుటయాకసమును దొలుచుటకుం జేయు ప్రయత్నము వలెఁ బిచ్చికాదా? సరే! జగత్కార్యము సహేతుకమని గాని సహజము నిర్హేతుక మనియుం గాని యుక్తులు చెప్పి స్థిరపర్చుట నుసరించు ప్రాకృతజన లోకోపకారక మెంతమాత్రము న్గాదు. నిష్ప్రయోజనము నీలోకమున కుపయోగముకాని చింతనందుట పిచ్చి. వివేకియగు మనుష్యుఁ డహంకార మమకారము లున్నంత వఱకును దేహస్మృతి యున్నంతవఱకు లోకోపకారముకొఱకై తన జీవితము నుపయోగించినపుడే యాతఁడు పుట్టిపెరిఁగిన సార్థక్యము. "నకర్మణాన ప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వమానశుః." అను శ్రుతిప్రకారము త్యాగముచేతఁ దప్ప నితరవిధముచేత శాశ్వతానందపదవి లభించదు. త్యాగమనఁగా స్వార్థపరత లేక లోకోపకారక మగు ధర్మమార్గము తప్పకనడుచుట, "ప్రమాణ ప్రమేయేత్యాది తత్త్వజ్ఞానాన్ని శ్రేయసాధిగమః" అను న్యాయమతమును స్థాపించిన యక్షపాదుఁ డగు గౌతమహర్షి యును "పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యమ్" అను శ్రుతిచొప్పున "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" అని ప్రతిపాదించిన యద్వైతమతస్థాపకుఁ డగు సత్యవతీసుతుఁ డగు వేదవ్యాసమునియును సర్వప్రాణులకుం బరమాప్తుఁడు గౌతమమహర్షి మతావలంబి యగు గౌతమ బుద్ధుఁడును "వ్యాసో నారాయణో హరిః" వ్యాసమూర్తిగా నవతరించిన గోవిందశిష్యుఁ డగు శంకరాచార్యుఁ డుభయుల మతములకుం

భేద మొక్కింతయును లేదు. స్వార్థత్యాగ మొనర్చిన సకలభూత దయాపరుఁడై సర్వలోకోపకారకమగు ధర్మమార్గము తప్పక జీవ యాత్ర గడుపుకొను పుణ్యాత్ముఁడు నిత్య సంతుష్టాంతరంగ స్వరూపక శాశ్వత కైవల్యానంద మందును. త్యాగ మనఁగా వైరాగ్యము, స్వార్థపరత లేమి వైరాగ్యము - లోకోపకారపరాయణతచేత స్వార్థ పరతలేమి యగు వైరాగ్యము సిద్ధించును. "సర్వంవస్తుభయాన్వితం భువినృణాం వైరాగ్యమేవాభయమ్" అను భర్తృహరి వాక్యాను సారముగా నహంకార మమకార మూలమగు భోగవాంఛ మాను కొని పరోపకారమునకై మాత్రమే జీవించునతఁడే విరాగి యనం బడును. త్యాగమనబడిన వైరాగ్యము. వైరాగ్య మనఁగా "సర్వేజనాః సుఖినోభవంతు" అని త్రికరణశుద్ధిగాఁ గోరుచుఁ దన తోడిపాటిజనుల ప్రేమానురాగములకుఁ బాత్రుఁడై వారిని సుఖపెట్టి తా సుఖపడుపద్ధతి వైరాగ్య మనంబడును. ధర్మమోక్ష సాధక మార్గములగు శ్రౌతకర్మాచరణమునందును మఱి సన్న్యాసాశ్రమ ధర్మాచరణమందును ప్రత్యవాయము రానీక ప్రవర్తింపఁదగినవార లతీంద్రియ ద్రష్టలగు ఋషులు తప్పఁ బ్రాకృతు లింద్రియ వివశు లల్పజ్ఞులగు మానవు లొక్కింతయును సమర్థులుకారు. "లౌకిక వ్యవహారేషు యథేష్టం చేష్టతాంజనః, వైదికేషుతు మార్గేషు విశే షోక్తిః ప్రవర్తతామ్" అను మహోపాధ్యాయ వర్ధమాన వాక్యాను సారముగా నతీంద్రియ ధర్మమోక్షములను పురుషార్థము లతీంద్రియ ద్రష్టలగు ఋషులు సాధించనీ యింద్రియాధీనులగు నల్పజ్ఞ ప్రాకృత మర్త్యులు కేవల మర్థకామములను పురుషార్థములను సాధించు కొనుటకై యెవ రెవరి కేయే నడువడి స్వభావసిద్ధమో యాయా విధముగా నర్థకామములను పురుషార్థములను జనసమ్మతముగా నంపాదించుకొనవచ్చును. అర్థకామములను పురుషార్థములను సంపా

దించుకొనుటలోఁ దనతోడిజనుల కెట్టివిధముగానైన బాధరానీక తమ యిష్టానుసారముగా నడువవచ్చును. జనరంజకనుగా నున్నఁజాలును, జనార్థాభినయము లెట్లుచేసికొన్నం బరమార్థహాని లేదు. పరులను సంతోషపెట్టి యర్థకామముల నెట్లు ప్రవర్తించినను దోషములేదు. కాఁబట్టి తనతోడిపాటివారి ప్రేమానురాగములు సంపాదించుకొను విధముగఁ దా నెట్లు భోగించి యర్థకామముల నెట్లు సుఖించినను సుఖింపవచ్చును. అతీంద్రియ ద్రష్టలగు ఋషులు తప్ప నితరులకు ధర్మమోక్షములను పురుషార్థములఁ బొందు సమర్థు లెంతమాత్రము న్గాను కారు. దేహస్మృతికి ధర్మమోక్షములు కేవల మగోచరములు. అర్థకామములు మాత్రమే యీ శరీరస్మృతికీమ ర్త్యబుద్ధికి విషయములు. ఈ లోకవ్యవహారము స్వప్నజాగ్రద్దశలఁదు సత్యమే. లోక వ్యవహారము సత్యముకానిచో వేదశాస్త్ర ప్రవృత్తి వ్యర్థమేకదా? కాఁబట్టి యీలోకము వాస్తవమే. యీలోకమున వ్యవహరించు మనుష్యులకుఁ దత్తద్దేశకాల పాత్రోచితముగా నాచరింపఁదగు సకల వర్ణాశ్రమధర్మము లవశ్యానుష్ఠేయములు అని సిద్ధాంతీకరింపక తీఱదు.

"భుక్తభోగాం జహాతి, నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి, పాదోఽస్య విశ్వాభూతాని, కామిగాక మోక్షకామిగాఁడు" అను వాక్యములం బట్టి నిద్రాహారవిహారకర్మ స్వరూపము దేహస్మృతి మూలమగు నీ లోకవ్యవహారము జీవుఁ డనుభవించక తీఱదు. సంపూర్ణముగా సగుణమగు నీ ప్రకృతిసంసృష్టజగత్కార్యము పాదోఽస్య విశ్వాభూతాని అనుటచేతఁ బరిమితము కనుక "త్రిపాదస్యామృతం దివి" అనుటచేతఁ బురుషుఁ డనుభవించి సంసారబంధమున నెట్లు చిక్కుపడినాఁడో యట్లే ప్రకృతిని సంపూర్ణముగా ననుభవించిన పిదప విడిచిపెట్టి వైరాగ్యవంతుఁడై ముక్తుఁడగుచున్నాఁడు. వెయ్యేల

మబ్బులే సహజకారణముచేత నిరాకారనిర్లిప్తాకాశము నలముకొని సాకారావలిప్తముగాఁ జేయుచున్నవో మఱి యట్టి సహజకారణము చేతనే "కాలరూపీ జనార్దనః" అనునట్లు కాలస్వరూపుఁడు నిర్గుణుఁడు నిర్లిప్తుఁ డగు పురుషునిం ద్రిగుణాత్మక ప్రకృత్యాత్మ సంసారము తనంతఁ గలిగియు చేయుచున్నది. వాస్తవముగాఁ బురుషుఁడగు జీవునకు సంసార బంధమోక్షకారణ మగు దేహస్మృతి రూపక జ్ఞప్తి యాకసమంతు మబ్బువలె నాగంతుక మనిత్యకార్యమును నధ్యారోపితము మిథ్యయును దౌవారికము ప్రాతిభాసికము భ్రాంతికృత మెండమావులవలె మాయగాని నిత్యస్వభావమును యథార్థము న్గాదు. "శివః కేవలోఽహమ్" అనునట్లు "అసంగోహ్యాయం పురుషః" అను విధమున నీలోకవ్యవహారమునకును జీవునకు మబ్బుల కాకసమునకువలె సంబంధ మొక్కింతయు లేదు. బుద్ధిభ్రమ చెందిన వెఱ్ఱివానికిం బిశాచరోగస్తునకును మద్యపాయికి న్మనోవికార వశమున లేనిపోని కల్పితవస్తువులు తోఁచునట్లు బుద్ధిమాంద్యము గల ప్రాకృతమనుష్యులకు మిథ్యాత్మకమగు నీ జగత్కార్యములీ నిద్రాహారవిహారతృష్ణయు సుఖదుఃఖాత్మక కర్మస్వరూపక సంసారము న్దోఁచుచున్నవి గాని నిక్కముగా బుద్ధిమంతులగు కపిలాదిమునుల కీప్రకృతి సంబంధానుభవమే తగులక శాశ్వత కైవల్యానందానుభూతియే "యత్రనాన్యచ్ఛృణోతి నాన్యత్పశ్యతి నాన్యద్విజానాతిన భూమా" అను బ్రహ్మస్థితియే మిగిలియున్నది. కాఁబట్టియే వేదమాతయగు గాయత్రీమంత్రజపముచేత మాబుద్ధి తిన్నబడుగాక యని ద్విజు లహర్నిశము న్గోరుచుందురు. స్వార్థపరత లేక పరోపకారమునకై మాత్రమే బ్రతుకుచు సర్వజనసములయిన పరమ భాగవతులు తక్క స్వపరభేదముతో స్వార్థైక తత్పరులై యహంకార మమకారములం బ్రతుకు మానవులందఱును బుద్ధిహీనులే కనుక నీసంసార

సముద్ర మెన్నఁడు నడువనేరక "పాదోఽస్య విశ్వాభూతాని" అనుట
చేతను త్రిపాదాత్మకామృత దీపమునకుఁ గ్రేనీడవంటి యీ జనన
మరణ ప్రవాహరూపక సంసారాంధకారమునుండి తామెన్నటికి
న్వెలువడనేరకుందురు. మూఁడుపాళ్ళమృతము దైవస్వరూపమున
నొకపాలీమర్త్యజగము, అమృతమనఁగా మాఱకుండు దివ్యసుఖము.
మర్త్యజగ మనఁగా "సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం
సుఖమ్" అనునట్లీ యెడ తెగని సుఖదుఃఖాత్మ సంసారబంధము, బుద్ధికి
లక్షణము వైరాగ్యము నందుట, వైరాగ్యము కలవారి లక్షణము
స్వార్థపరత యొక్కింతయు లేక కేవలము పరోపకారమునకై
మాత్రమే జీవితకాల మంతయు న్వినియోగపర్చుచు "సర్వేజనాః
సుఖినోభవంతు" అని యహర్దివమును జపించుచు లోకులందఱును
దన యావజ్జీవితకాలములో హాయిగా నుండున ట్లొనరించుమని ప్రతి
క్షణమును దేవుని వేఁడుకొనుచుండుట అట్టి వైరాగ్యవంతు లగు
పరమ భాగవతులే కవులనియు ఋషులనియును "నానృషిః కురుతే
కావ్యమ్" అను విధముగా ధర్మోపదేష్టలనియుం బేర్గొప్వాను, అట్టి
సజ్జనులు పరమాత్మునికేకపాదమగు నీమర్త్యప్రపంచ సంసారాంధ
కారమునుండి తమతోపాటు తమ తోడిపాటివారిలోఁ దము యుప
దేశానుసారులగు పుణ్యాత్ముల నమృతరూపమగు దేవునిత్రిపాదాత్మక
కైవల్యానందమునఁ జేర్చుచుఁ దాము తరించి యొరులం దరింపఁ
జేయుచున్నారు అనిత్యమిథ్యాత్మక నిద్రాహారవిహార సౌఖ్యసంపాద
నైకప్రయోజనమాత్రము లగు నీ సంసారబంధనముం బిగించు నర్థ
కామములను పురుషార్థములను సంపాదించుకొనుటకై శిష్టోపదిష్ట
మార్గము నవలంబించు సజ్జనులకు సకల జగత్సాక్షి యగు దేవుఁడు
ధర్మమోక్షసాధకమగు నుభయలోక సంతారకబుద్ధి నొదవించక
మానఁడు సర్వజనప్రత్యక్ష నిద్రాహారవిహార సౌఖ్యాత్మకార్థ కామ

ములను పురుషార్థములు సంపాదించుకొనుటకై యథేష్టమార్గములను వ్యావహారికదశ నెవరియిచ్ఛానుసారముగా వారు సంచరించవచ్చును గదా! యర్థకామములను బొందుఁడీ యని యొరు లుపదేశింప వలెనా ? ఊపిరి తీసుకొనుఁడీయని యొరులు చెప్పనవసరము లేనట్లర్థకామములను సంపాదించుకొండనియొక్కరొకరికిఁ జెప్పనవసరము లేదు.

మఱియును గగనారవిందమువలెఁ శబ్దమాత్రకములగు ధర్మ మోక్ష తత్త్వములు బొత్తిగా నప్రత్యక్షము లింద్రియాతీతములగుట చేత వేదవిద్యల తత్త్వమిద్దియని గాని వేదార్థ మిద్దియని గాని వేదము లిట్లు బోధించుచున్నవని గాని మోక్షతత్త్వ మిట్టిదని గాని మోక్షానంద మిట్లున్నదని గాని యహంకార మమకారాత్మక ప్రకృతి బద్ధులయి సంచరించు దేహు లెఱుఁగ శక్యముకాదుగా ! కాబట్టి ధర్మార్థ కామమోక్షములను పురుషార్థ చతుర్వర్గ సంపాదనము గూర్చి యుపదేశింపఁ బోవుట కేవలమును భ్రాంత చేష్టితము "కేవలమానం హివ్యాఖ్యానమ్" అను చందమున బుద్ధిమంతుడగువాని లక్షణము మానమే. మానమనఁగా "ముక్తిర్నిర్విషయం మనః" అను విధమున "సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ" అనునట్లు తటస్థుఁడై కుమ్మరిపురుగు మంటినివలె నంసారము నంటకుంట. సర్వజ్ఞులగు కపిలాదిమును లేల శాస్త్రము లోకులు కుపదేశించిరి ? భూమస్థితి నూఱకుండ రేల యని యందురేని మానమనఁగా నన్ని యింద్రియములనుమూయుచుకొని మిన్నకుండ స్థితి యని యర్థముకాదు. స్వార్థపరత న్మాని సర్వజన సములై సర్వభూత దయాపరులై సర్వలోకోపకారము కావించుటకు మాత్రమే కాయసిద్ధినొంది యణిమాద్యష్టైశ్వర్యవైభవము శాశ్వతానందులై శాశ్వత దివ్యాభీష్ట దేహధారులై తమతోడిపాటి వారలం జతుర్విధాభినయ విశేషములచేత బ్రహ్మానంద పరవశుల న్గావించు జీవనస్థితి

యని సునిశ్చితార్థము. కాఁబట్టి బుద్ధి కలవారు ధర్మార్థకామమోక్ష ములను లోకోపకారముగాఁ దాము సంపాదించుకొని తమతోడిపాటి వారికి సమకూర్చవలయును. కాబట్టియే జీవన్ముక్తులగు కపిలాది మునులు ధర్మార్థకామమోక్షము లనుపురుషార్థములను సంపాదించు కొను తెన్ను లోకుల కుపదేశించుచుండిరి. అమ్మహామునుల యుప దేశానుసారముగా యథామతి న్లోకోపకారమొనర్చు నుద్దేశముతో స్వలాభ మాసించక మిక్కిలి వ్యయప్రయాసలకోర్చి కవులిట్లు గ్రంథ ములం బ్రకటించుచుండిరి.

## మిథ్యా ప్రకృతి స్వరూపము

"శబ్దార్థౌ కావ్యమ్" లోకోపకారమగు విధమునఁ జేయఁ బడిన చతుర్విధాభినయము కావ్య మనఁ బరగును. కేవలమును స్వార్థపరులైన ద్రోహులొనర్చు చతుర్విధాభినయ మసత్కావ్యము. స్వార్థపరులు గాక కేవలము లోకోపకారమునకై మాత్రమే జీవించు పరమభాగవతు లొనర్చు చతుర్విధాభినయము నిక్కమగు సత్కా వ్యము. లోకోపకారకములగు మంచిపను లన్నియును సత్కావ్య ములే. మఱియును లోక ద్రోహకరములగు చెడ్డపనులన్నియునుం గుకావ్యములే. జీవులందఱును సుకవులుం గుకవులని రెండు విధముల నంచరించుచున్నారు. తమతోడిపాటి జనుల నంతోష పెట్టు సజ్జనులు సుకవులు. తోడిపాటి వారిని బాధించు దుర్జనులు కుకవులు, వేదములందుఁ దఱచుగా" గణానాంత్వా గణపతిగ్ం హవామహే, కవిం కవీనామ్" అని కవి శబ్దము లోకోపకారకు లగు దేవతలకును ఋషులకు నుద్దేశింపఁ బడుచున్నది. దుర్జనుఁలయి చతు ర్విధాభినయ మొనర్చు లోక ద్రోహులగు కుకవులను నిద్రాహార విహారసౌఖ్య భంగకరములగు రుజాజరామమృత్యువులవలెఁగలనై వం

జింతింప కుపేక్షించి లోకోపకారులగు మహాత్ములకు మాత్రమే మహాకవి సంజ్ఞ నిరూఢమైనది. ముండ్లు పొల్లచెత్తలనుపేక్షించి కావలసిన నిద్రాహార విహారసౌఖ్యకర వస్తువుల నపేక్షించు విధమున సాధుజన బాధాకరులగు దుర్జనుల నొడువు శబ్దార్థముల న్దుకావ్యములవలె సరకు చేయ కుభయలోక సంతారకములగు సజ్జనులు నొడువు శబ్దార్థముల సత్కావ్యముల నాదరమున నంగీకరించవలయును.

"సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియమ్" అను నిద్రాహార విహార సౌఖ్యాత్మకమగు నర్థకామములు కేవ లైహిక వ్యవహార మాత్రములు గనుక నారెండు పురుషార్థములను మనోవాక్కాయ కర్మములచే జనులందఱు బరస్పర ప్రేమానురాగములతోఁ గలసిమెలసి సంచరించు నడువడి న్సరసముగాఁ జతుర్విధాభినయముల నోప్పధింపఁ గల సహజ బుద్ధి వైభవమును, వేదశాస్త్ర జ్ఞానమును, సర్వలోక సాధారణానుభవమును గలవిద్వాంసులు మహాకవులనం దగుదురు. ధర్మమోక్ష తత్వజ్ఞానము కేవల పారలౌకికము గనుకఁ బ్రాకృత మనుష్యపండితులగు మహాకవు లభినయింపఁజాలరు కావున నతీంద్రియ ద్రష్టలగు భగవత్కవులనఁ దగు వ్యాసాది మహర్షులు మాత్రమే బోధింప సమర్థులు. కావున జగమునందు పారమార్థిక ధర్మ మోక్షము లను పురుషార్థములు సంపాదించుకొను జ్ఞానమును బోధించు వ్యాసాది భగవత్కవులను వ్యావహారిక నిద్రాహార సౌఖ్యాత్మకార్థకామములను పురుషార్థములు సంపాదించుకొనఁదగు జ్ఞానము బోధించు కాళిదాసాది ప్రాకృత కవులుగాఁ బారమార్థిక కవులు వ్యావహారిక కవులని కవులు రెండు తెఱగుల నుంద్రు. ధర్మమోక్షములనలెఁ దదుపదేష్టలగు వ్యాసాది భగవత్కవు లతీంద్రియులు లోకాతీతులు కనుక ననుమాన శబ్ద ప్రమాణములచేత మాత్రమే యా మహర్షుల యథార్థ స్థితి నెలిసి

కొనవలయును. వారి చరిత్రము లోకాతీతము. ప్రాకృతులగు మనుష్యులు తెలియ నసాధ్యము కనుక వారి సంగతి ప్రస్తుత విచారణీయము కాదు. మఱియుం బ్రాకృత కవులలో సకల జనులకుం బరస్పర ప్రేమానురాగము లొదవునట్లు నిద్రాహారవిహార సౌఖ్యాత్మకములై వ్యావహారికములయిన యర్థకామములను పురుషార్థములను సంపాదించుకొను జ్ఞాన మష్టావధాన విద్యావైశద్యముతోఁ జతుర్విధాభినయ విశేషములం బోధింపఁ గల కాళిదాసాది ప్రాకృత కవుల వాచికాంగికాహార్య సాత్త్వికాభినయ విశేషములం దత్తద్దేశకాల పాత్రోచితముగా సకలలోకులున్నవులగు విధమునఁ బ్రయోగించినపు డఖిలజనులున్నవులయి సకల లోకోపకారమగు విధమున నర్థకామములు సంపాదించుకొనఁ దగినట్లు చతుర్విధాభినయ నిపుణులయి నిక్కపు మనుష్యులనఁబడుదురు.

క్షణకాల మాత్రమే శ్రవణేంద్రియ గోచరమగు నవ్యక్తకల నాదము శ్రుతి యనఁబడు నాధ్వనిదో యనుకరణనాత్మకమై యొక్కతీరుగా హెచ్చు తగ్గులు లేక తెగకొక నిముసము వినంబడెనేని యట్టి దీర్ఘ ధ్వని స్వర మనంబడును కొలవిత్రిప్పనపుడు జ్యోతి యెడతెగని వలయాకారముగాఁ గనపడు చాలనావకాశ స్థితి వైచిత్ర్యమువంటిదే ధ్వన్యనుకరణనావకాశము న్దోఁపనీకుండు క్రియాంతర్వర్తి కాలము లయ యనంబడును. కావున మూర్తానభివ్యక్తనాదమునకు లయ యనియు మూర్తాభివ్యక్త క్షణికనాదమునకు శ్రుతి యనియు శ్రుత్యనుకరణాత్మక దీర్ఘ కాల స్థిత ధ్వనికి స్వరమనియును సంజ్ఞలు, లోకవ్యవహారము నకై యేర్పర్చఁ బడెను. వ్యావహారిక దశలో మధ్య విలంబ లయలతోఁ గొలఁది గొప్ప యవకాశములం బలుక ధ్వనుల లఘూ గురు ప్లుత స్వరవిశేషములు కేవల ధ్వన్యాత్మకముగాను వర్ణాత్మకముగాను వాచికాభినయము ప్రయుక్తమగుచున్నది. శ్రుతిజాతి

స్వరగ్రామ మూర్ఛనలు కేవల ధ్వని విశేషములు, అచ్చులు హల్లులు వర్ణాత్మక ధ్వని విశేషములు. కేవల ధ్వనిరూపకమగు వాచికాభినయము సర్వ జన సాధారణ భాష యనఁ దగును. మఱి యచ్చులు హల్లులు గల వాచికాభినయము సాధారణ ఛంధః సంస్కృతాద్యనంతభాషా విశేషములయి వ్యవహరింపఁబడుచున్నది. వైఖరియనంబడు మనుష్య కంఠధ్వని జుగుప్సాశ్లీల భయ లజ్జ లొదవించి జనులకు బరస్పర ద్వేష మొదవించని విధముగాఁ దమ తమ యూహను ధ్వన్యాత్మకముగాఁ గాని వర్ణాత్మకముగాఁగాని యేరీతి ప్రయోగింపఁబడినప్పటి కాశబ్దము సంస్కృత శబ్దమే యనఁ దగియుండును. లోకోపకారముగాఁ దత్తద్దేశకాల పాత్రోచితముగా శ్రవణ సుఖముగాఁ దమ యూహ విస్పష్టముగా బోధపడునట్లు వాచికాభినయ మొనర్చవలయును. ఏ దేశములో నే భాష పండిత పామర బోధకమై యున్నదో యట్టి భాషతో జనరంజకముగా వాచికాభినయ మొనర్చవలయును. మఱి యాంగికాభినయ విశేషములగు ప్రాఁత చిత్ర లేఖనము మొదలగు చాక్షుష శిల్పవిశేషములం బ్రయోగించవలెను. ప్రస్తుతకాలమందు సర్వజన సాధారణముగా వాడుకలో నున్న పూర్వభాషా పద్ధతుల గ్రంథ విరచన గావింపవలయును. లోక వ్యవహారమునకుఁ బనికిరాక కేవలము మునులకు మాత్రమే యుపచరించు నలౌకికార్థ ప్రతిపాదక గ్రంథములు ముని ప్రోక్తములనియు నర్థకామములను లౌకిక పురుషార్థ సంపాదనోపయోగములు కాకుండియును దురవగాహము లయ్యును బఠించుటచేత మాత్రమే యపూర్వ స్వర్గాది ఫలము నిచ్చుననియును వేదము లనియును శాస్త్రము లనియును కేవల ధర్మమోక్షములను పురుషార్థము లనియును వర్తమానోపయోగ మెంతమాత్రము గాని యలౌకిక శబ్దార్థములం బ్రాతఁ పంచాంగములవలెగతజలసేతుబంధన వర్ణనమువలెఁ బ్రాఁతఁ కలలవలె నుపేక్షింపవలయును.

వేదశాస్త్ర పురాణేతిహాసాద్యష్టాదశ విద్యారహస్యవేత్తల మని దంభ వేషములతో శిష్టాచార పరాయణులమని యగ్రజాతుల మనియు ని దాహారవిహార సౌఖ్య మొదవింపఁదగు నర్థకామములను పురుషార్థములను వంచకులై కేవల స్వార్థైకపరులై పరుల సౌఖ్య మొక్కింతయుఁ దలఁపక ధూర్తపామరులం బెదరించుకొని మొండి కూటి యాచనమున బ్రతుకు ద్విజమ్మన్యుల వాచికాద్యభినయము నక్కవినయము లోకద్రోహకరమని తెలిసికొని యట్టి మోస కాండ్రను సంఘమునుండి బహిష్కరించవలయును. నక్కయేడ దేవలోకమేడ, కుక్షింభరుఁడు ప్రాకృతుఁడు జ్ఞానలవ దుర్విదగ్ధుఁడు వీని వీఁపే వీఁ డెఱుఁగఁడు వీని కొలబద్దతో "బింబ మింత వెడల్పు కావలసిన సూర్యసిద్ధాంతములో వ్రాయఁబడియున్నదని చూడుఁడని" కూటికిఁ గాని గుడ్డకుఁగాని కసింతయుం గొఱగాని సారకాయలు నఱకు మోసకాఁడు మనుష్యసంఘసస్యము న్జెరుపఁబుట్టిన గాబుకలు వంటు తెలుపువంటివాఁ డని లోకోపకారపరాయణుఁ డగు మహాకవి తన యభినయ విశేషములం బ్రచురించక తీఱదు తీరదు. ధర్మమోక్ష బోధకములయి కేవల పారలౌకికార్థ ప్రతిపాదకములయి యతీంద్రియ ద్రష్టలగు వ్యాసాదిమునులకు మాత్రమే వేద్యములయి యీలోకమున కొక్కింతయు నుపచరింపకుండు ధర్మమోక్షములను పురుషార్థములను సాధించు సాధనములగు వేదశాస్త్రములు తా నెఱింగినట్లల్పజ్ఞుఁడగు మానవుఁడభినయించుటకన్న లోకద్రోహకరమగు కార్య మింకెద్దియు న్గాదు. లోకవ్యవహారమునకుఁ బనికివచ్చి ప్రజోపకారకము లగు నర్థ కామములను పురుషార్థముల సాధింపఁదగిన యభినయము న్దన శక్తి కొలంది న్గావించుచుం దన తోడిపాటి వారితోఁ గలసిమెలసి పాటు పడుచుం దన నిద్రాహారవిహార సౌఖ్యము సకలజన సమ్మతముగా ననుభవించు పరమభాగవతుని చతుర్విధాభినయ విశేషమే సకల జనాదరణీయమని సిద్ధాంతము సిద్ధాంతము.

వాస్తవముగా నాప్రత్యక్షానుభవముం బట్టి త్రిగుణాత్మక
మగు స్వప్న జాగ్రత్సుషుప్తి దశాస్వరూపకమైన నాదేహస్మృతియే
యీ ద్రవ్యగుణ కర్మసామాన్యవిశేష సమవాయాభావములను సప్త
పదార్థమయ జగత్కార్యము లన్నియును విస్మృతి యనగా "నా సదా
సీన్నోఽసదాసీత్తమ ఆసీదివి శ్రుతిః "నిష్క్రియము విక్రియము నిర్గు
ణము శాంతము నిరంజనము" "సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ, ప్రకృతిః
కర్త్రీ, పురుషః పద్మ పత్రాంబువ న్నిర్లిప్తః" అన్నస్థితి ఈ శరీర
జ్ఞప్తియే త్రిగుణాత్మకమై సకల జగద్వికారసృష్టిస్థితి ప్రళయములం
గనిపెట్టుచున్న ప్రకృతి, ఈ ప్రకృత్యాత్మక శరీరజ్ఞప్తియొక్క జ్ఞానక్రి
యేచ్ఛాశక్తి ప్రవృత్తికి కారణమయ్యు నిర్లిప్తుఁడై నిర్గుణుఁడై సచ్చి
దానంద లక్షణుఁడై భక్తరక్షాదీక్షితుఁడైన పరమపురుషుఁడు నారా
యణుఁడు "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" స్వయంప్రకాశుఁడై
యున్నాఁడు. ఈ శరీరజ్ఞప్తికి సత్త్వరజస్తమోమయ ప్రకృతి యనిగాని
జీవాత్మ యనిగాని పేరు. స్వప్న దశయందు లేని జగము వాస్తవముగాఁ
దోఁచునట్లే శరీరస్మృతి దశయందు నేను నాది యది యిది నాకు వేఱు
వస్తువు లివి నిద్రాహారవిహార సౌఖ్యవాంఛయా కోరిక దీర్చు కొనుటకై
చేయుచున్న ప్రయత్నము మఱలఁ మఱలఁ గలుగుచున్న క్షుత్పిపాసాది
దేహకష్టంబులకుఁ బ్రక్రియ లన్న పానాదికము చేఁ గావించి సంతుష్టిపొందు
చుండియును స్వప్నజాగరావస్థల న్నానా జగద్వికారముల న్గనుచు
నాదేయు హేయవస్తునిరూపణము కావించుచు స్వానుభవైకవేద్యము
లయి తనకుఁ గష్టము లెవ్వియో సుఖము లెవ్వియో యొక్క సారి
నిశ్చయింపఁజాలక క్రమక్రమముగా దేశకాల పాత్రానుసారము
నొకప్పుడు తనకు సుఖము వాస్తవమనుకొన్న పదార్థ మింకొకవుడు

తనకు దుఃఖము కల్ల యనుకొనుచు మొత్తముపై యే యంశమందు సంశయముతీఱక "ఇదమిత్థమేవ" అని యేవిషయమందు దృఢనిరాధ నిశ్చయజ్ఞానము లేక యవశములయి తన కోరినట్లు ప్రాపించకుండు స్వప్నజాగ్రత్సుషుప్తిదశ లనుభవించుచు నేవస్తువును గూర్చియైనం దెలిసిన ట్లొకప్పుడు బొత్తిగాఁ దెలియన ట్లొకప్పుడు తెలిసీతెలియక సంశయించుచు మఱొకప్పుడు మనఃస్థైర్యము మాటిమాటికిఁ దప్పుచు గాలివశమునం బరిభ్రమించు చొక్కాకువలె సత్త్వరజస్తమోగుణాత్మ మగునీ దేహాస్మృతి యొకప్పుడు నిర్వికారముగా నుంటయు నింకొకప్పుడు సుఖదుఃఖాత్మక లోకవ్యవహారమునఁ జిక్కి పొంగుచుం గ్రుంగుచుంటయును నవరసముల తత్తద్దేశకాల పాత్రానుసారముగా దైవపౌరుషవశత నభినయించుచుంట కనిపెట్టుచుంటిని "సోఽయం దేవదత్తః - సఏవాహమ్" అను తీరున నిన్నటివాడనే నేఁడున్న నేను "సుఖమస్వాప్సమ్" హాయిగా నిద్రించితి నేమి జరిగెనో నెఱుఁగను నాకుఁ గల యొద్దియను రాలేదు. నే నెట్లుంటినో నాకుఁ దెలియదు. నా శరీరజ్ఞప్తియే నాకు లేదన్నపుడు నాకు వేఱే లోకజ్ఞాన మెట్లుండును ? నా నిద్రలో నీయీ స్వప్నములుం గంటి నిపుడు మేల్కాంటి నీలోకము నానాకారముల నానాకార్యముల కన్నానావస్తువులు నాజ్ఞప్తిలో నున్నవి - నాకుఁ బ్రత్యక్షము లివి నా యింద్రియదృష్టములుఁ నవి గాని యీవస్తుతత్త్వము బొత్తిగా నే నెఱుఁగఁజాలను మఱియీవస్తుతత్త్వముగూర్చి కొంతవఱకు నాకుఁ దెలియును-ప్రకృతము నా శరీరపోషణమునకు సౌఖ్యకరములగు పదార్థములు కావలసినవివి.

నా కనిష్టములుం బాధాకరములగు పదార్థము లివ్వి ప్రత్యక్షోపమానానుమాన శబ్దప్రమాణములచేత నాకుఁ దెలిసినతత్త్వమిద్దికాని యీసంగతి యిదే యను మనోనిశ్చయము నాకు లేదు. వేయేల. నే నను పదార్థముసంగతి నిశ్చయించి నేఁ జెప్పలేను. నా దశేంద్రియములు పంచభూతాత్మకములు. నా శరీరమును

గూర్చియే నాశరీరతత్త్వ మిది నామనస్తత్వ మిది యని కెఱూపే ప్రమాణముచేతనైనం దెలియఁజాలని నేను నాశరీరమునకు నామనస్సుకు నాకును వేఱుగఁ దోఁచు నీజగత్కార్య తత్త్వముంగూర్చి "ఇదమిత్థమ్" అని యేప్రమాణము నాశ్రయించి చెప్పుటకు సందేహము తీఱకున్నది. నిస్సందేహముగా నాయెఱింగిన సంగతి నాశరీర స్మృతి యున్నంతవఱకు దేహేంద్రియ పాటవము బొత్తిగా లేనపుడు నా యనుభవము బైకిఁ దెల్ప లేకున్నను "అహమస్మి" నేనున్నానని మాత్రము నిస్సంశయముగా నిరూఢిగా వాస్తవముగా నా యునికిని మాత్రము నేఁ గనిపెట్టుచుంటిని నాకుఁదోఁచు జగమునుగూర్చియును మఱి ననుగూర్చియు వాస్తవతత్వమును "ఇదమిత్థమ్" అని ఏప్రమాణముచేతనైనను నిశ్చయింప సమర్థుఁడ న్గాను."అహమత్యాకారకజ్ఞానమ్" నేనను జ్ఞప్తిమాత్రమే నాకు వాస్తవముగా నిశ్చయమై యున్నదిగాని నా మనస్సును గూర్చిగాని నా దేహమును గూర్చిగాని నే నను జ్ఞప్తికన్న మఱి నాకు వేఱుగాను. నామనస్సు నాశరీరమునాకుఁదోఁచుజగత్కార్యములఁగూర్చి యేప్రమాణముచేతనైన నే నెద్దియుం దెలిసి యేసంగతినిగాని దెలిసికొనఁజాలకున్నాను. నాశరీరముగాని జగముగాని మఱేతలంపుగాని నా కిపుడు లేకున్నను నామనస్సు నిర్విషయమై నా యంతర్బాహ్యేంద్రియములనే మఱియు సమస్తేంద్రియములద్వారమున వచ్చు నా యనుభవమును నా ధ్యానయోగబలముచేత నేను మఱచి పునరుద్భావనము లేనిసమాధిం బొందఁగలనను నానకు నా సుషుప్తిదశయును నా గాఢమూర్ఛాదశయును నాకుఁ దొలంగిన పిమ్మట నా కా రెండుదశలయం దెద్దియు నెఱుఁగకుండిన తత్త్వము న్గూడ నా రెండుదశలందుం గ్రియాశక్తి లేక కేవలము సూక్ష్మరూపమై మొలకెత్తఁదగినంత శక్తియు నవకాశము లేకున్న బీజమువలె నా యీ దేహేంద్రియములం దీశరీర జ్ఞప్తి యణంగి

యున్నది. నా యీ దేహేంద్రియ జ్ఞప్తిరూపకమగు నహంకార మమకారము లేకాలమందైనఁ దిరిగి తలచూపఁజాలని విధమున దగ్ధ బీజమువలె గాఢవైరాగ్య సంప్రాప్త భూమస్థితి నొదవించు బ్రహ్మ సమాధిం జెందెనేని యపుడు త్రిగుణసామ్యమగు ప్రకృతిరూపమై యీస్మృతి నిర్దుష్టమై గుణప్రకోపశాంతిచేత నహంకార మమకారాది మిథ్యావికారానుభవము లేక నిర్గుణుఁడగు పరమపురుషునిలో విలీనమై సగుణమయ్యును గుణసామ్యస్థితిచేత నహంకార మమకార శూన్యమై "పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి" అను శ్రుతి వాక్యానుసారముగా ముప్పా లమృతపురుష స్వరూపమున లీనమై పరమపురుషుని సచ్చిదానంద లక్షణమగు లీలాప్రవృత్తి ప్రయోజన ముకై విశ్వసృష్టిస్థితినాశ విచిత్రానుభవము న్నామమాత్రావశేషమై నిలిచియుండు ననుకొనెదను-ఉపమానానుమాన శబ్దప్రమాణము లనుభవము లేక ప్రత్యక్షప్రమాణానుభవము కలుగనేరదు, జ్ఞానజ్ఞేయ జ్ఞాతృవస్తుత్రిపుటిచేతఁగాని నేను నాది యిదది యను దృష్టియే కలుగుటకు వీలులేదు. "ప్రమితివిషయాః పదార్థాః" ప్రమితి యనఁగా యథార్థజ్ఞానము. యథార్థజ్ఞానముచేఁ దెలియఁబడునవి ద్రవ్యాది పదార్థములు, ద్రవ్యాది సప్తపదార్థములను ప్రమేయముల యథార్థ తత్త్వమును ప్రమితిసాధనముచేతఁ బ్రమాత తెలిసికొని శాశ్వతానందము నందుచున్నాఁడు. సహవాసముచేత సిరియబ్బుట లోకములో మిక్కిలి యరుదుగాని చీడ తప్ప కబ్బు నను సామెతఁగా వేదశాస్త్రావేక్షణముచేతను యథార్థజ్ఞానమగు ప్రమ యబ్బలేదు, మఱియును శ్రద్ధాభక్తులు కుదురలేదు. కాని దుర్జనసహవాసముచేత నాస్తిక్యమును భ్రమయును మిథ్యాజ్ఞాన సంశయములు తప్పక నా మనసు నలముకొని యభివృద్ధిపొంది యెంత విడిపించు కొనుటకుఁ బ్రయత్నించినను విడువక దుర్వ్యసనమువలె దిన దిన ప్రవర్ధమాన

యున్నది. నా యీ దేహేంద్రియ జ్ఞప్తిరూపకమగు నహంకార మమకారము లేకాలమందైనఁ దిరిగి తలచూపఁజాలని విధమున దగ్ధ బీజమువలె గాఢవైరాగ్య సంప్రాప్త భూమస్థితి వొదవించు బ్రహ్మ సమాధిం జెందెనేని యపుడు త్రిగుణసామ్యమగు ప్రకృతిరూపమై యీస్మృతి నిర్దుష్టమై గుణప్రకోపశాంతిచేత నహంకార మమకారాది మిథ్యావికారానుభవము లేక నిర్గుణుఁడగు పరమపురుషునిలో విలీనమై సగుణమయ్యును గుణసామ్యస్థితిచేత నహంకార మమకార శూన్యమై "పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి" అను శ్రుతి వాక్యానుసారముగా ముప్పాలమృతపురుష స్వరూపమున లీనమై పరమపురుషుని సచ్చిదానంద లక్షణమగు లీలాప్రవృత్తి ప్రయోజన ముకై విశ్వసృష్టిస్థితినాశ విచిత్రానుభవము స్వప్నమాత్రావశేషమై నిలిచియుండు ననుకొనెదను-ఉపమానానుమాన శబ్దప్రమాణము లనుభవములేక ప్రత్యక్షప్రమాణానుభవము కలుగనేరదు, జ్ఞానజ్ఞేయ జ్ఞాతృవస్తుత్రిపుటిచేతఁగాని నేను నాది యిదది యను దృష్టియే కలుగుటకు వీలులేదు. "ప్రమితివిషయాః పదార్థాః" ప్రమితి యనఁగా యథార్థజ్ఞానము. యథార్థజ్ఞానముచేఁ దెలియఁబడునవి ద్రవ్యాది పదార్థములు, ద్రవ్యాది సప్తపదార్థములను ప్రమేయముల యథార్థ తత్త్వమును ప్రమితిసాధనముచేతఁ బ్రమాత తెలిసికొని శాశ్వతానందము నందుచున్నాఁడు. సహవాసముచేత సిరియబ్బుట లోకములో మిక్కిలి యరుదుగాని చీడ తప్ప కబ్బు నను సామెతఁగా వేదశాస్త్రావేక్షణముచేతను యథార్థజ్ఞానమగు ప్రమ యబ్బలేదు, మఱియును శ్రద్ధాభక్తులు కుదురలేదు. కాని దుర్జనసహవాసముచేత నాస్తిక్యమును భ్రమయును మిథ్యాజ్ఞాన సంశయములు తప్పక నా మనసు నలముకొని యభివృద్ధిపొంది యెంత విడిపించు కొనుటకుఁ బ్రయత్నించినను విడువక దుర్వ్యసనమువలె దిన దిన ప్రవర్ధమాన

యను చందమున నీసంసారదుఃఖపాశబంధ మూపిరి యున్నంతవఱకు స్వార్థత్యాగులై వైరాగ్యవంతులై కేవల లోకోపకారపరాయణు లగు పరమభాగవతులకుఁ దప్ప నస్మదాది నిద్రాహారవిహారసౌఖ్య తత్పరులకుఁ దప్పదు తప్పదు 'సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః" ఇట్లు జీవన్ముక్తులగు పుణ్యాత్ము లెవ్వరో యెచ్చట నున్నారో ఘూకమునకు సూర్యప్రకాశమువలె నజ్ఞానాంధకార నిర్మగ్నులై యహంకార మమకారబద్ధులై స్వార్థైకతత్పరులయి దుర్వ్యస నాసక్తులై నిద్రాహారవిహార భోగపరాయణులై జ్ఞానలవదుర్విదగ్ధు లగు ప్రాకృతజనులకు మిక్కిలి దుష్ప్రాప్యము.

కొఱవి త్రిప్పినప్పుడు సంపూర్ణ చక్రాకారముగా నగ్గి వలయ రేఖ యెడ నెడ సందు లగపడనీక యేకముగా గతివేగవశమున నగపడుటచేత చైతన్య మనునగ్నితోడి కొఱవులవలెనున్న వాయ్వగ్ని జలపృథివీ పరమాణువులు నిర్గుణుఁడై పరమాకాశస్వరూపుఁడై ప్రకృత్యాత్మక సర్వజగత్సృష్టిస్థితినాశక్రియల కాధారమైయున్న పరమపురుషునియందు "యంత్రారూఢానిమాయయా" అనునట్లు కొఱవిం ద్రిప్పెడు శక్తింబట్టి యాకొఱవి కొననున్న యగ్నిదీప్తి నానావిధాకారముల నణుమహద్ధ్రస్వదీర్ఘ వివిధవిశేషములం దెఱపి సందు లవకాశములు నిల్వులుగతి విశ్రామము లొక్కింతయుందోఁపనీ కగపడువిధమునం ద్రిగుణాత్మక ప్రకృతిపురుష సంపర్కమహిమచేత నానావిధ జగత్కార్యరూపముగాఁ దోఁచుచున్నది. నీటివంక లా నీరుప్రవహించు భూమివి కాని నీటి వెంతమాత్రమున్గావు నిక్కముగా నేటికి వంకలున్నవి కాని నీటికి వంకలేలేవు పురుషసంపర్కమహిమాతి శయముచేత నగ్గికొఱవివంటి సగుణప్రకృతి భ్రమించునపుడాదిమధ్యాం తము లగపడనీక పాంచభౌతిక జగదుద్భవస్థితి నాశకార్యములు

లెఅపి చూప కణుమహద్థ్రి స్వదీర్ఘకోణ వలయాది నానారూపము లందినట్లు తనకుఁ దా మదమత్తునివలెఁ భ్రాంతిచెందుచున్నది. వాస్త వముగా త్రిగుణసామ్యమగు ప్రకృతికిగాని సత్త్వరజస్తమములను గుణ ములకుఁగాని నిర్గుణుఁడగు పరమపురుషాత్మక సచ్చిదానంద స్వభావ శక్తి తప్పఁ వేఱుకారణము లేదు. కొఱవి కొనను మూర్తీభవింపఁ బడిన యుష్ణగుణ మగ్నిరూపమునఁ జక్షుర్గ్రాహ్యమై యాకొఱవిని ద్రిప్పగతివిశేషముచేత నాకసమున నంతరము లేక సంపూర్ణ వలయా కారముగా నాయగ్నిదీప్తి భ్రాంతబుద్ధి కగపడునట్లు వాస్తవముగా నిర్గుణుఁ డగు నారాయణతేజము సచ్చిదానందలక్షణ మహిమముచే నానావిధ జగదుద్భవ స్థితినాశరూపముల నాప్పించుచున్నది. వాస్తవ ముగా స్వప్నదశాజగమువలె నీజాగ్రద్దశాజగముకూడఁ ద్రిప్పఁబడు చున్న కొఱవి కొననున్న యగ్నిదీప్తియొక్క వివిధాకృతులవలె నెండ మావుల నీటివలె విభ్రాంత బుద్ధికల్పిత మిథ్యారూపముగాని యథా ర్థము కాదు కాదు కాదనియే "తత్తుసమన్వయాత్" అని వేదవ్యాసుని సిద్ధాంతమును సర్వజ్ఞులగు గౌతమబుద్ధుఁడు శంకరాచార్యుఁడును బోధించిరి. నా ప్రత్యక్షానుభూతియు నాడ నా శరీరస్మృతియే యీ జగద్రూప మగుచున్నదనియును నా సుషుప్తిదశయందలి విస్మృతియే యీజగము నుపసంహార మొనర్చుచున్నదనియును నా దేహస్మృతి చేత ననఁగ సవిషయమగు మనస్సుచేత సంసారబంధ కష్టమును, విస్మృతిరూపమగు నిర్విషయ మనస్సుచే మోక్షానంద మనుభవించు చుంటింగాని నావిస్మృతియే త్రిగుణసామ్యమగు ప్రకృతిరూపమున నున్న వాసుదేవుని విద్యాస్వభావము నాస్మృతియే యాదేవుని యవిద్యాస్వభావము, చీఁకటి వెల్లడి రేయి పవలు న్నేమము నిమేషము రాక పోక భావము అభావము స్మృతి విస్మృతి యీపదార్థములందు వస్త్రమునందలి పేఁకపడుగులవలె దేవుఁడే యున్నాఁడు. నే ననిగాని

నాదియనిగాని నాయింద్రియముల నేను నాది నీవు నీది యని దృశ్యమైన మమతయును మిథ్య "ఓంతత్సత్" అనునట్లు మాత్రము బుద్ధికి గోచరమై నిరూపింప శక్యముకాకింద్రియాతీతమై యీజగ మెద్దియు న్గాని పరవస్తువునకు "తత్" అనియు నాప్రత్యక్షానుభవ మిద్దియే యని నిరూఢిగా నిశ్చయించుకొన్న మన స్సమాధానమునకు "ఓం" అనియును మఱే సందేహము లే కేకోర్కెయు న్బొందక సంపూర్ణముగా సంతుష్టుఁడనై ఖేదమోదములు రెండింటిని బొందక నేవికారము న్గొనకున్న నాయపరోక్ష విద్యా బ్రహ్మానందము "సత్" అనియు నుపనిషత్సంజ్ఞల నొప్పారుచున్నది. ఈ బ్రహ్మానందాత్మక పర విద్యాతిశయ మాత్మైకవేద్య మని మాత్రమే తెల్పఁగలను.

మఱి యీ వ్యావహారికాపరవిద్యాత్మకాష్టాదశ విద్యలచే బోధింపఁబడఁదగు నైయాయిక ప్రతిపాదిత సకలపదార్థతత్త్వవిచారణను చేయునపుడు చతుర్విధాభినయవిశేషము లన్నియుఁ బ్రిప్పఁబడు కొలఁది తుద నన్న యగ్గి నానాకారముల న్దోఁచుటయే నామరూపాత్మకమగు తల్లి. మఱి యా నామరూపపరమాణు సంయోగావకాశ విరామకాలవిశేషమే లయాత్మకమగు తండ్రి. "శ్రుతి ర్మాతా లయః పితా" అనుటచేత తల్లిం బోల్చి చెప్పవచ్చునుగాని తండ్రి న్నిరూపింపశక్యముకాదు. తల్లి యింద్రియములచేఁ దెల్పఁదగు నామరూప విశేషము. తండ్రి యాత్మైకవేద్యమగు కాలవిశేషము. "కాలరూపీ జనార్దనః" అనుటచేతఁ బాంచభౌతిక సృష్టిస్థితినాశములింద్రియ వేద్యములుగాని పంచభూతసంయోగవియోగకారణ కాలమాత్మైక వేద్యముకదా? కాలకర్మ లొండొంటింబట్టి వేద్యములై యితరేతరాశ్రయములై దైవపౌరుషములవలెఁ బ్రకృతిపురుషుల చందమునఁ గార్యకారణములవలె వృక్షబీజములమాడ్కి శివశక్తులవలె గుణిగుణములవలె మృద్ఘటములవలె వస్తుభేదము లేకున్నను నామరూప

భేదము కలవై జననీజనకాత్మక శ్రుతిలయస్వరూపములై మొదల లొక్కటి యయ్యుం జవుల భేదించు కాయలం గాచు రెండుకొమ్మల వలె మూలప్రకృతియెడ నగ్నపట్టుచున్నవి.

తెలిసి దుఃఖమనుభవించుట నరకము తెలిసి సుఖమనుభవించుట స్వర్గము తెలిసి సుఖదుఃఖముల రెండింటికిం దటస్థముగా నుండుట యపవర్గము. ఈ సమస్తజగత్కార్యానుభవ మూలము దేహ స్మృతిరూపక స్వప్నజాగరావస్థలు, స్వస్వరూపమున "తదా సంపన్నో భవతి" అనునట్లు సుఖదుఃఖముల రెండింటి యనుభవము లేకుంటకుఁ గారణము విస్మృతిరూపక సుషుప్తి "పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" మూఁడువంతులకాల మమృతమగు సుషుప్తియు నొక్కవంతుకాల మమర్త్యమగు స్వప్నజాగర వ్యవహారదశను జీవుఁ డనుభవించుచుండును గూఁడు విడిచి యాహార విహారములకై సంచరించి తిరిగి గూఁడు నిద్రకై చేరుకొను పక్షివిధమున నగుణుఁ డగు జీవాత్ముఁడు స్వప్నజాగరదశలం బరిభ్రమించి స్వస్థానమగు సుషుప్తి స్వకర్మానుసారముగ నియతకాలమువఱకు విశ్రాంతి చెందుచుండును సుషుప్త్యవస్థయే వాస్తవము నిత్యమును. విస్మృతిరూపక సత్యపారమార్థిక కారణము మఱియును బ్రహ్మస్థితి. స్వప్నజాగరములు రెండును స్మృతిరూపకమిథ్యాత్మక వ్యావహారికానిత్యాసత్యప్రాతిభాసిక మాయాకార్యప్రకృతిస్వరూపము. వాయ్వగ్ని జలపృథివీ భూతముల కాకాశమువలె స్వప్నజాగరములకుసుషుప్తియే యాధారము "మరణం ప్రకృతిశ్శరీరిణాం వికృతిర్జీవన ముత్యతేబుధైః" మరణాత్మక సుషుప్తియే ప్రకృతి. దేహికి జీవనాత్మక స్వప్నజాగరములే వికృతి.

## మా న వ మీ మాం సా వై ఖ రి

ప్రకృతి యన వాస్తవదశ. వికృతి యన మిథ్యాదశ, నిర్గుణాద్వైతమగు విస్మృతిరూపక సుషుప్తియే సహజయథార్థ విద్యాస్వరూ

పము. సగుణాద్వైతమగు స్మృతిరూపకస్వప్నజాగరము లాగంతుక మిథ్యావిద్యాస్వరూపములు. స్వప్నజాగ్రత్సుషుప్తులకు సాక్షియై పరమభాగవత జనసంసేవ్యుఁడై తురీయావస్థాత్మకుఁడు నారాయణుఁడు జీవాత్మలను స్ఫులింగముల కాలవాలమగు స్వయంప్రకాశక సర్వ జగజ్జ్యోతి. సరియే, యీ తత్త్వమంతయును దేహస్మృతివికారమే ఈ వ్యావహారికజ్ఞానము పారమార్థిక తత్త్వము నెట్లు నిర్ణయించు కొననీ యీ వేదాంతార్థ విచారణమునకు సంసారు లధికారు లెంత మాత్రము న్నారు. మఱి యీ బ్రహ్మజిజ్ఞాస కధికారులు సాధనచతుష్ట సంపన్నులగు ముముక్షువులు గాని నిద్రాహారవిహార సౌఖ్యతత్పరు లగు సంసారులు తగరు.

“ప్రమితివిషయాః పదార్థాః” అని ప్రమితిని నిర్ధారణ చేయుటకు మొట్టమొదటఁ బ్రమాణము జెప్పకతీరదుగా ? ప్రమాణప్రమేయాది పదార్థములలో మొదటఁ జేర్పఁబడిన “ప్రమితికరణం ప్రమాణమ్”అనుటచేఁ బ్రమితిని సాధించుటకై ప్రమాణము కావలెనుగదా? ప్రమితిం బట్టి కాని ప్రమాణ మేర్పడదు. మఱియుం బ్రమాణము లేనిది ప్రమితి కుదురదు. కాఁబట్టి ప్రమితిప్రమాణముల రెండింటికిని వెఱ్ఱి కుదిరినంగాని పెండ్లి కాదు మఱి పెండ్లియైనంగాని వెఱ్ఱి కుదరదన్నట్లన్యోన్యాశ్రయ దోష మనివార్యము. ప్రమితి యన నేమో మఱి ప్రమాణ మన నేమో నిర్ధారణము చేయుటకే యుక్తి చాలకున్నవుడీ యుక్తిం బట్టి యేర్పడిన న్యాయశాస్త్ర మంతయును గగనసౌధము వలె నిరాధారమై యప్రమాణమై వెఱ్ఱివాని యూహవలె స్వేచ్ఛాహంకారకల్పితమై నానాపదార్థ తత్త్వజ్ఞానమును సంపాదించుకొనుటకై యుపాసనాసౌలభ్యమునకై యేర్పఱ్చఁబడిన దేవతాప్రతిమవలె నొకవిధమైన యూహాపోహా రచనావిశేషముగాని సంపూర్ణముగా మనస్సమాధానము కావింపనేరదు. యుక్తి కంతము లేదు. యుక్తిపై

యుక్తి యుండకమాన దింతకును జగత్కారణమగు దేవుఁడు భక్తి గోచరుఁడు గాని యుక్తిగోచరుఁ డెంతమాత్రము న్గాఁడు. శాస్త్రము లన్నియు నొకవిధమైన యాత్మనిశ్చయాత్మక మగు నమ్మికఁబట్టియే రచింపఁబడును. "యతోవాచో నివర్తన్తే" యనున ట్లీ వేదము లీ శాస్త్రము లీ మానవవైఖరీగ్రంథములు యథార్థాత్మతత్త్వము న్దెల్పఁ జాలవు.

"విజ్ఞాతార మరే కోవిజానీయాత్ సోఽంగవేద యదివాన వేద" అనునట్లు జ్ఞాత జ్ఞేయములకును చైతన్యము జడమునకు గ్రాహ్యములగుట సకలలోక ప్రత్యక్షానుభవ విరుద్ధము. చెవుల పిల్లికిం గొమ్ము సాధింపఁ బూనిన యవివేకి చెప్పెడియుక్తివలె న్యాయశాస్త్ర మంతయు నసందర్భ ప్రలాప ముబుసుపోని మంగలి పిల్లి తల గొఱుగు వృథాప్రయత్నము, వ్యాయామముచేతశరీరావయవములు దృఢపడి యారోగ్య మిచ్చునట్లు తర్కశాస్త్రాభ్యాసము బుద్ధిని వికసింపఁజేసి యథార్థ తత్త్వజ్ఞాన సంపాదన సాధనమగునని సర్వజ్ఞులగు గౌతమాది మును లొనర్చిన యుపదేశమును దాఱుమాఱొనర్చి యడ్డదిడ్డము గ్రంథ విరచనము గావించి ప్రాకృతులు తమ పొట్టపోషణముకై తాము నైయాయికులమనియును దామభ్యసించి కంఠపాఠముగాఁ బిక్కపెట్టుకొన్న యసందర్భ గ్రంథమంతయును కణాద, గౌతమ మహర్షులు స్వయము రచించిన సూత్రములనియును హాయిగా దున్నుకొని పండించుకొని తాము సుఖపడి యొరుల యాహారనిద్రావిహార సౌఖ్య సంపాదనోపాయము లరయక నిద్రాహార విహార సౌఖ్యభంగ కరమై లేనిపోని యూహలతోఁ బిచ్చెత్తినట్లు వ్యర్థముగాఁ దాము శ్రమపడి తాఁజెడ్డకోఁతి వనమెల్లం జెఱచెడు సామెతగా నితరులకుఁ గూడఁ దమ వెఱ్ఱి నంటించుచున్నారు. కారణము లేక కార్యము కలుగుట లోక ప్రత్యక్షానుభవ విరుద్ధము గనుకఁ బ్రతి కార్యము

న్సహేతుకము కాకతీఱదని యాయాకార్యముల కాయాకారణము లింద్రియాతీతము లని యూరకొన కెవ్వరో లేనిపోని యూహలం బన్ని తమ యూహ లన్నియును గౌతమాది ముని సమ్మతములని యును ధర్మార్థ కామ మోక్షములను పురుషార్థములను సాధించు కొను నుపాయములగు వేదవేదాంగాద్యష్టాదశ విద్యల నతీంద్రియ ద్రష్టలగు ఋషులీ ప్రపంచ సృష్టితోనే వైఖర్యాత్మక వాఙ్మయా క్షర సమామ్నాయ సంజ్ఞిక గ్రంథ సందర్భములు లోకహితార్థమై ప్రకాశింపఁ జేసిరనియు దృఢముగా నక్కాణించుటకుఁ దగిన కార ణము నిక్కముగా సహజాత్మ నిశ్చయాత్మక మనోవిశ్వాస స్వరూప మగు శ్రద్ధయే కదా? నేను బ్రతికియున్నా ననుకొంటకు నాయాత్మ నిశ్చయమే నాకుఁ బ్రమాణము, తన జీవితమునకుఁదన ప్రత్యక్షాను భవమే ప్రమాణమైనప్పటి కితరులకుఁ దా జీవించియున్నట్లునమ్మించఁ దగిన ప్రమాణము లెవ్వియు న్దెలుప నెవ్వఁడుం జాలఁడు. ఎద్దియో సందర్భానుసారముగా బొమ్మ కదలదా! పల్కదా! పనిచేయదా? కాఁబట్టి యామాత్రమున బొమ్మ సచేతన మనఁ దగునా? సచేతన మెద్దియో యచేతన మెద్దియో సశరీర మెద్దియో యశరీర మెద్దియో సకారణ మెద్దియో యకారణ మెద్దియో తెలిసికొనుటకుఁ దన నమ్మి కయే మూలము. మఱి యట్టి నమ్మిక సహజముగాఁ దనకుఁ దోఁచ వలెను గాని యొరులు కలిగింపనేరరు. నేను జీవించియున్న సంగతి నాకే నిస్సందేహముగాఁ బత్యక్షానుభవముగాఁ దెలియునుగాని తర్కవైశేషికశాస్త్రపద్ధతులచేత నేను బ్రతికియున్నానా లేదా యని యొరులు నిస్సందేహముగా నిర్ధారణము చేయఁజాలరు. జ్ఞానజనక మగు ప్రమాణమునకుఁ గూడఁ బ్రమాణము కావలసియుండును గనుకఁ బ్రత్యక్షాది ప్రమాణములం దెల్పుటలోఁ జక్రక దోష మని వార్యము. స్వస్కంధారోహణమువలెఁ దన్నుఁదా నెఱుంగ లేఁడు

మఱియుం దా బ్రతికున్న స్థితి తానెఱింగినప్పటి కితరుల కన్నిస్సం
దేహముగా బోధించి నమ్మించఁ జాలఁడు. విశ్వాసము సహజముగాఁ
దనకుఁ బుట్టవలయుంగాని యొరులు తనకుఁ బుట్టింప నేరరు తన
యూపిరితీసికొనుటయు గ్రుక్క మ్రింగుటయును శరీరము సచేతన
మగుటయును దన బ్రతుకున్న సంగతిఁ దా నెఱుంగుటకుఁ బ్రత్యక్షా
త్మానుభవము తప్పనితర కారణోపాయములు పనికిరావు.

పంచభూతములెట్లు సహజ సిద్ధములో యా పంచభూత
సంయోగ వియోగ విశేషములందుఁ జైతన్యము మబ్బులందు మెఱపు
లుఱుములవలె నుద్భవస్థితి నాశములందుట స్వభావము. కాలకర్మాను
సారముగాఁ ద్రిగుణాత్మకఁ జైతన్యస్వరూపక దేహస్మృతిచేత నా
జాగ్రత్స్వప్నసుషుప్తి దశల నెట్లుంటినో నాకే యెఱుకగాని యిది నా
యనుభవ మిట్టిదని యే యభినయముచేతనైనం గూలంకషముగా
నితరులకుఁ దెల్పఁ జాలను జాఁను. నన్నే నే నెఱుఁగ శక్యము కాకున్న
నిన్నెఱింగితి ననుట కేవల భ్రాంతికాదా? నిక్కముగా నన్నే నే
నెఱుంగఁ గల్గినచో నన్ను నీకుఁ జూపగలనా? నాశరీరమా? నేను
నాశరీరముతో సంబంధించిన జడపదార్థమా? నేను నాది నీది యను
పదార్థములు మాత్రమే వేద్యములుగాని నేను నీవనుపదార్థ తత్త్వము
లవేద్యములు. నాకుఁ దెలయనట్లే నీకుఁ గూడఁ దెలియవేమో?
నీ సంగతి మాట కేమిగాని నా సంగతి నే నెంతగింజుకొన్నను వాస్తవ
ముగా నేకారణము చేతను గలగసుచుంటినో సుషుప్తినందుచుంటినో
మేల్కొనుచుంటినో యీ నా దేహస్మృతి యుద్భవస్థితి నాశము
లెట్లందుచున్నదియో యెద్దియును నిశ్చయించుకొనుటకు నాయుక్తి
నాకేసరిపడకున్నది. కాని నే నను జ్ఞప్తినాకుంట నాప్రత్యక్షాను
భవము. నే నున్నానని నానమ్మకము నానిశ్చయము నే నను పదా
ర్థముం గూర్చి కాని నాయున్కిం గూర్చికాని యథార్థతత్త్వ మిట్టిదని

నిరూఢిగా నిశ్చయించి విశ్వసింపఁజాలనని మాత్రమే నాశరీర సాహా
య్యమున నభినయించఁగలను.

ప్రకృతిపురుషులు దృగ్దృశ్యములు, గుణగుణులు, కార్య
కారణములు, శరీరచేతనములు, పాధీశ్వరులు, శ్రుతిలయ, లద్వై
తాద్వైతములు వ్యావహారిక పారమార్థికములు, భ్రమప్రమలు,
నిద్రాశుషుప్తులు, ప్రవృత్తినివృత్తులు, వృద్ధిక్షయములు, భేదాభేద
ములు, భావాభావములు, సుఖదుఃఖములు, తెలివిమఱవులు-మొద
లగు నానాపదార్థజాలమునకు నిక్కముగా "సాక్షీచేతాః కేవలో
నిర్గుణశ్చ" అనునట్లు నిత్యసాక్షి నారాయణుఁడను జగద్గురు శంకర
మతమును మాత్రము నచ్చి యెట్లోగాని "బ్రహ్మసత్యమ్ - జగ
న్మిథ్యా" అని ద్వైతబంధమునుండి తప్పించుకొనుటకై నాయీబ్రతు
కున గిఁజుకొనుచు నారాయణుని న న్దరింపఁజేయుమని శరణుపొందు
చున్నాను. ఇట్లుభగవద్భక్తికి మూలము భక్తిశ్రద్ధలు గలిగిన సదా
చార సంపన్నులగు పెద్దల యుపదేశమే. కాఁబట్టి లోకోపకారార్థమై
చతుర్విధాభినయపద్ధతు లెఱింగించు నష్టాదశవిద్యల ననాదికాలము
నుండియు బ్రహ్మసృష్టితోనే యుపదేశించిన మహామునుల ఋణము-
"బ్రహ్మచర్యేణ ఋషిభ్యః ప్రజయాపితృభ్య ఇజ్యయాదేవేభ్యః"
అను విధమున నష్టాదశ విద్యామూల సకలవిద్యాస్వరూపము లగు
వేదాభ్యాసముచేత ఋషులయొక్కయు యజ్ఞముచేత దేవతల
యొక్కయు సంతానముచేతఁ బితృదేవతలయొక్కయును ఋణము
తీర్చుకొని "అనృణశ్శుచిః" అనువిధమున మనుష్యుఁడు శుద్ధుఁడు
కావలయును.

"పృషోదరాదీని యథోపదిష్టమ్" అను పాణిని సూత్రమునకుఁ
బతంజలి "శిష్టులనఁగా నత్యాశలేనివారును ధనాద్యైహిక సంపదలు
సంపాదించుకొను కోరిక యెద్దియు న్లేకయే యష్టాదశ విద్యలలో

నొకదానియందైన సంపూర్ణజ్ఞానమును సంపాదించుకొన్నవారు మఱు నాఁటికి మాత్రమే యుపయోగించునంతమట్టుకే ధాన్యాది భోజన పదార్థములు నిలవచేసికొనునంత యల్పసంతుష్టులు. లోకోపకారము నకై మాత్రమే తమ యావజ్జీవము నష్టపడు సర్వభూత దయాపరు లయిన మునులు శిష్టు లనంబడుదురు." అని వక్కాణించెను కాఁబట్టి యట్టి యనాది శిష్టసంప్రదాయాచారముల ననుసరించి నడుచుటయే మిక్కిలి శ్రేయము.

శిష్టాచారమునకుఁ గాలవశమునఁ బ్రమాదముకలిగి ధర్మగ్లాని యైనప్పుడే గౌతమబుద్ధుఁడు జగద్గురు శంకరాచార్యుఁడు మొదలగు సర్వజ్ఞుల రూపమున లోకానుగ్రహతత్పరతచేత ధర్మసంరక్షణార్థమై భగవంతుఁడుమానవులం దవతరించక మానఁడు. సత్కావియే వాచి కాభినయముచేతను బ్రభువై, శిష్టరక్షక దుష్టశిక్షకుఁడై, యాంగి కాహార్యాభినయముచేతను యతియై, సాత్వికాభినయముచేతను మనుష్యులకుఁ దత్తద్దేశకాల పాత్రోచితముగా నిహపర సంతరణో పాయములం బోధించుచుండును. "అయోగ్యః పురుషో నాస్తి" అనున ట్లుత్తమ మధ్య మాధమస్థితుల నకలజన స్వరూపుఁడై తత్తద్దేశకాల పాత్రోచిత ధర్మాచరణము నగావించుచుండును. "గీ॥ ఉత్తముఁడు హితముచేయుచు నూరకుండు, మధ్యముఁడు హితముచేయుచు మాఱు వెదకు, అధముఁ డొరుచేయు హితమైన నణఁచివుచ్చు, హితమునకు నెగ్గుచేయువాఁ డెవ్వఁ డగును." అనునట్లు పరోపకారము చేయుటకై యెట్టికష్టములయిన నహించు శ్రీరామచంద్రు ఉత్తము లట్టి మానవు లేయుగమందైనం గడు నరుదు. మధ్యములు నూటి కొక రధములు నూటికిఁ దొమ్మండ్రు తక్కిన తొంబదుగురు కృతఘ్నులే. కృతయుగమున మనుష్యు లంద ఱుత్తములే. త్రేతయందు జనులలో నాల్గవభాగము మాత్రమే యుత్తములు. ద్వాపరమునఁ బదాఱవవం

త్తుత్తములు. కలికాలమందు మనుష్యులందఱిలో నచ్చటచ్చట స్త్రీలందుమాత్రమే "కలౌ పంచ సహస్రాణి జాయతే వర్ణసంకరః" అనుటచేత మిక్కిలి యరుదుగా నుత్తమత మిగులుండును. పురుషులలో నుత్తములు బొత్తిగా నుండరని జ్యోతిశ్శాస్త్రము నుడువుట చేత సహజముగాఁ బురుషులకన్న స్త్రీలే మంచివారు. స్వభావముగాఁ బురుషుఁడు నిర్గుణుఁడు. పురుషునియందలి సుగుణముగాని దుర్గుణముగాని స్త్రీచేతనే స్ఫటికమణికరణి పీతాదివర్ణమువలె నాగంతుకమై రావలయును. కాఁబట్టియే స్త్రీలు వంద్యులయిరి. సహజముకాని దోషమునకు వశుఁడైన దుష్టపురుషుఁడే యాతతాయియై వధార్హుఁడయ్యెను. సహజము స్త్రీజాతి-కనికరింపఁదగిన మంచిజాతి కనుకనే వేఁటయందైన నాఁడుపులినిగూడఁ జంపనొల్లరు.

"అహిమూషకమున నొదవిన మాడ్కిన్" అత్యుత్కటైః" పాపపుణ్యైరిహైవ ఫలమశ్నుతే-కాలోహి దురతిక్రమః" అనుటచేతఁ బన్నెండుగంటల వఱకుం బగలుం, బన్నెండు గంటల వఱకుఁ రాత్రియు, నొక దేశమునందు విధినియతకాలంబు లయినప్పుడుపన్నెండు గంటలకన్నఁ గర్మసాక్షియగు సూర్యుఁ డాకసము నెక్కువగాఁ గాని తక్కువగాఁ గాని తోఁపకుండుట ప్రత్యక్షానుభూత యదార్థసిద్ధికదా? ఆగామి సంచిత ప్రారబ్ధములను సహజ స్వకీయ కర్మానుసారముగా జీవులు కష్ట సుఖము లనుభవించక తీఱదు. "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి" అను విధమున నెంతకాలమువఱకే యే దేహధారులేయే కర్మానుసారముగాఁ బాపపుణ్యములు సుఖదుఃఖము లనుభవి ప విధినియమితులై రో యంతవఱకుం బ్రతుకక తీఱదు. వ యపాయములు గాని యే ప్రమాదములు గాని ప్రత్యక్షముగా తనంత ప్రతిజ్ఞ పట్టివచ్చిన మృత్యుదేవతగాని యాయుర్దాయకాలము యొక్క మర్యాదను జీవులకుఁ దప్పింప నేరదు. కాలమృత్యు వనఁగా

మనుష్యులకు సాధరణముగా నియమితమైన చాంద్రమానాబ్దములు నూటయిరువది కగు నాయుః సమాప్తి. అకాలమృత్యు వనఁగా దేహధారులకు నూటయిరువదేండ్లలోపుగా సంభవించుమృతి. నూట యిరువదేండ్లు బ్రతికిన మనుష్యులకు మఱి యనుభవింపవలసిన కర్మ మిగులకు కనుక నట్టివారు "త్రిపాదస్యామృతం దివి" అనున ట్లమృత సూర్యలోకపదవి నొయనువుదురు. కర్మ శేషముతో మృతులయిన వారు "పాదోఽస్య విశ్వాభూతాని" అను నట్లు నిత్య చంద్రలోక మునఁ జేరి పుట్టుచుఁ గిట్టుచుందురు.

అపరవిద్యాత్మకముగు నష్టాదశ విద్యలీ లోకవ్యవహారమును గూర్చియే మునులచే నుద్దిష్టము లయినవి. పరవిద్య యపరోక్ష బ్రహ్మానుభూతికావున "యత్రనాన్య త్పశ్యతి" అనునట్లు భూమ స్థితి కావునఁ గేవలాత్మానుభవైకవేద్య మతీంద్రియమే గాని వ్యావ హారి కాష్టాదశ విద్యలవలె నింద్రియగోచరము కాదు. అద్వైతవాసన పరవిద్యా స్వరూపము. కావున నా బ్రహ్మాత్మకముగు పరవిద్య యీ చతుర్విధాభినయములకు లోఁబడక కేవల మతీంద్రియ బ్రహ్మసమాధి రూపమునఁ గైవల్యమై సత్యమై నిత్యమై నిరుపద్రవమై సచ్చిదానంద లక్షణ వాసుదేవ పరబ్రహ్మమైనది మాత్రమే - యపరవిద్య కేవల మునులకు మాత్రమే వేద్యమయి యున్నదని కేవలా ప్తవాక్యాభి నయాత్మక శబ్ద ప్రమాణముచేతం బరమభాగవతులు తమ యంత రాత్మలందు సంతుష్టులగుచుంటకన్న వే అభినయ మొద్దియుం బర విద్య నెలుపఁ జాలదు ఈ జగమంతయుం జతుర్విధాభినయమయమే. అభినయ మనఁగా రసము న్వెల్లడింపఁ దగు నామరూపములు. "రసో వైసః" అనుటచేత రసమనఁగాఁ బరవిద్యా స్వరూపుఁడగు దేవుఁడు. నిత్యానంద పదవీ స్వరూపుఁడగు వాసుదేవుని శాఖాగ్రచంద్రన్యాయ ముగా నీ యష్టాదశవిద్యా స్వరూపముగు నపరవిద్యలు జతుర్విధాభి

నయ మూలముగా మానవోపాధులం దత్తద్దేశకాల పాత్రానుసారముగాఁ బంచభూతముల గుణములగు శబ్దస్పర్శ రూప రస గంధములు నానా ప్రకారములం బ్రవర్తిల్లు విధమున వాచికాంగికాహార్య సాత్త్వికాభినయ విశేషములు వ్యవహరింపఁ బడుచున్నవి. వాచికాభినయమునం దాకాశగుణమయి తక్కిన పృథివ్యప్తేజోవాయు వుపాధుల వశమున శ్రుతి లయల న్నానాప్రకారముల ధ్వన్యాత్మక వర్ణాత్మక విశేషముల నాద బ్రహ్మ మూలమై శబ్దము ప్రవర్తిల్లుచు శ్రుతి లయ కారణరూపముల న్నిత్యమై యవ్యక్తమై పారమార్థిక కార్యమై పర విద్యాస్వరూపమై స్వరతాళరూపముల ననిత్యమై వ్యక్తమై వ్యావహారికమై యపరవిద్యాత్మకాష్టాదశ విద్యాత్మకమై యున్నది. నిత్యశబ్దము పరవిద్య కేవలము సర్వ జగత్కారణమగు దేవుఁడు మఱి యనిత్య శబ్ద మపరవిద్య. కార్యరూపకమగు నిజ్జగమంతయును నాదబ్రహ్మమే చతుర్విధాభినయాత్మక జగత్కార్యమున కంతకు న్మూలకారణము. ప్రప్రథమమున వ్యక్తమై మిక్కిలి హ్రస్వముగా నణుమాత్రముగా శ్రవణేంద్రియగ్రాహ్యమైన ధ్వని శ్రుతి నాఁబడును. మఱి యట్టి శ్రుతి యనంతసంఖ్యాకములగు రోమకూపాత్మక దేహనాళ వాయువుల పరస్పరాఘాతవశమున జంతువు పుట్టిన కాలమునుండియు వైఖరీ మూలముగా వెలువడుటకై దైవప్రేరితమై యజ్ఞాత మగు పురుష ప్రయత్నముచేఁ బ్రారంభించి కాలపక్వమై దేశకాల పాత్రానుసారముగా వ్యవహృతమగుచున్నది. వినఁబడఁ దగునట్లు కంఠమునుండి గాని మఱెట్లు గాని పుట్టెడు శబ్ద మనాద్యగణితకాలమునుండియుం బ్రారంభించి యాయువువలె నియమిత కాలమునకు సమాప్తి యగుచున్నది. అవ్యక్త నాదమును శ్రుతిరూపముగా వినిపించఁదగిన యవకాశకాలము లయ యనందగును. శ్రుతికార్యరూపము లయకారణ రూపముగా నాదబ్రహ్మ మీజగద్రూపమున వివృతమైన యది. వినం

బడిన శబ్దమంతయును ఘుణాక్షరమువలె నవశము స్మృతి యజ్ఞాన
కృత్యమే గాని స్వవశము జ్ఞానకృత్య మెంతమాత్రము న్గాదు కాదు.
కాఁబట్టి ఘుణాక్షరమువలెఁ బుట్టెడు నీ జగద్ వ్యావహారికా నిత్య
కార్య శబ్ద మెట్లు బుద్ధిపూర్వకమును స్వవశమున్నాదో యట్లే యా
శబ్దము న్గూడ స్వవశుఁడై బుద్ధిపూర్వకముగా దేహి వినఁజాలఁడు.
శబ్ద మెట్లు ఘుణాక్షరమువలెఁ దోఁచునో యా శబ్దమున కర్థము
గూడ నా ఘుణాక్షరమువలెఁ బ్రకటింపఁబడును. వాస్తవముగా వినఁ
బడిన శబ్దము గాని మఱియు గ్రహింపంబడిన యా శబ్దార్థము గాని
యా వాగర్థములు రెండును గాని ఘుణాక్షరములవలె వుట్టె మీఁది
బ్రహ్మలిపివలెఁ గేవల భావనావశములు.

"యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ" కాఁబట్టియే
యొక శబ్దము దేశకాలపాత్రానుసారముగా నానార్థములన్ వ్యవహ
రింపఁబడుచున్నది. కాఁబట్టి యీ లోకమందలి నామరూపము
లన్నియు భావనావశమున తత్తద్దేశకాల పాత్రానుసారముగా రసము
న్గలిగించుచున్నవి. దేహము లనేకములుగాని జీవుఁడొక్కఁడే యైనట్లు
నామరూపములు పెక్కులుగాని రస మొక్కటియే. నామరూపములు
వాగర్థములన్నియు మిథ్యాభావనావశములుగాని రసముమాత్రమ
పరోక్షానుభూతమగు సచ్చిదానందలక్షణ బ్రహ్మస్వరూపమని సిద్ధాం
తీకరింపకతీఱదు. వాగర్థము లేటివలె దేహము రసము నీటివలె
దేహి వంకలు మొదలగు వికారములన్నియు నేటివిగాని నీటివి కావు.
చతుర్విధాభినయవిశేషములను మాయాప్రకృత్యుపాధిద్వారమున
రసాత్మనాదబ్రహ్మ మీ జగద్రూపముగా వివర్త మగుచున్నది.
కాఁబట్టి యీజగత్కార్యవిశేషములగు నామరూపాత్మక చతుర్విధాభి
నయవిశేషము లన్నియు నష్టాదశవిద్య లన్నియు మిథ్యాత్మకములు
వ్యావహారికములు ఘుణాక్షరములవలె నెండమావులవలె భ్రాంతి

కల్పితములుగాని వాస్తవములు పారమార్థికములు న్గావు కావుననే పరమార్థదశయందు వేదములు లేవని జగద్గురు శాసనము. సత్త్వరజస్తమోగుణములు గాని తత్త్రిగుణమయ ప్రకృతిగాని పురుషుఁడుగాని పృథివ్యప్తేజోవాయువులుగాని తద్గుణములగు శబ్దస్పర్శరూపరసగంధములుఁగాని జడముగాని చేతనముఁగాని మొత్తముఁపై బురుషునితో లెక్కింపఁబడి షడ్వింశతి తత్త్వములన్నియుం బరస్పరముం బాళ్ళ భేదమునఁ బరస్పరముం గలిసియున్నవేకాని ప్రత్యేక మేతత్త్వమయినను శుద్ధముగా నున్నదని చెప్పుట స్వప్రమాణము స్వయుక్తికమెంతమాత్రము న్గాదు. కణాదమునిచేతను మఱియుం గౌతమునిచేతను మఱియుం గపిలమునిచేతను గానీ పేర్కొనఁబడిన పదార్థములు శిష్యులకు సులభబోధకై ప్రత్యేకముగా నున్నట్లు వ్యవహారార్థమై మాత్రమే యుపదేశింపఁబడెనుగాని పరమార్థమున నొక్క బ్రహ్మపదార్థముకన్న వేఱే పదార్థము లేనేలేదు. మఱియుఁ గపిలుఁడు పేర్కొన్న యిరువదియైదు ప్రాకృతతత్త్వములు నైయాయికులు పేర్కొన్న పదార్థములన్నియుం బురుషునికన్న భిన్నములు కానే కావు. "పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యమ్" అను శ్రుతిమాత్రమే యష్టాదశవిద్యలకెల్ల సారమగు ముఖ్యవాక్యము. తక్కినవాక్యము లన్నియును గౌణములు మఱి యప్రధానములని సిద్ధాంతీకరింపక తీఱదు. "ఓమ్" ఓంకార శబ్దమాత్రముచేత నష్టాదశ విద్యలన్నియు గతార్థము లగుచున్నవి. కాఁబట్టియే పరమహంసలు "ఓమ్" అని ఓంకారమును మాత్రమే యుపాసించుచుఁ దుద కాయోంకారమున లయమగుచున్నారు. అకారము, ఉకారము మకారములు కలిసి "ఓమ్" అని యైనవి. నాదబిందుకలాత్మకములగు అకారము, ఉకారము, మకారము, సత్త్వరజస్తమోగుణముల నుద్బోధించుచు శివశక్తుల యైక్యమును బోధించుచు నిర్గుణ బ్రహ్మ

సమాధినీ యోంకారోపాసనము కలిగించును. నిర్గుణము నిరంజనము శాంతమునగు పరబ్రహ్మమే "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" అను విధమున "ఓమ్" ఓంకారోపాసకుఁడగు పరమహంస బ్రహ్మీభూతుఁడే యగుచున్నాఁడు. జలబిందువు జలమందే లయము చెందునట్లు భక్తిశ్రద్ధలు గల పరమభాగవతుఁడు భగవతునియందే లయమగుచున్నాఁడు నిర్గుణమగు నేకాగ్రదృష్టిరూపక మనిర్విషయమగు ధ్యానవాస్తవమగు పారమార్థికతత్త్వము, సగుణసవిషయ మనోభ్రమమే మిథ్యాత్మక వ్యావహారికతత్త్వము. నిర్గుణతత్త్వము వాస్తవము సగుణతత్త్వము సత్యము కాదుకాదు. నిర్గుణపరబ్రహ్మమే సత్యము సగుణమగు జగత్తే యసత్యము. కలలోని కలవలె జగన్వికారములోని వికారము లీ యష్టాదశవిద్యలు.

పృథివ్యప్తేజోవాయువు లాకసమున లయము చెందునుగాని యాకసము స్వతంత్రకార్య మగుటచేత నిత్యకారణరూపమున నుంటచేత నుద్భవస్థితినాశములు చెందక సచ్చిదానందలక్షణ స్వస్వరూపమున నిత్యమై సత్యమై యున్నది. ఆ పరమాకాశమే నాదబ్రహ్మమనంబడును. మఱి యీ నాదబ్రహ్మమే "బ్రహ్మైవ సంసరతిముచ్యత ఏతదేవ, దౌవారికం భవతి సంసరణాచతస్య, ముక్తిః పునర్భవతి చిద్వపుష్మైవతస్య, స్వాజ్ఞానతః స్వమహిమ ప్రతిబోధతశ్చ" అను సర్వజ్ఞమునిమతము బుద్ధునియొక్కయుం జగద్గురుఁడగు శంకరాచార్యునియొక్కయు నుపనిషత్తు లన్నింటియొక్కయు "వాసుదేవః సర్వమితి" అను భగవంతునియొక్కయు బోధల ననుసరించి సప్రమాణమై సయుక్తికమై యున్నదని నానమ్మకము. నామతముతో నేకీభవించువారికి నామతమే యథార్థముగాకమానదు. శబ్దముత్పన్నమైనకొంతసేపటికింద్రియపాటవముకొలందిని శ్రవణేంద్రియగాహ్యమగునపుడు శబ్దముత్పన్నమయిన క్షణమందున్న శక్తికంటె

సన్న గిల్లి వినంబడును. కాలవిలంబముం బట్టియు శ్రవణేంద్రియశక్తి యొక్క యసామర్థ్యమును బట్టియుఁ బుట్టినక్షణమం దున్న శక్తి ధ్వనికిఁ దగ్గుచుండును. సకలపదార్థసమ్మేళనములే కింద్రియగ్రాహ్య మగుకార్య మెద్దియు న్గలుగనేరదు. ఒండొంట నంటక శుద్ధముగాఁ బ్రత్యేక మే భూతమునకు స్వాతంత్ర్యస్థితియుంట స్వప్రమాణము న్సయుక్తియుం గాదు. "తత్త్వమసి తత్సవితుర్ వరేణ్యమ్, తత్సత్ తదైక్షత" ఈ మొదలగు శ్రుతులయందలి "తత్" అను శబ్దము సత్య జ్ఞానానంతలక్షణమగు బ్రహ్మపదార్థమును జెప్పుచున్నది. ఇంద్రియ దృష్టమయి చెంతనున్న వస్తువును గూర్చి "ఇది నీవు, నేను" అను శబ్దములు వ్యవహరింపఁబడును దూరముగా నున్న పదార్థము విషయమైగాని యదివఱకుం బరిచితమై ప్రస్తుతము ప్రత్యక్షము కాని యంతదూరమం దున్న వస్తువిషయమైగాని కేవలాప్తప్రమాణము మాత్రముచేత నెచ్చటనైన నున్నదని నమ్మినవస్తువును గూర్చిగాని "తత్" అను శబ్దము వ్యవహరింపఁ బడుచున్నది. "నేతి నేతి, యతో వాచో నివర్తన్తే అప్రాప్యమనసాసహ" అను శ్రుతులం బట్టి మనో గోచరమైనదిగాక యింద్రియదృష్టముగాక కేవలముం దన స్వప్న జాగ్రత్సుషుప్త్యవస్థల కెన్నఁడైన ననుభవము కాక బోక కేవల మాప్తవాక్యప్రమాణముచేత మాత్రమే విశ్వాసముచేతను మఱి యాస్తిక్య మతాభ్యాసపటిమచేత నొక విధమైన వస్తువతీంద్రియమై సర్వలోకాతీతమై వ్యావహారికభిన్నమై సకలప్రమాణముల కగమ్యమై యున్నదనుకొన్న పదార్థము గురించి "తత్" అని ప్రథమపురుషము వ్యవహరింపఁబడుచున్నది. అనఁగా మొత్తముపై నీలోకములో లేని వస్తువు వఱియు ర్త్యజ్ఞానమున కగమ్యమగు వస్తు వాప్తవాక్యప్రమా ణముచేత మాత్ర మున్నదనుకొని నమ్ముకొన్న వస్తువునుగూర్చి "తత్" అనివ్యావహారికశబ్దము వాడఁబడుచున్నది. "తత్" అను

శబ్దమునకు నిర్గుణపరబ్రహ్మమని యర్థము చెప్పబడుచున్నది. కాని నిక్కముగాఁ బారమార్థిక వస్తువు ఏ వ్యావహారికమగు "తత్" అను శబ్దముచేత మునులు బాఁబోధకై మఱి యుపాసనా సౌలభ్యమునకై తక్కిన శబ్దములవలె నుపదేశించినా రనుటయే సయుక్తికమును మిక్కిలి సమంజస మనకతీఱదు. "అశబ్ద మస్పర్శం నిర్గుణం శాంతమ్" అను శ్రుతులు శాఖాగ్రచంద్రవత్తుగా దేవునిగూర్చి వ్యవహరింపబడుచున్నవి. "శ్రుతిస్థానే స్వరాన్వక్తుల నాలం బ్రహ్మాపి తత్త్వతః" అను నారదోక్తి ప్రకారము "ఇదమిత్థమ్" శబ్దముంబట్టి యర్థమును గాని యర్థముంబట్టి శబ్దమునుగాని నిర్దేశింప నలవికాదు. "పాదోఽస్య విశ్వాభూతాని, త్రిపాదస్యామృతం దివి" అనుటచేత భగవత్త్వము మూఁడువంతులశరీరము న్నిరుపాధికమైనది మఱియొకపాలుసశరీరము నోపాధిక మైనదను శ్రుత్యాత్మకాప్తవచన ప్రమాణము న్నమ్మిన యెడల "అశరీరమాత్మా" అన్నట్లు "తత్" అను శబ్దముచే నిర్గుణ బ్రహ్మ ముద్దేశింపఁబడుచున్నది. నిన్నటి సూర్యకాంతికి నేఁటి సూర్య కాంతికిం బ్రతిక్షణముం భూతభవిష్యద్వర్తమాన కాలములయందలి సూర్యకాంతికి న్దత్తద్దేశకాల పాత్రానుసారముగా మాఱుదల యున్నదని సయుక్తికముగా సప్రమాణముగా సిద్ధాంతీకరింపకతీఱదు కనుక క్షణక్షణమునకు మాఱుచున్న పదార్థములం బట్టి మాఱుదల లేని పదార్థ మొకటి యున్నదనుకొంట యప్రమాణమున్ భ్రాంతి యుంగాని యథార్థము కానేరదు కాఁబట్టి వ్యావహారిక నామరూపము లనిత్యము లగుటచేత ననిత్య మర్త్యబుద్ధిగుణమునకుఁ గేవల విలక్షణమగు నిత్యబుద్ధిగుణము గ్రాహ్యమగుననుట "వింధ్యః ప్లవేత్సాగరే" అనుటవలె నసంభవము కాదా ? నడురేయి చిమ్మచీకటిచేతఁ బట్టపగటి వెల్లడి గ్రాహ్యమగునా ?

## దైవపౌరుష పరిణామక్రమము

అనిత్య మర్త్యబుద్ధికి నిత్యామృతాత్మ బుద్ధివిషయమగునను
నైయాయిక మతము అంషముచేత నాకసము న్ముక్కలుగాఁ
గోయుటవలె నసంభవముకాదా ? కేవలము నీ భక్తివిశ్వాసములకు
మూలమగు నాప్తవాక్య ప్రమాణముచేతఁ దప్ప దేవుఁడు నాస్తిక
పాషండ వేదబాహ్య కుతర్కముచేతఁ సాధ్యుఁ డెంతమాత్రము
న్గాఁబోఁడు, "నమ్మి చెడినవారు లేరు నమ్మక చెడిపోతే పొయ్యేరు"
అను విధముగా నాప్తవాక్యానుసారముగా హేయాదేయ వస్తువివే
కము నంపాదించుకొన్న మేల్మఱచి కృతఘ్నులై యాప్తవాగ్రూప
మగు నష్టాదశ విద్యల యుపదేశము ననుసరించి లోకోపకారముగాఁ
జతుర్విధాభినయములం బ్రయోగించి "ఆపరితోషాద్విదుషాం
నసాధుమన్యే ప్రయోగవిజ్ఞానమ్" అను కాళిదాస వచనము విశ్వ
సించి లోకోపకారము సంపూర్ణముగ నాచరించునట్లు చతుర్విధాభి
నయ విశేషప్రయోగము కావించుశక్తిం దనకుఁ గలిగించుమని
భగవంతునిం బ్రార్థించుచుం బరమభాగవతుఁడై యొరుల సుఖపెట్టి
తరింపఁజేసి తా సుఖపడి తరించవలెను.

వాచికాభినయము న్నాసించు శిక్షావ్యాకరణ చ్ఛందోనిరుక్త
శాస్త్రములంగూర్చి - సకల మర్త్యజంతువుల నడువడి యంతయును
స్వబుద్ధికృత మెంతమాత్రము న్గాక యవశముగా ఘుణాక్షర న్యాయ
ముగా ననిత్యమై క్షణావస్థితమై యెన్ని జంతువులో యాజంతువుల
జీవితకాలములో లెక్కింపఁ దగిన క్షణము లెన్నియో యన్నివిధములఁ
మాఱుచున్నప్పటికి "సోహం దేవదత్తః" అను రీతిగాఁ బ్రతిక్షణ
మన్నివిధముల మాఱుచున్న గంగాతరంగిణులవలెఁ బ్రత్యేకముగా
మాఱుచున్నట్లు దైవవశమునఁ గొంతకాలమువఱకు నిల్చియుంటచేత

నొక్కొక్క పద్ధతి ప్రకారము కల్పింపఁబడినట్లు కాన్పించుచున్నది. ఈజగములోఁ జేర్కొనఁబడిన పదార్థము లొకటియైన నొండొంట మిశ్రమముగాక శుద్ధము స్వతంత్రము కలువు లేక కన్పట్టనేరదు. త్రిగుణాత్మకము కాని పదార్థ మొక్కటియు న్లేదు. స్వప్న జాగ్రద్దశలందు మాత్రమే మనస్సు సవిషయమై నానావిధ జగద్వికారములం గని పెట్టుచు దానిర్విషయముగా నున్న సుషుప్తిదశ న్గూడ స్మరించుచున్నది. కాఁబట్టి భావాభావములు సగుణ నిర్గుణములు నని పదార్థములు రెండేవిధములయి స్మృతి విస్మృతులంబట్టి ప్రతిపాదించవలసియున్నది. భావ సగుణ స్మృతికార్యముల కభావనిర్గుణవి స్మృతులు కారణము లనఁకొనక తీఱదు. భావ సగుణ స్మృతికార్యమే యీ యైహ లౌకికద్వైత వ్యవహారదశ మఱి యభావ నిర్గుణ విస్మృతి కారణస్వరూపమే యీ పారలౌకి కాద్వైత పరమార్థదశ "యథా లోక స్తథా వేదః" అనుటచేత సర్వసముఁడగు భాగవతున కీలోకమే వేదస్వరూపుఁ డగు గురువుగాఁ గాన్పించును మఱియును స్వార్థైక తత్పరుఁడు కేవల కుక్షింభరుఁ డగు దుర్జనునకు సుఖదుఃఖాత్మకుఁ డగు శనిగాఁ బొడగట్టుచుండును "గురుర్జ్ఞానం సుఖం శని ర్దుఃఖమ్" అనుటచేత నిత్యమనశ్శాంతి గురుస్వరూపము. మఱి సంతత మనోవికారము శనిస్వరూపము. సుఖనిద్రకై సజ్జనుండును దుర్జనుఁడు నుభయులును గాంక్షించుచుంట సహజమైనప్పటికిని దుర్జనుఁడు వ్యసనపరుఁడై కోరిన మనశ్శాంతిని దాఁ జెఱచుకొనుచు నితరులకుఁ గూడఁ జెఱుపఁ బ్రయత్నించుచుండును ప్రసన్న హృదయుఁడు శాంత చిత్తుఁ డగుపరమభాగవతుఁడు "సత్యంబ్రూయాత్ ప్రియం బ్రూయా న్నబ్రూయా త్సత్య మప్రియమ్" అను నీతిపద్ధతి ననుసరించి లోకుల యాదరమునకుఁ బాత్రుఁడై సుఖముగా నిద్రించును. దుర్జనుఁడు

పలుగాకియై యసందర్భ ప్రలాపములచేత దుస్సర్వజ్ఞత్వముందురహంకారముం జూపుచు లోకుల యాగ్రహమునకు లోనై పోయిగా నిదురింపనేరఁడు సుషుప్తివంటి మోక్షమును గూర్చియును స్వప్నము వంటి చోదనాలక్షణ ధర్మముం గూర్చియు సంసారులు చింతింపఁబనిలేదు. లోకమున జరుగుచున్న సకల వ్యవహారములకును సందర్భించియే వేదశాస్త్రము లున్నవి వేదశాస్త్రనుసారముగానే లోకవ్యవహారములు కల్పించఁబడినవి. వేదములోఁ జెప్పఁబడిన సంగతులే లోకమందు వ్యవహరింపఁబడుచున్నవి. లోకమందలి వ్యవహారధర్మమునే వేదము చెప్పుచున్నది. లోకవృక్ష కార్యమునకు నిక్కముగా వేదమే బీజము. కాని యవ్యక్తమగు కారణము ౯దెలిసికొనుట యసాధ్యము. కంటిరెప్ప వేసినంతకాలము పలము. పలములో వేయి యవభాగము తత్పరము మఱియుందత్పరమందలి వేయియవభాగము లగ్నము. కాఁబట్టి యాలగ్నకాలము న్నాతాతయగు వసిష్ఠుఁడే తెలియనేరఁడు మఱియు ౯దేవగురువగు బృహస్పతియే కనిపెట్ట స్సమర్థుఁడు కాఁడన నేనేపాటియని పరాశరముని తన హోరా శాస్త్రమునవక్కాణించెను.

"లౌకిక వ్యవహారేషు యథేష్టం చేష్టతాంజనః, దైవికేషుచ కార్యేషు విశేషోక్తిః ప్రవర్తతామ్" అనుటచేత లోకులు తత్తద్దేశ కాల పాత్రానుసారముగా నడచిన నడత వేదశాస్త్రములం దెట్లు వివరింపఁబడెనో యాసంగతి బోధించుటకై మాత్రమే వేదశాస్త్రములు ౯దేశింపఁబడెను గాని వేదశాస్త్రములం బ్రతిపాదింపఁబడిన పద్ధతులం బట్టి వ్యవహరించుటకుఁ గాదు సంసార మను బండికి రెండు చక్రములవంటి దైవ పౌరుషములం బట్టి మనుష్యుఁడు తా నడచిన నడతన్గూర్చి వేదశాస్త్రము లేమి చెప్పెనో తెలిసికొనుటకై మాత్రమే వేదశాస్త్రముల ప్రయోజనము. లోకవ్యవహారము చేయుట మొదటి

పని. వ్యవహరించిన పిదపఁ దన నడతను గూర్చి వేదశాస్త్రము లెట్లు
చెప్పెనో తెలిసికొనుట వెనుకటిపని. శబ్ద స్పర్శ రూప రస గంధాను
భవముల శ్రోత్ర త్వఙ్నేత్ర జిహ్వా ఘ్రాణేంద్రియ ప్రవృత్తి గలిగిన
పిమ్మటఁ గదా యీ శబ్దస్పర్శ రూప రస గంధ గుణ తత్త్వవిచార
ణము కలుగుట సకలలోక ప్రత్యక్షానుభవమే కదా ? లోకవ్యవహార
మెద్దియైన సహజముగా జనుఁడు చేసి యనఁగాఁ దనకు దేహస్మృతి
కలిగిన పిమ్మటఁ గదా యీ శరీరస్మృతి సకారణమా నిష్కార
ణమా, సహజమా, యాగంతుకమా వాస్తవమా, మిథ్యయా,
నిత్యమా యనిత్యమా, స్మృతియే జగద్రూపమైనదా. జగమే శరీర
స్మృతికారణమా, స్వప్నదేహమువలె జాగ్రద్దేహము గూడ భ్రాంతి
కల్పితమా యీ మొదలగు విచారణము శరీరస్మృతి కార్యము పుట్టిన
పిదపఁ గదా శరీరస్మృతి కారణ మెఱుఁగఁ దలకొనుట. ఈ దేహ
స్మృతియే లోకవ్యవహార స్వరూపము. ఈ శరీర స్మృతికారణ
మునే వేదశాస్త్రములు వివరించును. కాఁబట్టి కార్యజ్ఞానము మొదటం
గారణజ్ఞానము పిదప గలుగుటయే మర్త్యులకు సహజ ధర్మము.
కార్యదృష్టి లేనపుడు కారణచింతయే పొడమదు. కార్యస్వరూపమే
పౌరుషము. కారణస్వరూపము దైవము. కార్య మింద్రియగోచరము,
కారణ మతీంద్రియము. పంచేంద్రియ ప్రవృత్తికార్యాత్మక లోకవ్యవ
హారము పౌరుషము. పౌరుష నియామక కారణాత్మక వేదశాస్త్ర
స్వరూపము దైవము దైవముం దెలిసికొని వ్యవహరింప నెవ్వరికిం
దరముకాదుగదా? యట్లే వేదశాస్త్రము లెఱిఁగి బ్రతుకు నడుపు
కొంట యసాధ్యము. శరీరస్మృతికారణముం దెలిసికొనుటయుఁ దన్నుఁ
దా నెఱుఁగుటయును వేదశాస్త్రధర్మము దెలిసికొనుటయును "అహం
బ్రహ్మాస్మి" అని యనుకొంటయును నిక్కముగా నౌపచారికములు
శాఖాగ్రచంద్రబోధలు- శశవిషాణములవలెఁ గేవల శబ్దమాత్రములు

స్వప్నపదార్థములవలె మిథ్యాకల్పనములు కేవలశబ్దైకప్రమాణములు విశ్వాసైక మూలములు సహజానుభవ విరుద్ధములు లోకాతీతములు మఱి యతీంద్రియములు కేవల ధ్యాన గమ్యములు కావున సకల లోక వ్యవహారాత్మ కార్థ కామప్రయోజక పౌరుషకారణమగు కేవల పరమార్థబోధక ధర్మమోక్ష ప్రయోజక దైవమును గూర్చిన లోక వ్యవహారములు మానుకొని యొరుల సుఖపెట్టి తా సుఖపడక లోక వ్యవహారముతో సంబంధము లేక యతీంద్రియమై యవేద్యమై యలౌకికమై దైవస్వరూపమై సర్వజగన్మూలకారణమై నిత్యమై యపౌరుషేయమై దైవస్వరూపమైన చోదనాలక్షణధర్మమును గూర్చి గాని మోక్షమును గూర్చి గాని చింతించుట మునులకుఁ జెల్లును. సంసారులకు బొత్తిగాఁ దగనిదని.

లోకోపకారమునకై మాత్రమే తమ పౌరుషమును వినియోగింపఁ జేయుచుఁ దమ బ్రతుకు నిత్యము కావింపుమని దేవుని వేఁడుకొనుటయే యర్థకామములను పురుషార్థములు. మునులకు మాత్రము ధర్మమోక్షములను పురుషార్థములు వేదశాస్త్రములచే విధించఁబడెనుగాని సంసారుల కెంతమాత్ర ముద్దేశింపఁబడలేదు. మును లతీంద్రియు లశరీరు లవస్థాత్రితయ సాక్షులు మఱి యీ జనన మరణ సంసారసాగర నిమగ్నులగు మర్త్యు లర్థకామములను పురుషార్థములు మాత్రమే సంపాదించుకొనుటకే విధింపఁబడిరి కావునఁ దనతోడిపాటివారి ప్రేమానురాగములు సంపాదించుకొన్నఁ గాని యభీష్టార్థ కామములు తన కబ్బనేరవు. ఒరులను సుఖపెట్టి తా సుఖపడుటకై సాధింపఁ దగిన పురుషార్థములు ప్రాకృతులగు మర్త్యుల కర్థకామములు రెండే, రెండే. ధర్మమోక్షము లర్థకామములకు సముద్రమునకుఁ దరంగములవలె వేఱుకావు, దేహస్మృతి విశేషముతో భ్రమమాత్రమలయిన యర్థకామ్య విశేషములే ధర్మమోక్షములు. అంబలి

త్రాగువానికి మీసము లెత్తువాఁడు కావలెనా యను సామెతగా నర్థ కామములనే సంపాదించుకొన నేరనివానికిఁ దన ప్రాఁతయే తాఁ జనువలేనివాని కితరుని ప్రాఁతవలె ధర్మమోక్ష చింత పనికిరాదు పనికిరాదు ధర్మమోక్షములు సాధన చతుష్టయసంపద గలయశరీరు లతీంద్రియద్రష్టలగు కపిలాదిమునులకు మాత్రమే సాధ్యములు. ఒక్క దమ్మిడితోఁ బదికోట్ల పీసెలబంగారు విలువగల చక్రవర్తి సౌధము న్గొననుంకించు భ్రాంతునివలె మాటాడుకొను పిల్లకాయల వలె ధర్మమోక్షముల సాధింపయత్నించు సంసారులు కేవల మవివేకులు కారా? ధర్మమోక్షములు కేవలముం బారమార్థికములు గాని వ్యావహారికము లెంతమాత్రమున్గావు. అనఁగా వేదశాస్త్రములు కేవల పరమార్థబోధకము లగుటచేత నతీంద్రియ ద్రష్టలగు కపిల పతంజలి గౌతమ కణాదజైమిని వ్యాసాదిమునులకు మాత్రమే యుద్దేశింపఁబడినవికాని సంసారుల కెంతమాత్రము న్గావు కావు. కనుకనే "యథేష్టం లోకవ్యవహారేషు చేష్టతాంజనః" అను కామచారానుజ్ఞయీఁబడెను. ఆకాశాద్వాయుర్వాయోరగ్ని రగ్నే రాపోఽద్భ్యః పృథివీ పృథివ్యా ఓషధయ ఓషధీభ్యోఽన్నమన్నాత్పురుషః పురుష ఏవేదగం సర్వమ్" అనుటచేత దేహస్మృత్యాత్మక పౌరుష దృష్టపదార్థము లన్నియును స్వప్నదృష్ట పదార్థము లన్నియును స్వప్నమయములే యైనట్లు పౌరుష మయములే కావునఁ బౌరుషము కంటె వేఱెపదార్థమే లేదు.

శరీరస్మృత్యాత్మక పౌరుషముచేత జ్ఞానమున కబోధ్య తత్త్వముతో స్ఫురించు పదార్థమే "ఆత్మన ఆకాశః సంభూతః" అనుటచేత దేహస్మృతిరూపక పౌరుషజ్ఞానమున కవేద్యతత్త్వమై స్ఫురించు పదార్థమునకే యాత్మయని గాని దైవమని కర్మమనిగాని కాలమని గాని నామములు. "సుఖస్య దుఃఖస్య నకోఽపిదాతా పరోదదాతీతి

కుబుద్ధిరేషా, అహంకరోమీతి వృథాభిమానః స్వకర్మసూత్ర గ్రథి తోహిలోకః" అను విధముగా నాగామి సంచిత ప్రారబ్ధములను కర్మములచేత నశరీరుఁడగు జీవుఁడు స్థూల సూక్ష్మకారణ దేహముల నుపాధులుగా నాశ్రయించి తుదమొదలు లేక భూతభవిష్యద్వర్తమాన కాలమందు సుఖదుఃఖ పరంపరను "సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖమ్" అను తీరున నపార సంసారసముద్రమున నీదులాడుచున్నాఁడు. ఈకర్మ మనాది. కర్మమే బ్రహ్మస్వరూపము- కాలము- కర్మము- దైవము- విధి- యదృష్టము కర్మమునకే పర్యాయపదములు. ముఖ్యముగాఁ దన పురుషప్రయత్న మెద్దియును లేకయేఁ దాఁగోరని సుఖముగాని దుఃఖముగాని కలిగించుచుఁ దన కెద్దియు న్నిరూపింప శక్యముగాక యతీంద్రియమైన కారణమే కర్మ మనియుం దైవ మనియును వ్యవహరింపఁ బడుచున్నది. అన్ని పదార్థముల కంతర్బాహ్యములనిండి, యన్నిపదార్థముల పరస్పర సంయోగ వియోగములకు హేతువై, సమస్తమును దానయ్యు నతీంద్రియమై తన వాస్తవతత్త్వ మెద్దియో యెవ్వరికిం దెలియనీక తనయున్కిని మాత్రమే తెలియపర్చుచుంటచేతఁ బౌరుషగ్రాహ్యమై సకలపౌరుష మూలమైయున్న యాకాశమునకుఁ గూడ నెద్దికారణమో యద్దియే కర్మము దైవమునాఁ దగును. జీవులందఱును జగమంతయును "దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతం, తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమదేవతా" అనున ట్లీజగమంతయును దైవ వశమున సృష్టిస్థితినాశము లందుచున్నది. మఱి యాదైవము మంత్ర మనఁబరగు. వేదముంబట్టి ప్రవర్తిల్లుచున్న దావేదము బ్రాహ్మణ శబ్దవాచ్యులగు గౌతమ వ్యాసాదిఋషిస్వరూపమైయున్నది. కాఁబట్టి యతీంద్రియ ద్రష్టలు సర్వజ్ఞులు సకలజననములు సర్వభూతాంతరాత్ములు సకల లోకోపకారపరాయణులు స్వార్థత్యాగులు సర్వ

భూతదయామయులగు జగద్గురువులగు మహామును లుపదేశించిన వేదశాస్త్రరూప కాప్తవచన ప్రమాణమే నాయభీష్టదేవతగా నమ్మి సేవించెదనను వాక్యము పరమభాగవత జనసమ్మతము సమ్మతము. జగద్గురువులగు పరమమునులు తత్తద్యుగానుసారము ధర్మార్థ కామమోక్షములను పురుషార్థముల సాధించుకొను నుపాయము ల మహాకవులై పరమభాగవతులై వేదశాస్త్రముఖముల నుపదేశించు చున్నారు. యుగానుసారముగాఁ బురుషార్థ చతుర్వర్గమును సాధించు కొనఁదగిన త్రోవలు మాఱుచుండును. ధర్మమోక్షములు సుషుప్తి దశవలె వివరించి "ఇదమిత్థమ్" అని నిర్దేశింప శక్యముకావు. కాఁబట్టి ధర్మమోక్షముల గూర్చి చెప్పెడి వేదశాస్త్రములు వర్తమానకాలమున నావృద్ధ ప్రపితామహుని గూర్చిన చింతవలె వ్యర్థమును మఱియుం బనిచేటుగాని లాభములేదు "ధర్మ మధర్మము భంగి నధర్మము ధర్మంబు మాడ్కిఁ దనయాతోఁచున్." అన్నట్లు ధర్మసూక్ష్మత గనిపెట్ట నలువయైనఁ జాలఁడు. కంటియెదుట జరుగుచున్న సంగతియొక్క ధర్మము నిరూపింపఁజాలని మర్త్యుల కతీంద్రియ మునిప్రియము మునిరంజనము శాంతము "ఏకమేవా ద్వితీయంబ్రహ్మ" యను తత్త్వస్వరూప మగు మోక్షవిచారణముగూడఁ గుందేటి కొమ్ముతో దువ్వనచేయఁబోవు ప్రయత్నమువలె నసంభవకార్యము కాబట్టి దైవపౌరుష కృత్యములుం బ్రత్యక్షములగు నర్థకామముల న్సాదించుకొను నుపాయముల న్వెదకుకొనుటయే మర్త్యుల కవశ్య కర్తవ్యము.

సరిగాఁ జతుర్విధాభినయప్రయోగ మొనర్చిన సజ్జనుఁడు మాత్రమే యర్థకామములను పురుషార్థముల రెండింటిని సంపాదించు కొనుటచేత నట్టి పుణ్యాత్మునకుఁ దమంతటఁ దామే ధర్మమోక్షములు రెండు గూడసిద్ధించును-సిద్ధించును. అర్థమనఁగా బ్రతుకు. కామమనఁగా

జీవితేచ్ఛ. నిద్రాహారవిహారస్వరూపము బ్రతుకు. నిద్రాహారవిహార సుఖాభిలాషము జీవితేచ్ఛ. అర్థకామముల స్వరూపము హాయిగా బ్రతుకు కోరిక. హాయిగా బ్రతుకు కోరిక నెఱవేఱ నిత్యమనః సంతోషము నొందిన జనుఁడుమాత్రమే ధర్మార్థ కామమోక్షములను పురుషార్థముల నాల్గింటిని సంపాదించుకొన్న భాగ్యశాలి సుకృతి. నిత్యమనస్సంతుష్టి లేనివాఁడు పురుషార్థముల స్సంపాదించుకొనఁ జాలని దౌర్భాగ్యుఁడగు దుష్కృతి. "స్వకర్మ సూత్రగ్రథితోహి లోకః" అనుటచే నేవిత్తు నాటిన నామొక్క మొలచును. మొత్తముపై లోకములోఁ గర్మానుసారము సుఖదుఃఖము లనుభవించుట సకల జనసాధారణ ప్రత్యక్షానుభవమే కదా? కాఁబట్టి త్రికరణశుద్ధిగా సర్వలోకోపకార స్వరూపమగు సత్కర్మము నాచరించి పురుషార్థములను సాధించుకొనవలయును. "అహింసా పరమోధర్మః" అనుటచేత సత్కర్మములకెల్ల సర్వలోకోపకారక మగు భూతదయ సారము. కాఁబట్టి సకలజనరంజకముగా బ్రతుకవలయును. బ్రతుకు చతుర్విధాభినయాత్మకము. ఆ యభినయములలో మొదటఁ బేర్కొనంబడిన వాచికాభినయమును గూర్చిన శిక్షావ్యాకరణచ్ఛందో నిరుక్తశాస్త్రములందుఁ బలుకు తెరువును శాసించు శిక్షాశాస్త్రమును వివరించుటలో ధర్మార్థకామమోక్షములని యుచ్చరించిన క్రమమున కర్థనిర్దేశము నందు ధర్మమే యర్థమర్థమే కామము కామమే మోక్షమని యభేద స్వరూపమే ధర్మాధర్మ కామమోక్షములు నాల్గు నొక్కటియే. పౌరుష మనిపించుకొనుచున్నది. పురుష ప్రయత్నము నాల్గువిధములయి ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థములయి యున్నది. పౌరుషమనఁగా బ్రతుకు. బ్రతుకు ధర్మార్థ కామమోక్ష సాధనమగు పౌరుషమయి యున్నది. ధర్మార్థ కామమోక్షములలో నిత్యములు దైవికములు నగు ధర్మమోక్షము లతీంద్రియములు మఱి

యర్థకామము లనిత్యమర్త్య శారీరకము లింద్రియకృత్యములు కేవల పురుషకారములు సర్వజన ప్రత్యక్షములు మఱియు న్నిద్రాహార విహార స్వరూపములు.

నిద్రాహార విహారమయమగు జీవితమందు సాధింపఁదగిన యర్థ కామములకు దగుస ట్లభినయించుటలో వాచికాభినయ విధాన మెఱఁగించు శిక్షావ్యాకరణ చ్ఛందోసరు క్తములందు మొదటిది శిక్షా శాస్త్రము. నారదశిక్ష యత్యుత్తమము, పరమభాగవతులలో సజ్జ నుఁడు నారదుఁడు, గంధర్వవేదకోవిదులందు నారదుఁడు దేవముని కావున నారదశిక్ష శిక్షలలో శ్రేష్ఠము. సత్త్వరజ స్తమోగుణాత్మక మగు శరీరస్మృతి రూపకజాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాను భవమే జీవాత్ముఁడు. భూతభవిష్య ద్వర్తమానకాలములం దాగామి సంచిత ప్రారబ్ధస్వరూపక స్వకర్మమనుభవించి యనుభవించుచు ననుభవించ వలసిన కర్మమును స్వకర్మసూత్రగ్రథితుఁడై యాదిమధ్యాంతరహిత సంసారచక్రమునఁ ద్రిందుమీఁదుల స్వర్గనరకాత్మక సుఖదుఃఖకారణ నిజపుణ్య పాపకర్మఫల మనుభవించక తప్పదు.

సంపూర్ణ సత్కర్మఫలముచేత నిత్య సంతుష్టాంతరంగుఁడై స్వార్థపరత లేమిచే భగవదర్పిత సర్వకర్మ ఫలము కలవాఁడగుటచేతఁ బరమభాగవతుఁడై సంచరించుచుండియును మంటియందుండియు న్నన్నంటని కుమ్మరి పుర్వుచందమునఁ బ్రకృతినంటక నిర్లిప్తుఁడై కపిల మహామునివలె జీవన్ముక్తుఁడగును. ప్రకృతి స్వరూపకగుణమయ దేహ స్మృతి మాత్ర మాత్మకుఁ దప్పదుగాని సత్కర్మచేత లభ్యమగు నిత్య మనస్సంతృప్తి రూపక బ్రహ్మసమాధి నుండుటచేత "మనురభవమ్" అని బ్రహ్మజ్ఞానముతోనే తల్లి గర్భమున వెలువడుచున్న వామ దేవుడు గుణమయదేహమును ధరించియుం బ్రకృతికంటక నిర్లిప్తుఁడై "బ్రహ్మవలోకస ధియం నజహాతి యోగి" అను నట్లు జ్ఞానయోగ

ముగల మునికీ దేహస్మృతి రూపక సంసారము దగ్ధపటమువలెఁ బేరునకు మాత్రముండును గాని వాస్తవముగా సకల భూతదయా పరుఁడు సకల జనసముఁడు సర్వలోకోపకారపారీణుఁడు స్వార్థత్యాగి యగు సుకృతికి సంసారము జలస్తంభవిద్య గల్పింపఁబడిన నౌక యంతస్సముద్రమున యథేష్ట సంచార మొనర్చిన ట్లుంటీయుంటదు. "మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అనుటచేత సకాముఁడు బద్ధుఁడు నిష్కాముఁడు ముక్తుఁడుగా నీజనన మరణ ప్రవాహరూపకసంసారముజీవునకుఁదప్పదు దప్పదు. సత్కర్మముచేత "అగ్నిర్హి మస్యభేషజమ్" అనునట్లు సజ్జనుఁడు సంసారదుఃఖమును బొందక నిత్యసంతుష్టుఁడై బ్రహ్మానందమున నోలలాడుచుఁ గర్మఫల మనుభవించక సూర్యునివలెఁ గేవలము కర్మసాక్షియై యుదాసీన తటస్థ లక్షణములతోఁ బరమాత్మ సాక్షాత్కారముందును. కాఁబట్టి "అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్" అను వాక్యాను సారముగా మునులు వేదశాస్త్రముఖమున మనుష్యులకు "అథాతో ధర్మ జిజ్ఞాసా- అథాతో బ్రహ్మజిజ్ఞాసా- అథశబ్దాను శాసనమ్" అని సదుపదేశ మొనర్చిరి. "బాలానాం సుఖబోధాయ" అని కొందఱు ప్రాజ్ఞులు శాస్త్రి వ్యాఖ్యానములొనర్చిరి. కాఁబట్టి యష్టాదశ విద్యల సారము పిన్నలకు శక్తికొలందిం బెద్ద లుపదేశింపవలసి వచ్చెను. వేదశాస్త్రానుసారములే సార్వలౌకిక నిద్రాహార విహార సౌఖ్యసంపా దక కర్మము లన్నియు, లోకములో జరుగుచున్న ప్రతి క్రియయును వేదశాస్త్రసమ్మతమే. "ధాతాయథా పూర్వ మకల్పయత్" అను టచేత వేదమును స్మరించి వేదమునం బ్రతిపాదితము లయిన పదార్థ ములనే బ్రహ్మదేవుఁడు పూర్వకాలమున నున్నట్లే వర్తమానకాల మందుఁ గూడ సృజించెను. దేశకాలపాత్రానుసారముగా నానా వస్తువుల నుందర్భముచే సుఖకరముగాఁ గావించుకొనుట కేవల

పౌరుషాయత్తము. సజ్జనునకు మాత్రముపదార్థ సందర్భ జ్ఞానమబ్బును. ఆసందర్భముగాఁ బదార్థముల ననుభవించు నవివేకి తాఁ జెడి లోకులం జెఱచును. సజ్జనుఁడు సందర్భ శుద్ధి నెఱిఁగి లోకోపకారము కావించి తా సుఖపడును గాఁబట్టి లోకములో పదార్థము లన్నియు నుపయోగించఁ దగినవియే. ఉపయోగించుకొన వలసిన మార్గములు కేవలాప్త వాక్య ప్రమాణమునఁగాని యితర ప్రమాణములవలన విస్పష్టముగాఁ దెలియఁబడవు. సర్వలోకాప్తులు గౌతమ వ్యాసమునులు. న్యాయ మిహమును గూర్చియు వైరాగ్యము పరలోకము నూర్చియు మూర్తీభవించినవి న్యాయవేదాంతములు. "నేర్చి బ్రతుకువాఁడునేరక చెడువాఁడు ధాత్రియందుఁ గలరె ధరణినాథ" అను తీరునఁ బౌరుష మంతయును విఫలము "యల్లభసే నిజకర్మోపాత్తం విత్తం తేన వినోదయ చిత్తమ్" అను నాచార్యోక్తి ప్రకారము స్వకర్మానుసార ముగా నైహలౌకిక పదార్థములచే నర్థకామములుసంపాద్యములగును. "యద్ధాత్రా నిజఫాల పట్ట లిఖితం స్తోకం మహ ద్వాధనం తత్ప్రాప్నోతి" అను వాక్యానుసారముగా స్వకర్మానుసారముగా దైవపౌరు షములు ఫలించును. తన భూత భవిష్యత్కర్మములు తనకు మిక్కిలి పరోక్షములు. వర్తమానకాలమందు లోక విరుద్ధము కాక స్వార్థ పరత లేక కేవల పరోపకారమునకై మాత్రమే సజ్జనుఁడు తీవ్ర పౌరుషమునఁ జేయు కర్మమంతయు నొకప్పు డనుకూల కాలమున నొకప్పుడు కాలవైపరీత్యముచేత సఫలమయ్యును విఫలమయ్యును ఫలాపేక్ష యనఁగా స్వలాభము నాసించి యా సజ్జనుఁడు వ్యవహ రించఁడు గనుక నా పుణ్యాత్ముని బ్రతుకునందలి కర్మములన్నియును లోకోపకారములయి విబుధ స్తవనీయములు కాకమానవు.

## కర్మము బ్రహ్మము

తన సుషుప్త్యవస్థయును స్వప్నావస్థయు దన యాత్మాను భవప్రమాణముచేత నుపేక్షించి తన జాగ్రద్దశా వ్యవహారమే

యథార్థమనుట మర్త్యులకుఁ దప్పనిస్వభావము కనుక నీజగమంత యును "ద్వైతాద్వైతసమంబ్రహ్మ"అనురీతి న్యథార్థముగా భావిం చుకొని దేహధారులు వ్యవహరించక తీఱదని సర్వజ్ఞులును జ్ఞాన స్వరూపులుం బరమకారుణికులును సర్వజగదుపకారులు నగు గౌత మాది బ్రహ్మర్షులు కేవలాద్వైతబ్రహ్మధ్యాన సమాధిస్వరూపు లయ్యును జగద్గురు శంకరాచార్యాది పరమహంసలు లోకోపకార మునకై కదా శారీరక భాష్యాద్యనేకగ్రంథముల ద్వారా పురుషార్థ ములను సంపాదించుకొను నుపాయము లుపదేశించిరి. కాఁబట్టి యీ లోకమంతయును త్రిగుణమయమగు నిజకర్మానుసారముగా లబ్ధ మయిన స్వప్నజాగ్ర త్సుషు ప్త్యవస్థానుభవ మంతయును స్వార్థ త్యాగులై లోకోపకారపరులయిన సజ్జనులకు సంసారవికారముల నొకింతయు గలిగింపఁజాలక కేవలము న్నిత్యమన స్తృప్తి రూపక బ్రహ్మానందాను భూతిగా మాత్రమే ఫలించును. పాంచభౌతిక పదార్థ ములన్నియును గౌతమాదిబ్రహ్మర్షులకుఁ బ్రత్యక్షము లయినప్పటికి నమ్మహనీయుల బ్రహ్మభావనావశమున నీజగమంతయును వాసు దేవుఁడుగానేఁ పొడకట్టి బ్రహ్మానందము గలిగించునుగాని రాగ ద్వేషాది సంసారవికారముల నొక్కింతయును గావింపనేరవు. కాఁబట్టి జాగ్రదవస్థకు గ్రాహ్యమగు ప్రత్యక్షపరోక్షాత్మకమగు నీ జగత్కా ర్యము లన్నియును మఱి యీ లోకవ్యవహార మంతయును వాస్త వమే కాని కల్ల కాదు. శశవిషాణమువలెఁ ద్రికాలములయందు లేనిది లేనిదే. యభావ మభావమే. లోకాతీతము. లోకాతీతమే. శూన్యము శూన్యమే. ఇంద్రియ ప్రత్యక్షమైన పదార్థ మొకప్పుడు నీడవలెఁ బ్రతిబింబమువలె భ్రాంతికృతమయ్యు నాభ్రాంతి. కారణములేక కలుగుట యస్వాభావికము యుక్తివిరుద్ధ మసంభవముకాదా?

కాబట్టి కారణములేక కార్య మొదవదను న్యాయము సకల జన సహజ సామాన్య మతమేకదా? "ప్రమితి విషయాః పదార్థాః।

ధియో యోనః ప్రచోదయాత్" అని వేదశాస్త్రము లం బట్టి తదార్థ తత్త్వము నిశ్చయించుటకు మూలకారణము యథార్థ బుద్ధియనంబడి పదార్థ తత్త్వమును లెక్కించు ప్రమితి యని న్యాయ మతమును, వాస్తవ మెఱింగించు బుద్ధిని దేవుఁడు మాకిచ్చుఁగాక యని శ్రుతి మతమును బ్రవర్తిల్లుచున్నవి "ప్రయోజన మనుద్దిశ్యనమందోఽపిప్రవర్తతే" ఎద్దియో కారణరూపక మగు నూహ లేక యే వెఱ్ఱికూడనే కార్యముచేయుటకైనం బ్రవర్తిల్లఁడుగా? కాఁబట్టి సకారణము గాని కార్య మీలోకమునఁ బుట్టదని యేమాత్ర జ్ఞానవంతుఁడైన మనుష్యుఁడు నూహింపక తీఱను తీఱదు. త్రిగుణమయ శరీరస్మృతి యీలోకమంతయు నీ దేహస్మృతికంటె వేఱే మఱి పదార్థమే లేదు. "ప్రమితి విషయాః పదార్థాః" అనుటం బట్టి దేహస్మృతియే యీ ప్రాపంచికపదార్థములతత్త్వమునుగనుగొనుచున్నది. కాఁబట్టియీలోక పదార్థ స్థితి కంతకును మూలకారణమా శరీర స్మృతియే. మఱియు నీ దేహస్మృతియే జగత్కార్యముగా బరిణమించిన కారణమనితర్క వేదాంత మతముల రెండింటియొక్క సమన్వయము సమంజసమే యను నిశ్చయజ్ఞానము గౌతమ వ్యాసాది మునులకు మాత్రమే చెల్లును గాని ప్రాకృతులగు మర్త్యులకు కార్యకారణములు రెండు నొక్కటే యనియు దేవునకును జగమునకు భేద మెద్దియును లేదనియును విత్తునకును జెట్టునకును వస్తు భేదము లేదనియును తను శరీర స్మృతియే యీ సమస్త జగద్రూపముగా బరిణమించుననియు "పురుష ఏవేదగ్ం సర్వమ్" "హరి మయము కాని వస్తువు పరమాణువు లేదు" అను బుద్ధి యీశ్వర బుద్ధివలె నిత్యము కానేరక భ్రమచేత దూషితమై యథార్థ వస్తువు నరయఁజాలక విపరీతమై ప్రతి కృతిచ్ఛాయా మాత్రమునే కనుచు వాసుదేవునకుఁ బ్రతిబింబమగు జగమును వాసు

దేవుఁడుగా యథార్థముగా గ్రహింపనేరకద్దమునఁ దన నీడఁ జూచి బోరాడు పిచ్చుకలవలె నీప్రాకృత జనులందఱు నీవిపరీత బుద్ధులయి స్వకర్మపాశబద్ధులై "సర్వంఖల్విదం బ్రహ్మ" యను యథార్థ బుద్ధి యిప్పటి వఱకును సద్గురు కటాక్షమునకుఁ బాత్రులు కాకుండుటచేతఁ గార్యకారణములు రెండు నొక్కటియేయని తలంపలేక దుర్భరసంసార తాపత్రయాగ్ని దందహ్యమానులగుట కోర్వక దయాంభోనిధులగు గౌతమ వ్యాసాది మహామునులు తర్క వేదాంత ద్వైతాద్వైత మతములను జతుర్విధ పురుషార్థములను సంపాదించుకొని సంసార దుఃఖము నదరించు దారుల నొండొరుల నొక్కొక్కటి జాటి చెప్పుచు జ్ఞానవృద్ధులు వయో వృద్ధులయిన సజ్జనులు ప్రత్యక్షముగా మంచినడువడి మప్పుచు నీటిలో మునిగిపోవుచున్న వారల నెవల కరుణతోఁ దమ ప్రాణము లొడ్డియైన నొడ్డెక్కించి కాపాడుచున్నారు. - బొమ్మలాటవలె నాటకమువలెఁ దెలిసిగాని తెలియకగాని యథార్థమనుకొని మత్తెక్కైన భావించుకొని గాని యీ సుఖదుఃఖాత్మక సంసారసాగరమున గురుకటాక్ష మను నొడ్డెక్కించునావ దొరకినవఱకు నీలోకులు క్షణక్షణము మునుగుచు దేలుచుంట తప్పదు తప్పదు. "జ్ఞానాగ్ని దగ్ధ కర్మణామ్" అను నట్లు కేవల పరమభాగవతాచారముచేత నబ్బిన సద్బుద్ధిచేత "త్రిపాదస్యామృతం దివి" అను నట్లమృత మగు పురుష తత్త్వము లీనమై సంసారమును దరించి నిర్లిప్తుఁడు నిర్గుణుఁడు "సాక్షీ చేతాః కేవలోనిర్గుణశ్చ" అను పురుష తత్త్వమున లీనుఁడై బ్రహ్మీ భూతుఁడగును.

"పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" అను శ్రుతి దేవుఁ డర్ధ నారీశ్వరుఁడని యభిప్రాయ మిచ్చుచున్నది. "పాదోస్య విశ్వాభూతాని" అను వాక్యము జగద్రూపిణి యగు శక్తిని "త్రిపాదస్యామృతం దివి" అను వాక్యము నిర్గుణుఁ డగు శివుని బోధించుచున్నది. కాఁబట్టి "శివ శక్త్యాత్మకం జగత్" అను స్మృతిచేత నీ జగమంతయు నర్ధనారీశ్వరాత్మకమగు శివశక్తి స్వరూ

వమే కావున నీ జగమంతయు వాస్తవమే కానిమిథ్య కాదు. కాఁబట్టి మెట్టవేదాంతములు చాలించి ధర్మార్థకామమోక్షములను సాధించు కొనుటకై యాప్తవాక్యాత్మక వేదశాస్త్రాను సారము మనుష్యులు శ్రేయస్కాములయి నడుచుకొనక తీఱదు. “గీ॥ మొసలిచేఁ బట్టువడి నీటమునిగియున్న గజమును సుదర్శనంబునఁ గాచు శౌరి। మోహమునఁ బట్టువడి భవమున మునుంగు ।మనలఁ గూడ సుదర్శనమున నె కాచు॥” అను భాగవత పురాణమతమును విశ్వసించి ఫలాపేక్షలేక స్వార్థపరులు గాక కేవల లోకోపకార బుద్ధితో మాత్రమే పరమ భాగవతులు చేయు సంసారమే నిశ్చయముగా పురుషార్థ చతుర్వర్గ సాధనో పాయమని సకల వేదశాస్త్రముల ముఖ్యాభి ప్రాయము.

నేను నా దేహము నా బ్రతుకు నాకు శరీరజ్ఞప్తి యున్నంత వఱకు నెట్లు సత్యములని నమ్మకతీఱదో యట్లే నాకుం దోఁచు సమస్త సహజ జగత్కార్యములు వాస్తవము లనియును మఱియు నీజగమంతయు నెట్లు సత్యమో జగమునందు వ్యవహరించు సకల చరాచర జంగమస్థావర జడచేతన పదార్థ వ్యాపారము లన్నియును- వేయేల లేనివస్తువు తలఁపునకే దోఁపదు. బుద్ధి కసాధ్యము లేదు. దేహస్మృతి యెట్లు నిత్య మనుకొనుచున్నాఁడో యటులే దేహస్మృతికిఁ గోచరమగు జగత్కార్యము లన్నియును వాస్తవములే. బింబములేక ప్రతిబింబము కలుగనేరదు. తనయున్కి తన కెంత వాస్తవమో తన దేహస్మృతికి గోచరమగు పదార్థము లన్నియును దనకు వాస్తవములు కాకతీరదు. తనకుఁ దన శరీరజ్ఞప్తి యద్దమూ యద్దమందుఁ దన దేహమే తా ననుకొని యెట్లు నత్యముగా దన్నుఁదా చూచుకొన్నట్లు విశ్వసించుచున్నాఁడో యట్లే తన స్మృతి యనెడి యద్దమునదోఁచు జగత్కార్యము లన్నియును వాస్తవములే యనుకొని వ్యవహరించక తీఱునా ? చేసే దొకటి పరులను వంచించు

టకై చెప్పేది యింకొకటి ధూర్తజనలక్షణము. లోకోపకారబుద్ధిగల మహాత్ము లీజగమంతయును వాస్తవమనియే తమకన్న యథార్థ తత్త్వమును "పూర్వజన్మ ని యానారీ పూర్వజన్మనియద్ధనమ్, పూర్వజన్మ నియావిద్యా, అగ్రేధావతిధావతి" అన్నట్లు సూర్యోదయాస్తమయములవలెనే దేహధారులై దైవ నియతులై యెవు డేకర్మములు చేయవలయునో మఱి యెవు డేసుఖదుఃఖము లనుభవించవలయునో యాయాకర్మములు చేయకతీఱదు మఱి యాయాసుఖదుఃఖము లనుభవించక తీఱదు. దుఃఖములు తప్పించుకొనుటకు సుఖములు పొందుటకును చేయు పురుషప్రయత్న మంతయును వ్యర్థమా యని శంకించినచో నాగామిసంచిత ప్రారబ్ధకర్మము లన్యోన్యకారణములై విధిగా ననాదికాలమునుండియును జీవుల కనుభూతము కాకమానవుగాని "బాలానాం సుఖబోధాయ, కుర్వే వా ముదుదీపికామ్" భూతభవిష్యద్వర్తమాన కాలవేత్తలగు మునులు వేదశాస్త్రమూలమున నెట్టి కర్మమున కేఫలమో యేకర్మమెప్పు డనుభవించవలసియుండునో ఐహలౌకిక కర్మస్వరూప మెట్టిదో పారలౌకిక కర్మస్వరూప మెట్టిదో ధర్మార్థకామమోక్షములను పురుషార్థములను సాధింపఁదగిన కర్మము లేప్రకారముగాఁ బ్రవర్తిల్లునో పురుషప్రయత్న మెప్పు డవసరమో మఱెప్పుడు వ్యర్థమో పురుషప్రయత్న మను కర్మమునకు మూలకర్మ మెద్దియో యాసంగతు లన్నియును హేయాదేయ వస్తువులనుగూర్చి పెద్దలు పిన్నల కుపదేశించిన ట్టుపదేశింపవలసి వచ్చెను. మామిడిమొక్కను దోహదముచేసి పెంచుకొనఁగా నద్ది వృక్షమై పూచి కాచి ఫలించి యింతకాలమున కీవిధముగా నుపయోగించునని యజ్ఞులకు సహజముగాఁ బ్రాజ్ఞు లుపదేశించుట యాప్రాజ్ఞులకుఁగూడ విధినియతకర్మమే "కర్మమునఁబుట్టి జంతువు కర్మమునన్ వృద్ధిపొందుఁ గర్మమునఁ జెడున్" కాఁబట్టి జననమరణ

ప్రవాహాత్మక సంసారమంతయు స్వకర్మస్వరూపమే. వేయేల కర్మబీజమే యీశరీరస్మృతి. శరీరజ్ఞప్తియే జగదాకారముగా స్వప్నావస్థయందలి మనోవృత్తివలె జాగ్రదవస్థయందుఁ గూడఁ బరిణమించుచున్నది. "కర్మణ్య కర్మయఃపశ్యేదకర్మణిచకర్మయః" అనుటచేత నేమహాత్ముఁడు సంచరించుచుండియును రాగద్వేషము లంటకుండునో యాఁ భాగ్యశాలి మాత్రమే కర్మబద్ధుఁడు కాఁబోక జీవన్ముక్తుఁ డగును. "త్రిపాదస్యామృతందివి" అనుటచేతఁ గాముని దహించిన శివుఁడు తప్ప సకాముఁడు "పాదోఽస్య విశ్వాభూతాని" అనునట్లు సంసారాత్మక కర్మబద్ధుఁడు కాకతీఱదు. త్రిగుణాత్మకమగు సంసారప్రకృతి కర్మస్వరూపిణియగు శక్తి-నిర్గుణుఁడగు పురుషుఁ డమృతమయుఁ డగు శివుఁడు ధర్మార్థకామములు త్రిగుణములు కర్మస్వరూపములు. మోక్షము నిర్గుణమగు కర్మాతీతపరబ్రహ్మము. సత్కర్మమే మోక్షము దుష్కర్మమే సంసారము. సత్కర్మ మొనర్చు సజ్జనుఁడు విరాగియై కర్మమునం దకర్మము గనుగొనును. దుష్కర్మ మొనర్చు దుర్జనుఁడు కర్మమందుఁ గర్మమరసి గర్మముఁ జూచును. కనఁగా రాగద్వేషములంటని యోగి సంచరించుచుండియును సంసారము నంటక నిర్విషయమను మనస్సుతో ధ్యానయోగముచేత నమృతపదవి నొందునుఁడగును. కోర్కెకలవాఁడు భ్రాంతునివలె లేని వస్తువులం దనకుఁ దా బన్నుకొని సుఖదుఃఖాత్మక సంసార కర్మపాశ బద్ధుఁ డగును. జ్ఞానిగాని యజ్ఞానిగాని స్వకర్మఫల మనుభవించక తీఱదు గాని "ధియోయోనః ప్రచోదయాత్" బుద్ధిమంతుఁడు. తా ననుభవించకతీఱని కర్మ మెప్పుడు తటస్థించునో యెట్లుజరుగునో యాకాలము నాకర్మస్వరూపమును ముందుగాఁ దెలిసికొనుటచేత నీసంసారమంతయును నిస్సారమని నిశ్చయించుకొని రాగద్వేషములొందక నిర్లిప్తుఁ డగుటచేత జీవన్ముక్తుడయి కైవల్యానంద మనుభ

వించును. ఏకాలమం దేకర్మము తా ననుభవించవలసి యుండునో యాసంగతి తెలియుని యజ్ఞాని రాగద్వేష బద్ధుఁడై తుద కాశాభంగ మగుటచేత తా ననుకొన్నట్లు తన ప్రయత్నము కొనసాగకపోవుట మఱింత నిర్విణ్ణుఁడై కర్తవ్యాకర్తవ్యము లరయక మఱింత సంసారాంధకారమునఁ జిక్కుపడును. "బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్నికీలలు హరినామ కీర్తనములు" "జ్ఞానాగ్ని దగ్ధకర్మాణామ్" అను నట్లు కోర్కి రూపమగు కర్మమును నిష్కాముఁడై వైరాగ్యకారణ మగు జ్ఞానమును "ధియోయోనః ప్రచోదయాత్" అని ప్రతిపాదింపఁబడి వివేకాత్మకబుద్ధిని సంపాదించుకొన్నవాఁడు కర్మపాశము నంటక సంసారమును దరించి యమృతపదముం జేరుకొనును. వేద శాస్త్ర ముఖముల న్మునులు ధర్మార్థకామమోక్షములు సంపాదించు కొనఁజాలు బుద్ధిఁ గఱపుచున్నారు. కాఁబట్టి కర్మబద్ధులగు మర్త్యులు తప్పక భక్తిశ్రద్ధలతోఁ బురుషార్థసాధకమగు బుద్ధి నాప్తవాక్యము న్విశ్వసించి యష్టాదశ విద్యాసార మెఱిఁగి భక్తిజ్ఞాన వైరాగ్యము లంది కర్మస్వరూపమగు సంసారబంధమునుండి విముక్తులై పరమ భాగవతులవలెఁ దరించుచున్నారు. కాఁబట్టి మునులు సంసారులకు మిక్కిలి శ్రేష్ఠబుద్ధి దాయకములు భక్తిజ్ఞాన వైరాగ్యజనకములగు నానావేదశాస్త్రము లుపదేశించిరి.

"ఉద్యోగినం పురుషసింహముపైతిలక్ష్మీః — ఉద్యమేనవి నాన్యాణాం న సిధ్యన్తి మనోరథాః" నిద్రాహార విహారసౌఖ్యమునకై దేహస్మృతి యున్నంతవఱకు దేవులాడకతీఱదు. అద్వైతం పర మార్థతః, పురష ఏవేదగ్ం సర్వమ్, అహింసాపరమోధర్మః ధర్మం చర" సాధనచతుష్టయ సంపదగల ముముక్షువులకు "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" అనియును భక్తిశ్రద్ధావంతులగు పరమభాగవతులకు "నహింస్యాత్సర్వభూతాని" అనియును, గృహస్థులకు "సత్యంవద,

ధర్మంచర, అతిథిదేవోభవ, ఆచార్యదేవోభవ, పితృదేవోభవ, మాతృదేవోభవ, పారదార్యమనాయుష్యమ్, నపరదారాన్‌గచ్ఛేత్ నానృతం వదేత్" అను వర్ణాశ్రమధర్మములను నిక్కముగా నధికారి భేదముంబట్టి దేశకాలపాత్రోచితముగాఁ బురుషప్రయత్నముం జేయుటకై వేదశాస్త్రములమునఁ లుపదేశించిరి. పంచభూతోపద్రవములు లేక నిద్రాహారవిహార సౌఖ్యసంపాదనమునకై శక్తిగొలంది నేదేహధారులు యావజ్జీవము తంటాలుపడుతున్నారు గాని వాన యెండ చలి మొదలగు దైవప్రేరిత ఋతువిశేషముల నీతిబాధలనుండి కాపాడుకొనుటకై యిండ్లు కట్టుకొనుట యిరవులు వెదకుకొనుటకై పురుషప్రయత్నము చేయకతీఱదు. వేదశాస్త్రములద్వారా జగదాప్తులైయిన గౌతమాది మహామునులు నిద్రాహారవిహార సౌఖ్యకరవస్తువులు తత్తద్దేశకాల పాత్రానుసారముగా సంపాదించుకొనఁదగిన సాధనములను భూతోపద్రవములనుండి కాపాడుకొనఁదగు నుపాయముల నుపదేశించిరి. ధర్మార్థ కామమోక్షములను పురుషార్థము లనఁగా బురుషప్రయత్న సాధ్యములగు నైహికాముష్మిక సంపదలను సంపాదించుకొనుటకై పురుషప్రయత్నమే ముఖ్యము. పురుషప్రయత్నము లేకయే యైహికాముష్మిక సుఖదుఃఖములు దేహధారులకుఁ గలిగించు నతీంద్రియకారణమే విధి. నియతి, యదృష్టము కర్మము నను పేర్లంబరగు దైవము. దైవగతి నప్పుకొనుటకై పురుషప్రయత్న మొక్కింతయు నొంటకాదు. రేఁబవళ్ళు నాసీకడ్డఁదరముగా దవి ప్రవర్తిల్లుట కవాఙ్మనసగోచరమగు దైవమను నెద్దియో సహజకారణము కలదు. కారణము లేక కార్యము ప్రవర్తిల్లుట ప్రమాణవిరుద్ధము గనుక సహజ పంచభూతప్రవృత్తికిఁ గూడ దైవమను పేరున నొక కారణము కల్పించుకొనక తీఱదు. ఈ పాంచభౌతిక శరీరోత్పత్తికి సంసారరథమునకు దైవపౌరుషములు రెండును రెండు చక్రములని యాజ్ఞవల్క్యముని చెప్పిన

ప్రకారముగా. దైవముం బౌరుషమును రెండును ముఖ్యపురుషార్థ సాధకోపాయములే గాని పురుషప్రయత్నము దేహధారులవశము. దైవగతి దేహధారులు తప్పించుకొననేరరు గాని పురుషార్థములను సంపాదించుకొనుటకై సహజముగాఁ బ్రయత్నించకమానరు. కాఁబట్టి యేపురుషార్థమును సంపాదించుకొనుటకై పురుషప్రయత్న మెట్లు చేసికొనవలయునో ప్రాకృతులు కించిజ్జ్ఞులగు మర్త్యు లెఱుఁగరు గనుక లోకోపకారపరాయణులు సర్వజ్ఞులు నతీంద్రియ ద్రష్టలగు మునులు వేదశాస్త్రములద్వారా హితోపదేశము గావించిరి.

సామాన్యమువిశేషము వైకల్పికము నిత్యమనిత్యము విధినిషేధము కామచారానుజ్ఞలను పేర్లతో శాస్త్రము నానావిధములుగా దేశకాల పాత్రోచితముగా నుపదేశింపఁబడుచున్నది. కష్టకారులగు మనుష్యుల తప్పుత్రోవలనుండి మళ్లించి జనుల సుఖదాయకములగు మంచి తెరవుల నడిపించు నుపదేశములే వేదశాస్త్రములు. కాఁబట్టి యీవేద శాస్త్రము లన్నియు నతీంద్రియద్రష్టలును సర్వజ్ఞులగు మునులకుఁ గాదు.-అల్పజ్ఞానులు లోకానుభవము చాలక భ్రాంతులై విపరీత దృష్టులై ప్రమాదమున నిద్రాహారవిహార సౌఖ్యాత్మక చతుర్విధ పురుషార్థములను సంపాదించుకొనుటకై తగిన మార్గమున నడువ నేరక తప్పుదారి నడుచు నజ్ఞానులు బాలురు మందబుద్ధులు నగు ప్రాకృతుల నుద్దేశించి "బాలానాం సుఖబోధాయ" అని పండితులు వ్యాఖ్యానము తాము చేయుటకై కారణమును దెల్పునట్లు మునీశ్వరులు పురుషార్థసంపాదక సులభమార్గముల న్వేదశాస్త్రములద్వారా నుపదేశించిరి. కృతార్థులగు కపిలాదిమునీశ్వరులకు దైవపౌరుషములు రెండును లేవు. "విస్మృతిః ఖలుముక్తిః, సర్వమాత్మైవ ఖలుకంకే నపశ్యేత్" అను తీరున బ్రహ్మధ్యానసమాధి నైవల్యానందమున నోల

లాడుచున్న మునులకు హేయోపాదేయములు రెండును లేవు, "ద్వైతా
ద్వైత సమం బ్రహ్మ" సర్వజ్ఞులయ్యును "వాసుదేవః సర్వమితి"
అను బ్రహ్మభావనముచేత నిర్లిప్తులగు మునుల కగ్నికన్న శక్తి పర
లోకసంరక్షణ యొనర్చుట సహజగుణము. గనుక వేదశాస్త్రములం
బ్రాకృతుల నుద్ధరించుటయె ప్రయోజనముగా నుపదేశించిరి. కాఁబట్టి
యభీష్ట నిద్రాహారవిహార సౌఖ్యమునకై చేయక విధిలేని పురుష
ప్రయత్నమును మును లుపదేశించినట్లు దేహధారులు చేసికొన్న
యెడలఁ దమ కోరిన కోర్కెలన్నియును సఫలమగును. మునుల
యుపదేశముల చొప్పున దేహధారులు చేసిన పురుషప్రయత్నము
నకు దైవము తప్పక తోడ్పడకతీఱదు. భక్తిశ్రద్ధలతో వేదశాస్త్రోప
దేష్టలును సర్వలోకాప్తులు నగు గౌతమవ్యాసాది మహాముని మతము
లనుసరించి నడుచుకొన్న సజ్జనులకు దైవమెక్కింతయుం బ్రతిఘ
టింపనేరదు. వేదశాస్త్రోక్తాప్తవాక్యప్రమాణము చొప్పున దప్పక
పౌరుషముతో దీక్షవహించి నడుచుకొన్న మనుష్యులకు దైవముసహా
యము కాకతీఱదు. భక్తిశ్రద్ధలతో నాప్తవాక్యాత్మక వేదశాస్త్ర
ప్రమాణముం బట్టి నడుచుకొన్న సజ్జనుల పురుషప్రయత్నము కంటె
దైవము వేఱు కానేరదు. కాఁబట్టి సహజముగా మనుష్యులు తమ
నిద్రాహారవిహారాత్మక చతుర్విధపురుషార్థ సాధకమగు పురుష
ప్రయత్న మెట్లాచరింపవలయునో యా యుపాయము చెప్పుటకే
గౌతమ వ్యాసాద్యాప్త వచనముకంటె నితరప్రమాణము మఱెద్దియుం
బనికిరాదు.

"అణిమా మహిమాచైవ గరిమాలఘిమాతథా ప్రాప్తిః
ప్రాకామ్య మీశత్వం వశిత్వం చాష్టభూతయః" మిక్కిలి కొంచె
మగుట మిక్కిలి పెద్దయగుట మిక్కిలి తేలికయగుట, మిక్కిలి బరు
వగుట, ఇష్టము వచ్చినచోటికేఁగఁ గల్గుట కోరిన కోర్కె పొందుట,

అడ్డులేక యథేచ్ఛగాఁ గావలసిన భోగమెల్ల ననుభవించుట జగము నెల్లఁ దనవశము కావించుకొనుట- ఈ యష్టైశ్వర్యముల బురుష ప్రయత్నమువల్ల సాధించుకొనవచ్చును. బుద్ధి కసాధ్యమే లేదు. పంచేంద్రియదృష్టములగు పంచభూతములు పాంచభౌతికమగు జగమంతయుఁ దన యిష్టానుసారముగాఁ బురుషప్రయత్నమువలనఁ దన వశముచేసి సర్వస్వతంత్రుఁడై తాను సంకల్పించిన పనియెల్ల పురుష ప్రయత్నముచేత నెరవేర్చుకొనవచ్చును. విశ్వామిత్రుఁ డను ఋషి బ్రహ్మ సృష్టికి మాఱుగా ముల్లోకములను బురుషప్రయత్నమువల్లనే సృజించెను. "తద్ధితప స్తద్ధితపః" అనునట్లు చతుర్ముఖ బ్రహ్మ పురుష ప్రయత్నముచేతనే తపోనిష్ఠుఁడై త్రిభువనములను సృజించెను. పురుష ప్రయత్న సాధ్యముకాని దెద్దియును లేదు. బుద్ధిహీనులు సరిగా నేకార్యమును సాధించుటకే యుపాయము పన్నవలయునో యెట్లు తీవ్రప్రయత్నమును బట్టుదలతో నెంతవఱకుఁ జేయవలయునో యట్టి విద్యాబుద్ధులను సంపాదించుటకు దృఢవ్రతమును జాగరూకతతోఁ దీవ్రప్రయత్నమును బూనక సోమరులై యల్పప్రయత్నముచేసి త్రోవ తప్పి తప్పుత్రోవ నన్నడిచి యేకార్యమున కెట్లు ప్రయత్నించవలెనో యా యుపాయము లేక బుద్ధిమంతుల యుపదేశమును సరిగా గ్రహించక శాస్త్రమును సరిగాఁ దెలిసికొని శరీరకష్టమున కోర్చి తగునట్లు పురుషప్రయత్నము చేయఁజాల కల్పప్రయత్నముచే మహత్కార్యములు నెఱవేర్చగోరి విఫలమనోరథులైతమ కార్యములు నెఱవేఱకుంటకు దైవమను నొక పదార్థము ప్రతికూలించెనని లేని దైవమును కల్పించి తాము చెడుటయేగాక యితరులను గూడ, ఈ జగమంతయు దైవాధీనమనియును గుమ్మరి కుండలం బన్ను చున్నట్లు దైవ మీ జగత్కార్యములఁ జేయుచున్నాఁ డనియును లేనిపోని ప్రమాణములం బన్ని పామరు లన్మోసపుచ్చి తమవలె వారినిం గూడ

సోమరిపోతుల న్గావించుచున్నారు. "ఆత్మన ఆకాశః సంభూతః" "ఆకాశాద్వాయుర్వాయో రగ్నిరగ్నే రాపః అద్భ్యః పృథివీ పృథివ్యా ఓషధయః ఓషధీభ్యో౽న్నమన్నాత్పురుషః" అనుటచేత ఆత్మాకాశ వాయ్వగ్ని జలపృథివ్యోషధుల సారమే దేహి కాబట్టి పృథివ్యప్తేజో వాయ్వాకాశాత్మలను యథేష్టముగాఁ దనపౌరుషముచేత వశపఱ్చు కొనఁగలఁడు. "అహం బ్రహ్మాస్మి, మత్తోనాస్తికించన మనురభవమ్ తదైక్షత, బహుస్యాం ప్రజాయేయ" అనుటచేత పురుషుఁ డెద్ది సంకల్పించునో యద్ది పురుషప్రయత్న సాధ్యముకానియెడలనట్టిసంకల్పమే పురుషున కొదవదు. లేనిదే కల్గదు. మఱియున్నది లేకపోదు. ఈ ప్రపంచకార్యము లన్నియును. బురుష మనస్సంకల్పాత్మకములే. జీవుఁడు సంకల్పమయుఁడు మనస్సు సవిషయమైనంతవఱకు జగత్కార్యము లెట్లు భావించునో యట్లు తోఁపకమానదు, "యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ" భావన యనఁగాఁ బురుషప్రయత్నము కాఁబట్టి పురుషప్రయత్నసాధ్యము కాని జగత్కార్యమే లేదు. లేనివస్తువును పొందుటకు దేహికిఁ గోర్కెగాని ప్రయత్నము గాని కలుగనేకలుగదు, "దైవంహి మూలమితి కాపురుషావదన్తి" కాపురుషులనఁగాఁ విద్యాబుద్ధులు కష్టపడి సంపాదించుకొని ధర్మార్థ కామమోక్షములను చతుర్విధపురుషార్థముల నప్రమత్తులై దృఢ ప్రయత్నముతోఁ బెద్దలవలన వేదశాస్త్రము లభ్యసించి తమ తెల్వి తేటలుపయోగించుకొని దేశకాలపాత్రానుసారముగా త్రికరణశుద్ధిగా నే కార్యమును సాధించుట కేపద్ధతుల ననుసరించవలెనో జాగరూకులై యాయా యుపాయముల నాయా తెరువుల నడునక వ్యసనపరులగు సోమరులు "తాఁబడి పొట్టనేల" యన్నట్లు దేవుఁడు తమకుఁ బ్రతిఘటించి తమ కార్యములను బాడుచేయుచున్నాఁడని తమ దేహస్మృతికిం దమ జ్ఞానమునకు న్మించి వేఱేలేని దైవమును భ్రాంతుఁడు పిశాచము నల్పించుకొనునట్లు కల్పించుకొనుచున్నారు.

"అయమాత్మాపురుషః పురుష ఏవేదగ్ం సర్వమ్" అను తెలుంగున "ధియోయోనః ప్రచోదయాత్" అని పురుషాత్మ తపోనిష్ఠచేత బ్రహ్మజ్ఞానమును "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" బ్రహ్మ మనఁగా సర్వస్వతంత్ర బుద్ధి. యట్టి బుద్ధిని సంపాదించుటకై చేయు పురుష ప్రయత్నము బ్రహ్మ జిజ్ఞాసయని చెప్పఁ బడెను. కాఁబట్టి భక్తి జ్ఞాన వైరాగ్యములఁ బెద్దల యుపదేశమునఁ గష్టపడి సంపాదించుకొని జాగరూకుఁడై దృఢమగు పురుష ప్రయత్నముచేతఁ బురుషార్థ చతుష్టయము నార్జించు కొనవలెను. భక్తి శ్రద్ధలతోఁ బెద్దల యుపదేశమున విద్యా బుద్ధుల స్సంపాదించుకొన్న పురుషుఁడే నిక్కువు వేల్పు. అట్టి బుద్ధిశాలి యొనర్చు పురుష ప్రయత్నముకన్న మఱి వేఱే దైవ యత్నము లేనేలేదు. కాఁబట్టి సోమరిపోతు మిథ్యాదృష్టి మాని గురుముఖమున వేదశాస్త్రములభ్యసించి బుద్ధిమంతుఁడై దృఢ పురుష ప్రయత్నముచేత ధర్మార్థ కామమోక్షములను పురుషార్థములను మనుష్యుఁ డనఁ దగినవాఁ డెల్ల సంపాదించుకొనక తీఱదు. కనుకనే వేదశాస్త్రములను మును లుపదేశించుట ముఖ్య ప్రయోజనము "శ్లోకార్ధేన కణార్ధేన విద్యామర్థంచ సాధయేత్" "ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండల భేదినౌ। పరివ్రాట్ యోగ యుక్తశ్చ రణే సహాత ఏవచ" అనుటచేతఁ బురుషార్థ చతుష్టయమును గేవల పురుష ప్రయత్నముం బట్టి సాధించుకొనవలయును. "స్వకర్మ సూత్ర గ్రథితోహిలోకః" అనుటచేఁ దాను జేసిన కర్మ ఫలమునే తా ననుభవించక తీఱదు. దైవమునకుం బురుష ప్రయత్నమునకు స్సంబంధ మొక్కింతయును లేదు. పురుష ప్రయత్నము తప్ప దైవమన్న పదార్థమే లేదు. శశవిషాణ శబ్దమువలె దైవ శబ్దము కేవలము సోమరిపోతులు భ్రాంతిచేతం బెంకెతనమునఁగల్పించి, మా పురుషప్రయత్నము యొక్క లోపమేమియును లేదుగాని దైవము

ప్రతికూలించెనని సరిగాఁ బురుష ప్రయత్నముం జేయుటకు బద్ధకించి మద్యమత్తులు బొమ్మలను భ్రాంతి గల్పించుకొను విధమున దైవము గల్పించుకొని తమ ప్రయత్నలోపమును వెల్లడింపఁ బోక యన్యాయముగా లేనివిధి గల్పించుకొనివంచకులై తాము చెడియొరుల, జెఱచుచున్నారు, "అథాతో ధర్మజిజ్ఞాసా-అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను మొదలగు జిజ్ఞాసా శాస్త్రములు మఱి సకల వేదశాస్త్రాత్మకాష్టాదశ విద్యలు పురుషార్థ చతుష్టయ సంపాదకోపాయములు బ్రహ్మచర్యగార్హస్థ్య వానప్రస్థ సన్న్యాసాశ్రమ ధర్మములు మఱి యితర విధములయిన సమస్త కర్మాచరణ పద్ధతులు కేవల పురుష ప్రయత్నసాధ్యములు కావుననే నిక్కముగా ధర్మార్థకామమోక్షములకు బురుషార్థములను పేరుకలిగెను. మఱియుం బురుషప్రయత్నమే కర్మస్వరూపము మఱి పురుషుఁడు గతకాలమున దానార్జించిన కర్మము మఱచి తత్ఫల మిపుడనుభవించుచుంట తలంపక తన విస్మృత కర్మమునే దైవ మనుకొనుచున్నాఁడు. "బ్రహ్మైవ సంసరతి ముచ్యత ఏతదేవ దావారికం భవతి సంసరణంచ తస్య, ముక్తిః పునర్భవతి చిద్వపుషైవతస్య, స్వాజ్ఞానతః స్వమహిమ ప్రతిబోధతశ్చ" అనుట చేత సహజమగు నవిద్యచేత మూఢుఁడైన జీవాత్ముఁడు సంకల్పవశమున సకాముఁడై కర్మమాచరించి స్వకర్మాను సారముగా సుఖదుఃఖాత్మక సంసారపాశబద్ధుఁడగుచున్నాఁడు మఱియును సహజముగానే వృద్ధారుణకర్మవిపాకశాస్త్రోక్తవిద్యాతిశయముచేతఁ బ్రాయశ్చిత్తాదివిశేషములచేత సంసారపాశము విడిపించుకొనుచున్నాడు. "సుఖస్యానంతరందుఃఖం దుఃఖస్యానంతరం సుఖమ్" అనుతీరునజీవాత్మునకు బంధమోక్ష కర్మములు రెండు నావరణవిక్షేపశక్తులయి వెల్గు నీడలవలె సహజములు కాఁబట్టి పురుషుఁ డవిద్యావశమున సహజముగా సకాముఁడై ప్రయత్నపూర్వముగా సంసరించుచున్నాఁడు. మఱి నిష్కా-

ముఁడై విద్యావశమున స్వభావముగానే తనంతట దగిలించుకొన్న సంసారపాశమును విడిపించుకొని ముక్తుఁ డగుచున్నాఁడు కాబట్టి వాస్తవముగా జీవాత్మునకు వేఱుగా దైవమను నొక పదార్థము లేనే లేదు. మఱిజీవాత్ముఁ డొనర్చి మఱచిపోయిన కర్మమునకే వర్తమానమునఁ దన ప్రయత్నము తన యిష్టమునకు విరుద్ధముగా ఫలించినపుడు తన పూర్వకర్మమే కారణమనుకొనసేరక లేనిదైవమును గల్పించుకొని మనస్తృప్తి కొంతవఱకు బల్మిం గావించుకొనుచున్నాఁడు. ఆత్ముఁడు స్వకర్మానుసారముగా సహజముగా బంధమోక్షము లందుచున్నాఁడు మఱి యాయాత్ముఁడే యవిద్యావశమున సంసరించు బద్ధుఁ డగుచున్నాఁడు మఱివిద్యాతిశయ వశమున బుద్ధిమంతుఁడై తనంతట దాఁదగుల్చుకొన్న సంసారపుఁ జిక్కూడఁ గొట్టుకొని ముక్తుఁడగుచున్నాఁడు గాని వాస్తవముగా నాత్మకన్న నింకొక పదార్థమే లేదు. ఆత్మునికిఁ గల్గు బంధ మోక్షములు స్వకర్మ ఫలములు. ఆత్మునకు విద్యావిద్యలు సంకల్పవికల్పము లావరణ విక్షేపశక్తులు పుణ్యపాపములు స్వర్గనరకములు జననమరణములు బంధ మోక్షములు ద్వైతాద్వైత జ్ఞానానుభవములు కావించు దేహాస్మృతి విస్మృతిస్వరూపకమగు కర్మమునహాజము. కాఁబట్టిసూర్యునకు మఱి తత్కిరణములకును భేదమెట్లు లేదో యాత్మునకు దత్కర్మమునకు భేద మట్లు లేనే లేదు. కాఁబట్టి పురుషుఁ డాత్ముఁడు కర్మమనను శబ్దములు పర్యాయపదములు కాఁబట్టియే కర్మమే బ్రహ్మమనియుం గర్మముకంటె వేఱే పదార్థమే లేదనియు న్మును లుపదేశించిరి. కనుక “దేవానాం ప్రియో మూర్ఖః” అనునట్లు కష్టపడి వ్యసనపరుఁడు గాక యప్రమత్తుఁడై దృఢవ్రతుఁడై తానవివేకముగాఁ జేసికొన్న కర్మఫలమగు సంసారదుఃఖబంధము నాప్తులగుగౌతమ వ్యాసాది మహాత్ముల

యుప దేశముల భక్తిశ్రద్ధల నవలంబించి పౌరుషము న్మాత్రమే నమ్ముకొని యుస్మత్తు చందమూన సంభవ దైవము నల్పించుకొనక తన ప్రయత్నముచేతనే ధర్మార్థకామమోక్షములను పురుషార్థములను సాధించుకొన్నవాఁడే మనుష్యుఁ డనఁ దగినవాఁడు తగినవాఁడు, ఎందు కీడొంకతిరుఁగుడు! మానవుఁడు నిద్రవాకవిహార సౌఖ్యాభిలాష మున్నంతవఱకును బద్ధుఁడే, మఱెప్పుడు విగతతృష్ణుఁడగుచున్నాఁడో యపుడు ముక్తుఁడే. ఆత్మునకును మఱి యులేఁ డొనర్చు బంధమోక్ష కారణ కర్మమునకును మృద్ఘటమునవలె నామరూప భేదమేగాని వస్తుభేదము లేశేసు. ఆత్ముఁడే బద్ధదశయందు జీవుఁడగుచున్నాఁడు ముక్తదశయందీశ్వరుఁ డగుచున్నాఁడు. మఱియును స్వకర్మముచేతనే తనయెటుఁ దానవిద్యాస్వభావముచేత సంసరించుచు స్వకర్మచేతనే విద్యాస్వభావముచేత ముక్తుఁడగుచున్నాఁడు. "పురుష ఏవేదగ్ం సర్వమ్" అనుటచే బంధమోక్ష కర్మస్వరూపుఁడగు నాత్మునికన్న మఱి వేఱే వాస్తవమైన పదార్థమే లేదు. "అయమాత్మా పురుషః— ఆత్మైవేదగ్ం సర్వమ్" కాఁబట్టి పురుషునకు నతని నైసర్గిక కర్మమునకును మృత్తునకును మృద్భాజనమునకువలె నామరూప భేదమేగాని వస్తుభేదములేదు. సంసారకర్మము చేయుచు జీవాత్ముఁ డనిపించుకొనుచున్నాఁడా పురుషుడే; మోక్షకర్మ మొనర్చుచుం బరమాత్ముఁ డనిపించుకొనుచున్నాఁడాపురుషుఁడే. కాఁబట్టి దైవము దైవమని సోమరిపోతు మాటలాడక కాప్తోపదేశముచేత విద్యాబుద్ధులు సంపాదించుకొని ప్రాల్మాలక వ్యసనసక్తులు గాక పెద్ద లేర్పర్చిన పద్ధతులంబట్టి భక్తిశ్రద్ధలతో బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్న్యాసాశ్రమముల న్దేశకాల పాత్రానుసారముగా నెఱవేర్చుకొను నిహపరసౌఖ్యములందుఁడి యని పౌరుషమాత్ర సాహాయ్యముచేతనే పురుషాగ్రగణ్యులై జగదాప్తులైన గౌతమ

వ్యాసాది మహామునులు కేవల పురుషప్రయత్న మాత్ర సాధ్యము లగు పురుషార్థచతుష్టయసంపాదకోపాయము లుపదేశించిరి. "ఆత్మావా అరే శ్రోతవ్యో ద్రష్టవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః, అగ్నిష్టోమేన స్వర్గకామో యజేత - నానృతంవదేత్ - న పరదారాన్‌గచ్ఛేత్ - అహరహః సంధ్యాముపాసీత - బ్రాహ్మణేన నిష్కారణం సాంగవేదోఽధ్యేతవ్యః" ఈ మొదలుగా శ్రౌతస్మార్తావశ్య కర్తవ్యకర్మము లన్నియుఁ బురుషార్థ చతుర్వర్గ సంపాదనముకై బురుషప్రయత్నమే ముఖ్యమనియు "తస్మాద్యోగీ భవార్జున" అను భగవద్వాక్యము "ఉద్యోగినం పురుషసింహముపైతిలక్ష్మీః" అను వాక్యముం బ్రోత్సహించుచు "ఉద్యోగంపురుషలక్షణమ్" అనికేవలము పురుషప్రయత్నము సకలైహికాముష్మిక సంపదైక సాధనమని వేదశాస్త్రము లన్నియు నుపదేశించుచుం గేవల పురుషప్రయత్నముచేతనే యనాదికాలము నుండియుం బ్రతిపాదితము లగుచున్నవి. కోరిక యున్నంతవఱకు కోర్కె నెఱవేర్చుకొనుటకై పురుషప్రయత్నముచే నుపాయము లరయకతీఱదు. కాఁబట్టి లేనిపోని యాకాశపంచాంగములు విప్పక సోమరులయి తమ ప్రయత్నలోపముచేతఁ గలుగు తప్పు లాపదలు న్యాయముగా దయామయుఁడు సర్వజనసముఁడు నిర్లిప్తుఁ డహంకార మమకార దూరుఁడు నిష్కళంకుఁడు నిరవద్యుఁడు భక్త పరాధీనుఁడగు దేవునిపై మోపక సర్వజనరంజకముగా సకలలోక సమ్మతముగానడుచుకొనఁదగి విద్యాబుద్ధులనుమనోవాక్కాయకర్మలం గష్టపడి పౌరుషమున ధర్మార్థకామమోక్షములను మనుష్యుఁడు సంపాదించుకొనుటకే సమస్తవిద్యలు బ్రహ్మధ్యాన పరాయణు లయ్యును లోకహిత మాచరించుటయే తమ స్వభావముగా నొప్పారు గౌతమ వ్యాసాది జగదాప్తమును లుపదేశించిరి.

వ్యాసాది మహాత్ములు కేవల పురుషప్రయత్నమాత్ర సాధ్యము లగు పురుషార్థచతుష్టయసంపాదకోపాయము లుపదేశించిరి. "ఆత్మావా అరే శ్రోతవ్యో ద్రష్టవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః, అగ్నిష్టోమేన స్వర్గకామో యజేత-నానృతంవదేత్ - న పరదారాన్ గచ్ఛేత్-అహరహః సంధ్యాముపాసీత- బ్రాహ్మణేన నిష్కారణం సాంగవేదో ఉధ్యేతవ్యః" ఈ మొదలుగా శ్రౌతస్మార్తావశ్య కర్తవ్యకర్మము లన్నియుఁ బురుషార్థ చతుర్వర్గ సంపాదనమునకై బురుషప్రయత్నమే ముఖ్యమనియు "తస్మాద్యోగీ భవార్జున" అను భగవద్వాక్యము "ఉద్యోగినం పురుషసింహముపైతిలక్ష్మీః" అను వాక్యముఁ బ్రోత్స హించుచు "ఉద్యోగంపురుషలక్షణమ్" అనికేవలము పురుషప్రయ త్నము సకలైహికాముష్మిక సంపదైక సాధనమని వేదశాస్త్రము లన్నియు నుపదేశించుచుం గేవల పురుషప్రయత్నముచేతనే యనాదికాలము నుండియుఁ బ్రతిపాదితము లగుచున్నవి. కోరిక యున్నంతవఱకాకోర్కె నెఱవేర్చుకొనుటకై పురుషప్రయత్నముచే నుపాయము లరయకతీఱదు. కాఁబట్టి లేనిపోని యాకాశపంచాగములు విప్పక సోమరులయి తమ ప్రయత్నలోపముచేతఁ గలుగు తప్పు లాపదలు న్యాయముగా దయామయుఁడు సర్వజనసముఁడు నిర్లిప్తుఁ డహంకార మమకార దూరుఁడు నిష్కళంకుఁడు నిరవద్యుఁడు భక్త పరాధీనుఁడగు దేవునిపై మోపక సర్వజనరంజకముగా సకలలోక సమ్మతముగానడుచుకొనఁదగి విద్యాబుద్ధులనుమనోవాక్కాయకర్మలం గష్టపడి పౌరుషమున ధర్మార్థకామమోక్షములను మనుష్యుఁడు సంపా దించుకొనుటకే సమస్తవిద్యలు బ్రహ్మధ్యాన పరాయణు లయ్యును లోకహిత మాచరించుటయే తమ స్వభావముగా నొప్పారు గౌతమ వ్యాసాది జగదాప్తమును లుపదేశించిరి.



అకర్మ యందుఁ గర్మమును గర్మమం దకర్మము నరయ వలయు నను భగవద్వాక్యమునకు నిష్క్రియుఁడు శాంతుఁ డగు నాత్మకీ లోప విహితమగు సత్కర్మచేయుటయే స్వభావమనియు నట్టి యాత్మ ధ్యాన పరాయణుఁడగు పరమ భాగవతుఁడు కేవలము భగవదర్పితముగా ఫలాపేక్షలేక సకలలోకహిత సత్కర్మాచరణ మొనర్చుచుండు ననియుం దాత్పర్యము. శరీరస్మృతి యున్నవఱకు నిద్రాహారవిహార సౌఖ్యాభిలాషము తప్పదు తప్పదు. మఱియుం దేహికిఁగల శరీరస్మృతియే యహంకార మమకారములను సత్త్వ రజస్తమస్సులను త్రిగుణములనైన స్వప్నజాగ్రత్ప్రపంచ వికారములను దోపింపఁ జేయుచున్నది. దేహికిఁగల దేహస్మృతి త్రిగుణమయమై సకల జగదుద్భవస్థితి నాశకార్యాత్మకమగు నిజగత్తును రజ్జువునందు సర్పమువలె విపృతముగా నొకప్పు డారోపింపఁజేయు భ్రాంతింబుట్టించి భయపెట్టుచు మఱొకప్పుడు భ్రాంతిన్దలిగింపక రజ్జువే వాస్తవమనువివే కమును గల్పించి సంతోషపఱ్చుచుండును. స్వప్నజాగ్రత్సుషుప్త్యవ స్థానుభవము దేహికి దేహస్మృతియే కావించుచున్నది. దేహియును దేహస్మృతియును విశేష్యవిశేషణములు. శక్తిమచ్ఛక్తులు-గుణిగుణ ములు - మృద్ఘటములకువలె నామరూపభేదమేగాని దేహికిని మఱి దేహస్మృతికిని వస్తుభేదమే లేదు.

"సత్యంజ్ఞాన మనంతంబ్రహ్మ" సత్యమనఁగా భూతభవిష్య ద్వర్తమానకాలములం దొక్కవిధముగానే యున్నస్థితి-జ్ఞానమనఁగా స్వప్నజాగ్రత్సుషుప్తిదశలతీంద్రియముగఁ దోఁచు వస్తువుల దెలిసి కొను మనస్తత్త్వము. అనంతమనఁగా దెలియఁబడకున్న వస్తువుస్థితి గాని యనేకవిధములుగా రూపించు వస్తుతత్త్వముగాని యొక్కవిధ ముగాఁ గాని నానావిధములుగాని హద్దులేక శాసించు నుద్భవస్థితి నాశాత్మక జగత్కార్య పరిణామ విశేషము. బ్రహ్మమనఁగా

నిర్విషయ శాంతమనఃస్థితి "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" సత్యము జ్ఞానము అనంతము బ్రహ్మ మను నీ నాల్గుశబ్దములు మొత్తము సమానార్థకములై స్వప్నజాగ్రత్సుషుప్త్యాత్మక శరీరస్మృతి కాశ్రయ మగు నిర్గుణాద్వైతాత్మ తత్త్వముం దెల్పుచున్నవి. వాయ్వగ్నిజల పృథ్వుల కాకాశమువలె నాత్మయే త్రిగుణాత్మక శరీరస్మృతి కాధారమై యున్నది. "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" అనుటచేత జాగద్దశయందు స్వప్నదృష్ట జగము సత్యముకాదని తెలిసికొని స్వప్నదృష్ట వికారముల స్మరణము తొలఁగించుకొన్నట్లే బ్రతుకు నందు సుషుప్తినుండి స్వప్నము స్వప్నమునుండి జాగ్రద్దశ జాగ్రద్దశ నుండి ప్రబోధదశ ప్రబోధదశనుండి ముక్తివిశేషదశ లనుభవించు చున్న కాలందెం బూర్వదశలనఁగా సుషుప్త్యనుభవము స్వప్నమందు స్వప్నానుభవము జాగ్రత్తునందు జాగ్రదనుభవము ప్రబోధమునందు ప్రబోధానుభవము ముక్తివిశేషదశలందు మఱచిపోవుచుం దేహి త్రిగుణాత్మక శరీరస్మృతిచే సుఖదుఃఖాత్మక సంసారబంధమునుండి తప్పించుకొని నిర్గుణమగు దేహవిస్మృతిచేత నద్వైతానందాత్మక మోక్షసంపద న్మఱల ననుభవించుచుంట యాహారవిహారములకై మాటిమాటికిఁ బాటుపడి తనియుచు డయ్యుచుం దనశ్రమ యంతయు న్మఱచి నిద్రసుఖించు నిజప్రకృతి ప్రతిదేహికిం బ్రత్యక్షానుభవమే కదా? కాఁబట్టి శరీరస్మృతిచేతఁ ద్రిగుణాత్మక సంసారబంధమును దేహవిస్మృతిచేత నిర్గుణానందాత్మక మోక్షము నాత్మఁ డొకదాని వెంబడి నొక్కటిగా బంధమోక్షము లనుభవించుట స్వభావము. స్మృతి విస్మృతి రూపక సగుణ నిర్గుణ బంధమోక్షము లాత్మునికి నిజలీలా నటన విశేషములు. స్వప్నవికారములవలె సంకల్పమాత్ర ములు గాని వాస్తవములుకావు. "నచబద్ధో నవాముక్త ఇత్యేషా ఫరమామతిః" అనునట్లు దేవుడు తప్ప నితరవస్తువే లేదు.

"సంగాత్సంజాయతేకామః, బుద్ధిభ్రంశాత్ప్రణశ్యతి" పురుషుఁడాజ్యఘటంబు పోలఁతివహ్నిముఖంబు కలియకుండ రాదు కలిసెనేని బ్రహ్మయైనఁ గూతుఁ బట్టంగఁ మానడు వనితతోడిపొత్తు వలదు వలదు" "బ్రహ్మైవ స్వాజ్ఞానతః సరతిపునఃపునః మహిమప్రతబోధతో విముచ్యతే" అనున ట్లీదేహి కోరి సంసారబంధము స్వతకుఁ దాఁ దగుల్చుకొనుచుఁ దనకుఁదా విప్పుకొనుచున్నాఁడు బంధమోక్షము లందును దుఃఖించుటయును సుఖించుటయు దేహము స్మఱల మఱల స్మరించుచుంటయును మఱచుచుంటయు జీవాత్మునకు సహజలీలలు. దేహికి సుఖదుఃఖానుభవములు నటునకువలె నాగంతుకములు నిమిత్త మాత్రములుగాని యథార్థములుకావు "యోగరతో వాభోగరతో వా సంగరతో వా సంగవిహీనః యస్య బ్రహ్మణిరమతే చిత్తం సందతి నందతి నందత్యేవ" అనున ట్లీదేహి భూతభవిష్యద్వర్తమాన కాలముల మూఁడింటయందు నొక్కతీరుగానే యుండునుగాని యేవిధముగానైన న్మార్పుచెందఁడు. "సోయం దేవదత్తః- తత్త్వమసి-న ఏవాహమ్" మునుపటి దేవదత్తుఁడే యీ దేవదత్తుఁడు మునుపున్న నీవే యిప్పటి నీవు మునుపున్న నేనే యిప్పుడున్న నేను. "అహం బ్రహ్మాస్మి" నేను లేనని నే ననుకొనుట ప్రమాణ విరుద్ధము కనుక నా దేహస్మృతియే నారూపము కనుక నాయునికి నాకే యెఱుక. మఱియును నా దేహస్మృతియే నన్నును నాకుదోఁచు సమస్త జగత్కార్యములను నాకుఁ దెల్పుచున్నది. కాఁబట్టి జ్ఞానముకంటే వాస్తవమగు పదార్థము మఱిలేదు. మఱియు నీజ్ఞానము తనసుషుప్తి దశయందు సూక్ష్మకారణ స్వరూపముగాను మఱియుం దన స్వప్న జాగ్రద్దశలందు స్థూలకార్య స్వరూపముగాను దన ప్రకృతి వికృత్యవస్థల మాటిమాటికిం దానే కనుచు బాధమోక్షములం గ్రుంకుచుం బొంగుచుండుట స్వభావము.

## అంతర్నిగూఢసత్యబోధన

“స్వభావోహి ప్రవర్తతే” ఉన్నదిపోదు లేనిదిరాదు. శరీర స్మృతిబంధము. మఱి శరీరవిస్మృతిమోక్షము. స్మృతిరూపక స్వప్న జాగ్రద్దశలయందు నాకోరిన సుఖము నాకోరిన దుఃఖము దైవపౌరుషములు రెండింటివశమునఁ బ్రాపించుటచేత నాకోరిన సుఖమును ప్రాప్తమే నాకుఁ గలిగింపజాలునని నాశరీరస్మృతి స్వరూపమగు నాస్వప్నజాగ్రద్దశలు రెండును శాశ్వతములై యుంటకన్న నా కోరఁదగిన పదవి యింకెద్దియుండును? విస్మృతి రూపకసుషుప్తి నా కనిష్టమగు దుఃఖమును మఱపించును గనుక నాజీవితమందు నాకోరిన సుఖముకన్న నేవెఱచెడు దుఃఖము వేయిరెట్లధికము గనుక సుఖ దుఃఖములు రెండును లేని నిద్రను నేను విధిలేక కోరవలసివచ్చెను. దేహవిస్మృతి నిద్దురమోక్షము నీరెండును శరీరస్మృతి సంసారము బంధములను మూఁడింటివలె సమానార్థశబ్దములే, నాశరీర స్మృతి ప్రయోజనము నాకోరిన సుఖమును గలిగించుటయే, మఱి “బ్రతికి యుండిన సుఖములు బడయవచ్చు” ఒక తులము సుఖమునకై వేయి మణుగుల దుఃఖమైన నోర్చుట శరీరస్మృత్యాత్మకమగు నాబ్రతుకు కోరును. గాని పనికిమాలిన నాశరీరవిస్మృత్యాత్మకమగు మొద్దు నిద్దుర గోరదు. కాఁబట్టి శరీరస్మృతిరూపక సంసారమే నాకోరని కోర్కె నాశరీర విస్మృతిరూపక మోక్షము చావకతీఅని గూనివంపులవలె సంసారము నడుపుకొను తెల్వినాకుఁ గొంతయైనపుడు కోరక విధి లేని కోర్కె నాశరీరవిస్మృతి రూపకమోక్షము. తెల్వితేటలు గల పరమభాగవతులు లోకోపకార వ్రతాత్మక భగవత్పాదసేవద్దప్ప సేవ్యసేవక భావశూన్యమై పనికిమాలిన మోక్షము గోరరు అహింసా వ్రతముతో స్వార్థపరతన్మాసి తమ తోడిపాటిజనుల యుపచారము చేయుటకన్న మనుష్యులనిపించుకొన్నవారలు తమ బ్రహ్మచర్య

గార్హస్థ్యవానప్రస్థసన్యాసాశ్రమావలంబనముచేత సంపాదించఁదగిన
పురుషార్థము మఱెద్దియు న్గాదుకాదు. తనతోడిపాటిజనులు హాయిగా
నుంట చూచుటకన్న మనుష్యజీవితమునందు సుఖ మింకొకటి లేదు
లేదు. తన పొట్టనించుకొని సుఖించుటకల్ల, అనిత్యమగు సుఖము కల్ల
గాని తనతోడిపాటి వారలకుఁ గడుపునిండ నన్నము పెట్టి యువ్వారలు
హాయిగా నుంట చూచుటయే వాస్తవనిత్యసుఖము, సత్త్వరజస్తమో
గుణాత్మకమై దేహస్మృతిరూపకమైన మనుష్యుని జ్ఞానము వ్యావ
హారికము పారమార్థిక మనియును రెండువిధములై దేహదార్ఢ్య
మున్నంతవఱకును మఱి పంచేంద్రియశక్తి కొఱఁత పడకున్నంత
వఱకును బాల్యయౌవనదశలందు వ్యావహారికరూపమై లోకోప
కారకమగును, మఱియును వార్ధకదశయందు దాజ్ఞానమింద్రియ పాట
వము తగ్గుటచేత లోకోపకారముగా వినియోగించలేక కాయక్లేశ
మునఁ గష్టపడి కూడు కూర్చుకొని తామనుభవించి పరులను
బోషింపఁజాలకున్న ముసనల్ల కాజ్ఞానము పారమార్థికముగా మాఱి
యీ లోకవ్యవహారమున కెంతమాత్రమును బనికి రాకుండును.
"సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృ
త్తయః" అను విధమున మనుష్యులు బాల్యయౌవన దశలం దింద్రియ
పాటవము కలవారై కష్టపడి నిద్రహారవిహార సౌఖ్యోపయోగ
మగు పదార్థములు కూర్చుకొని తాము సుఖపడి తమ తోడిపాటి
వారిని సుఖపెట్టి తమ బ్రతుకును సార్థకము కావించుకొనెదరు.
వార్ధకభరముచేత నింద్రియశక్తి న్గొఱఁతపడి ముసలివారుగాని
లేకొరుల కష్టముపై బ్రతుకనెంచిన సోమరిపోతు బూకరితనపు
యౌవనవంతులుగాని కేవల శాస్త్రదృష్టమై వ్యవహారమునకు
ఱవంతయును బనికిరాక పరమార్థజ్ఞాన చర్చలో వ్యర్థము గాఁగొట్టు
కొనుచుందురు.

ఒక తులం బంగారులోని కోటి యవభాగము కరిగించుట కెంత మూసకావలెను? మూసను బట్టుకొను కారెంత యుండవలెను? కనుఱెప్పపాటు కాలము పలను. పలములోని వేయి యవభాగము తత్పరము తత్పరకాలములోని వేయి యవభాగము లగ్న మాలగ్న ముంగనిపెట్టిజాతకము వ్రాసినచో ఫలములు తప్పిపోవు. ప్రాణాయామ ప్రత్యాహారధ్యానధారణ సమాధులచేత నాకసము బ్రద్దలుచేయు నట్లు చిత్తము న్యాసి బీగము వేయవలయును. భిక్ష కుదిరినఁగాని నిష్ఠ కుదురదు గా? పారమార్థికజ్ఞానము కేవలాత్మైక వేద్యము నిశ్వైరై కగమ్యమతీంద్రియముగాని నిక్కముగా లౌకికమును వ్యావహారికము కాదు. అవాఙ్మనస గోచరము వేదశాస్త్రములచేతను మఱి జగద్గురు శంకరాచార్యాది పరమహంసల గ్రంథములచేతను స్థూలారుంధతీ న్యాయమున విధిలేక బోధ్యమైన ట్లొప్పుకొనక తీఱక పనికిమాలిన వృద్ధులు కాలక్షేపమునకై కాకి దంతపరీక్ష చేయుచున్నను దేహేంద్రియశక్తి కల మనుష్యులందఱును నిద్రాహారవిహారసౌఖ్యసంపాదనమునకుఁ దగిన వ్యావహారిక జ్ఞానమును సద్గురూపదేశము సత్సహవాసము చేతను సంపాదించుకొని బుద్ధిమంతులై యొరులను సుఖపెట్టి తా సుఖపడు నడివయస్సు గల మనుష్యులే చెఱకు నడిమి భాగము వలె తమ బ్రతుకు సఫలము కావించుకొనెదరు.

తమతిండి తాము సంపాదించు కొనక పిశాచములవలె యొరులం బీడించి యన్నమడుగుకొనుచు యౌవనమున సోమరులై తాము బ్రాహ్మణులమనియును సన్యాసులమనియును సిగ్గులేని వేసములూని "ఉదర నిమిత్తం బహుకృత వేషః" అను తీరున నేమియో తెలిసీ తెలియని యధిక ప్రసంగములు చేయుచుండ దమ సోమరిపోతు బ్రతుకును హెచ్చరించుచు లేనిపోని వ్యాఖ్యానములు మున్యుపదిష్ట గ్రంథములకు చేయుచుంట రుజాజరామరణముల దోడుగా మనుష్య

లకు మిక్కిలి తెలుచుగాఁ జగులు నొక విధమగు నంటుతెవులీ మెట్ట వేదాంత చర్చ పరస్పర ప్రేమానురాగములతోఁ గలసి మెలసి హాయిగా నిద్రాహారవిహార సౌఖ్య సంపాదనోపయోగముగా విద్యా బుద్ధులు సంపాదించుకొని బ్రతుకుం బోషించుకొనుటయే సకల వేద శాస్త్రముల ముఖ్య తాత్పర్యమని సిద్ధాంతీకరింపవలయును వలయును. నిర్గుణమగు సున్న యను నంకమువంటి యభావపదార్థ మెట్లు హెచ్చించిన నగ్గించినను విభాగించినను సున్నయే యభావమే యగును గాని సగుణమగు భావ పదార్థ మెన్నటికి న్గాసేరదని యేమాత్రము బుద్ధికలవారికైనం దెలియక మానదు. జాగ్రద్దశలోనున్న వివేక వంతులకు యథార్థ వస్తు జ్ఞానము కలుగక తీఱదు గాని సహజముగా సత్త్వరజస్తమోగుణాత్మకమగు శరీరస్మృతియే భ్రమగాని ప్రమకాదు. యథార్థజ్ఞానమునకీ దేహస్మృతి ప్రతిబింబము యథార్థజ్ఞానము కల బుద్ధిమంతులకు "భిద్యతే హృదయ గ్రంధిశ్ఛిద్యన్తే సర్వసంశయాః" అను భగవద్వాక్యానుసారముగా సంపూర్ణ మనస్సంతుష్టి నెలితి పడక యెందున స్సందేహపడక కుంగక పొంగక యహంకార మమ కారములు లేక కేవల లోకోపకారమునకై మాత్రమే త్రికరణ శుద్ధిగాఁ బాటుపడుచుంట మనుష్యులనఁదగిన పరమ భాగవతుల సహజలక్షణము. అహంకార మమకారములతో స్వపరభేద మెంచి స్వార్థపరులై ధూర్తులైన కుక్షింభరు లెల్ల త్రాఁగు బోతులవలె విపరీత దృక్కులగుటచేత వారికిఁ గల శరీరస్మృతి వాస్తవమగు దివ్య దేహస్మృతి యొక్క భ్రాంతి మూలక ప్రతిబింబమే.

వేదమాత యగు గాయత్రీ మంత్రము యొక్క తాత్పర్యము మేము సంపూర్ణముగు బుద్ధిసంపద నొందుటకై త్రికరణ శుద్ధిగాఁ బాటుపడక తీఱదు అని-కాఁణ మేమనఁగా బుద్ధియొక్క లక్షణము చెడని సంతోషము. ఇపుడు మేము మిక్కిలి బుద్ధిహీనుల మగుటచే

భ్రాంతులమై కోరికలు తీర్చగలిగి మా బాధలం బోగొట్టజాలి మాకు శాశ్వత సంతుష్టినీని, వాస్తవముగా మాకు మేలుచేయ దగిన యథార్థ విహిత వస్తువుల నగపర్చ సరియైన మార్గమును దప్పి తప్పు త్రోవల నడిచి దుఃఖపడుచున్నాము. మాకోర్కెలు తీరకున్నవి. మామనసులోని వెలితిపోకున్నది. కలనైనం జిత్తశాంతి లేకున్నది. నానాటికి మా తాపత్రయానలము క్షణక్షణమును బ్రజ్వరిల్లుచునది. కాబట్టిబుద్ధి యెట్లు వచ్చునో యందుకుం దగిన వేదశాస్త్రము లభ్య సించెదము. నిత్యసంతోషులయిన పరమభాగవత సహవాసము తృటి యైనం దప్పక చేసికొనెదము. మా బ్రతుకంతయును లోకోపకార ముకై మాత్రమే ధారపోసెదము. దృఢవ్రతులమై శాశ్వత మన స్సంతోష లక్షణ మగు బుద్ధిని సంపాదించుకొనుటకై ముఖ్యమైన త్రోవ పరోపకారముచేయుటకై త్రికరణ శుద్ధిగాం బాటుపడుట తప్ప మఱే యాశ్రమము న్గాదుకాదని వేనోళ్ళంజాటి చెప్పెదము. మా పూరుషోద్యమమందు కసింతయుం బొరపాటు రానీక కేవల లోకోప కారముగా మా బ్రతుకుం గొనసాగించి మాతోడి పాటి జనులందఱును హాయిగా నున్న సమయమున నోకర్మసాక్షీ! యోజగజ్జ్యోతి! యోలోకబాంధవా! యోజగచ్చక్షూ! యోసకలజగదుద్భవస్థితిలయ మూలకారణమా! యోసకలజన నిత్యప్రత్యక్ష దేవతా! సూర్యనారా యణా! "జ్యోక్చ సూర్యం దృశే సవితుః వరేణియంభర్గో దేవస్య ధీమహి" అని సద్బుద్ధి యోగ మిమ్మని భగవంతుని వేడుకొనుటకన్న గాయత్రీమంత్ర తాత్పర్య మింకెద్దియు న్గాదు. భ్రాంతులకు న్స్వా ర్థపర ధూర్తులకును గాయత్రీమంత్ర మహిమము గ్రుడ్డగూబలకు బగటి వెల్గువలె నిష్ప్రయోజనము. నిత్యనైమిత్తికవిధి నిషిద్ధ కామ్యకర్మముల కీత్రిగుణాత్మక శరీరస్మృతియే కారణము ఈశరీరస్మృతి కేవలము పురుష ప్రయత్నమూలమును బురుష ప్రయత్న

స్వరూపమును గాఁబట్టి ఇంద్రియదృష్టముగా నింద్రియాతీతముకానీ తోఁచఁబడిన పదార్థమంతయుం బురుష ప్రయత్నాత్మభావపదార్థమే గాని దైవమను పురుష ప్రయత్న స్వరూపముకాని భావ పదార్థ మెద్దియును లేదు. "పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్" కాఁబట్టి దేవానాం ప్రియత్వమున్మాని వృథా పిష్టపేషణ మవలఁ బెట్టి యాకాశపంచాంగముంపగంతరేఖ యొక్క హద్దువలె భ్రాంతికరమగుటచే తెలిసీ తెలియని నిర్గుణాద్వైత వస్తు విచారణ ముకై బంగరువంటి ప్రాయము ప్రతి పుచ్ఛక లోకోపకారముగా బ్రతుకను వినియోగించుకొని బుద్ధిని సంపాదించుకొని బుద్ధికసాధ్యము లేదు కనుక వేదశాస్త్రముల గురు ముఖమున నభ్యసించుచు నిద్రాహారవిహార సౌఖ్యము లకై సోమరిపోతులయి పరులం బీడింపక కాయక్లేశముల భూమినిఁ బండించుకొని గాలి యెండ వానలనుండి తప్పించుకొనజాలిన యిరవుల సృద్ధిసాహాయ్యము నేర్పర్చుకొని యణిమాద్యష్టైశ్వర్యములం బొందుటకును వేయేల పురుషప్రయత్నమున సకల జగదుద్భవస్థితి ప్రలయ మూలకారణమగు దేవుఁడే తా నగుటకుఁ దేట తెల్లముగాఁ బరమాప్తులగు గౌతమ వ్యాసాదిమహర్షులు వేదశాస్త్రముల ద్వారమున రాజమార్గము నేర్పియే యున్నారు. మీ పౌరుషముపయోగపర్చుకొని పట్టుదలతోఁ దగిన విద్యాబుద్ధుల నార్జించి ధర్మార్థకామమోక్షములను పురుషార్థములను ప్రహ్లాదాది పరమ భాగవతులవలె సంపాదించుకొనుఁడు.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను వ్యాస సూత్రమందలి బ్రహ్మ శబ్దమున కర్థము కేవల పురుషప్రయత్న సాధ్యమగు వ్యవహార యోగ్యమగు యదార్థ జ్ఞానాత్మకబుద్ధిగాని నిర్గుణ మతీంద్రియమగ్రాహ్య మలౌకికమగు పదార్థ మెంతమాత్రము గాదు. "ప్రమితి విషయాః పదార్థాః" అను న్యాయసూత్ర తాత్పర్యము ప్రమి

యనఁగా మనుష్యుఁడు తన పురుషప్రయత్నముచేత సంపాదించుకొనఁ గలిగిన బుద్ధి యను నణిమాద్యష్టైశ్వర్య కారకమగు నొక సుగుణ విశేషము. బుద్ధి కగ్రాహ్యముగాని యసాధ్యముగాని నిర్గుణాద్వైత బ్రహ్మపదార్థ మొకటి యతీంద్రియమై యలౌకికమై యున్నదని "తత్తు సమన్వయాత్" అని వ్యాసర్షి యుపదేశించుట యందలి తాత్పర్యము మనుష్యుఁడు తన బుద్ధినిఁ దన పురుషప్రయత్న బలము కొలంది వికసింపఁ జేసికొని త్రిగుణమయ శరీరస్మృతిరూపక సమస్త ప్రపంచమును దానేయై తనకు వేఱుగానక సుఖదుఃఖాత్మక సంసార భ్రాంతి న్దొరంగి "సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ" అను రీతిగా జీవన్ముక్తుఁడు కాఁగల సామర్థ్యమును సంపాదించుకొనుటయే పరమ పురుషార్థమని "ఆత్మారే ద్రష్టవ్యోమన్తవ్యః శ్రోతవ్యో విజిజ్ఞాసితవ్యో నిదిధ్యాసితవ్యః" అను ప్రాఁబలుకులను "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను తన మీమాంసను లోకోపకారముకై మొట్టమొదటిసూత్ర ముపదేశించెను. నిత్యనైమిత్తిక విధి నిషిద్ధ కామ్యాది నానాకర్మముల కాలవాలము పౌరుషేయమగు జాగ్రదవస్థయేకదా పురుషప్రయత్న ముసఁ గావించు నెట్టికర్మముచేతనైన సంపాదించుకొనఁ దగినది బుద్ధి కదా? బుద్ధిని వికసింపఁ జేసికొన్నవాఁడు నిత్య మనస్సంతోష పాత్మక కైవల్యపదవిం జూఱకొనుచున్నాఁడు "బుద్ధి భ్రంశాద్వినశ్యతి" అను నట్లు మతిభ్రష్టు తాఁజెడి యొరులఁ జెఱచు చున్నాఁడు. బుద్ధికలవాఁ డొరులను సుఖపెట్టి తా సుఖపడును. నిద్రాహారవిహార సౌఖ్య సంపద నోపయోగముగాఁ ద్రికరణశుద్ధిగాఁ గష్టపడి విద్యాబుద్ధుల న్వెల్లడికావించి లోకోపకార మొనర్పఁగల్గు మంచి నడువడి తప్పక తా నడిచి యొరుల కట్టి మంచినడక మప్పెడుజనుఁడు మనుష్యుఁడు. నిక్కపు మానిసికాని సోమరియై పనిపాట్లొండవేసి బూకరితనమున బెదరించి యొరుల కష్టేష్టము లిష్టమంతయు గ్గనిపెట్టక కేవలము

స్వార్థపరుఁడై చేసే దొకటి చెప్పేది వేఱొకటిగా మోసకాఁడైన మనుష్యుఁడు చెడుమానిసికష్టపడి యొరులను సుఖపెట్టి తా సుఖముగా బ్రతుకు నుపాయములే సకల వేదశాస్త్రముల ముఖ్యోద్దేశము. శరీరజ్ఞప్తి యున్నవఱకు నిద్రాహారవిహార సౌఖ్యముల యందు కోరిక యున్నంతవఱకుం బాంచభౌతిక ప్రపంచ మంతయును మఱి సర్వలోక వ్యవహారములను యథార్థములేగాని మిథ్యలు కావు కాంతమీఁదియాస కనకంబుపై నాసలేనివాఁడు పుడమిలేనివాఁడు" జీవితేచ్ఛ యున్నవాఁ డెల్ల పురుషప్రయత్నమునఁ బాటుపడి నిద్రాహారవిహార సౌఖ్యకరములగు నుపకరణములను శక్తికొలందిని సంపాదించుకొని లోకసమ్మతముగా నడవకతీఱదు.

"నాద్వైతవతః కర్మాణివిధీయన్తే" అనఁగా నహంకార మమకారములు లేక బొత్తిగా దేహస్మృతియే లేకున్న సుషుప్తుఁడు పురిటిపిల్లఁడు గాఢమూర్ఛ నున్నవాఁడు యూపిరితీయుటకుఁ దప్ప మఱేయింద్రియశక్తియును లేనివాఁడు తన మంచిచెడ్డ లెఱుఁగఁజాలని యున్మాదరోగముచేతఁ బీడితుఁడైన వాఁడును మాత్రమే యన్నపానములచేఁ గాపాడఁదగినవారు. సమలోష్టకాంచనుఁడై సర్వజనసముఁడై యేకోర్కెనైన న్వెల్లడింపకే యూహాయు న్లేక గాలి వశమున నల్లాడు పండుటాకువలెఁ దనశరీర మెట్లు కదలుచున్నను బ్రాణిహింసనుండి మాత్రమే తన యింద్రియముల నదంభుఁడై మళ్ళించుకొనుచుఁ జిఱునగవును గనికరంబు పల్కును లోకోపకార వర్తనము బ్రత్యుపకార మొక్కింతయు కోరకే బ్రతికెడి పరమ భాగవతుని వర్తన మంతయును శాస్త్రీయమే కావున నట్టి యద్వైత మూర్తి కెట్టికర్మము నియమింప నవసరము లేదు. మఱి యన్మహానుభావుని గూర్చియే "యోగరతో వా భోగరతో వా" అను న్యాయముద్దేశింపఁబడెను. కాయక్లేశము నొసటి చెమ్మట నూడ్చుకొనుచు

నెవ్వరి నొప్పింపఁబోక తనబుద్ధిబల సాహాయ్యముచేత మాత్రమే
కష్టించి యేవిధముగానైనం బశుహింస యొక్కింతయు నెన్నఁడైనఁ
జేయబోక సర్వభూతదయయు సత్యము మూర్తీభవించినట్లు తోడి
వారితోఁ గలసిమెలసి యందఱి ప్రేమానురాగములకుఁ బాత్రుఁడై
యెవ్వరి ద్వేషింపనొల్లక "సర్వేజనాః సుఖినోభవంతు" అని సంత
తము జపించుచు లోకోపకారమునకై మాత్రమే తన బ్రతుకు పొడి
గించుమని భక్తవత్సలుఁడైన భగవంతునిఁ దన యంతరాత్మలో
ధ్యానించుచు సకలలోక జీవనోపయోగ కరములగు క్రొత్త క్రొత్త
యంత్రముల గనిపెట్టఁదగిన విద్యాబుద్ధుల నేర్చుకొనుచుం బండితజన
సహవాసమున దినదిన ప్రవర్ధమానమగు పాండిత్యముతో నలరారుచుఁ
దన పొరపాటు లొప్పుకొనుచు జాగరూకతతో వ్యవహరించుటకు
మిక్కిలి నిష్కపటముగాఁ బూనుకొనుచుఁ బురుషార్థ చతుర్వర్గ
సంపాదకసాధనము మిక్కిలి విద్యాబుద్ధు లుపయోగించి త్రికరణ
శుద్ధిగాఁ జేయు పురుషప్రయత్నముకన్న నితరమార్గమే లేదు. మఱి
యట్టి సజ్జనునకు దప్పక దైవము తోడ్పడునని చాటి చెప్పుచున్న
వాఁడే మనుష్యులలో రాజనిగాని మహాత్ముఁడని గాని పండితుఁ డని
గాని చెప్పఁదగి సమస్తజనులు గారవింపఁదగినవాఁడు "జటిలోముండీ
లుంఛితకేశః కాషాయాంబర బహుకృతవేషః, పశ్యన్నపిచ నపశ్యతి
మూఢో హ్యుదరనిమిత్తం బహుకృతవేషః" అను జగద్గురు వాక్యాను
సారముగా దంభుఁడై స్వార్థపరుఁడై సోమరియై జనులతోఁ గలసి
మెలసి సర్వలోకోపకారముగాఁ బాటుపడ నొల్లక మొండికూటి
వేషముతో బండతనముఁ గొందరు తామే యగ్రజాతివార మనియుం
దక్కినవా రస్పృశ్యులు పంక్తిబాహ్యు లధమజాతులనియు న్విపరీత
ములగు కట్టు బొట్టు జుట్టులతో నీరు నిప్పు కప్పను మడి తడి పొడి
భేదము లెంచుకొని గొంగళిం దిని యెవ్వియో లెక్కించుకొను తీరునఁ

దన తప్పు లరయ కొరులకు లేనిపోని తప్పులు పట్టుచు "పరుల సుఖమునకు విద్యాపరిణతికిం దేజమునకు బలమునకు మనం, బెరియఁగ ననహ్యపడు నన్నరుఁడు తెవులులేని వేదనంబడు నధిపా" అనునట్లు కులజాతి మతముల నఖిల మనుష్యులలోఁ దామే శ్రేష్ఠులమని విఱ్ఱవీగుచు బ్రహ్మ ముఖమునుండి తామే యూడిపడినట్లు నకల వేద శాస్త్రముల కపార్థ వ్యాఖ్యానములం బ్రచురపర్చి పామరులం బెదిరించుకొని బ్రతుకు ధూర్తులకు నిక్కముగా బుద్ధిచెప్పక తీఱదు.

దేహస్మృతి యొక్క వికారమేగాని నిక్కముగా నీ స్మృతి రూపముగాని జగత్తే లేదనుచున్నావుగా? యోయద్వైతీ! యెవ్వరి కొఱకిట్లు తెలిసి తెలియని గోలపెట్టెదవందువేని నీ కొఱకే నాయీ గోలయో భ్రాంతద్వైతీ! యద్వైతమన నేమో తెలియక ప్రచ్ఛన్న బౌద్ధుఁడే యద్వైతి యనముఁ జుల్కనఁ జూడకు. స్వార్థత్యాగ మొనర్చి కేవలము పరోపకారముగాఁ ద్రికరణ శుద్ధిగాఁ బాటు పడుచుం దనతోడిపాటి మనుష్యులందఱితోఁ బొత్తుగా బ్రతుకు నిక్కపట మానవుఁడే బుద్ధిమంతుఁడైన యద్వైతి. జనులకు బరస్పర ద్వేషముం గల్పించి సోమరియై యాకాశపంచాంగములు చెప్పుచుం బామరులం బెదరించి స్వార్థైక పరాయణుఁడై జాతికుల మతాభిమానముచే లోకులను దిట్టి లోకులచేతఁ దిరస్కరింపఁబడు నవాటి బుద్ధిహీనుఁడే ద్వైతి. సరియే పిచ్చి సన్యాసివి నీతో నేమి గాని నిక్కముగా లోకోపకారముగాఁ బ్రయోగింపఁ దగు చతుర్విధాభినయములలో మొదటిదగు వాచికాభినయము—?

అద్వైతమతము తెలిసిన మొట్ట-విశిష్టాద్వైత మతము తెలిసీ తెలియని మొట్ట-ద్వైతమతము తెలియని మొట్ట, సత్త్వగుణము చేత నొదవు జాగ్రదవస్థాత్మక మద్వైతము. రజోగుణముచేతఁ గలుగు స్వప్నావస్థారూపము విశిష్టాద్వైతము. తమోగుణముచేతి

నొదవు గాఢ మూర్ఛాత్మక సుషుప్త్యవస్థాత్మకము ద్వైతము, విలంబ మధ్య ద్రుత లయలం గ్రమముగా మంద్రమధ్యతార స్థాయి స్వరూప ముల శబ్దరూపమున సత్త్వరజ స్తమోగుణములు మూర్తీభవించును. సత్త్వగుణాత్మకాద్వైత మతముచేత మంద్రస్థాయియును, రజోగుణా త్మక విశిష్టాద్వైత మతముచేత మధ్యస్థాయియును, తమోగుణాత్మక ద్వైతమతముచేతఁ దారస్థాయియు, నొదవుచున్నవి. సత్త్వమునఁ బశ్యన్తియును రజస్సున మధ్యమయుం దమస్సున వైఖరియును గ్రమ ముగా మంద్ర మధ్య స్థాయు లగుచున్నవి. సత్త్వరజ స్తమోగుణ సమ్మిశ్రణ విశేష సంఘాత జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాత్మకా ద్వైత విశిష్టాద్వైత మత స్వరూపక మంద్ర మధ్య తారస్థాయి రూపక శబ్దములకుఁ దురీయావస్థాత్మక సచ్చిదానంద లక్షణమగు నిర్గుణ నాదబ్రహ్మ స్వరూపమే పరయను పేరఁ బరఁగుచుం గేవల యోగి హృద్ధ్యానైక గమ్యమై నిత్యనిరవయవశాంత పరమాత్మ స్వరూపమై యున్నది. సత్త్వరజ స్తమోగుణాత్మక శరీర స్మృతియను కార్య వృక్ష మునకు స్థూలకారణ దేహాభిమానము గల జీవాత్మ మఱి యా జీవాత్మకు "సాక్షీచేతాః కేవలోऽనిర్గుణశ్చ" అను శ్రుతినఁ బరమాత్ముఁ డగు వాసుదేవుఁడు సూక్ష్మకారణము. నాదబ్రహ్మ స్వరూపుఁడగు వాసుదేవుని లీలావేశమే యాకాశోపాధి నొలువడు శబ్దగుణము. పరమాత్ముని గుణము నిత్యము- జీవాత్ముని గుణ మనిత్యము- పర మాత్ముని బుద్ధి నిత్యము. జీవాత్ముని బుద్ధి యనిత్యము. గుణమును బట్టి గుణి తత్త్వము తెలియంబడును. కాఁబట్టి పరమాత్ముఁడు కేవల బుద్ధిగమ్యుఁడు. బుద్ధిగల ప్రహ్లాదాది పరమభాగవతు లేకాంతభక్తులకుఁ దప్ప వాసుదేవ పరబ్రహ్మ సాక్షాత్కార మల్ప బుద్ధులకు నితరజీవుల కెన్నఁడు నలభించను లభించను "క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే" అనుటచేతఁ కేవల లోకోపకారమునకు మాత్రమే మనో

వాక్కాయ కర్మములం బ్రతుకు ధారపోయు పరమ భాగవతులకు నైష్కర్మ్య సిద్ధ్యాత్మకమగు దైవముకన్న వేఱుగతి లేదు. మఱి యల్ప బుద్ధులకు స్వకర్మాత్మక పౌరుషముకన్న యపేక్షింపఁ దగిన యుపాయమే లేదు.

## విశ్వకల్యాణ సత్యసంకల్పము

"అశరీరమాత్మా" అనుటచేత నిర్గుణుఁడై యుండుట యాత్మకుఁ బ్రకృతిరూపమగు మరణావస్థగాని సగుణుఁడై యుండుట వికృతిరూప మగు జీవితావస్థ సుఖదుఃఖములు రెండుం బ్రకృతి నైనగాని సుఖ దుఃఖములు రెండును సగుణాత్మక వికృత్యవస్థ యగు బ్రతుకు నందు కలదు. సుఖదుఃఖములు వాస్తవములు కావు కాఁబట్టి దుఃఖము లేని దుఃఖ మనుభవించు నష్టమున్నప్పటికి లేని సుఖమనుభవించు లాభము కలదు గనుక లాభముగల యనిత్య వికృత జీవితము లాభనష్టములు రెండును లేని నిత్య ప్రకృతి మరణము కంటె మేలు. కాఁబట్టి జీవునకు జీవితాశ వదలకుంట స్వభావము.

జడము చేతనము లన్నియును గుణవిశేషములం బట్టి పుంస్త్రీ నపుంలింగములం బేర్కొనం బడినవి నపుంలింగమగు బ్రహ్మము వలెనే నపుంలింగములం బేర్కొనం బడిన వస్తువులు లోకవ్యవహార మునకుం బనికిరావు. శబ్దము గూడ పుంస్త్రీ నపుంలింగములం బేర్కొనఁ బడినవి కేవల మానసిక మయిన వేదమంత్రములు "అహం బ్రహ్మాస్మి" మొదలగు నపుంలింగము లగు కేవల శాంతరస ప్రధానమంత్రము లాత్మైకగమ్యము లగుటచేతఁ బరివ్రాట్టులకుఁగాని సంసారులకుఁ బనికిరావు. "యచ్చిద్ధితే విశోయథాప్రదేవ వరుణవ్రతం, మినీమసిద్య విద్యవి" అని కేవలము దైవప్రార్థనాత్మకములగు మంత్రములు, "పశు మాలభేత" అని కామ్యకర్మపరములగు మంత్ర

ములును పుం(స్త్రీ) రూపములై శృంగార వీర కరుణ బీభత్స రౌద్ర హాస్యాద్భుత భయానకరసాత్మకములై చతుర్విధాభినయ విశేషముల న్లోకమున వ్యవహార యోగ్యములగుచున్నవి. అభిప్రాయ విశేషాను సారముగా వైఖరి స్వరకాల స్థాన ప్రయత్న విశేషముల న్వెలువడు చున్నది. అనాది సంప్రదాయ నియతిం దప్పక వేదము లుచ్చరించని యెడలఁ ప్రత్యవాయము కలుగును కాఁబట్టి వేదములను సరిగానుచ్చ రించు సామర్థ్యము బ్రహ్మకే లేదని నారదమహర్షి నిర్దేశించెను. కనుక ప్రాకృత మానవు లుచ్చరించు శబ్దములు వేదములు గానే కావు కాని యపౌరుషేయ వేదవాక్యములకు మూలముగా నున్న నిర్జీవ కృత్రిమ శబ్దములు కాఁబట్టి లోకు లుచ్చరించు వేదమంత్రములు యథార్థముగా కాకున్నను సాహిత్యప్రాప్తి కక్షరాభ్యాసమువలె పరమార్థసాధనము లని పెద్దలచే సిద్ధాంతీకరింపఁబడెను. కాఁబట్టి వేదమంత్రములను పుస్తకములపై లిఖించుకొని చక్షురక్షరసంయోగ మాత్రమున నిరుక్త్యైక సాహాయ్యముల నాపాదించ వలసినదేగాని పఠింప నసాధ్యములు. లౌకిక శబ్దములు యథేష్ట స్వరకాల స్థాన ప్రయత్న విశేషముల చేత మనుష్యులు పరస్పరముం దమతమయూహా లన్యథేష్ట చతుర్విధాభినయ విశేషములచేత ననోన్యన్య చిత్తరంజనము కావించుకొనుట సంగీత మనంబడును.

"గాయత్రీగాతారం త్రాయతి ఇతిగాయత్రీ వేదమాత యగు గాయత్రీ మంత్ర శబ్దార్థము "గైస్తవనే- గైశబ్దే" అనుట చేతను స్తవన మనఁగా లోకరంజనముగాఁ జతుర్విధాభి నయ మొన ర్చుటలో ముఖ్యముగా వాచికాభినయ మొనర్చు వారిని రక్షించు దేవతకు గాయత్రి యని పేరు. పాటపాడెడువారిని మాత్రమే దేవత కాపాడును. మంత్రరాజమైన గాయత్రీ మంత్రమున కర్థము- మార్గ యనఁగా ననాది సంప్రదాయ సిద్ధమై భరతాది మహామునులచేత

మాత్రమే ప్రయుక్తమైన చతుర్విధాభినయ స్వరూపము- కాఁబట్టి "యచ్ఛిద్ధితే విశో యథా ప్రదేవ వరుణ వ్రతమ్" అను ఋక్కు నెట్లు పఠించవలెనో మునులకే యెఱుక "తే" అను పదమున నుదాత్తముగా ననఁగా మంద్ర స్థాయితోను "మినీమసి" అను పదము నందలి "సి" యను నక్షర ముదాత్తముగా హెచ్చు స్థాయిగా నుచ్చరించునపుడు షడ్జమ స్వరమున కుచ్చముగా నున్న ఋషభాది స్వరములతో "సి" యను నక్షరమును "తే" అను నక్షరము నిషాదాది తగ్గు స్వరములతో నుచ్చరించవలెను.

"ఉదాత్తే నిషాదగాంధారావ నుదాత్తే ఋషభధైవతౌ స్వరితప్రభావా హ్యేతేషడ్జమధ్యమ పంచమాః" నిషాదగాంధార స్వరములచే నుదాత్తమును ఋషభధైవతముల చేతననుదాత్తము షడ్జమధ్యమ పంచమస్వరములచే స్వరితము నుచ్చరించవలెను. "స-రి-గ-మ-ప-ధ-ని" సప్తస్వరములు. షడ్జ మధ్యమ గాంధారములను మూఁడు గ్రామములు. నందీ, విశాలా, సుముఖీ, చిత్రా, చిత్రవతీ, సుఖా, బలాయను దేవతామూర్ఛనము లేడును ఆప్యాయనీ, విశ్వామృతా చంద్రా, హేమ, కపర్దినీ, మైత్రీ, బార్హతీయను పితృమూర్ఛనము లేడును భూలోకభువర్లోకములం బుట్టి షడ్జమధ్యమ గ్రామముల న్వెలువడి లోకవ్యవహారమందున్నవి. స్వర్గమునందు మాత్రమే గాంధారగ్రామమును దజ్జన్యములగు నేడు మూర్ఛనములు గలవు. సప్తస్వరములు, మూఁడుగ్రామములు, ఇరువదొక్క మూర్ఛనములు, నలువది తొమ్మిది తానములుం గలిపిస్వరమండలమను సంజ్ఞ బరఁగుచున్నది. కాఁబట్టి యీస్వరమండలమునకు మార్గిసంగీతమని పేరు. ఈ మార్గిసంగీతమును ప్రయోగించుట కర్హులు భరతాది మహామునులు మాత్రమే కనుక ఋగ్యజుస్సామములను త్రయీవిద్య కేవలమును భరతనారదాది మహర్షులకు మాత్రమే తెలియును కాఁబట్టి

మనుష్యులు శాస్త్రీయముగా వేదపఠన మొనర్చుట కెంతమాత్రముం
బనికిరారు. మఱియును యథాశాస్త్రముగాఁ జతుర్విధాభినయాత్మక
గాంధర్వవేదముం బ్రయోగింప సమర్థు లెంతమాత్రము న్గారు.
ప్రస్తుతము లోకములో వేదములనంబడు "అగ్నిమీళే" మొదలగు
శబ్దములు కృత్రిమములుం బౌరుషేయములు ననిత్యములుం గాని
నిత్యము లపౌరుషేయములు వాస్తవములుం గానేకావు. సూర్యుఁడు
చంద్రుఁడు శివుఁడు నారాయణుఁడు మొదలగు దేవతలపేర్లు గల
మనుష్యులా దేవత లెట్లుకారో ఋగ్యజుస్సామాథర్వములను పేర్లతో
నీలోకమున వ్యవహరింపఁబడుచున్న వేదము లనిత్యములుం గృత్రి
మములుగాని యపౌరుషేయ నిత్యశబ్దములు కానేకావు. సన్న్యాస
మున కధికార్లు సాధనచతుష్టయ సంపదఁ గల యుత్తము మనుష్యుల
వలె వేదశాస్త్రముల న్దెలిసికొని ప్రవర్తించుటకు భరతాదిమహర్షులు
మాత్రమే యధికార్లుగాని మనుష్యు లెంతమాత్రము న్గానేకారు.
కాఁబట్టి వేదశాస్త్రవేత్తలమని నటించు మనుష్యులందఱును మోస
కాండ్రే. వేదవేదాంగములు కేవలమును స్వర్గాపవర్గములవలెఁ బార
లౌకికములు గాని పంచభూతములవలె నైహలౌకికము లెంతమాత్రము
న్గావుకావు. కాఁబట్టి నక్కయేడ దేవలోకమేడ యన్నట్లు మనుష్యుఁ
డేడ వేదవేదాంగము లేడ అమృతములగు వేద వేదాంగములు
మర్త్యుల నోళ్ళ న్వెలువడుట యాకాశము బ్రద్దలగుటవలె మిక్కిలి
యసంభవము. కాఁబట్టి లోకరంజకమైన చొక్కపు వర్ణాత్మక ధ్వన్యా
త్మక వాచికాభినయమును మఱి యాంగికాహార్య సాత్త్వికాభినయము
లను బ్రయోగించువాఁడే గాతగాయకుఁడు ననఁబడును. మఱి యట్టి
లోకరంజకుఁడై "ప్రేవవదేత్, పీవన్నృత్యేత్" అను విధముగా
నాడుచుం బాడుచు సకల లోకోపకారముగా జతుర్విధాభినయ
ప్రచారకుఁ డగు విద్వాంసున్న కాయురారోగ్యైశ్వర్యముల నిచ్చి

కాపాడు దేవత గాయత్రి యనంబడుచున్నది. కాఁబట్టి గాయత్రీ మంత్రోపాసకుఁ డనఁగా సకల లోకోపకారముగా సకలజనరంజక ముగా మనోవాక్కాయ కర్మమున్ వ్యవహరించు సజ్జనుఁడు మఱి యట్టి సజ్జనుఁడే గాయత్రీమంత్రోపాసమున కర్హుఁడైన ద్విజన్ముఁ డగును. "ప్రహీణః స్వరవర్ణాభ్యాం యోహిమంత్రః ప్రయుజ్యతే, యజ్ఞేషు యజమానస్య, రుషత్యాయుః ప్రజాం పశూన" అనుటచేత యజ్ఞమందుమాత్రమే శ్రౌతకర్మమును గావించునపుడు వేదమంత్రో చ్చారణమునకు మాత్రమే స్వరకాలస్థాన ప్రయత్నములు మంత్రో చ్చారణమునకు విధింపఁబడెను గాని లోకమునందు వ్యవహరింపఁ బడెడు ధ్వన్యాత్మక వర్ణాత్మకశబ్దములకు దేశకాల పాత్రోచితరంజక ముగా యథేష్టస్వరకాలస్థాన ప్రయత్నము లుపయోగించుకొనక తీఱదు. "ఎప్పటికెయ్యది ప్రస్తుత మప్పటికా మాటలాడి" అన్నట్లు పరులను రంజింపఁజేయు విధమున దేశకాల పాత్రోచితముగాఁ జతు ర్విధాభినయముల నుపయోగించుకొనుట కన్న వేరే నియమము ననుసరింపవలసిన పనిలేదు. వేదశాస్త్రము లన్నియు ననాదికాలము నుండియుం దత్తద్దేశకాల పాత్రోచిత వ్యవహారమునే బోధించు చున్నవి. వర్తమాన కాలోచితముగాఁ బ్రస్తుత లోకరంజనము గావించు విధమున బూర్వాచారము లన్నియును మార్చుకొనుచు వ్యవహరించు చుండియును ధూర్తులు తాము పూర్వాచారపరా యణులమని దంభవేషములతో వర్తమాన కాలాచారము లనుసరించి బ్రతుకుచుండియును వర్తమానకాలమునఁ జెల్లనినాణెములవలె నున్న పూర్వాచారముల న్గొనియాడుచు దంభవేషములతోఁ దాముపూర్వా చారానుసారముగాఁ బ్రవర్తించుచున్నట్లు నటించుచుఁ బ్రస్తుతాచా రములనె బట్టి నడుచుచుండియును గేవల పూర్వశిష్ట సంప్రదాయాను సారుల మని బొట్టు కట్టు జుట్టులచేత మాత్రమే యెన్నాళ్లు నుండియో

నశించిపోయిన పూర్వజాతినీతిమర్యాదల న్గాపట్యమున వెల్లడించుచుం దమవలె దంభమొల్లక వర్తమాన కాలానుసారముగా సర్వరంజకముగా నొరులను సుఖపెట్టి తాము సుఖపడు భూతదయాపరులు నిష్కపటులు నగు సాధుల నాస్తికులనియుం బాషండులనియు మ్లేచ్ఛలనియు ననార్యులనియుం జాతిబాహ్యులనియుం బూర్వాచారదూషకులనియును ద్వేషించుచు నొరులం జెఱచి తాము జెడుచున్నారు. "బ్రతికిన దూరు మానినది మం" దన్నట్లు చేతివానిని వదలి కాలువానిం బట్టుకొన నుంకించు నవివేకులవలె వర్తమాన కాలోచిత ప్రవర్తనమునఁ దమ తోడిపాటివారల న్సుఖపెట్టి తాము సుఖపడఁబోక, నేనాఁడో గతించినవారి నడువడి ప్రాఁత పంచాంగములకుఁ దెలిసీతెలియని యర్థనిర్దేశము చేయుచు వెల్గునందలి కొయ్యవలెఁ గోరితములోఁ దాము గతించిన పీరు సాహేబుగడ్డము పొట్టిదని కొందరు పొడువైనదని కొందఱు వృథావాదము లొనర్చుకొని కొట్లాడి తన్నుకొని యన్యోన్యద్వేషముతో నపమృత్యువు పాలగుచుంట మిక్కిలి శోచనీయము. లోకములోని మనుష్యులందఱుం బరస్పరమైత్రిం బ్రోత్సహించుకొను విధముగా దేశకాల పాత్రోచితముగా నాచరించుకొను మనోవాక్కాయకర్మము లన్నియును విధ్యుక్తములే యని సకల వేదశాస్త్ర సమన్వయాభిప్రాయమని సిద్ధాంతీకరింపక తీఱదు. జనులకుం బరస్పర ద్వేషమూలములగు నాచారములెంతమాత్రముం బరమకారుణికులు సర్వజ్ఞులు నగు మునులు నియమించనేలేదు. ఆదిమధ్యాంతరహిత మగు కాలము "కాలరూపీ జనార్దనః" అను తీరున సర్వలోక హితమునకే ప్రవర్తిలుచున్నది.

మంచిచెడ్డలు మనః కల్పితములు, తెలిసినది మొదలు ప్రాణులందఱును దమతమహితమును గోరియే యభీష్టసుఖము నందుటకై సహజముగా నుద్యమించుచున్నారు. బుద్ధిమంతులు సర్వజనసమ్ములై

యొరులను సుఖపెట్టి తాము సుఖపడుచున్నారు మఱియు హేయో పాదేయము తెలియని పసిపిల్లలును స్వార్థపరులైన ధూర్తులును స్వపరోపకారకమగు మార్గమున నడిపింపఁబడవలసి యుందురు. బుద్ధి తెలియని పిల్లలను మఱియు బుద్ధులు ముదిరిన దుర్జనులను లోకోపకారకమగు మంచిత్రోవను నడిపించి హాయిగా బ్రతుకు తెన్ను మన్నాటకై భూతభవిష్యత్కాల విదులయిన పెద్దలు చతుర్విధాభినయవిశేషముల స్వకలలోకహితముగాఁ బ్రకటించుచున్నారు. లోకోపకార పరాయణులలోఁ దమతమ సామర్థ్యముకొలఁది కొందఱు కవులయి, కొందఱు గాయకులయి, కొందఱు నానావిధ శిల్పులయి, కొందఱు దేశకాల పాత్రానుసారముగా సకలజనరంజకాచార ప్రవర్తకులయి పరుల సుఖపెట్టి తాము సుఖపడుచున్నారు. సకల వేదశాస్త్రములును దేశకాల పాత్రానుసారముగా సర్వజనసాధారణ హితమగు ధర్మము నే బోధించుచున్నవి. నాతోడిపాటి జనులు యను గ్రహమును నేను నా బ్రతుకును హాయిగాఁ గడుపుకొనుటలో నల్పజ్ఞుఁడ నల్పశక్తిని నేను గనుక సర్వజ్ఞుఁడవు సర్వశక్తివియైన యో దేవుఁడా నాకోర్కెల కొనసాగించుమను తన పరమోద్దేశమును బిట్టకైన నెన్నఁడు న్దెలియనీక తన పాపము స్మఱి తన యశక్తిని బ్రతిక్షణము లోకు లందఱికి బట్టబయలు కావించుకొనుచు నిష్కపటుఁడై తన నేరము బహిరంగముగా నొప్పుకొనుచు కేవల లోకోపకారపరుఁడై నిత్యసంతుష్టిన్ జీవన కాలక్షేప మొనర్చుకొన వలసినదనియే సకల వేదశాస్త్ర సాధారణ సమ్మతాభిప్రాయము. జనుల కన్యోన్య ద్వేషము దుఃఖమూలక సంసారబంధము. మఱియుం బరస్పరమైత్రిసుఖమూలక మోక్షము. "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్, నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి" విత్తొకటి వేసినఁ జెట్టొకటి మొలవదను చందమున నొరులకు మేలొనరించినవాఁడు మేలు బొందక

పొందును. మఱి యొరులకు కీడొనర్చినవాఁడు తప్పక కీడు పొందునని సర్వజనసాధారణ ప్రత్యక్షానుభవమే కదా? జీవుఁడు నిత్యుఁడు కనుకఁ బురాకృత జన్మకర్మానుసారముగా నొకప్పుడు మేలునకు బదులు కీడు, కీడునకు మాఱుగా మేలు కలుగుచుంటచేత మను లుపాధివశమున జీవుఁడు జననమరణ ప్రవాహరూపకమగు జన్మపరంపర లెత్తుచుం దత్తత్కర్మానుసారఫల మనుభవించుచున్నాఁ డనుట యుక్తియుక్త మనుకొనవచ్చును.

భూతభవిష్యజ్జన్మము లున్నను మఱియు లేకున్నను జీవుఁడు నిత్యుఁడయ్యును గాకున్నను దొంబదితొమ్మిది వీసము లీబ్రతుకులోఁ బోరునష్టము పొందులాభ మనుట సకలజన ప్రత్యక్షానుభవమే కదా? "మనుజులతోఁ బొందు పొసఁగి మనుటొప్పు నృపా" అన్నట్లు మొత్తముపై మేలునకు మేలు, కీడునకుఁ గీడు కలుగుచుంట తెలిసికొన్న బుద్ధిమంతులు పరులకు మేల్చేసి పరుల యనుగ్రహమును సంపాదించుకొని సుఖముగాఁ దమబ్రతుకు గడపుకొందురు. ఒరులను ద్వేషించి కష్టముల పాలగుచున్న యవివేకులు పసిపిల్లలకన్న ననికరింపఁ దగినవారును మంచిమార్గమున నడిపింపఁదగినవారును గనుక నట్టి తెలియనివారికి మంచిబుద్ధి చెప్పవలె నుపదేశింపక తీఱదు. కనుకనే యనాదిగా వేదశాస్త్రములు చతుర్విధాభినయాత్మకముగా జగద్రూపమునఁ బ్రవర్తిల్లుచున్నవి పరోపకారమును యజ్ఞము స్వర్గదాయకమని వేదమును మఱి యైహిక సౌఖ్యదాయకమని శాస్త్రమును బోధించుచున్నవి. ఆఁకలి దప్పికలం బాధపడుచున్న తనతోడి జీవుల కన్నపానము లిచ్చుటయే యజ్ఞ మొనర్చుట యని సకల శ్రౌతవిధానముల కర్థము నిద్రాహారవిహార సౌఖ్యములం దనతోడిపాటి వారలకు కలిగించుట స్మార్తకర్మ విధానమున కర్థము. సకలశ్రౌత స్మార్త కర్మము లన్నియుం దనతోడిపాటి జీవులకు నిద్రాహారవిహారసౌఖ్యము

న్గావించునని మనుష్యవచనాదికాలము నుండియును జతుర్విధాభినయ రూపము సహజ కృత్రిమరూపముల న్వెలయుచు బోధించుచున్నవి.

దేవమునియగు నారదమహర్షి వేదపఠనమునందు స్వర ప్రమాదమును దప్పించుకొనుటకై తన శారీరమునకు సాక్ష్యము గా దా నోటఁబల్కినది సరిగా వీణమీద వాయించుచు వీణానాద ముతోఁ గలిపి "వీణామునగాయన్తి" అను శ్రుతిప్రకారము సామ వేదమును బఠించువాఁడు. వీణాది తతవాద్య సహాయములేక "ఇత్యే తచ్చరితం సర్వంస్వరాణాం సార్వవైదికమ్" అను శిక్షాశాస్త్రి మనుసరించక షడ్జాది సప్తస్వరజ్ఞానము రంతయు న్లేక వేదములు గతానుగతికులై "శతాంధాః కూపం ప్రవిశన్తి" అను విధమున బొంతకాకులవలె నపస్వరముగా వేదపఠనముచేయుచుఁ బామరుల న్దాము వేదపఠనమునఁ బండితులమని మోసముగా నమ్మించి స్వార్థై పరాయణులైన ఛాందసమ్మన్యులు సకల జనానోన్యమైత్రిం జెఱచు చున్నారు. అపౌరుషేయమగు "అగ్నిమీళే" అను వైదికశబ్దము నిత్యము సప్తర్షి మండలమువలె సర్వలోక ప్రత్యక్షమయినప్పటికి నక్షత్ర తత్త్వము ప్రాకృతుల కెట్లు దురవగాహమో యట్లే మంత్ర బ్రాహ్మణ శబ్దార్థ తత్త్వము మున్యైక గోచరముగాని ప్రాకృత మానవులకు గ్రాహ్యము కాదుకాదు. "పద్మపత్రప్రభః షడ్జో ఋషభః శ్శుక పింజరః కనకాభస్తు గాంధారో మధ్యమః కుంద సంప్రభః" షడ్జ స్వరమునకుఁ బద్మకాంతి ఋషభము యొక్క వర్ణము చిలుక వన్నె బంగరురంగు గాంధార స్వరమునకు మధ్యమ స్వరమునకు మల్లెపూవు వన్నియ శాస్త్రిమునఁ జెప్పఁబడెను గాని మానవులకుఁ దప్పనాయాయి స్వరతత్త్వము గ్రాహ్యమగు టెట్లు? పంచమ స్వరము నలుపఁట దైవతము పచ్చనిదఁట నిషాదము చిత్రవర్ణముకలదఁట ఆయా యి స్వరము లుచ్చరించినపుడు గాలియం దాయాయి రంగులు గనఁ

బడునట, స్వామునకు మాను శరీరరచన నవరస విశేషములు వర్ణ
ములు భోజన భాజన విశేషము లాకారములు నడువడులు మఱియు
నది దేవతలు మనుజులు తెలిసికొని యోగసప్తస్వరముల నెల్లడింపఁ
గలుగు నెట్లు? కాఁబట్టి వేదశబ్దము లుచ్చరించుటకుఁగాని వేద
శబ్దార్థ తత్త్వము తెలియుఁగుటకుఁ గాని వేదముల న్బోధించుటకుఁ గాని
మునులు మాత్రమే శక్తులు మనుష్యులు కారు. అతీంద్రియ
తత్త్వమును మునులు మొని మతము నాచార్యులు నాచార్యమతమును
బండితులు లోకమున నెల్లడించుచుండిరి కాని కేవల పరమార్థబోధక
ములగు వేదశాస్త్రములతో సంసారులగు మనుష్యులకుఁ బ్రయోజన
మెంతమాత్రము నేదు సత్యసంకల్పులు కామరూపులు సర్వశక్తులు నర్వజ్ఞు
లతీంద్రియ ద్రష్టలగు మహామునులు తమ యోగదృష్టిచేత షడ్జాది
సప్తస్వరము లుచ్చరింపఁబడినపుడు పంచభూతమయమైన యుచ్ఛ్వా
సమునందలి నామరూప విశేషముల గని పెట్టి లోకానుగ్రహపరులై
స్వరకాలస్థాన ప్రయత్నజన్యమగు ధ్వన్యాత్మక వర్ణాత్మకశబ్దశాస్త్రము
న్గావించిరి. ఆకసమం దాకస్మికముగా నలముకొన్న మబ్బునందు నానా
విధములగు నుఱుములు మెఱపులు వానయుం బాంచభౌతిక గుణవిశేష
ముల నెలువడునట్లు వైఖరీ విశేషములందు శబ్దస్పర్శ రూపరసగంధ
విశేషముల దమ యోగసూక్ష్మదృష్టిచేత మహామునులు కనిపెట్టి
లోకానుగ్రహ తత్పరులై వస్తుతత్త్వమును వేదశాస్త్రముల బ్రక
టించిరి.

ఆప్తవాక్య ప్రమాణముచేతనే కదా సకలవస్తు తత్త్వముల
నూహ తెలిసినకొలందిం బుట్టి పెరుఁగుచున్న జీవులు తెలిసికొని
హేయా దేయవస్తువుల గుర్తెఱిఁగి వ్యవహరించు చున్నారు తన
తలిదండ్రులు తన కన్నం బెద్దలయిన తన తోడిసాటి జీవుల ననుక
రించుచుం బిన్నలు పెద్ద లగుచున్నారు. కాఁబట్టి యనాది కాలము

బడునంట, స్వాయంభువ మనుశేర్వరఁగాని నవరస విశేషములు వర్ణ
ములు భోజన భాజన విశేషము లాకారములు నడువడులు మఱియు
నధి దేవతలు మనుజులు తెలిసికొని సూక్ష్మసప్తస్వరముల న్వెల్లడింపఁ
గలుగు నెట్లు? కాఁబట్టి వేదశబ్దము లుచ్చరించుటకుఁగాని వేద
శబ్దార్థ తత్త్వము తెలియఁగుటకుఁ గాని వేదముల న్బోధించుటకుఁ గాని
మునులు మాత్రమే శక్తులు మనుష్యులు కారు. అతీంద్రియ
తత్త్వమును మునులు ముని మతము నాచార్యులు నాచార్యమతమును
బండితులు లోకమున వెల్లడించుచుండిరి కాని కేవల పరమార్థబోధక
ములగు వేదశాస్త్రములతో సంసారులగు మనుష్యులకుఁ బ్రయోజన
మెంతమాత్రము న్లేదు సత్యసంకల్పులు కామరూపులు సర్వశక్తులు సర్వజ్ఞు
లతీంద్రియ ద్రష్టలగు మహామునులు తమ యోగదృష్టిచేత షడ్జాది
సప్తస్వరము లుచ్చరింపఁబడినపుడు పంచభూతమయమైన యుచ్ఛ్వా
సమునందలి నానారూప విశేషములం గనిపెట్టి లోకానుగ్రహపరులై
స్వరకాలస్థాన ప్రయత్నజన్యమగు ధ్వన్యాత్మక వర్ణాత్మకశబ్దశాస్త్రము
న్గావించిరి. ఆకసమం దాకస్మికముగా నలముకొన్న మబ్బునందు నానా
విధములగు నుఱుములు మెఱపులు వానయుం బాంచభౌతిక గుణవిశేష
ముల న్వెలువడునట్లు వైఖరీ విశేషములందు శబ్దస్పర్శ రూపరసగంధ
విశేషములం దమ యోగసూక్ష్మదృష్టిచేత మహామునులు కనిపెట్టి
లోకానుగ్రహ తత్పరులై వస్తుతత్త్వమును వేదశాస్త్రములం బ్రక
టించిరి.

ఆప్తవాక్య ప్రమాణముచేతనే కదా సకలవస్తు తత్త్వముల
నూహా తెలిసినకొలందిం బుట్టి పెరుఁగుచున్న జీవులు తెలిసికొని
హేయా దేయవస్తువులం గుర్తెఱిఁగి వ్యవహరించు చున్నారు తన
తలిదండ్రులు తన కన్నం బెద్దలయిన తన తోడిసాటి జీవుల ననుక
రించుచుం బిన్నలు పెద్ద లగుచున్నారు. కాఁబట్టి యనాది కాలము



నుండియు వేదశాస్త్రములం బట్టి వస్తుతత్త్వమును దెలిసి వ్యవహరించు
పెద్ద లాప్తులు మఱి యట్టి యాప్తవాక్యములే వేదశాస్త్రములు.
సద్గురు ముఖమున వేదశాస్త్రతత్త్వమెఱింగి నవుడు గాని యెట్టి
బుద్ధిమంతుల కైన సద్గురూపదేశము లేనిచో యథార్థవస్తుజ్ఞానము
కలుగనేరదు. మొదట దను తలిదండ్రులు పిదపఁ దనతోడిపాటి
జనులలో భూత దయాపరులైన పరోపకార పరాయణులగు లోకులు
తన గురువులుగా నెంచుకొని పిన్నలు హేయాదేయ వస్తువు లెఱింగి
వ్యవహరించవలెను. మఱి యట్టి పెద్దల యుపదేశములకును వేద
శాస్త్రములకును రవంతయు న్భేదము లేనే లేదు. వేదశాస్త్రాభిప్రాయ
మ ననుసరించియే తమ తల్లిదండ్రులు గురువు లాప్తులు మొదలగు
పెద్దలు తనకుఁ గర్తవ్యాకర్తవ్యము లెఱింగించెదరు. తనకుఁ దన
సౌఖ్యము కోరుకొనుట యెట్లు సహజగుణమో యట్లే తన తలి
దండ్రులు మొదలగు పెద్ద లాప్తులు మొదలయిన సుజనులకుఁ దన
కిహపర సౌఖ్యసంధాయకమగు తెన్నైన వేదశాస్త్ర తత్త్వమును
బోధించుట స్వభావము. సర్వభూతదయా పరులై తమ సౌఖ్యమును
మఱచి కేవల లోకోపకార పరాయణులగు గౌతమ శంకరాచార్యాది
మనుష్యులకన్న వేఱే మునులు మఱెవ్వరు న్లేరు. స్వార్థపరత లేక
కేవలలోకోపకారమునకై మాత్రమే జీవించు పుణ్యాత్ములకు
మాత్రమే వేదశాస్త్రములు సరిగా బోధపడును. వేదశాస్త్రము
లన్నియును సర్వజన సాధారణోపకారైక ప్రయోజనమయి మాత్రమే
యనాదిగాఁ బ్రవర్తిలుచున్నవి. తనకుఁ దన శరీరావయవము లన్నియు
నొక్క పోల్కి బ్రియముగునట్లు వేదశాస్త్ర రూపుఁడగు వాసుదేవు
నకు సర్వజనులును బ్రియులే, కర్మసాక్షియై సూర్యునివలె నాదేవుఁడు
సత్కర్మ మాచరించు పుణ్యాత్ములను దనతో సమానులని మెచ్చు
కొనుచు దుష్కర్మమునుండి తెమలలేక బాధపడు నవివేక జీవులకు

సద్బుద్ధి నొసఁగి కాలక్రమానుసారముగా నెవ్వనికైనం దయా మయుఁడు గాన దల్లి చంటిపాపల న్బోలె రక్షించకమానడు. అనాదు లగు జీవుల కనాదికర్మముకూడ స్వభావము. జీవులకు దత్తత్కర్మాను సారఫలము నిచ్చుట కాలరూపియు సర్వసాక్షి యగు భగవంతునకు సహజగుణము. ఐతేయును భగవంతుఁడు స్వతంత్రుఁడు కనుక "కర్తుమకర్తు మన్యథా కర్తుం శక్యతే భగవాన్" అనునట్లు సత్క ర్మాచరణ మొనర్చు తన భక్తులను సంసారబంధము నుండి తొలం గించి నిసర్గ దయామయుఁడు పరమాత్ముఁడుగాన సూర్యుఁడు స్వప్రకా శముచేతఁ జీకటి నావరించిన జగమునుం బ్రకాశింపఁజేయునట్లవివేక మునఁ మునింగిన దుష్టాత్ముల న్నాశఁ బ్రళయావసరము వేచి దుఃఖ బంధవిముక్తుల న్గావించి తనకంటె వేఱుఁగక తానొక్కఁడే సుధా పయోధిని యోగనిద్రం జెందును. ఈపరమార్థము న్గురుకటాక్షముచేత భక్తివిశ్వాసములు గల యాస్తికులగు పరమభాగవతులు బోధించు చున్నారు. స్వార్థపరత మాని కేవల లోకోపకార పరాయణులగు పరమ భాగవతులే పరమ మునులును శిష్టులు ననఁదగిన మానవులు. "పృషోదరాదీని యథోపదిష్టమ్" అను పాణిని సూత్రముచేత శిష్టు లుచ్చరించిన దెల్ల సుశబ్దమే. కాఁబట్టి శిష్టులగు పరమభాగవత జను లాడినఁ దాట పాడినది పాట శిష్టవాక్యము సమస్త వేదశాస్త్రసమ్మ తము. కావునఁ గేవల లోకోపకార పరాయణు లుపదేశించిన విధ ముగా వాచికాంగికాహార్య సాత్త్వికాభినయము లొనర్చి లోకరంజ కులై భగవదనుగ్రహమునకు మనుష్యులందఱుం బాత్రులై సంసార దుఃఖబంధ విముక్తులు కాఁదగినది కాఁదగినది. "నాద్వైతవతః కర్మాణివిధీయన్తే" అను రీతిగాఁ గేవల లోకోపకార పరాయణులు సర్వ భూతదయాపరులు సర్వజనసములు. "వెట్టి కుదిరితేఁగాని పెండ్లి కాదు పెండ్లైనంగాని వెట్టి కుదురదు" అన్నట్లు స్వార్థపరత లేనివాఁడు

సంసరించుచుందురు. సంసారికి స్వార్థపరత యుండకతీఱదు. గనుక జగమున సంచరించుచు స్వార్థపరత లేక కేవల పరోపకారపరాయణులుం బరమభాగవతులు నయిన సద్గురువులు సంసారులకు లభించి సదుపదేశము చేయు భాగ్యము జనులకబ్బుట మిక్కిలి దుర్లభము.

మునులచే నుపదిష్టములయిన వేదశాస్త్రవాక్యములలో ననాది సంప్రదాయసిద్ధము లయినవెన్నో యందాధునికులచేత నడుమఁ దోపఁబడిన ప్రక్షిప్తము లెన్నో మఱి యా వేదశాస్త్రములకు నానా ముఖముల భాష్యము లొవచ్చిన యాచార్యాభిప్రాయము లన్నింటికిని సమన్వయ మెట్లు చేయవలెనో యాసంగతి స్వార్థపరులైన విద్వన్మన్యుల యహంభావముచేతం బరస్పర ద్వేషముచేత నిర్ణయింప నలవికాదు కాఁగా "త్రిపాదస్యామృతం దివి, ద్వాసుపర్ణా" అను శ్రుతులం బట్టి దేవుఁడు నిజలీలచే విశ్వరూపుఁడై సగుణుఁడై బంధమును, నిర్గుణుఁడై కైవల్యానందము ననుభవించు రహస్యము ను యుక్తిచే గ్రహింపఁ బ్రాకృతబుద్ధులు శక్తులు కారుగాని, దైవకృప వలనఁ బరమ భాగవతుల నాదేవుఁడు కరుణామయుఁడును భక్తరక్షణ దీక్షాపరుఁడును "సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, పరే బ్రహ్మణి సోఽపి నసక్తః" అనుచుండిన సంసారము నిస్సారము దుఃఖాంత నాటకము నిశ్చయించి స్వార్థపరత మాని సర్వేశ్వరుని నారాయణ స్వరూపమే యును నాప్తవాక్య ప్రమాణమును మాత్రము విశ్వసించుకొని భూతదయాపరులై కేవల లోకోపకార మొనర్చుటకు మాత్రమే తమ జీవనములం గొనసాగించుచుండి తమ యంతరాత్మలందు మాత్రమే యహర్దివము న్భగవంతుని నిష్కపటులై ధ్యానించు పరమభాగవతుల సద్భావా వాసుదేవుఁడు ధరింపక మానఁడు మానఁడని నిఖిలలోకాప్తుఁడగు వేదవ్యాసముని పురాణములు జాటిచెప్పెను.

"ఆర్చికం గాథకం చైవసామికంచ స్వరాంతరమ్, కృతాంతే స్వరశాస్త్రిణాం ప్రయోక్తవ్యం విశేషతః" ఋగ్యజుస్సామ వేదములకుఁ బ్రత్యేకముస్వరములు సంగవిన్యాసమును నియమింపబడినవి "ఏకాంతరస్వరోహ్యర్క్షుగాథా సుద్వ్యన్తరఃస్వరః, సామసుత్ర్యన్తరం విద్యాదేతావత్స్వరతో న్తరమ్" ఒకస్వరమునువిడిచి యొక స్వరముచేత ఋగ్వేదమును రెండుస్వరములందాటుచు యజుర్వేదమును మూఁడుస్వరము లతిక్రమించుచు సామవేదమును బంతించవలెను. "సగరిని" యని ఋక్కును "సమగని" యని యజుస్సును "సపమని" యని సామము నుచ్చరించినపుడు గ-మ-ప-లు హెచ్చుస్థాయిగాను 'ని' తగ్గుస్థాయిగా నుచ్చరింపవలయును. మరియుం గ్రమముగా 'రి-రిగ-రిగమ'లు హెచ్చుస్థాయియందు 'స-రిస-గరిస'లు తగ్గుస్థాయియందు నుచ్చారణమున లోపించుటచేత నాంతరస్వరములగును. మూరెడు-రెండుమూరలు___మూఁడుమూరలు నెడముగా ముందు వెన్కలకు గంతులిడిన విధముగా ఋగ్యజుస్సామ మంత్రస్వరాంతరములుండును. మఱియును హస్తాంగుళ్యాద్యాంగికాభినయముకూడ నీమూఁడువేదములకు భేదించుచుండును. వేదమంత్ర పఠనమును వేద శబ్దార్థవిజ్ఞానవైదిక కర్మాచరణమును బ్రాహ్ణాపరాహ్ణ మధ్యాహ్న సాయాహ్న ప్రశము నమర్థతయు సూర్యునకువలె మునులకుమాత్రమే కలదు. ప్రకాశవిశేషమాత్రములచేత మాత్రమే మింటిచుక్కలపాల జాడయున్కి నెలిసికొను చందమున మేఘగర్జనాదిభౌతికానిత్య శబ్ద శ్రవణమాత్రముచేతనే నిత్యవేద శబ్దస్థితినిమఱియు ననిత్యమర్త్యబుద్ధి గుణముచే నిత్యేశ్వర బుద్ధివిలాస మహిమము స్థూలారుంధతీ న్యాయముగా నూహింపవలసినదే కాని కూలంకషముగా వేదశాస్త్రముల యొక్కగాని దేవునియొక్కగాని యథార్థతత్త్వమును కేవల విజ్ఞాన మూర్తులగు గౌతమవ్యాసాది మహామునులుతప్పఁ బ్రాకృతమానవు

తెలుఁగ నేమాత్రమునుశక్తులు కారుకారు. ప్రాకృతులగు మనుష్యు
లందఱును స్వార్థపరులై వేదశాస్త్రి తత్త్వ మెఱింగినట్లు వృథాలాప
ములుచేయుచు నబద్ధపువ్రాఁతలు వ్రాయుచున్నారు. స్వార్థపరులై
పరస్పర విద్వేషణ కారకులైన సంసారులుచ్చరించునవి వేదమంత్ర
ములుకావు. వేదశాస్త్రములు కేవలాత్మైక వేద్యములతీంద్రియములు
గాని ప్రత్యక్షములుకానేకావు. పల్కఁబడవుకనుపడవు. వేయేల "నేతి
నేతి" అనునట్లు దేవునివలెనీలోకములో గ్రాహ్యములు కానేకావు. తుచ్ఛ
మర్త్యులతో సంబధించిన జ్ఞానమంతయును దుచ్ఛమును మర్త్యమే
కాకతీరదు. విత్తొకటివైచిన మొక్కొకటి మొలచునా? కాబట్టి
స్వర్గాపవర్గములంగూర్చి తమకుఁదెలిసినట్లు కన్నులు మిటకరించు
దేహధారులందఱును మోసకాండ్రే రామకృష్ణాద్యవతారములును
గౌతమవ్యాసాదిమహామునులు బుద్ధశంకరాద్యాచార్యులును చిత్తోప
శాంతికై పెద్దలచేతఁ బ్రతిపాదింపఁబడిన విజ్ఞానశరీరులుగాని వాస్తవ
ముగా మర్త్యులవలెఁ బాంచభౌతిక దేహధారులెంతమాత్రమున్నారు
కారు-జీవన్ముక్తులు పరమహంసలు సర్వజనసములు సర్వభూతదయా
పరులు సకలలోకోపకార పరాయణులహంకార మమకార విముక్తు
లగు పరమ భాగవతులు రామకృష్ణ గౌతమ వ్యాసబుద్ధ శంకరాచార్య
సంజ్ఞల ననాదిగా నెవ్వరుమతముల నవలంబించి కేవల లోకోప
కారమునకై యెక్కాలమందైనను దేహధారులై జగద్గురువులై
సంచరించుచుంటయాయామతము లవలంబించిన లోకోపకారపరాయ
ణులగు సుజనుల కంటికిఁ బ్రత్యక్షానుభవమే. వేయేల జనులకుఁ
బరస్పర ప్రేమానురాగము కలిగించు నడువడియును యజ్ఞ మొనరించి
తమతోడిపాటి వారియనుగ్రహమునకుఁ బాత్రులై సుఖముగా బ్రతు
కుటకన్న స్వర్గమును యన్యాత్మలాభ సంతుష్టికన్న నపవర్గమును
మనుష్యులకు మఱివేఱే లేదు లేదష్టాదశ విద్యలన్నియును సమన్వ

యము చేయఁగాఁ దేలినముఖ్యాభిప్రాయ మొరులను సుఖపెట్టి మనుష్యుఁడు తా సుఖించుటయనియే-సకలవిద్వత్సిద్ధాంతము. మూఁఢు వంతులు వేదములందును శాస్త్రములందును స్వార్థపరులైన ధూర్త పండితులు పామరులన్దను వశముచేసికొని తమతోడిపాటివారికన్నఁ బాటుపడకయే యెక్కువ, భోగములు తాములంకించుకొనుటకై దోపిప్రక్షిప్తము లున్నప్పటికి నాదికాలమునుండియును ఋతువులవలె సహజముగా లోకోపకారములై యష్టాదశ విద్యలు చతుర్విధాభినయ స్వరూపముగా శిష్టప్రవర్తనమూలములై యీలోకమునఁబరగుచున్నవని నిరూఢిగా ననుమాన ప్రమాణమున విద్వాంసులు సిద్ధాంతీకరించుచున్నారు కాఁబట్టి యనాది సంప్రదాయానుసారముగా స్వర కాల స్థానప్రయత్న విశేషములచేత ద్విజులు పఠనపాఠనములం బ్రచురించు వేదశాస్త్ర ప్రవృత్తి యిహపరసౌఖ్యదాయకమని యొప్పుకొనకతీఱదు. వేదమంత్ర పఠనమాత్రముచేతను వైదికకర్మముల చేతను స్వర్గకారణమగు పుణ్యమును మఱియుఁ దదర్థబోధనమునం బొడము వైరాగ్యముచేత నపవర్గమును దప్పక కలుగును. అధికబుద్ధి మేధలుకల ప్రతిభావంతులయిన పండితులచేతం బఠనపాఠనముల నుపదేశింపఁబడినపు డెక్కువగొద్దిఫలమునుమఱి, కించిజ్జ్ఞులపఠనపాఠ నోపదేశములచేతఁ గొద్దిఫలము వేదశాస్త్రములు లోకుల కిచ్చుచుంటకు సంశయములేదు.

వేదశాస్త్రములు నిత్యాపౌరుషేయములైనను మఱి యనిత్యాపౌరుషేయములయినను సంస్కృతమయినను మఱి యపభ్రంశములయినను లోకోపకారపరాయణులగు సజ్జనులకు భక్తిశ్రద్ధలం బ్రోత్సహించి స్వర్గాపవర్గదాయకము లగుట నిస్సందేహము. సర్వజ్ఞులగు మునులచేత యథావిధిగా వేదము లుచ్చరింపఁబడును. మఱి సమగ్రముగా నెఱుంగఁబడును. కించిజ్జ్ఞులగు ప్రాకృత మానవులచేత

ద్రోహ భూయిష్ఠముగా నుచ్చరింపఁబడి కొంచెముగా బోధితము లగును. “చెఱకునకు వంకబోతేమి చెడునెతీపి” అను విధమున పఠించినను, మఱెట్లు గ్రహింపఁబడినను వేదశాస్త్రములు సన్మానవులకు, సత్ఫల మొసంగక మానవు. కాఁబట్టి యథాశక్తిగా మనుష్యులు సద్గురూప దేశమున వేదశాస్త్రము లభ్యసించి లోకోపకార సత్కర్మాచ రణము కావించుకొని యిహపరములఁ దరించవలెను. నిష్కపట మానవు లభ్యసించిన విద్య యట్టి సుజనుల నిహపర సౌఖ్యసంధాయకము కాక మానదు. విద్య లభ్యసించిన ఫలము వినయము. వినయముచేతఁ దన తోడిపాటి వారి యనుగ్రహమును మనుష్యుఁడు సంపాదించుకొని యొరులను సుఖపెట్టి నిస్సంశయముగా దా సుఖపడఁ గలఁడు.

“ఏకశ్శబ్దః సమ్యగ్జ్ఞాతః సుష్ఠు సంప్రయుక్తః స్వర్గేలోకే కామధుక్ భవతి” అను మహాభాష్యోక్తిం బట్టి సద్గురూపదేశమున విద్య నెఱింగి లోకోపకారకులగు నడువడి కలవాఁ డాచార్యుఁ డనఁ బడును. మఱి యట్టి యాచార్యోత్తములగు శంకరాచార్యాదులు లోకమం దచ్చటచ్చట యుగానుసార వేషములతో జనులకుఁ గర్తవ్యమును బోధించుచుందురు. జనుల కన్యోన్య ప్రేమానురాగములతో బ్రతుకుటకన్న ననశ్య కర్తవ్యమిం కెద్దియు న్గాదు. వేదశాస్త్రాభ్యాసము- వర్ణాశ్రమోచిత ధర్మాచరణము- దేశకాల పాత్రానుసార ప్రవర్తనము ముఖ్యముగా నిష్కపటులగు పరమభాగవతులతోడి సహవాసము- స్వధర్మాచరణమున నాకస్మికముగాఁ దటస్థించు ప్రమాదములనుండి తప్పించుచుఁ బశ్చాత్తాప మొదవించుచుందఱకుఁదప్పక నిశ్శ్రేయమును గలిగించక మానదు మానదు.

## వేదవైదికవిజ్ఞానగానము

దేశకాల పాత్రోచితముగా జనులకు వారివారి యభిరుచి కనుకూలముగా నానావిధధర్మప్రచారమువలె వేదశాస్త్రములు

నానా దేశముల నానావిధములయి ప్రవర్తిల్లుచుండును. కొందఱికి స్వరములు తారస్థాయి యందు మఱికొందఱికి మధ్యస్థాయి యందును మఱికొందఱికి మంద్రస్థాయి యందును రుచించును. ప్రాచీనులకు నల్లని కొప్పును నల్లనికన్నులును రమ్యమగును, పాశ్చాత్యుల కెఱ్ఱని కొప్పును బిల్లికన్నులు రుచించును. "లోకోభిన్నరుచిః" అని తెలిసిన విద్వాంసులు సమరసులై సర్వలోక రంజనముగాఁ బ్రవర్తింతు రదుగాని యొరులను నొప్పించరు, మఱి తాము నొవ్వరు. లౌకిక స్వరమునకు వైదిక స్వరము కారణమైనప్పటికి దేవుఁడు జగత్తునకుఁ గారణమైనప్పటి కెట్లతీంద్రియ గ్రాహ్యుఁడో యట్లే యతీంద్రియము ముకౌక్యవిదితమేగాని లోకవేద్యముగాఁ బోదు. మఱి మానవులచేఁ బ్రయోగింపఁబడ సాధ్యము కాదు. జనరంజకము కాని వేదస్వరము నకై మనుష్యులు తంటాలు పడుట సూర్య బింబముం జొరఁ బ్రయత్నించుటవలె మిక్కిలి వ్యర్థము. కావునఁ దత్తద్దేశకాల పాత్రోచితములుగా నామరూప విశేషములఁ జతుర్విధాభినయములం బ్రయోగించి లోకరంజన మొనరించి యొరుల సంతోషపఱ్చి వివేకవంతు లొరుల మన్ననకుఁ బాత్రులగుచున్నారు.

"తస్మాద్విద్వాన్ ప్రేవవదేత్-పీవస్మ్రత్యేత్-దాన కామా అస్మై ప్రజాభవతి" అను విధమున విద్వాంసుఁడు జనరంజకముగాఁ జతుర్విధాభినయ ప్రయోగముచేత లోకులచేత గారవింపఁ బడు

చున్నాఁడని శ్రుతినుడువు చున్నది..."ద్యుత ద్యామానం బృహతీ

మృతేనబుతా వరీ మరుణప్సుం విభాతీమ్, దేవీముమనం స్వారా

వహంతీం ప్రతివిప్రా సోమతి భిర్జరంతే" ఇందక్షరములమీఁద (।) గీత లుదాత్తమును క్రింది (-) గీత లనుదాత్తమును దెల్పు

చున్నవి. సత్యయజ్ఞముచేతఁ బ్రకాశించు పెద్ద రథము నడుపుచు నెట్టిని వన్నెతోఁ నలరుచు సూర్యునలయుచున్న మహానుభావ యగు నుషాదేవిని బుద్ధిమంతులు కొనియాడుచున్నారని పై బుక్కునకర్థము. ఒకస్వరము నెద్దియైన నాధారపు గ్రామముగా నేర్పర్చుకొని యా స్వరమునే మధ్యస్థాయిగాఁ గావించుకొని యా స్థాయికంటె హెచ్చుగా ఋషభ గాంధార మధ్యమ పంచమధైవత నిషాద స్వర సమ్మేళనముగా నుచ్చరించుటలో కేవలము హెచ్చుస్థాయి మాత్రమే తెల్పుట యుదాత్తస్వర మగును. మఱియు హెచ్చు తగ్గు స్వరములు స్థాయి నెల్పునపుడు స్వరితస్వరము, నగును. వీర శాంత కరుణ రస ములు సత్త్వగుణప్రధానములు గనుకఁ దద్రసానుకూలముగా నుదాత్తా నుదాత్తస్వరిత స్వరములం దెల్పుచు స్వార్థము తలంపక కేవల లోకోపకారులగు నుత్తముల చిత్తము రంజిల్లు విధమునఁ గోమల మృదుమధురములగు నామరూపములం బ్రకటించుచుఁ జతుర్విధాభి నయము కావింపవలయును. తమ సౌఖ్యముఁ గోరి పరులయెడ మంచిగా నడుచు రజోగుణప్రధానుల రంజించు విధమున శృంగార హాస్యాద్భుతరసము లగపర్చుచుం దీవ్రకోమలస్వరము లుపయోగిం చుచుం ద్రివిధస్వరముల నభినయించవలయును. తమోగుణప్రధానులు రంజిల్లువిధముగా రౌద్రబీభత్స భయానకరసము లుప్పతిల్లువిధమునఁ గేవల తీవ్రశ్రుతుల నభినయించవలసినది. ఉదాత్తానుదాత్తస్వరిత స్వరోచ్చారణమునం బఠించు శబ్దార్థ రసానుకూలముగా నాంగికా హార్యసాత్త్వికాభినయము లొనర్చుచు "తస్మాద్విద్వాన్ ప్రేవవదేత్ వీవప్రత్యేత్" అను శ్రుతిప్రకారము నామరూపాత్మక మగు జగము నందుఁ దన తోడిపాటి జంతువుల కుపకారమగు విధమున నుత్తమ మనుష్యులు ప్రకటించు మనోవాక్కాయకర్మములన్నియును మఱి యట్టి సజ్జనులు తమ బ్రతుకునఁ జేయు పనులన్నియును శాస్త్రీయ

మగు చతుర్విధాభినయాత్మక యజ్ఞస్వరూపమై సకలపురుషార్థ సాధకము తప్పకగును.

“స్వరస్యకంపోగమకః” అను తీరున సామవేదపారమున స్వరము గమకము తప్పక విలంబలయతో నుండును. ఋగ్యజుర్వేదములందు గమక ప్రాధాన్యములేని ద్రుతమధ్యలయలచే స్వరము లుచ్చరించఁబడును. కేవలము దైవప్రార్థనమందు మాత్రమే ఋగ్యజుర్మంత్రము లుపయోగింపఁబడునపుడు గమకస్వరములు విలంబలయతో నాంగికాహార్య సాత్త్వికాభినయముల సాహాయ్యమున నుచ్చరింపఁబడి సామగాన మనంబడును. సామగానముయొక్క ముఖ్యప్రయోజనము దైవానుగ్రహసంపాదనమును మఱియును సకలజనరంజనమును గాబట్టి “తస్మాద్విద్వాన్ ప్రేవవదేత్ పీవనృత్యేత్ దానకామా అస్మైప్రజాభవంతి” అను శ్రుతిచేత సకలజన రంజకముగా మనోవాక్కాయకర్మములం బ్రకటించువాఁడే విద్వాంసుఁ డనియును మఱి యట్టి విద్వాంసునకు సకలజను లన్నవస్త్రములిచ్చి పరిచర్య సేయుదురనియును దాత్పర్యమగుచున్నది. కాఁబట్టి యష్టాదశవిద్యారహస్యము సర్వజనసముఁడై సర్వభూత దయాపరుఁడై సకలజన రంజకుఁడై మనుష్యుఁ డిహపరములం దరించుననియే. “స్వతోరంజయతి శ్రోతృ చిత్తం నస్వరఉచ్యతే” సకలజన రంజకమగు ప్రవర్తనమే సకల శ్రుతిస్మృతి శాస్త్రసమ్మతమని సకలముని ముఖ్యమతము. “నాద బ్రహ్మ ముపాస్మహే అతోనాదాత్మకం జగత్” అనుటచేత శబ్ద బ్రహ్మముకన్న మఱియొక వేఱుపదార్థమే లేదనియు నిజ్జగమంతయుం జతుర్విధాభినయాత్మక శివస్వరూపమే యనియును భరతాది మహా మునుల మతమే మిక్కిలి సయుక్తికమును సప్రమాణమని పెద్దలందఱైకకంఠ్యముగా నుడువుచున్నారు. “వీణావాదన తత్త్వజ్ఞ శ్రుతిజాతి విశారదస్తాళజ్ఞశ్చ ప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి” అను

సకలబ్రహ్మవిచ్ఛిరోమణియగు యాజ్ఞవల్క్యుని స్మృతి యుద్ఘోషించు చున్నది. అనఁగా యాజ్ఞవల్క్యమహాముని ముఖ్యాభిప్రాయము సకల జనచిత్తరంజకప్రవర్తనము గల మనుష్యుఁడు మాత్రమే యిహపరములం బరించఁగల్గునని- కాఁబట్టి లోకరంజకుఁడు కాని స్వార్థపరుఁ డార్యుఁ డెంతమాత్రము న్గాఁడు మఱి యట్టి యొంటిగొట్టురాకాసి కేవల స్వార్థపరుఁడై పఠించు వేదముగాని సల్పు యజ్ఞముగాని బూడిదనోసిన పన్నీరువలె వ్యర్థమును మఱి శ్రుతిస్మృతి విరుద్ధమని చాటి చెప్పవలయును. సర్వజనరంజకుఁడైనవాఁడే నిక్కమగు శ్రోత్రియుఁడు, విద్వాంసుఁడు, బ్రాహ్మణుఁడు మఱి యార్యుఁ డనఁ దగువాఁడు తన తోడిపాటివారితో విరోధపడువాఁడు మిక్కిలి పనికి మాలియెద్దియో క్రూరజంతువగును గాని మనుష్యుఁ డెంతమాత్రము న్గానేకాఁడు. "షడ్జః ప్రీణాతివై దేవాన్ ఋషీన్ప్రీణాతి చర్షభః పితౄన్ ప్రీణాతి గాంధారో గంధర్వాన్ మధ్యమః స్వరః దేవాన్ పితౄన్ ఋషీంశ్చైవస్వరః ప్రీణాతిపంచమః యక్షాన్నిషాదః ప్రీణాతి భూతగ్రామంచధైవతమ్" అనుటచేత షడ్జాదిసప్తస్వరజ్ఞానము లయ జ్ఞానమును మఱి చతుర్విధాభినయ జ్ఞానమును గలిగి సర్వజనసమ్మతముగా బ్రతుకువాఁడే మనుష్యుఁడు. వేయేల, శ్రుతిలయజ్ఞానములు లేనివాఁడు మాతాపితృద్రోహియును లోకద్రోహి యగునొక క్రూరజంతువగును గాని నిక్కముగా మనుష్యుఁడు కానేకాఁడు. "శ్రుతిర్మాతా లయః పితా" అనుచందమున శ్రుతిలయజ్ఞానము గల పితృభక్తుఁడు నిక్కముగా లోకారాధన తత్పరుఁడే బుద్ధుఁడో యే శ్రీరామచంద్రుఁడో మఱే శంకరాచార్యుఁడో మఱే మహాత్ముఁడో గాని లోకములోఁ దక్కిన మనుష్యులందఱు న్గేవల స్వార్థపరులు వంచకులు పితృద్రోహులై యుండమగు భగవత్సృష్టికి దిష్టిబొమ్మల వలెం బుట్టుచుం గిట్టుచున్నారు.

ఋగ్వేదము కేవల వాచికాభినయప్రధానము. యజుర్వేద మాంగికాభినయప్రధానము.సామవేద మాహార్యాభినయప్రధానము. తతానద్ధఘనసుషిర వాద్యాలంకృతము మఱి యథర్వవేదము, నవ రసాత్మసాత్త్వికాభినయప్రధాన మాటచేతను కేవలము దైవానుగ్రహమును సంపాదించి స్వర్గాపవర్గాములను సంపాదించుకొనుటకై మాత్రమే వేదవేదాంగాభినయ విధాన మేర్పడినది. "స్వరావై సార్వవైదికాః" అనుటచేత శాస్త్రీయమగు మనోవాక్కాయ కర్మ స్వరూపములగు చతుర్విధాభినయ విశేషములు కేవలము పరమార్థ సంపాదకములువైదికములు సాధనచతుష్టయసంపన్నులగుముముక్షోపయోగముల గాని సంసారుల కెంతమాత్రముం బనికిరావు - సంసారులకు దేశకాల పాత్రోచితముగా జిత్తరంజకము లగుటకన్న మనోవాక్కాయకర్మాత్మకమును జతుర్విధాభినయాత్మకమగు సర్వజనప్రియవర్తనము వేదశాస్త్రవిరుద్ధమై వైదికధర్మప్రతికూలమైనప్పటికిని సకల వేదశాస్త్రసమ్మతమే యనియు "అనంతా వై వేదాః" అనుటచేత శాస్త్రీయమే యనియు సకలజనగ్రాహ్యమని మానికృతసిద్ధాంతము. పాలజాడలో చుక్కలొండొంటి కెంత దవ్వో మఱి యవి యెన్నో లెక్కించుచుంటకన్నఁ దనతోడిపాటివారి కష్టములం దీర్చు ప్రయత్నము లోకోపకారకము, ప్రస్తుతజీవనోపయోగమని యెల్లరికి స్వానుభవమేకదా! కాఁబట్టి దేశకాలపాత్రోచితము లగు కర్మములను మాత్రమే బుద్ధిమంతులు లోకోపకారపరాయణులు చేయుచుందురు.

"ఉదాత్తే నిషాదగాంధారా వనుదాత్తే ఋషభధైవతౌ, స్వరితప్రభవాహ్యేతే షడ్జమధ్యమపంచమాః, ఏతే విశేషతః ప్రోక్తాః స్వరావైసార్వవైదికాః, ఇత్యేతచ్చరితం సర్వం స్వరాణాం సార్వవైదికం" అనుటచేత నుదాత్తానుదాత్తస్వరిత సంజ్ఞలం బరఁగు

షడ్జాది సప్తస్వరాత్మక స్వరమండలి ఋగ్యజుస్సామవేద పఠనము నందు మాత్రమే విధింపఁబడెను. మఱియు శిక్షావ్యాకరణచ్ఛందో జ్యోతిష నిరుక్త కల్పములను వేదాంగము లాఱును సేవలను స్వర్గ సాధకములగు త్రయీవిద్యకే విధింపఁబడెను. "భద్రం కర్ణేభి శ్శృణుయామ" అను శ్రుతియందు "కర్ణైః" అని భాషయం దుండఁగా "కర్ణేభిః" అని వేదమం దున్నది. కాఁబట్టి కేవల పారలౌకికార్థ మాత్ర ప్రయోజనములగు వేదములతోఁ గాని వేదాంగములతోఁ గాని లౌకిక భాషకుఁగాని దీక్షితులుకాని మనుష్యుల ప్రవర్తనమునకుఁ గాని సంబంధమేమియును లేదు. యజ్ఞదీక్ష వహించిన మనుష్యులు యజ్ఞదీక్షితులతోనే సహవాసము చేయుచు వేదవేదాంగవేత్తలై కేవల మోక్షసాధకులగు వైదికు లనిపించుకొనుచు సంసారులగు లౌకికుల నంటక లౌకిక నివాసములకు వేఱగు నరణ్యముల సంచరించె దరు. కాఁబట్టి వేదవేదాంగవేత్తల మనియును యజ్ఞదీక్షితులమని యును ద్విజులమనియును జెప్పుకొనుచుఁ బత్తనములం బల్లెల నివసించి దంభవేషముల సంచరించు మనుష్యులందఱును మోసకాండ్రగు లౌకికులే గాని వైదికు లెంతమాత్రము న్గారు; కామ క్రోధ లోభ మోహ మద మత్సరగ్రస్తులయి యైహిక భోగములం దన్వి చెంద కీషణత్రయపాశబద్ధమగు మనుష్యలోకమునకు న్వేదవేదాంగ ధర్మము నకు, వైరాగ్యమునకు న్సంసారమునకువలె సంబంధము లేనే లేదు. కాఁబట్టి మనుష్యుఁడు తన తోడిపాటివారిని సంతోషపర్చు తీరున మనోవాక్కాయ కర్మములం బ్రవర్తించుట తప్ప వేదశాస్త్రపద్ధతు లేవియు నవలంబించి సంసారము చేయఁగూడదు. సన్న్యాసి పెండ్లాముతోఁ గాఁపురము చేయ శక్యమగునా? వైరాగ్యమునకు సంసారమువలె వేదవేదాంగపద్ధతి కిహలోకము కిట్టదు. యజ్ఞదీక్షవహించి యరణ్య మున నున్న సాధనచతుష్టయ సంపన్నగల మనుష్యులకు మాత్రమే

"నమ్లేచ్ఛితవై నాపభాషితవై, యజ్ఞేకర్మణి నానృతం వదేత్"
అనుటచేత సంసారులకు వేదవేదాంగ నియమములతోఁ బనిలేదు.
సంసారము చేయుచున్న మనుష్యుల కవసరమైనది ముఖ్యముగాఁ
దమ తోడివారికి సంతోషకరమగు తీరున మనోవాక్కాయ కర్మ
ములం బ్రవర్తించుటకన్న వేదశాస్త్రసమ్మతమైన విధి మఱెద్దియును
లేనేలేదు.

"గాయనస్యతు దశవిధాగుణ వృత్తిస్త ద్యథారక్తం పూర్ణ
మలంకృతం ప్రసన్నం వ్యక్తం వికృష్టం శ్లక్ష్ణం సమం సుకుమారం
మధురమితి గుణాః" పాటపాడెడివానికి పదిగుణములు తప్పకుండ
వలయును. తన కంఠధ్వనిం దత ఘనసుషిరానద్ధవాద్య విశేషముల
ననుసరించి యుండుట రక్తగుణము. ఈరక్తి వైదికగానమునకును
లౌకికగానమునకును ముఖ్యముగా నుండకతీరదు. శాస్త్రీయనియమ
ములు మఱేవియు ననుసరించి లౌకికగానమున కంత ముఖ్యము కా
నప్పటికీ "శ్రుతిలేని పాట సమ్మతిలేని మాట" రక్తిహీనమై జనరంజ
కము గాని పల్కు వైదికులకుఁ గాని లౌకికులకు గాని బొత్తుగాఁ
దగదుతగదు. కాబట్టి "గీతంవాద్యంచ నృత్యంచ లయశ్చ చతుష్కం
సంగీతముచ్యతే" అను గాంధర్వవేదానుసారముగా "సమ్యగ్గీతం
సంగీతమ్ సభారంజకం సంగీతమ్" అనుటం బట్టి జనుల చిత్తరంజన
మగు తీరున గీతవాద్యనృత్యలయాత్మకముగా నాటపాటమాటలందత్త
ద్దేశకాలపాత్రోచితముగా లౌకికులు చతుర్విధాభినయము లొనర్చ
వలసినది. గోడ నాధారము చేసికొన్నఁగాని యందుపైఁ జిత్రములు
లిఖింపఁబడనేరవు. వీణాది వాద్యముల శ్రుతిలయల నాధారము చేసి
కొన్నఁ గాని జనరంజకముగా నాట పాట మాట లుపయోగింప
నెవ్వరికిం దరముకాదు. మనుష్యు లందఱికిం బరస్పరప్రేమానురక్తు
లచే వ్యవహరించుచు హాయిగాఁ దమ బ్రతుకుఁ గొనసాగించుకొంట

కన్న నవస్వరకర్తవ్యమింకెద్దియు లేదు. వర్ష్యకొన్న వీణాది వాద్య శ్రుతికంటెఁ దక్కువ గాని యెక్కువగాఁగాని భిన్నశ్రుతిగాఁ బల్కక కేవలము శ్రుతిలోఁ దన కంఠస్వరమును లీనము కావించుకొని స్పష్టముగా నక్షరము లుచ్చరించు గుణము పూర్ణము. మంద్ర మధ్య తారస్థాయి స్వరము లొండొండు స్థాయి భేదములతోఁ గ్రొత్త రుచి శ్రోతల కొదవించుట యాలంకృత మగు గుణము. పర్ప్లెల చిత్తముతోఁ బాడుట ప్రసన్న గుణము. పదపదార్థములు సువ్యక్తముగా శ్రోతలకు మిక్కిలి స్పష్టముగాఁ దెలియునట్లు పలుకుటయే వ్యక్త గుణము. దూరశ్రావ్యముగాఁ బల్కుట విక్రుష్టగుణము. దేశకాల పాత్రోచితముగా జనరంజకమగు విధమునఁ బ్రకృత మర్యాద ననుసరించుటయే సమగుణము. దౌడతానము రానీక క్రింది మీఁది దంతముల పరస్పర ఘట్టనము కలుగనీక స్ఫుటముగా గొంతు విప్పి పాడుటయే సుకుమార గుణము. సహజముగా నున్న మృదుమధురాక్షరముల స్థతిసముగాఁ బల్కుకుంట మధుర గుణము. ఈ దశవిధ గుణములతోఁ గంఠధ్వని నుపయోగించుట వైదికులకును మఱియు లౌకికులకు నుభయులకును దప్పని విధియే కారణ మేమన గుణహీన మగు నభినయము లోకరంజనము కాదు, మఱి లోకరంజనము కాని పలుకు పల్కుట మిక్కిలి వ్యర్థమగుటయే గాక లోక విద్వేషకర మగును. దేవతలను రంజింపఁజేయుటకు యథాశాస్త్రీయముగా వైదిక గానమును తనతోడిపాటి జనులు రంజిల్లు విధమున యథేష్టముగా శ్రుతిలయలు మాత్రము తప్పకరక్తి ప్రధానముగా లౌకికగానమును ప్రకటింపవలయును. సంసారుల కందఱికి స్థమలోఁ దాము పరస్పర ప్రేమానురాగములు సంపాదించుకొనఁ గలిగిన తెన్నున దేశకాల పాత్రానుసారముగా నిద్రాహారవిహార సౌఖ్యము పొందుటకన్న లోక విస్పష్టములైన ప్రస్తుత వేదశాస్త్రిపద్ధతు లవలంబించఁగూడదు.

హృదయరంజనకారణ పదార్థము రస మనఁబడును, "రసోవైసః" అను శ్రుతి ప్రకారము "ఆత్మా సరత్యస్తి" అను రీతిని దేవుఁడే రస స్వరూపుఁడై "అంతః పూర్ణం బహిః పూర్ణం మధ్యే పూర్ణమ్" అను తీరున "ఆనందా ద్ద్యేవమాని భూతానిజాయన్తే తేన జాతానిజీవన్తి ఆనందమేవాభి విశన్తి" అను చొప్పున ఆనందరసస్వరూపుఁడగు వాసుదేవపరమాత్ముని కన్న నిత్య సత్య పదార్థము వేఱేదియు న్లేనే లేదు.

విశ్వరూపుఁడగు భగవంతుని శరీరమందు బ్రాహ్మణులు ముఖము, క్షత్రియులు బాహువులు, వైశ్యులూరువులు, శూద్రులు పాదములు, మ్లేచ్ఛులుపాయువు, ఇట్లు పంచజనమయమగు విశ్వరూపముతో రసస్వరూపుఁడై పరమాత్ముఁడు నిజలీలచే సత్త్వరజస్తమోగుణములం దాల్చి తనకుఁదా విశ్వాకారుఁడై "లేలాయతీవ ధ్యాయతీవ" అను నట్లు సృష్టిస్థితిలయముల క్రీడించుచున్నాఁడు ఈ సృష్టిస్థితిలయములు సంకల్ప మూలములయి యాకసమునం దేర్పర్చుకొన్న హద్దుకొలతలవలె సంకల్ప జన్యములు గాని వాస్తవములు కావు కావు. "మాయామాత్ర మిదం విశ్వమద్వైతం పరమార్థతః యచ్చకించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అను తీరున నాత్మకంటె నితరమైన పదార్థములన్నియును స్వప్నజగమువలె మృషలే గాని సత్యములు కానేకావు. ఆత్మయందు రజ్జువునందు సర్పమువలె నీ విశ్వమంతయు నధ్యస్తమై మఱి యారోపితమునై యెండమావులందు నీటివలె విభ్రాంతిజన్యమై యున్నది గాని సత్యము కాదు. సత్యము కాని పదార్థము ను సత్యముగా జీవాత్మునకుఁ దోఁపించునది నిత్యసత్యమగు పరమాత్ముని సహజలీలామయ త్రిగుణాత్మక ప్రకృతి. తేజస్తిమిరములవలె నన్యోన్య మంటకుండియును నిత్య సమ్బద్ధములై తేజము

వంటి యాత్మయును చీకటి నీడవంటి యాత్మని త్రిగుణమయ సహజ లీలయును నల్లకలువయందలి కలువయును నల్పురంగువలె మంటి కుండయందలి మన్నును ఘటాకాశము వలె సర్పకుండలమందు పాము చుట్టయును వస్తు వొక్కటియయ్యును భిన్నరూపములం దోఁచు విధమున భగవంతునకును భగవంతుని త్రిగుణాత్మక సహజలీలా మయ మగు జగమునకు న్భేద మెద్దియును లేకున్నను మఱియు భగవంతు నకును భగవల్లీలామయ విశ్వమునకుం దేజస్తిమిరముల మాడ్కి సత్యా సంబంధ ముండుటయు లేకుంటయును రెండును నిత్యములే. అనఁగా నసంగుఁ డగు నాత్ముఁడు నిత్యుఁడే మఱి యాత్మునకు సహజలీల యగు త్రిగుణాత్మక ప్రకృతియు నిత్యమే "ఇచ్ఛామాత్రం ప్రభోః సృష్టిః" యనుటచేత సత్త్వరజస్తమోగుణములచేఁ దనకుఁ దా వేఱుగా భావించుకొని స్వప్నజాగర సుషుప్త్యవస్థలం బద్ధుఁ డగుచుంట దురీ యుఁడై స్వప్నజాగర సుషుప్త్యవస్థలనంటియు నంటక విముక్తుఁ డగు చుంటయు నాత్మునకు సహజలీల యను వేదవ్యాస మతము స్వప్ర మాణము న్మిక్కిలి శ్రేష్ఠమగు మతము సకల వేదాంత సమన్వయ ఫలిత సిద్ధాంతము. ప్రతిక్షణకాలమునందుం బ్రతిలగ్నమందు న్నవ గ్రహము లున్నప్పటికిఁ బ్రతివస్తువునందుం బంచభూతము లున్నప్ప టికిఁ బ్రతిపదార్థము న్నవరసమయమైనప్పటికిం బ్రతిశబ్దాది సంజ్ఞ యం దెద్దియో యర్థమున్నప్పటికిం బ్రతివస్తువునం దాత్మయున్నప్ప టికిఁ బరమాత్ముని సంకల్పముచేతఁ బంచభూతాత్మలుం బంచభూతా త్మల సంకల్పప్రవృత్తిచేత జీవాత్మలుం ద్రిగుణబద్ధు లగుచు గ్రహ గతుల ననుసరించి మర్త్యలోక క్రియలును దైవసంకల్పము ననుసరించి గ్రహములుం బ్రవర్తిల్లుచున్నవి. బంధముక్తులు రెండును బరమా త్ముని సహజలీలాకృతములే, జీవాత్మునకు ద్వైతసృష్టి స్వరూ పములగు స్వప్నజాగరములు రెండును బంధావస్థలు, సుషుప్తిముక్తా

వస్థ, "నచ బంధో నవాముక్తి రిత్యేషా పరమార్థతా" అను నాత్మజ్ఞాన బంధమోక్షములు రెండు నుపేక్షించిన తురీయావస్థ మఱి స్వప్నజాగర సుషుప్తులం బఱరగు గుణమయలీలయును తురీయావస్థ నలరు నిర్గుణలీలయు నాత్మునకు సహజలీలలే. సేవగళ్ళవలె జీవాత్మకు బంధమోక్షములు జననమరణములు నిద్రాజాగరములు సుఖదుఃఖములు నొకదానివెంట నొకటి సర్వకాలము న్గలుగక తీరదు. సేవకుఁడు జీవుఁడు సేవ్యుఁ డీశ్వరుఁడు. జీవాత్మ బంధమోక్షములను కష్టసుఖములను దుదమొదళ్ళులేని యెల్లకాల మొకదాని వెంబడి నొకటి యనుభవించక తీరదు. పరమాత్ముఁడు తురీయుఁడై నిర్గుణుఁడై స్వప్నజాగ్రత్సుషుప్తుల సాక్షియై పద్మపత్రాంబువువలె సంసార మంటీయంటక యాశ్రితవాత్సల్యము స్వసంకల్పజనితలోకదుఃఖ నివారణ శక్తియుం గల్గి సంసార ఖిన్నులై విరాగులై యిహభోగములు తుచ్ఛములని యెంచి స్వార్థపరతమాని సర్వలోకోపకారపరాయణులైన పరమభాగవతుల న్దనలోఁ జేర్చుకొని కైవల్యానంద మొదవించును.

"పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" అనుటచేత మూఁడుపాదముల తనశక్తిని నిర్గుణనిత్యామృతపదవి నలరుచుఁ దనలోని యొకయంశము నీ సకల ప్రపంచము గావించి యందుఁ ద్రిగుణములం దాల్చి తనకుఁ దా సృష్టిస్థితిలయము లొనర్చుకొనుచు జీవాత్ముఁడై సంచరించుచుఁ గ్రమక్రమముగాఁదన నిత్యామృత త్రిపాదశక్తిరూపము స్సేవించి యవల తురీయుఁడై కల్పాంతమున శేషించుచున్నాఁడు. విశ్వతైజసప్రాజ్ఞాత్మరూపములం ద్రిగుణమయుఁడై సేవకుఁడై బంధమోక్షములం గల్పాంతముదనుక నాటాడుకొనుచు నిర్గుణతురీయాత్మస్వరూపుఁడై నిత్యత్రిపాదామృత తత్త్వమను శేషశయ్యనోగనిద్ర నైవల్యానందమున నోలలాడుచుండును.

ఇవఁగా నాత్మలో మూఁడుపాళ్ళునిత్యనిర్గుణామృతపరమాత్మతత్త్వము

మఱొకపాలు లీలాగుణమయజీవాత్మతత్త్వము. సర్వశక్తి పరమాత్మ-యల్పశక్తిజీవాత్మ-దేవుఁడు తనకుఁదా జీవాత్మయై లీలచేఁ ద్రిగుణమయుఁడై సంచరించుచు సేవకుఁడై నిర్గుణామృతపరమాత్మస్వరూపమున సేవ్యుఁడై "అహమన్న మహమన్న మహమన్న మహమన్నాదో౽న్నాదో౽న్నాదః" అను శ్రుతి చెప్పిన నిజలీలచేత సగుణుఁడై సంసరించుచు నిర్గుణుడైఁ ముక్తుఁడగుచున్నాఁడు. పరమాత్మునియంశము జీవాత్మ. జలకణము జలరాసియందు లీనమగునట్లు జీవాత్మపరమాత్మలో లయమగుచున్నాడు. సర్వమును బరమాత్మయే యని భావించుచు స్వార్థపరతలే కహంకార మమకారములుడిగి సర్వజనసముఁడై సర్వభూతదయాపరుఁడైన జీవాత్మ పరమభాగవతుఁడై లోకోపకారపరాయణుఁడై పరమాత్ముని యనుగ్రహము నకుఁ బాత్రుఁడై పరమాత్మలోఁగలిసి నిత్యసంతుష్టామృత కైవల్యానందపదవి నోలలాడుచుండును.

"యచ్చిద్ధితే విశోయథా ప్రదేవవరుణ వ్రతమ్। మి నీ ను సీ ద్యవీద్యవి। సానీసనీ సతీసనీ సరీససస సాససా నిసాని సాని నీస రీససా।" ఈపై నుదహరించిన స్వరప్రకారము గమకయుక్తముగా నుదాత్తానుదాత్తస్వరితాక్షరముతో నాఋుగ్మంత్రమును మిశ్రజాత్యటయును దేశీతాళము వేసికొని వీణతోఁగలిపి పాడుచు "ఓవరుణదేవుఁడా లోకమం దెట్లు ప్రజలొకప్పుడుపొరపాటుపడుచుందురో యట్లు మేముగూడ నిన్ను గూర్చి చేయు వ్రతమునందు ప్రమాదముచేసెదమేని యాదోషమును నివారించి ప్రతిదిన మావ్రతకర్మము నుద్ధ" ముట్టించుమని ఈ ప్రార్థనమును శాంతకరుణరస ముప్పతిలునట్లు వాచికాంగికాహార్య సాత్త్వికాభినయము లొనర్చుట విద్వన్నృత్యము. "తస్మాద్విద్వాన్నోప నృత్యేత్" లోకోపకార వ్రతమును గొనసాగించి నడునడుమవచ్చు ప్రమాదములం దప్పించి సకల జనరంజకముగాఁ దను నడిపించవలె

పరమభాగవతుఁడైన విద్వాంసుఁ డిట్లు గీతవాద్య నృత్యములచే శ్రీహరిం భజించి యొరులం దరింపఁజేసి తాఁదరించును.

సత్త్వగుణ మీశ్వరుఁడు తమోగుణము ప్రకృతి. రజోగుణము జీవుఁడు, పరమాత్మ తత్త్వమందు స్వతంత్ర తత్త్వము మూఁడుపాఁళ్ళమృత తత్త్వము. తక్కినపాలు, పంచభూతములున్ జీవుఁడును, నిత్యుఁడీశ్వరుఁడు సేవ్యుఁడు సర్వస్వతంత్రుఁడు సర్వశక్తియు సర్వాంతర్యామి యున్సత్య సంకల్పుఁడు నశరీరుఁడు - ఈశ్వర సంకల్పమున సృష్టిస్థితి లయములంబరఁగు జడములు పంచభూతములు పృథివ్యాపస్తేజోవాయ్వాకాశములు - పాంచభౌతికస్థూలసూక్ష్మ కారణోపాధుల ననాది యనంతవత్తగు స్వకర్మఫల మనుభవించుచు నస్వతంత్రుఁడై రజస్తమోగుణములచే "సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖమ్" అను విధమున సుఖదుఃఖాత్మక సంసార తాపత్రయమున నీశ్వరానుగ్రహము కల్గువఱకును గాఁగు నీశ్వర ప్రతిబింబ రూపుఁడైన సేవకుఁడు జీవుఁడు. ఈశ్వర ప్రకృతి జీవతత్త్వముల క్రీడించుచుంట పరమాత్మకు సహజలీల. ఇదే సర్వవేదశాస్త్ర సమన్వయము నిశ్చయింపఁబడిన పరమసిద్ధాంతము. భూతదయతోఁ దనతోడిపాటి జనులతోఁ బొందుపొసఁగి స్వార్థత్యాగియై దుష్టుల నుపేక్షించి సాధు సంరక్షణముచేయుచుండనకు సంసారతాపత్రయమును దప్పించి రక్షించుమని సర్వశరణ్యుఁడగు నీశ్వరుని సంతతము వేఁడుకొను పరమభాగవతు నీశ్వరుఁడు తనలో లయముచేసికొనును.

శబ్దము పరాపశ్యన్తీ మధ్యమావైఖరులని నాల్గువిధముల శరీరమునాప్యాపించియున్నది దాదు పరాపశ్యన్తీ మధ్యమశబ్దము లతీంద్రియములై కేవల యోగిజనైకవేద్యములయినవి. వైఖరియే ధ్వన్యాత్మకమును వర్ణాత్మకమని రెండువిధములు. కేవల ధ్వన్యాత్మకశబ్దము శ్రుతిలయల ననంతవిధములయి నవరసము లుత్పత్తిలంజేయుచు నానా

విధ జంతువులచే నాలింపఁబడుచున్నది. కంఠనాళము లిరువదిరెండుగా నిశ్చయింపఁబడుటచేత నిరువదిరెండు శ్రుతులుగా వైఖరి పరిణమించుచున్నది. "చతుశ్చతుశ్చతుశ్చైవ షడ్జమధ్యమపంచమాః। ద్వే ద్వే నిషాద గాంధారౌ త్రిస్త్రిర్ ఋషభధైవతౌ" అను మునివచనముంబట్టి యీయిరువదిరెండు శ్రుతులు సప్తస్వరాత్మకమై స్వరమండలి యగుచున్నది. కేవల ధ్వనివిశేష శ్రవణమాత్రముచేతనే హేయాదేయ వస్తుతత్త్వము గ్రహింపఁగల జీవులు ప్రాజ్ఞులు. వర్ణాత్మక శబ్దరూపమగు సంస్కృతాపభ్రంశాది భాషల వినుటచేతఁ గర్తవ్యాకర్తవ్యములు గ్రహింపఁదగిన జీవు లల్పజ్ఞానులు. భగవంతుని మనస్సులో ధ్యానింపఁగల యోగులవంటివారు కేవల స్వరమండలీ విశేషశ్రవణమాత్రముచేతనే హేయాదేయ వస్తుతత్త్వజ్ఞాన మలరు పండితమానవులు. మఱియుం బ్రతిమార్చనమూలముగా దేవునిం భజించు పామర మనుష్యులు కేవల వర్ణాత్మక ధ్వనిరూపములగు సంస్కృతాపభ్రంశాది భాషలమూలమునఁ గర్తవ్యాకర్తవ్యములం దెలిసికొనువారు "వాతాయ కపిలావిద్యుత్" అను శాస్త్రము మెఱుఁగినవారు మెఱపు రంగునుజూచినమాత్రముననే కాఁగలసంగతిన్నిశ్చయించిచెప్పఁగలరు. తగిలినగుండు తప్పినగుండు స్ఫుపాతుక్రోఁత విన్నమాత్రముచేతనే పండితుఁడు గ్రహించును, కనుక గీతవాద్య నృత్యలయ విశేషముల రసము గ్గనిపెట్టఁగల సంగీతవేత్త మనుష్యులంబాడితుఁడు, మఱి శ్రుతి లయజ్ఞానములేని సంగీతకుఠారము మనుష్యులలోఁ బరమపామరుఁడని సిద్ధాంతీకరింపక తీరదు. శ్రుతి లయాత్మకమగు కేవలధ్వని స్ఫుటముగా రసమును వెల్లడించి హేయాదేయవస్తుజ్ఞానము కలిగించఁగలిగినతీరున నానార్థములయి సంశయకారణములయి ప్రత్యేకజనగ్రాహ్యమాత్రము లయిన సంస్కృతాపభ్రంశాది భాషలు కేవలానిగ్రహాములు వలెఁ బామరజనులకై మాత్రమే యేర్పడిన సంజ్ఞలుగాని శ్రుతి

లయులవలెఁ ఖండితుల కేర్పడిన యేకాంత భక్తిమార్గములు కావు.

అనంత మప్రమేయమగు నాకాశమండలి పాంచభౌతికవిశ్వమంతయును మిక్కిలి సూక్ష్మమగు సూదిమొనవంటి మచ్చవంటిది. ఈశ్వరప్రకృతి జీవాత్మక పాంచభౌతిక విశ్వము సృష్టిస్థితి నాశములగుచున్నచోటు "పరమేవ్యోమన్" అను ఛందమున నిత్యనిర్గుణ సచ్చిదానందామృత పరమాత్మునియం దతని యచింత్య లీలామహిమవలనే స్వప్నజగమువలెఁ బుట్టుచుఁ గిట్టుచున్నట్లు వివేకజీవులకు బొడగట్టుచు వారల నోహింపఁజేయుచుండును. అనాద్యవిద్యా వశమున సుఖదుఃఖాత్మక సంసారబంధ మనుభవించుచు జీవులు పరమాత్ముని నిష్కారణ ప్రేమచేత సంసారబంధముక్తు లగుచుందురు. ఇచ్ఛాశక్తి క్రియాశక్తి జ్ఞానశక్తి యను మూఁడు శక్తులచే సహజముగాఁ గ్రీడించుచు "దివ్ క్రీడాయమ్" అనుటచేత దేవుఁడను సంజ్ఞనొప్పారు పరమాత్ముఁడు తనంతఁ దాబంధ మోక్షములం బిల్లకాయవలె నాటలాడుకొనుచున్నాఁడు. కాఁబట్టి పాలసముద్రమున వటపత్రశాయియగు ముకుందుఁడని భగవంతుఁడు పురాణములం బ్రతిపాదింపఁబడెను. "తదుచ్ఛిత్తిః పరమపురుషార్థః" అను సాంఖ్యసూత్రాను సారముగా నిర్గుణతత్త్వమే యాత్మకు యథార్థ స్వరూపము. మఱియు నహంకార మమకారము లుడుగుటయే జీవుఁడు నిర్వాణపదవియను పరమపురుషార్థమును సాధించుకొంట. సహజముగా నిచ్ఛాక్రియాజ్ఞానశక్తులం బరఁగు దేహస్మృతి స్వప్నజాగ్రత్సుషుప్తితురీయములను నాలుగవస్థల నాటిమాటికిం బొందుచున్న పరమాత్ముని యంచిత్య లీలయై బంధమోక్షము లెడతెగ కనుభవించుచున్నది. పరమాత్మ తత్త్వమిట్టిదని ధ్యానైకవేద్యముగాని జిజ్ఞాసితవ్య మెంతమాత్రము నాదు. "యోగశ్చిత్తవృత్తి నిరోధః" అనువిధమున నిర్వాత దీపశిఖ వలె నిశ్చలమగు మనఃస్థితిధ్యాన మనఁబడును. మఱి యట్టి ధ్యాన

సమాధివంతులు సంసారబంధవిముక్తులు జితేంద్రియు లతీంద్రియ ద్రష్టలగు వ్యాసాదిమహర్షులు మాత్రమే కలరని యాప్తవాక్యప్రమాణముచేత మాత్రమే యాస్తికులు నమ్ముచున్నారు.

పృథివ్యప్తేజో వాయువులు లేక వెలితిగనున్న యాకాశ ప్రదేశమును పూర్తిగావించుటకై యీ నాల్గు భూతములు సహజముగాఁ బ్రవర్తించుచుండును. సూర్యునిచేతఁ బృథివ్యప్తేజోవాయు పరమాణువు లాకర్షింపఁబడఁగా వెలితిపడి మిగిలిన యాకాశ ప్రదేశము పల్లమునీటి నాకర్షించుకొనునట్లు నాల్గుభూతముల నత్యంత వేగమున నాకర్షించుకొనుటచేత నా నాల్గుభూతములుం దొల్త మేఘాకారములయి క్రమక్రమముగాఁ బృథివ్యప్తేజో వాయు రూపంబుల న్విజృంభించి యదివఱకొక్కటన్ ఘనీభవించిన తమ తత్త్వము నిండుకొనియున్న భూగోళముచే నాకర్షింపఁబడుచు మఱల మఱల నాకాశప్రదేశముల న్గలయు చెడయుచుండును. పృథివ్యప్తేజో వాయువులు దనలో నొక్కొక్క సూక్ష్మప్రదేశమునం బ్రతిక్షణము నిండుకొని వెలితి యగుచుండుట యాకాశతత్త్వమునకు దైవనిర్మిత సహజపద్ధతి. "ఆత్మన ఆకాశః సంభూతః" అనుటచేతం బ్రజ్ఞాన స్వరూపమగు వాసుదేవపరమాత్ముని లీలచేతం పృథివ్యప్తేజోవాయువులవలె నాకాశముగూడ నుపచయాపచయాంతరాళావస్థలం బ్రాపించుచున్నది. తాఁజేయుపని తప్పొప్పులం దాఁ గనిపెట్టుచు "సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ" అనునట్లు సాక్షియై నిర్గుణుఁడై తురీయావస్థలోఁ బరమాత్ముఁడు నిత్యానందపదవి నుండియు నటుని వలె నవరసావిష్టుఁడగుచుఁ దనకుఁ దా వేత్తై క్రీడించుచున్నాఁడను నద్వైతసిద్ధాంత మొక్కటియే వాస్తవము స్మృతి యుక్తిసాధ్యమునై సంసారదుఃఖ విమోచనోపాయమును ప్రబుద్ధశాంకరమతముమాత్రమే పండితాదరణీయ మాదరణీయము. "సంసారోయమతీవ విచిత్రః"

అను శంకరాచార్యోక్తి ననుసరించి యీ సంసారము నింద్రజాలము వలె నెండమావుల నీటిచందమున భ్రాంతిజన్యము మిథ్య యని నిశ్చయించి యథార్థజ్ఞానులగు పరమభాగవతులు స్వార్థపరతమాని సర్వజనసములయి సర్వభూతదయాపరులై సర్వలోకోపకారపరాయణులై సంతతవాసుదేవధ్యానపరవశులై తాము సంసారము దరించి తమసహవాసముచే నొరులం దరింపఁజేయుచున్నారు. కనుక నట్టి పరమభాగవతులే ప్రత్యక్ష భూదేవతలనిన మ్మి "తస్మాద్విద్వాన్ పీవ నృత్యేత్" అను నట్లహంకార మమకారము లెడసి భగవద్భక్తి పరవశులై సకల లోకోపకారమునకై మాత్రమే తమ జీవితకాల మంతయును వినియోగపర్చు నప్పరమభాగవతు లన్సేవించి సంసారముం దరించవలయును.

"అణోరణీయాన్ మహతో మహీయాన్-ఆత్మా వేదగ్ం సర్వమ్" అని నేను నాది యను స్మృతి బంధము లేక కేవల లోకోపకారమునకై మాత్రమే బ్రతుకుచున్న దేహధారికన్నఁ బ్రత్యక్ష దైవ మింకెవ్వఁడు న్లేడు "ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు ర్మవ్యయమ్" అనుట అతీంద్రియామృత త్రిపాత్తత్త్వము - వేద వృక్షము - ఇంద్రియ దృష్టమై నశ్వరమగు విశ్వమంతయు నా వేద వృక్షము యొక్క శాఖ-మొత్తముపై ద్రష్టృదృశ్య తత్త్వములు రెండు నొక్క యాత్మపదార్థమే దృగ్వికారము దృశ్యప్రపంచమంతయును "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అను శ్రుతుల ననుసరించి యొక్క వాసుదేవ పరమాత్మ తత్త్వమే బంధమోక్షస్వరూపముల న్క్రీడించుచున్న దిదే మొత్తముపైఁ దేలిన సకల వేదాంతసార మిట్లెఱింగిన మనుష్యుఁడే పరమభాగవతుఁడై సర్వలోకోపకారక ప్రవర్తనమునఁ దరించి తన్నాశ్రయించిన సంసారుల న్దరింపఁ జేయును.

సున్నము-పసుపు-సున్నము-పసుపు కలుపఁదగిన ప్రదేశము-కలుపు కర్త-అట్లు కలుపఁగల సాధనము - సున్నము పసుపు గలుపఁగా వచ్చిన యెఱ్ఱవన్నెగల పారాణ - ఆపారాణ నునిపెట్టఁ దగిన సాధన దృష్టి-ఆదృష్టిగల దృక్కు - ఇన్నిటి కాధారము ప్రకృతి పురుషుఁడు-ఆయుభయుల గలుపు నాకాశప్రదేశము - కలుపు దైవము-కలుపు సాధనకాలము - ప్రకృతిపురుష సమావేశముచేఁ బుట్టిన జగము - ఆ జగము నునిపెట్టు జీవాత్మ కనిపెట్టు సాధనముగు నేత్రము. అందఱికి మూలకారణము బ్రహ్మము. సూర్యుఁడు, చంద్రుఁడు, కుజుఁడు, బుధుఁడు, గురుఁడు, శుక్రుఁడు, శని, రాహువు కేతువు- ఈ తొమ్మిదిగ్రహములు తొమ్మిది భిన్నపదార్థములు. ఇట్లు పృథివ్యప్తేజోవాయ్వాకాశ దిక్కాలాత్మ మనస్సులను నవద్రవ్యములు నవగ్రహములు- ఇందు స్వభావము, బ్రహ్మము, కేతుగ్రహము, మనస్సు నీ నాల్గునుమాత్రము పర్యాయపదము లొక్కయర్థమునే తెల్పుచు నిత్యములయి యపరిమితము లయియున్నవి. తక్కిన యెనిమిది పదార్థములణువులై యనిత్యములయి నానావిధముల నుద్భవ స్థితినాశము లందుచున్నవి. స్వభావ బ్రహ్మకేతు గ్రహాపర నామములం బరఁగు మనస్సే సవిషయ ప్రవృత్తిచేతం బై బేర్కొనఁబడిన యెనిమిది పదార్థములం భావించి సంసారబద్ధ మగుచున్నది. మఱి యీ మనస్సు నిర్విషయవృత్తిచేఁ గేవలమై శాంతించి తనకు వేఱు గనుక సంసారబంధ విముక్తమగుచున్నది.

ఇంతకు నాప్తవాక్య ప్రమాణము న్విశ్వసించి సంతుష్టుఁడయిన మనుష్యునకుఁ దప్ప తత్త్వ జిజ్ఞాసపరునకు సంసార దుఃఖ విముక్తి లేనేలేదు. భక్తిచేత తప్ప జిజ్ఞాసచేత సంతుష్టిరూపక కైవల్యానందము కలుగదు. కావున గౌతమ వ్యాసాద్యాప్తవాక్యము న్నమ్ముకొని లోకోపకార ధర్మాచరణ ప్రతిష్ఠ నొసి తన్ను

దరింపఁజేయుమని లోకబాంధవుఁడయి ప్రత్యక్షదేవుఁడైన సూర్యుని
గాయత్రీమంత్రజపముచే నారాధించుచుంట తప్ప మనుష్యుఁ డాచ
రింపఁదగిన యిహపరసాధన మింకెద్దియు న్లేదు. వెఱ్ఱికి వేవిధాలన్నట్లు
శాస్త్రచర్చ కంతములే దెన్ని మఱ్ఱులో యన్ని తుఱ్ఱలన్నట్లెన్ని
శంకలో యన్ని సమాధానములు, వాచికాంగికాహార్యసాత్త్వికాభి
నయముల న్లోకుల న్రంజింపఁజేసి లోకానుగ్రహమున మనుష్యుఁడు దా
హాయిగా బ్రతుకు కోర్కెను గొనసాగించుమని భక్తపరాధీనుఁడైన
భగవంతుని వేఁడు చిహపరములం దరించవలెను.

ఏదో వివరింపఁజాలని తెలిసీతెలియనికారణ మది యవిద్యకానీ
స్వభావము గానీ ప్రకృతి గానీ భ్రాంతి గానీ దైవసంకల్పము గానీ,
యనిర్వచనీయమాయ గానీ యేకారణ మెట్లున్నను శరీరస్మృతి
యున్నవఱకుం బ్రాపించు కష్టసుఖముల ననుభవించుచుం దన కోరిన
పదవి నందుటకై చెల్లీ చెల్లని పురుషప్రయత్నముచేత సాధ్యముకాని
సంపదకై దైవమును బ్రార్థించుచు నభీష్టసుఖము నందుటకై ప్రతి
జనుఁ డూపిరి యున్నంతవఱ కుపాయము వెదకుచుంట ప్రతిపురుష
న్యాయముగదా! తన కోరిక చెల్లినప్పుడు తన సామర్థ్యము న్స్వాహాట
ముగాఁ జాటుకొనుచుం దన యిష్టము నెఱవేఱనపు డితరులమీఁదను
మఱి దైవముమీఁదను నింద మోపుచు నెవనిముక్కు వానికిఁ దిన్నన
యన్నట్లు తనమట్టుకుఁ దా మిక్కిలి న్యాయముగా నున్నట్లు తన్నె
ంచకున్న నెవ్వఁడును బ్రతుకలేఁడుకదా! తన పొరపాటుచేతఁ
దన ప్రయత్నము సాఁగలేదనియుం దనపైఁ గిట్టనివారు తన కార్య
ముల కడ్డు తగులుచున్నారనియుం దన లోపము రవంతయైన న్లేదనియుం
దన యూహయే సరియైనదనియుం దనకుఁ దప్పఁ దక్కినవారికిఁ దన
కష్టములు మంచిచెడ్డలు మఱెవ్వరుం గనిపెట్టఁజాలరనియు "నెమ్మి
జనువారి నొల్లరు తమ్మొల్లనివారివెంట దగులుదు రధికత్వమ్మొఱఁగి

యెఱిఁగి తొడరుదు రిమ్మెఱుఁగక మూర్ఖజనములు "అన్నట్లు రజ స్తమోగుణ దూషితమయి దుర్విషయకమైన మనస్సు శస్త్రగహాధీన మయి యరిషడ్వర్గములకు లోనగుచు నరకవేదన మనుభవించు చుండును. మఱి లోకుల సుఖము తన సుఖముగాను లోకుల కష్టము తన కష్టముగాను భావించుచుఁ దన్నుఁ దా మఱచి పరోపకారమునఁ దన్మయమైన మనస్సు సత్త్వగుణ భూషితమై నిత్య సంతుష్టకైవల్యా నందమున నోలలాడుచుండును.

## అరిషడ్వర్గకథనము

సత్త్వరజస్తమోగుణ విశేషాత్మకమయిన శరీరస్మృతి రూపక మగు మనస్సుకన్న యథార్థవస్తు వింకెద్దియు న్లేనేలేదు కనుకనే "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అని మునులు సిద్ధాంతీకరించిరి. "మనో బ్రహ్మేతి వ్యజనాత్" అను శ్రుతి ప్రకా రము మనస్సుకంటె నిత్యసత్య వస్తు వింకొకటి లేదు. వాసు దేవ సంకర్షణానిరుద్ధ ప్రద్యుమ్న వ్యూహాత్మకమై యా మనస్సే సత్త్వగుణ ప్రశస్తమై- యహంకార మమకార శూన్యమై సచ్చిదా నంద స్వరూపమై- "సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ" అనునట్లు వాసుదేవ పరబ్రహ్మాత్మకమై యాత్మారాముమై త్రిపాదస్యామృతం దివి" అను విధమున నిత్య శుద్ధ బుద్ధ ముక్త తురీయ స్వరూపమై యుండియును రజోస్తమోగుణములచేతఁ దనకుఁదా వేఱై సుఖదుఃఖా త్మక బంధమోక్ష సంసారస్వరూపక విశ్వతైజస ప్రాజ్ఞ భేదంబుల న్నిజలీలచే ననిత్య సృష్టి స్థితి నాశాత్మక విశ్వాకారము లనుభవించు చున్నట్లు తనలోఁదా నాటాడుకొను సంకర్షణానిరుద్ధ ప్రద్యుమ్న వ్యూహములం బ్రవర్తిల్లుచు యాథేచ్ఛన్నిత్యవాసుదేవ పరబ్రహ్మమై మిగులుచున్నది. కాఁబట్టి తాఁబుట్టినట్లు పెరుఁగుచున్నట్లు నశింపఁ

బోవుచున్నట్లు తనకు వేఱుగా నానావిధవిశ్వమున్నట్లు తనకుఁ దావ త్రయమున్నట్లు త్రిగుణముల జ్లీలకై తాల్చి యావాసుదేవుఁడే తనకుఁ దానాటాడుకొనుచు దృగ్దృశ్యములు జ్ఞాతృజ్ఞేయములుకారణ కార్యములు భోక్తృభోజ్యములు రెండును దానె యా వాసుదేవుఁ డగుచున్నాఁడు. కనుకనే "వాసుదేవః సర్వమితి సమహాత్మా సుదుర్లభ" అనుటచేత నహంకార మమకారము లుడిగి జగన్మయుఁడైన పరమభాగవతుఁడు మిక్కిలి యరుదని భగవద్వాక్య ప్రవృత్తి కల్గెను. "యాదృశీ భావనా యత్రసిద్ధి ర్భవతి తాదృశీ" అను నార్యోక్తి ననుసరించి యీ జగమంతయు న్భావనారూపముగాని మధ్యవికారమువలె వాస్తవము కానేకాదు. నిర్వివయిక మయిన తురీయావస్థ యొక్కటి మాత్రమే నిత్య సత్య శుద్ధ బుద్ధ ముక్త వాసుదేవపరబ్రహ్మము. కాఁబట్టి లోకములో మనుష్యునకుఁ జేయవలసిన పనిగాని మానవలసిన పనిగాని హేయముగాని యాదేయము గాని కర్తవ్యముగాని యకర్తవ్యముగాని మతే కర్మముగాని యే గుణముగాని భావనయందుఁ దప్ప వాస్తవముగా లేనేలేదు "సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ-నచబంధో నవా ముక్తి రిత్యేషా పరమార్థతా" అను శ్రుతి మత మొక్కటియే నయుక్తికము సప్రమాణము సమంజసము న్వాస్తవమైన దని రూఢిగాఁ దెలసికొని నిత్యకైవల్యానందమున దనివి నోలలాడఁ దగినవాఁడు కేవల లోకోపకారము సల్పుచు నహంకార మమకారములం దొఱఁగు పరమభాగవతుఁడు మా తమే యని పరమాప్తము మును ఉపదేశించిరి కావున సంసారులందఱుం భాగవతులై సంసారముం దరించుటయే యవశ్య కర్తవ్య ధర్మకార్యము ధర్మకార్యము. నిత్య శుద్ధబుద్ధముక్త తురీయ స్వరూపుఁడైన యాత్మకు సత్త్వ రజ స్తమోగుణాత్మక స్వప్నజాగ్రత్ సుషుప్త్యవస్థానుభూతి నీడవంటి యనిత్య సహజలీల గాని వాస్తవము

కాదు. వాస్తవముగా సచ్చిదానంద రక్షణుఁడైన యాత్మనకుఁ త్రిగుణాత్మక మనస్సు ప్రతిబింబమువలె మిథ్యగాని యథార్థముకాదు కాదు. కాఁబట్టి బంధమోక్షములు మాయామయమనోగుణములు గాని యాత్మనకు లేనేలేవు.

విద్యోపాధితో స్వతంత్రుఁడు పరమాత్ముఁ డగు వాసుదేవుఁడు నిర్గుణుఁడు సిద్ధసంకల్పుఁడున్ నిత్యముక్తుఁడున్ సచ్చిదానందస్వరూపుడున్ సేవ్యుఁడై యవిద్యోపాధిగుణమయునివలెం త్రిగుణబద్ధులై సంసారులై ఖేదమోదము లనుభవించు జీవాత్ములను బొమ్మలవలె జగన్నాటక సూత్రధారియై నిజలీలకై యాడించుచుం బ్రహ్మకల్పాంతముదనుకఁ గ్రీడించుచుండును. కావున దూషణభూషణ తిరస్కారంబులు కష్టసుఖములు బంధమోక్షములు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు వేయేల కేవలము మనోవిభ్రాంతి మూలములగు నీ జగత్కార్యములతోఁ బరమాత్మనకువలెఁ బరమాత్ముని యంశమయిన జీవాత్మనకుఁ గూడ నెట్టి సంబంధమును లేదు లేదు. కాఁబట్టి పరమభాగవతుఁ డగు మనుష్యుఁడు "వాసుదేవః సర్వమితి" అను తీరున సర్వము నారాయణుఁడే యని దృఢముగా భావించి తన్నుఁ దా మఱచి యహంకారమమకారము లెడసి జీవన్ముక్తుఁ డగుచున్నాఁడు. వాచికాంగికాహార్యసాత్త్వికాభినయములచేతఁ దన తోడిపాటి జనులను నిరంతరము సంతోషపఱ్చగల విద్వాంసుఁడే పరమభాగవతోత్తముఁడై జీవన్ముక్తుఁడై యొరులఁ దరింపఁజేసి యిహపరముల నాదరించుచున్నాఁడు. బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థసన్న్యాసాశ్రమములు నాల్గునొండొంట నాశ్రితములై నానావిధవర్ణములు చవులుఁ గలసియున్న కప్పటి కెద్దియో యొక రంగు నొక్క చవి నాశ్రితము ముఖ్యముగా వెల్లడించు పాంచభౌతిక పదార్థమువలెఁ బ్రత్యేకము కన్పట్టుచున్నవి. కనుక దేశకాల పాత్రోచితమయి కేవల

ధ్వనితోను మఱియు స్వర్ణాత్మక భాషాధ్వనులతో నలరు శ్రవ్యాభి
నయమును దక్కిన దృశ్యాభినయమును కేవల లోకోపకారమును
లోకరంజనమును మాత్రమే యుద్దేశించి పరమభాగవతుం డగు
విద్వాంసుండుతన బ్రతుకున వెల్లడించును. లోకోపకారకప్రవర్తనము
ధర్మము. లోకులం బాధించు నడువడి యధర్మము. ధర్మమార్గమున
సంచరించుచు మఱి యా మంచిదారిలోఁ గంటకములవలె నడ్డు
దగులు దుర్జనుల కోసరిలుచుఁ బ్రమాదము దప్పించుమని సర్వేశ్వరుని
వేడుకొనుచుంట మనుష్యకర్తవ్యము. లోకులం బాధించుట రాక్షస
కృత్యము. తా సుఖపడి తన తోడిపాటి జనులు న్సుఖపెట్టువాఁడు
మనుష్యుఁడు. మఱి యొరులం బాధించి కోరి చేటు తెచ్చుకొనువాఁడు
రాక్షసుఁడు. "దేవాసురాః సంయత్తా ఆసనన్" అనుటచేత సజ్జను
లకు దుర్జనుల కెన్నఁడు సరిపడదు. కేవల లోకోపకారపరులు
సజ్జనులు. కేవల స్వార్థపరులు దుర్జనులు. మనుష్యుల నందఱి సజ్జనులఁ
గావించుటకై మాత్రమే సమస్త వేదశాస్త్రము లనాదిగాఁ బ్రవ
ర్తిలుచున్నవి. సుఖజీవనముం బ్రతిజంతు వాసించి ప్రవర్తించుట
సహజగుణముకదా? జగత్కారణ మేది యెట్లున్నను భూతభవిష్య
జ్జన్మములసంగతిని గూర్చి యాలోచన మప్రస్తుతము కనుక నట్టిచింత
యాహార నిద్రావిహారసౌఖ్యమునకై మాత్రమే దేవుఁడాడు సంసారు
లకు వందనియింటి కగ్గిగండము వలె నసంభవముకదా! గతించినవారలు
స్వర్గనరకవర్ణనము ప్రత్యక్షముగా వచ్చి చెప్పినపుడుగాని నజీవులగు
మానవులు నిస్సంశయముగా నమ్ముకొని ప్రవర్తించరుగా! వేదశాస్త్ర
ములు తెలిసికొని నడుచుట కధికారులు, పండితులు మాత్రమేకదా!
ఎక్కాలమునందైన మనుష్యులలోఁ గోటి కొకఁడు పడితుఁడౌట!
మిక్కిలి యరుదుకాదా! మొత్తముపై లోకములోని మనుష్యు
లందఱు స్వార్థపరులే కుక్షింభరులే యవివేకులే యని

సిద్ధాంతీకరింపక తీఱదుగా! వేదశాస్త్రములు పిక్కబెట్టి వల్లించి కంఠ
పాఠ మొనరించినవారిలో నైతము యుగములని కిలోకములో నొకఁ
డైన బండితుఁ డౌట మిక్కిలి యసాధ్యముగా! పండితుల మనుకొని!
సంసరించువారు కృత్రిమరత్నములవంటి పండితమ్మన్యులు గాని పండి
తులుకారుగదా! వివేకము సహజసిద్ధముగాని చదువుకొనుటచేఁ గలు
గదుగా! మంటియొక్క వికారములు ఘటకపాలాదు లయినట్లు
ప్రత్యక్ష ప్రమాణాంతర్భూతములై తక్కిన యనుమానాది ప్రమా
ణము లన్నియు నని నిశ్చయింపక తీఱని యంశముగాఁ బ్రాజ్ఞులకుఁ
దోఁచకమానదుగా! పౌరుషసాధ్యములు కేవల దైవనిర్మితములయి
రెండువిధములై లోకములో సకలక్రియలు జరుగుచుంట సర్వజన
ప్రత్యక్షానుభవమే కదా! దైవకల్పిత పంచభూతోపద్రవములం
దప్పించుకొన నెంతమాత్రమును బ్రాణులు సమర్థులు కారుగా!
పురిటి బిడ్డమోము క్షణక్షణము వికసించుచు ముణుంగుటవలె కను
ఱెప్పల ప్రతిక్షణోన్మేష నిమేషములవలె నొకదానివెంట నొకటిగాఁ
గష్ట సుఖములు బ్రతుకున ననుభవించుకొనక తీరని సంసారబంధము
ప్రతిజన ప్రత్యక్షానుభవమేకదా! తన తోడిపాటివారు తన చెడ్డకై
తను శిక్షించుటయు మఱియుం దన మంచికై తను నాదరించుట నెల్ల
రెఱిగిన సంగతియేకదా! కాఁబట్టి దేశ కాలపాత్రానుసారంగాఁ!
దన తోడిపాటి జనుల కింపగు నడువడి నవలంబించి యిహసౌఖ్య
మును దన బ్రతుకు హాయిగాఁగొనసాగించుమని వేఁడుకొని యిహపర
సౌఖ్యమును బాల్యము గడచిన ప్రతిమనుజుడును సంపాదించుకొనఁ
దగినదని పిన్నలకుం బామరులకు న్గాలము గడిపిన పెద్దలు నేర్పఁగాఁ
దల్లిదండ్రులు పిల్లలకు బ్రతుకుతెన్ను మప్పినట్లు మప్పుచుంట కూడా
ననాది సజ్జనస్వభావమేకదా! సుఖసంపల్లాభముకై బ్రతుకను యుద్ధ

రంగమునఁ బెనగువాఁడు ప్రాణులలో సద్గురుశిక్షితులయినవారిలోననా దిగా వచ్చుచున్న కాలములోనిప్పటికి "శుకో వా వాసుదేవో వా" అనుతీరున కడతేరిన పరమభాగవతుఁడు శుకమునియో, వామదేవ మునియో అనఁగా వేదవేత్తలగుట మునులకే దుర్లభమైనపుడు సంసా రులం జెప్పనేల? "మహాగజాః పలాయన్తే మశకానాంతుకా కథా" కాఁబట్టి శాస్త్రీయముగా బ్రతుకు నడుపుకొనుట సంసారుల కెంతమాత్రము న్నశక్యము కానేకాదు. వేదశాస్త్రములు సాధన చతుష్టసంపదగల మహాత్ములకై మాత్రమే యుద్దిష్టము లయినవిగాని కామక్రోధ లోభమోహ మదమత్సర గ్రస్తులయిన సంసారుల కెంతమాత్రము న్గానే కాదు. కాఁబట్టి తనపురుషప్రయత్నముచేత దేశకాల పాత్రాను సారముగాఁ బూర్వాచారములను మార్చుకొని మనుష్యు లన్యోన్యముం గలసిమెలసి పరస్పర ప్రేమానురాగ మభివృద్ధి చేసికొని యన్యోన్య సాహాయమునం బొందు పోనఁగి మఱియుఁ దమ బ్రతుకు హాయిగా గొనసాగించుమని దైవము నహర్దివము నేఁడుకొనుచుంట యవశ్య కర్తవ్య మింకెద్దియు న్లేదు. చతుర్విధాభినయ ప్రయోజన మెదుటి వారి సంగతిఁ దాఁ దెలిసికొని తన యూహ యెదుటివారికి స్పష్టముగా వెల్లడించి యెదుటివారి నుల్లాసపర్చి పరస్పర ప్రేమానురాగములచే నెదుటివారు న్దాను గూడా హాయిగా బ్రతుకుటకదా? సుఖసంపల్లా భమునకై జీవితమను రణరంగమునందన్న దుర్గాను కామక్రోధ లోభ మోహ మదమత్సరములను శత్రువుల న్వివేకాయుధమునఁ బరిమార్చి "శూరవీర విక్రాంతో" యనునట్లు ప్రతిమానవుఁడును వీరుఁడుం బుత్రుఁడని వేదముల వ్యాఖ్యానింపబడు చున్నాఁడు. అంత శ్శత్రువుల జయించినవారికి బాహ్యశత్రువు లుండనే యుండరు.

అంతశ్శత్రువులం దా జయించినగుఱుతు తన తోడిపాటిజనుల ప్రేమానురాగములకుం దా బాత్రుండగుటయే మఱియుం దనమనస్సు నిత్య సంతుష్టమగుటయే. మనుష్యునకుం దనతోడిపాటివారి యను గ్రహము సంపాదించుకొనుటకన్న వేఱే పొందందగిన స్వర్గము లేదు. మఱియు నిత్యమనస్సంతుష్టికన్నం బ్రాపింపందగిన యపవర్గము లేదు. ఆగిషడ్వర్గముం జయించినవాండు "శుకో వా వామదేవో వా" అనుట చేత మానవు లరిషడ్వర్గోపాధిలోనే పుట్టిరి కదా! మఱియు వారి స్వరూపమే యరిషడ్వర్గముకదా! శశవిషాణమువలె నరిషడ్వర్గజయ కథనము శబ్దమాత్రమేగాని యనుభవవిరుద్ధ మనెదవేమో? అందు కొఱకే వేదశాస్త్రము లనాదిగాం దెలిసిన పెద్దలచే జగమున బోధింపం బడుచున్నవి.

## దైవాధీనం జగత్సర్వమ్

సర్వజననముండు సర్వలోకోపకారపరాయణుండు సర్వభూత దయాపరుండై యహంకార మమకారములం బురుషప్రయత్నముచే నెడసి జీవిత రణరంగమున దైవభక్తి సాధనముచే నరిషడ్వర్గమును జయింపంగలిగినవాండే శుకునివలె వామదేవునివలె యథార్థముగా లోకమునందున్నాండని నమ్మకొని యూపిరియున్నంతవఱకు వెను కంజవేయనివాడే పుత్త్రిడనియు వీరుండనియు బాహాటముగా వేద ములు బోధించుచున్నవి.

వాచికాభినయమందు "శంకితంభీత ముద్ఘుష్ట మవ్యక్త మను నాసికమ్ । కాకస్వరం శిరసిగతం తథాస్థాన వివర్జితమ్ । విస్వరం విరసం చైన విశ్లిష్టం విషమాహతమ్। వ్యాకులంతాలు హీనంచగీతి దోషాశ్చ తుర్దశ" అను పదునాల్గును దోషములు. ఎవనియందైన గుణముల ప్రయోజనము జనరంజనము కావించుట- దోషములున్న ఫల మాపని

యందు జనుల కసహ్యతకలుగుట మాటాడునపుడుగాని పాటపాడు నపుడుగాని సందేహపడుట-భయపడుట-ద్వేషముతోనుంట-విస్పష్టత లేకుంట-ముక్కు-పాట-అపశ్రుతిగాఁ గాకివలె శ్రుతికంటె న్యూనాధిక ములుగానఱచుట-తారస్థాయిపల్కుటకై పీంద్రుకొనుట-మంద్రమధ్య తారస్థాయిలలో నెద్దానిలోనైన నిల్కడలేకుంట-షడ్జాది స్వరముల స్పష్టతలేకుంట-దేశకాల పాత్రోచితరసానుకూలముగాఁ బ్రయోగము చేయనేరకుంట-నాదమును జెదరకొట్టుచు న్యూనాధికశ్రుతులన్ సడలి పోవుచున్న తంత్రీనాదమువలె రక్తిహీనముగాఁబల్కుట-మృదువుగాఁ బల్కవలయుచోటఁ దీవ్రస్వరము తీవ్రస్వరమునకు బదులు కోమల స్వరములం బ్రతికూలరస మమర్చుట - యేడ్పుమోముతోఁ బల్కుట-పీకపిసుకుకొన్నట్లు సరిగా గొంతు తెఱవక-దౌడలు గజిమల మినుగుల బొక్కుచున్నట్లు మాటనమలుట యీ పదునాల్గుం బల్కుదోష ములు శ్రోత్రరంజకమై జనానురాగకరమైన ధ్వనియంతయును గుణ భూయిష్ఠమే, కర్ణకఠోరమై ద్వేషము ననహ్యతంగల్గించు శబ్దమంత యును దోషభూయిష్ఠమే- వైదికశబ్దములకుఁగాని లౌకికశబ్దములకుఁ గాని పైనుదాహరించిన గుణములాదేయములు దోషములు హేయ ములు. వైదిక శబ్దోచ్చారణమునకుఁ బై నుదాహరించిన గుణములే గాక శాస్త్రీయములగునియమములు గలవు వైదికశబ్దములు యథా విధిగా నుచ్చరించిపుడు దేవతాప్రీతి జనకములై స్వర్గమునిచ్చును. మఱి నియమములెప్పినపుడు ప్రత్యవాయము కలిగించును. కాఁబట్టి ప్రమాదమునకు సహజముగా లోఁబడు సంసారులు వేదములు పఠింప నెంతయుం దగరు తగరు. వేదపఠన పాఠములు కేవలముఁ జితేం ద్రియు లతీంద్రియద్రష్టలగు మునులకుమాత్రమే నిర్దేశింపఁబడినవి. లౌకికగానమునకు దేశకాల పాత్రోచితముగా శ్రోత్రరంజక మగుట కన్న మఱెట్టి శాస్త్రనియమముం బనికిరాదు. జనరంజనముకై యథే

ష్టముగా శాస్త్రీయపద్ధతుల నుల్లంఘించుటస్సైతము లౌకిక దేశీగానమున కొకయలంకారమే—బ్రహ్మ క్షత్రి వైశ్య శూద్రాదిజాతి నియమములు శ్రౌతవిధులుం గేవలఁ వైదికు లత్రీందయ్యద్వలు జితేంద్రియులగు ఋషులకే యుద్దేశింపబడెను. నిద్రాహారవిహార సౌఖ్యలెత్పరులయిన ప్రాకృత సంసారిజనులకుఁ దగదు తగదు. కాఁబట్టి మనుష్యులందఱికి న్దేశకాల పాత్రోచితముగాఁ బరస్పర ప్రేమానురాగములు సంపాదించుకొని హాయిగా బ్రతుకుటకంటె వేదశాస్త్రములచే విధింపఁబడిన చాతుర్వర్ణ నియమము లెవ్వియు నాచరింపఁగూడదు. సంసారులు వైదికాచారము లవలంబించినయెడ నందింజేయఁబోయి పందిం జేసినట్లు లోకరంజనమునకు బదులు జనద్వేషముం దప్పక కలిగించి మానవ జీవనసుఖముంబోగొట్టి "ఇతో భ్రష్ట స్తతో భ్రష్టః" అన్నట్లు వైదికనిష్ఠ కలవారమని స్వార్థపరులై యీామణ త్రయమునఁ దగులు మానవు లిహపరములకు రెండింటికి న్దామ చెడుటయేగాక తమతోడిపాటి వారలంఁగూడఁ జెఱచుచున్నారు. బ్రతికినదూరు మానినదిమం దన్నట్లు తనతోడిపాటిజనుల ప్రేమానురాగములు సంపాదించుకొన్నవాఁడే కులవంతుఁడు నిక్కపుమానిసి జనవిద్వేషమునకుఁ బాత్రుండు తా నధికుఁడననియు యథాశాస్త్రప్రవర్తకుఁడననియుఁ గులగోత్రములఁగలవాడననియు శిష్టాచారపరుఁడననియు దీక్షితుఁడననియు నెక్కడినుండియో యూడిపడ్డాడనియు డంభుడై చాటుకొనుచు నీషణత్రయమునఁ దగిలి తనగుట్టు తెలియనీక దొంగయై మనుష్యునివలె నటించు దుష్ట రాక్షసుఁడెంతమాత్రము న్గానేకాదు మఱియట్టి యొంటుగొట్టు రాకాసి కన్యోన్య ప్రేమానురాగములతో మెలఁగు మనుష్యులు తమసంఘములోఁ జేర్చుకొనఁగూడదు. తనతోడిపాటి జనులకన్నఁ గులగుణగోత్రములలో దా నెక్కువని చెప్పుకొనువాఁడు మనుష్యరూపముననున్న

రాక్షసుఁడుగాని మనుష్యుఁడెంత మాత్రమున్నానేకాఁడు. సర్వజన సముఁడు సకల భూతదయాపరుఁడు కేవల లోకోపకారమునకు మాత్రమే బ్రతుకు పరమభాగవతుఁడొక్కఁడే మనుష్యుఁడనఁదగిన వాఁడు తగినవాఁడు. మహాత్ములందఱుం బరమ భాగవతులే యుత్తమ పురుషులే-యతీంద్రియద్రష్టలు కేవల వైదికులు వారి సంగతి తెలియ నసాధ్యముగాని ప్రాకృత లౌకిక జనులందు బుద్ధ శంకరాచార్యాదులు పూర్వులలోను నవీనులలోఁ దత్తుల్యులు కొందఱును మనుష్యులకుఁ బుట్టినారు. సర్వజనసమతలేని స్వార్థపర ధూర్తులు "అమ్మకు రెం డబ్బకు రెం" డన్నట్లు తమ తల్లిదండ్రులన్నూడ నధోగతి పాల్గావించు చున్నారు. పుట్టిన జనులెల్లైన విధినియమితమైన సహజ మృత్యువు నకు లోఁబడిక తీరదుగదా! ఈ లోపుగా నెందుకు వ్యర్థముగాఁ గోరి కోరి పరస్పరముం ద్వేషపడి తమలోఁదా మెక్కువని కొట్లాడి తన్ను కొని యకాల మృత్యువు పాలఁ బడుచున్నారు? మనుష్యులమని విఱ్ఱ వీగు దుర్జనుని కన్న నాహా మఱే జంతువైన మేలుగా! మూర్ఖులగు పిన్నలకు నయ భయములం బెద్దలు మంచి నేర్పుట యవసరము గనుకను "ఆత్మావాఅరే శ్రోతవ్యః" అనునట్టు జనులకుం బరస్పర ప్రేమాను రాగములం బుట్టించుమార్గ మెఱిఁగించుట బోధనశక్తియున్న సామర్థ్య ముకనుకను మఱి పామరులకుఁ గర్తవ్య మెఱిఁగించుట పండిత స్వభా వము కనుక భూతభవిష్య ద్వర్తమాన దేశకాల పాత్రోచితముగా యతీంద్రియద్రష్టలు పరమ కారుణికులయిన మునులు వేదశాస్త్రము లుపదేశించిరి. మునులయభిప్రాయ మెఱిఁగి సర్వజన సమ్మతముగాఁ బ్రస్తుతోపయోగముగా నాచారములను మార్చుకొని సుజనులు కాలక్షేపము చేయుచున్నారు.

పంచమ మధ్యమ షడ్జస్వరములు బ్రాహ్మణులు ఋషభ ధైవతములు క్షత్రియులు, గాంధార నిషాదము లుచ్చం బొందు

నవి గనుక వైశ్యులు న్యూనాధికములగాఁ బల్కెడు స్వరములు శూద్రులు. కనుక మనుష్యులయందలి జాతులు స్వరములు జాతుల వలె మునులకు మాత్రమే గోచారములు గాని యల్పజ్ఞులగు మనుష్యులు తమ తమ జాతు లెవ్వియో కనిపెట్టఁజాలనప్పటికిధూర్తులు కులమునకై గ్రుద్దులాడెదరు. ప్రాకృత మానవులకుఁ దమ సంగతియే తాము తెలియనేరకుండియు నొరుల సంగతి "ఇదమిత్థమ్" అని నిశ్చయించి చెప్పుట యెంత దుశ్చేష్ట! పుట్టుట పెరుఁగుటగిట్టుట నిద్రాహార విహార సౌఖ్యాభిలాషము పంచభూతముల వలనఁ గలిగెడు మంచి చెడ్డలు తాపత్రయము బాల్యయౌవన వార్ధకములు ఖేద మోదము లీతిబాధ లాఁకలి దప్పికలు సర్వజన సాధారణములే కనుక మనుష్యులలో నొకరికొక రేగుణముల చేతనైన గొప్పవారు కొద్దివారు "లక్షాధికారైనా లవణమన్నమె కాని మెఱుగు బంగారంబు మ్రింగఁబోఁడు" అన్నట్లహంకార మమకార విజృంభణమే గాని గొప్పవారమని విఱ్ఱవీగు ధూర్తజనులందు మరే యెక్కువయు తక్కిన కొద్దివార మనుకొని యడఁకువఁ జూపు సాధులకన్న నగపడదు. మెడం బంగరుపట్టెడ నలంకరింపఁబడిన కుక్క కుక్కయే గాని సింహమగునా? స్వార్థపరులై వేదశాస్త్రములు పిక్కవేసి కట్టు బొట్టు జుట్టు మడి మైలం దడిపొడిబట్టలం గా లెత్తెత్తివైచు వైదికమ్మన్యుఁడు గాని హంస తూలికలం బాలిన బల్లివలె సుకుమారించిన సోమరిపోతు ధనవంతుఁడు గాని చావుపుట్టువులకు లోనగు తక్కిన జంతువులకన్నఁ గొన్ని గుణములం గొఱవడిన దురదృష్టవంతులుం ధూర్తులగు మనుష్యాధములే గాని సర్వజన సములై సర్వభూత దయాపరులై లోకోపకార పరాయణులగు పరమభాగవతు లెన్నఁడు న్గానేరరు కానేరరు. ఈ దంభ మానవులకన్నఁ బశువులు నయము చెట్లు నయము రాలు నయము. పాటుపడు గుణము శూద్రజాతి, సంగ్రహముచేయు గుణము వైశ్య

జాతి- సంపాదించు గుణము క్షత్రియజాతి. ఉపాయ మెఱింగించు గుణము బ్రాహ్మణజాతి ఈనాల్గు జాతులుచేరి స్థూల సూక్ష్మ శరీర ప్రకృతి సృష్టి స్థితిలయ నిమిత్తకారణ మాత్మ ఉత్పత్తి స్థితిలయ లందు పాంచభౌతిక స్థూలసూక్ష్మోపాధి ప్రవృత్తి నివృత్తులయెడ గుణ ములు జాతులు కలవుకాని యసంగుఁడగు పరమపురుషునకు గుణ ములుగాని జాతులుగాని లేనేలేవు అవిద్యగానీ మాయగానీ సదస ద్విలక్షణా నిర్వచనీయ ప్రకృతిగానీ ప్రధానముగానీ మిథ్యావస్తువు గానీ యీ పాంచభౌతికోపాధికి మాత్రమే గుణములనుజాతులుంటకుం ప్రమాణ మున్నది గాని యతీంద్రియమై యుక్తి కందక పురుష ప్రయత్న ప్రవృత్తి నివృత్తులకుఁ గూడ హేతువై యెద్దియో స్వతం త్రముగాఁ దన యిచ్ఛానుసారముగాఁ జగత్క్రియలఁ గావించు దైవము యొక్క యునికి దేహస్మృతి రూపకాలోచన శక్తిగల ప్రతిజనునకుం బ్రత్యక్షానుభవ సిద్ధమేకదా! సూర్యచంద్రాది ఖగోళ ములు ప్రత్యక్షము లయినప్పటికి దానియథార్థ తత్త్వముం దెలిసికొని మనుష్యు లెట్లు శక్తులుకారో యెద్దియో దైవము జగత్క్రియలకు మూలమై యున్నట్లు స్ఫురించియు నాదైవము యొక్క తత్త్వమును "ఇదమిత్థమ్" అని యతీంద్రియ దష్టలగు ఋషులే నిర్దేశింపఁజాల కున్నపుడు వేదవాక్కులే జగత్సృష్టికారణమగు నప్పరమాత్మ తత్త్వ మెఱుంగ దమశక్యము కాదని యనాదిగాఁ జాటుకొనుచున్నపుడు దైవముతోఁ బ్రతిఘటించి పౌరుషము కొనసాఁగు టెట్లు?

"దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతం తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమదేవతా" అను శ్లోకమందు దైవ మను శబ్దమునకు జగత్కారణమని యర్థము. మంత్రశబ్దమునకు సర్వ జనులు పరస్పర ప్రేమానురాగములతో నేకీభవించి హాయిగా బ్రతుకఁ దగిన యుపాయమని యర్థము బ్రాహ్మణ శబ్దమునకు స్వార్థపరుఁడు

గాక తనతోడిపాటి జనుల సౌఖ్యమే తన సౌఖ్యముగా సంతోషించు ప్రాణి యని యర్థము. దేవతా శబ్దమునకు మంచిమార్గము నుపదేశించు గౌతమ వ్యాసాది వేదపురుషుడని యర్థము కాఁబట్టి మంచి యుపదేశించు గురువు బ్రాహ్మణుఁడు. ఉపదేశమును సఫలము కావించు వాఁడు క్షత్రియుఁడు. మంచినిఁ బోఁగొట్టుకొనక సంగ్రహించుకొన్న వాఁడు వైశ్యుఁడు. మంచి యను సస్యము ఫలించుటకై పాటుబడు వాఁడు శూద్రుఁడు. శుద్ధములయిన యీ నాల్గు జాతుల గుణములతో నిత్యుఁడై సచ్చిదానందలక్షణుఁడై శివుఁ డున్నాఁడు. జనులం దొదవు పరస్పర ప్రేమానురాగసంపదయను మంచిం జెఱచువాఁడు పంచమజాతిఁవాడు. అసంగుఁడు నిర్గుణుఁడు దయామయుఁడు సర్వజ్ఞుఁడు సర్వజగత్కారణమగు నారాయణుఁడు తప్ప నీలోకమందలి చేతనాచేతన పదార్థము లన్నియును బంచమవర్ణములోఁ జేరినవియే. పదార్థసాంకర్యమునఁ బొడమిన యుపాధులం జననమరణము లనుభవించు ప్రాణులందఱును సంకరులే, కావుననే వేదములందు మనుష్యులు పంచ జను లను ప్రతీతి కలిగినది.

అచేతనము లందు వజ్రాదిమణులు షడ్జాదిస్వరములు, సచేతనములందు సకల జంగమస్థావర ప్రాణు లన్నివస్తువులును బ్రహ్మక్షత్ర వైశ్య శూద్రజాతి సాంకర్యమునఁ బంచమజాతి యగుటచేత పరస్పర ప్రేమానురాగముల నేకీభవించుటవలనఁ గల్గు నిత్యైకైవల్యానంద మనుభవించనేరక యపార ఘోరసంసార తాపత్రయ దావాగ్ని దంద్రహ్యమానము కావఁసి వచ్చెను. వేదపురుషునకు ఋక్కు బ్రాహ్మణజాతి, యజుస్సు క్షత్రియజాతి, సామము వైశ్యజాతి, యథర్వము శూద్రజాతి. ప్రవృత్తి స్వభావముచేత ఋగ్యజుస్సామాథర్వాణోన్యోన్య సాంకర్యమునఁ బొడమిన యీ జగమంతయును బంచమజాతి, నివృత్తిమార్గమునం బంచమజాతి శూద్రజాతి

యందు శూద్రజాతి వైశ్యజాతియందు వైశ్యజాతి క్షత్రజాతియందు క్షత్రజాతితుదకు బ్రాహ్మణజాతియందు జగమథర్వవేదమం దథర్వము సామమందు సామము యజుస్సునందు యజుస్సు ఋక్కునందు ఋక్కు వేదపురుషుఁడగు పరమాత్ముని యందును విలీన మగుచుండును. ప్రవృత్తిదశయందు నారాయణుఁడు త్రిగుణమయ జగత్స్వరూపుఁడై నివృత్తిదశయందు నిర్గుణ వేదపురుషుఁడై కైవల్యానంద స్వరూపుఁడగుచున్నాఁడు. తురీయావస్థ బ్రహ్మజాతి-జాగ్రదవస్థ క్షత్రియజాతి, స్వప్నావస్థ వైశ్యజాతి, సుషుప్త్యవస్థ శూద్రజాతి ఈనాల్గవస్థల న్నిల్కడలేని సంసారావస్థ పంచమ సంకరజాతి, శుద్ధజాతి కల జనులు పరస్పర ప్రేమానురాగములతో హాయిగా దీర్ఘాయువులై బ్రతికెదరు. సంకరులు పరస్పర ద్వేషముతో బాధపడుచు నల్పాయువులై పుట్టుచుం గిట్టుచుందురు. షడ్జ మధ్యమ పంచమము లను మూఁడు స్వరములు బ్రాహ్మణజాతి వైనప్పటికి బ్రాహ్మణజాతి స్వభావమగు తెలుపు మధ్యమస్వరమునకు మాత్రమే "మధ్యమః కుంద సన్నిభః" అని చెప్పఁబడెను. బ్రాహ్మణజాతికిఁ దెల్లని వన్నె క్షత్రియజాతి యొక్క వన్నె యెఱుపు-పచ్చని వర్ణము వైశ్యజాతికి-నల్పు శూద్రజాతికిస్వభావములు. తెల్పు నానావిధములుగా నుండునట్లే తక్కిన రంగులు కూడ నొక్కొక్కటి యనంత విధములుగా నుండును, పాల తెల్పు- కొంగ తెల్పు-మల్లియ తెల్పు- వెన్నెల తెల్పు, పిల్లి తెల్పు- బొల్లి తెల్పు కల్లు తెల్పు- కల్వ తెల్పు మొదలగు లెక్కింపరానన్ని విధముల తెల్పు లున్నట్లే యెఱుపులుం పచ్చని వన్నెలు నల్పులును గలవు, కాని లోకములో వర్ణసంకరముకాని కేవలము శుద్ధమగు తెల్పుగాని యెఱుపుగాని పసుపుగాని నల్పుగానిలేదు గుణసాంకర్యమేగాని యచ్చముగా సత్త్వ గుణముగాని రజోగుణముగాని తమోగుణముగాని యే యుపాధి స్థానరాని చందమున జాతి సాంకర్యము లేక లోకములోఁ

యందు శూద్రజాతి వైశ్యజాతియందు వైశ్యజాతి క్షత్రజాతియందు క్షత్రజాతితుదకు బ్రాహ్మణజాతియందు జగమథర్వవేదమం దథర్వము సామమందు సామము యజుస్సునందు యజుస్సు ఋక్కునందు ఋక్కు వేదపురుషుఁడగు పరమాత్మునియందును విలీన మగుచుండును. ప్రవృత్తిదశయందు నారాయణుఁడు త్రిగుణమయ జగత్స్వరూపుఁడై నివృత్తిదశయందు నిర్గుణ వేదపురుషుఁడై కైవల్యానంద స్వరూపుఁ డగుచున్నాఁడు. తురీయావస్థ బ్రహ్మజాతి-జాగ్రదవస్థ క్షత్రియజాతి, స్వప్నావస్థ వైశ్యజాతి, సుషుప్త్యవస్థ శూద్రజాతి ఈనాల్గవస్థల న్నిక్కడ లేని సంసారావస్థ పంచమ సంకరజాతి, శుద్ధజాతి కల జనులు పరస్పర ప్రేమానురాగములతో హాయిగా దీర్ఘాయువులై బ్రతికెదరు. సంకరులు పరస్పర ద్వేషముతో బాధపడుచు నల్పాయువులై పుట్టుచుం గిట్టుచుందురు. షడ్జ మధ్యమ పంచమము లను మూఁడు స్వరములు బ్రాహ్మణజాతి వైనప్పటికి బ్రాహ్మణజాతి స్వభావమగు తెలుపు మధ్యమస్వరమునకు మాత్రమే "మధ్యమః కుంద సన్నిభః" అని చెప్పఁబడెను. బ్రాహ్మణజాతికిఁ దెల్లని వన్నె క్షత్రియజాతి యొక్క వన్నె యెఱుపు-పచ్చని వర్ణము వైశ్యజాతికి-నల్పు శూద్రజాతికిస్వభావములు. తెల్పు నానావిధములుగా నుండునట్లే తక్కిన రంగులు కూడ నొక్కొక్కటి యనంత విధములుగా నుండును, పాల తెల్పు- కొంగ తెల్పు-మల్లియ తెల్పు- వెన్నెల తెల్పు, పిల్లి తెల్పు- బొల్లి తెల్పు కల్లు తెల్పు- కల్వ తెల్పు మొదలగు లెక్కింపరానన్ని విధముల తెల్పు లున్నట్లే యెఱుపులుం పచ్చని వన్నెలు నల్పులును గలవు, కాని లోకములో వర్ణసంకరముకాని కేవలము శుద్ధమగు తెల్పుగాని యెఱుపుగాని పసుపుగాని నల్పుగాని లేదు గుణసాంకర్యమేగాని యచ్చముగా సత్త్వ గుణముగాని రజోగుణముగాని తమోగుణముగాని యే యుపాధి స్థానరాని చందమున జాతి సాంకర్యము లేక లోకములోఁ



జేతనా చేతన వస్తువు లెన్నియుగా లేనేలేవు ఏద్దియో వన్నెయుం జాతిగుణము ప్రాముఖ్యముగా నున్నట్లుగా వన్నెయు నాజాతియు నచ్చముగానున్నట్లు చెప్పఁబడుచున్నవి. సత్త్వగుణ ప్రధానులు బ్రాహ్మణులు, సత్త్వరజోగుణప్రధానులు క్షత్రియులు— రజస్తమో గుణ ప్రధానులు వైశ్యులు, తమోగుణ ప్రధానులు శూద్రులు. చపలగుణము కలవారు సంకరులని యనిపించుకొందురు. ఏదో యొక గుణము నిక్కడగా నుండువారు మనుష్యులలో బ్రహ్మర్షి రాజర్షి వైశ్యముని-శూద్రముని యని లోకపూజ్యులయి పరరుచి విక్రమార్కుండు— భట్టి- భర్తృహరులవలె లోకోత్తరులగుచున్నారు. స్వార్థపరతమాని కేవలలోకోపకారపరాయణులగు సజ్జను లేయాకారముతో నున్నప్పటి కెట్టిజాతివారని పిల్వంబడి నప్పటికిని వన్నె వేఱయినప్పటికిం దేజస్సున నొక పోలికనలరు వివిధజాతి రత్నములవలె గణనీయులే. కేవల స్వార్థపరులైన ధూర్తమానవులు వివిధవర్ణకాంతులం బ్రామరుల నోఁసపుచ్చు కృత్రిమరత్నములవలెం బండితాదరణీయులు కానేరరు. స్వార్థపరత లేక కేవల లోకోపకారమునకై మాత్రమే బ్రతికెడువాఁడుత్తమ జాతిగల బ్రాహ్మణుఁడు సంపూర్ణ సత్త్వగుణ ప్రధానుఁడు. సగము సత్త్వగుణము కలవాఁడు క్షత్రియుఁడు, మూఁడవ వంతు సత్త్వగుణము కలవాఁడు వైశ్యుఁడు. నాల్గవపాలు సత్త్వగుణము కలవాఁడు శూద్రుఁడు. సత్త్వగుణ మెంతమాత్రము నేక కేవల రజస్తమోగుణముల నోకరింటకునా మనుష్యుఁడు పంచముడు సంకరుఁడు కులహీనుఁ డనంబడును.

## స్వరతత్త్వము - ఆత్మ

షడ్జస్వర ముచ్చరింపబడినపు డాకసమునం బృథివ్యప్తేజో వాయు సమ్మేళన విశేషముచేత పద్మరాగకాంతి జ్ఞాన చక్షువులగు

యోగులు కనిపెట్టిషడ్జస్వరము పద్మమువలె నెఱ్ఱసిరంగు గలదని శాస్త్ర మొనర్చిరి. షడ్జస్వర మొక విధమైన ధ్వని విశేషమని మాత్రమే పండితులు మాత్రము గుఱుతింప గలరుగాని మునులవలె నా స్వరముయొక్క తత్త్వవిశేషముల నెఱుంగఁజాలరు. కాఁబట్టి గౌతమ వ్యాసాది మహామును లొనర్చిన శాస్త్రము లాప్తవాక్య ప్రమాణ మట్టి యాప్తవాక్య ప్రమాణము నమ్ముకొన్నవాఁ డాస్తికుఁడు. మఱియట్టి యాస్తికుఁడు మాత్రమే స్వర్గనరకాది లోకము లున్నవని శ్రద్ధాభక్తులు కలవాఁడై స్వార్థపరతమాని సర్వజన సముఁడై భ్రమర కీటన్యాయముగా నాప్తులగు మునుల న్దన గురువులం గావించుకొని తాఁగూడ మునియై సకల ప్రాణుల కుపకారియై పరమ భాగవతుఁడై నిక్కపుమనుష్యుఁడనిపించుకొనుచున్నాడు. స్వార్థపరుఁడు కుతర్కముచేతఁ దన సౌఖ్యమును మాత్రమే సంపాదించుకొననెంచి వంచకుఁడై లోకకంటకుఁడై మనుష్యత్వము న్దొఱఁగి కూళరక్కసి యనిపించికొని జన గర్హితుఁ డగుచున్నాడు.

"నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః" అనునట్లు పరమాత్మునిలో మూఁడుపాళ్లమృతత్వము తురీయస్థితి, తక్కిన పాలు తనకుఁ దానే విశ్వరూపమున నానావస్తు భేదములగుచు సృష్టి స్థితి లయములం ద్రిగుణాత్మకమై బంధమోక్షము స్సంకల్ప వికల్ప స్వభావముల నాటాడుకొనుచుండును. నివృత్తి చక్షుష్కులగు యోగులు తమ హృదయాకాశమునం దేజోరూపమగు స్వస్వరూపమును ధ్యానించుచు రాగద్వేషము లంటక యమృత కైవల్యపదవి న్దురీయులై యానందించెదరు, ధ్యానవంతులకు మధ్య నల్లని యాకాశము మఱియాకాశము చుట్టుం బ్రకాశించు జ్యోతిశ్చక్రము మాత్రము తప్ప మఱెద్దియుం దోఁచ దన్మహాత్ము లాకాశమే జగత్సృష్టి లయ

ముల కాధారమయి సంకల్ప వికల్పాత్మకమగు నాది మధ్యాంతరహిత
మగు విష్ణుమాయ యనియును మఱి యాకాశముం జుట్టుకొన్న తేజస్సే
పరమాత్మయనియును మఱి యావిష్ణుమాయయే దృగ్దృశ్యాత్మకమై
యహంకార మమకార జనకమై నానావిధ విశ్వరూపమునం దా
బొత్తిగా నవాస్తవ మయ్యును వాస్తవమువలెం బరమాత్ముని శక్తి
చేత సూదంటురాయి శక్తిచేత సూది చేతనముకలదానివలెం జలించి
నట్లు వాస్తవముకాని యహంకార మమకారములతోఁ దనకు వేఱుగా
నానావిధ జగత్క్రియల స్వప్నమందలి మనస్సువలె భావించుకొని
రజస్తమోగుణములన్ ఖేదమోదములందుచు సత్త్వగుణముచేతం
బరమాత్మలో లయమయి యోగనిద్రం జెంది విశ్రాంతి నిర్వృతి నను
భవించుచుండును. ఆత్మకుఁ దురీయదశయే వాస్తవము. స్వప్నజాగ్ర
త్సుషుప్తి దశలాత్మ జ్యోతిలోని సంకల్ప వికల్పాత్మక మాయామయా
కాశాత్మకములగు హుళక్కి నీడ వెండమావులవలె మిథ్యలుగాని
వాస్తవములు కానేకావు.

"ఏకమేవా ద్వితీయం బ్రహ్మం" దేవుఁడు తప్పసత్యమైన
వస్తువు లేనే లేదు. మఱియు నీ జగత్తునకును దేవునకును గల భేదము
మృత్తునకు మృద్వికారమగు కుండకున్నట్లే, "వాచారంభణం వికారో
నామధేయం మృత్తికైవేతి సత్యమ్" అను తెఱంగున దేవుఁడే వాస్తవ
మీ జగమంతయు న్వికారము. నానావికార వికారము లుత్పత్తి
స్థితినాశముల మాఱుచుండును. "పునరపి జననం పునరపిమరణమ్"
అనునట్లు పరమాత్ముఁడు నిజలీలచే విశ్వరూపుఁడై బంధమోక్షముల
న్మకుంద శైశవక్రీడల నాటాడుకొనుచుండును. "యజ్ఞేన స్వర్గ
మకురుత" లోకోపకారముగాఁ నొనర్చు యజ్ఞమనఁగా మనో
వాక్కాయ కర్మము కాఁబట్టి యజ్ఞము కేవల పురుషకారమేగాని
దైవచోదిత మెంతమాత్రము న్గాదు. దేవతాప్రీతికై సకల లోకోప

కారముగా దేహధారులు త్రికరణశుద్ధిగాఁ గావించు మంచిపని యజ్ఞమనందగును. "యజపూజాయామ్" అనుటచేత యజ్ఞము బూజించుట యనంగా సంతుష్టి కావించుట యని తాత్పర్యము కనుకను జంతుహింస యెతమాత్రమును జేయక కేవలము పాయసము పండ్లు మాత్రము నర్పించి విష్ణుదేవుని యజించవలయును యజ్ఞార్థమై జంతుహింస చేయు మనుష్యులకు ఘోరనరకము తప్పదని మనుస్మృతి శాసించుటచేతను మర్త్యులు స్వర్గసౌఖ్యముం దమకు యజ్ఞమను వేదచోదిత కర్మమును జేసికొనుటకై విధింపఁబడుచున్నారు. "దేవా యజ్ఞమతన్వత, రాక్షసాన్వై యజ్ఞమకుర్వత, యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాః" ఈ మొదలుగా ననేక మంత్రములచే నశరీరులగు మర్త్యులుగాని యశరీరులుం గాయురూపులగు దేవాసురులు గాని తమ సౌఖ్యమును దాము కష్టపడి చోదనా లక్షణమగు ధర్మకర్మము నాచరించి యపూర్వమగు స్వర్గసౌఖ్యముం బొందవలయునుగాని యజ్ఞకర్మముం బురుషప్రయత్నముచే నాచరింపని సోమరిపోతు జీవులకు దైవము స్వర్గసౌఖ్యము నొసంగఁ గలుగఁజేయును. "ఉద్యమేనవినా రాజన్న సిధ్యన్తి మనోరథాః" అను నీతివాక్యము చేతను లౌకిక సుఖము సంపాదించుకొనుటకై పురుషప్రయత్న మంతగా ముఖ్యము కాదుగాని పరమార్థమును సంపాదించుకొనుటకై మనుష్యుల పురుషప్రయత్న మత్యావశ్యకము. పురుషప్రయత్నము లేక పరమార్థము సిద్ధింపనే సిద్ధింపదు. పరమార్థమే దైవస్వరూపము కనుక బరమార్థస్వర్గసౌఖ్యము కేవల పురుషప్రయత్నైక సాధ్యమేయని శంకరాచార్యవచనముం బట్టియును "దైవం హిమూలమితికాపురుషావదన్తి" అని కష్టపడకయే నిత్యస్వర్గసౌఖ్యము పొందనాసించు సోమరిపోతులు దైవమే స్వర్గసౌఖ్యము దమ కిచ్చు మూలమని యవివేకములుగాఁ బల్కుచున్నారను పండితోక్తిం బట్టియుం గోర్కె కలజీవులు

తమ కోరిన పదార్థము స్వమకూర్చుకొనుటకై పురుషప్రయత్నము చేసికొనుచుంట సర్వలోక ప్రత్యక్షానుభవ మగుట చేతను స్వర్గసౌఖ్య దాయక దేవతారాధనమును విధ్యుక్త వేదచోదిత ధర్మముచేతఁ ద్రికరణశుద్ధిగా మర్త్యు లాచరించి కృతార్థులు కావలయు నావలయును. "సర్వేజనాః సుఖినోభవన్తు"అని సంతతము గోరుచుంట మానసయజ్ఞకర్మము. సర్వజనరంజకముగాఁ బల్కుట వాగ్యజ్ఞకర్మము. తన తోడిపాటి ప్రాణుల కందఱికి నాహార విహార నిద్రా సౌఖ్యము గలిగించుటకై పాటుపడుచుంట శరీర యజ్ఞకర్మము, "కర్మణా యంమభిప్రైతి స సంప్రదానమ్, విప్రాయగాం దదాతి"అనుట చేత సత్పాత్రము యజ్ఞ మనఁదగినది. "సతాం కేనాపి (యత్నేన) కార్యేణ లోకస్యారాధనం వ్రతమ్" అను మహాకవి వాక్యానుసారముగా లోకోపకారక మగు మనోవాక్కాయకర్మము నాచరించుట మర్త్యులకు విధ్యుక్తధర్మము.

"రూపగ్ం రూపం ప్రతిరూపమ్" అన్నట్లు నాబ్రహ్మము యొక్క యాద్యప్రతిబింబము "అగ్నిమీళే"యను ఋగాదిత్రయీవిద్యావాక్కులు-శబ్దమున కకారాది ప్రాణములుగాని కకారాది వ్యంజనములుగాని యర్థదాయకములు కానేకావు. షడ్జాది సప్తస్వరాత్మకోదత్తానుదాత్తస్వరితోచ్చరణ విధియే యభీష్టార్థసిద్ధి దాయకము వేదవాక్ఛరీరమునకుం జైతన్యమయి ప్రవర్తిల్లుచున్నది. "యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్" అనుటచేత "ఇంద్రశత్రుః" అనుపదమునందలి "ఇంద్రశత్రుః" అనునాల్గక్షరములు విధ్యుక్త షడ్జాది స్వరములచే నుచ్చరింపఁబడకున్న యెడల నా "ఇంద్రశత్రుః" అనుపదము నిరర్థక మగుటయేగాక ప్రత్యవాయజనకమున్గాడంగాక మానదు మానదు. కాఁబట్టి షడ్జాది సప్తస్వరజ్ఞానము లేని మనుష్యుఁడు తాఁజెడుటయేగాక లోకులకుఁగూడ నపకారియై మాటల

స్వ్వాయపర్చకమానఁడు "సంగీత సాహిత్య రసానభిజ్ఞః సాక్షాత్పశుః పుచ్ఛవిషాణ శూన్యః" అనువాక్యమునందలి పశుశబ్దమునకుఁ గ్రూర జంతువని యర్థముగనుక జననీజనక సరూపములగు శ్రుతిలయలను గనిపెట్టని దుష్టు పితృనిరోధియై యుభయలోక భ్రష్టగుచున్నాఁడు. తలిదండ్రులన్నని పెట్టువాఁడు లోకసమ్మతుఁడైనట్లు శ్రుతిలయానుసార ముగాఁబల్కు పండితుండు సకలలోక రంజకుఁడై యిహపరసౌఖ్య ముం జూఱగొనును, ఎవ్వనిపల్కు సకల జనరంజనము కావించునో యట్టి పల్కు శ్రుతిలయానుసారనని సిద్ధాంతీకరింపక తీరదు కావున లోకరంజకనుగు వాక్కే వేదము. జనరంజకముగాని శబ్దమెటువంటి యక్షరములతో నుండినను మఱెంత ప్రాచీనమైనను వేదమంత్రసం జ్ఞకుఁదగదు. తనతోడిపాటి జనులను రంజింపఁజేయనేరని కూళ మర్త్యుఁడు దేవతల నెట్లు రంజింపఁ జేయఁగలఁడు.

"అఋణశ్శుచిః బ్రహ్మచర్యేణ ఋషిభ్యః ప్రజయాపితృభ్యః ఇజ్యయా దేవేభ్యః" అని సుస్వరోచ్చారణముచేత ఋషులను ప్రేమానురాగములచేతఁ దనతోడిపాటి జనులను భక్తిచేత దేవత లను సంతృప్తిచేసినయెడల నే మువ్వురు తన పరమార్థ సాధన దేహ ధారణమునకుఁగారణ భూతులో యట్టి పితృాషిదేవతల ఋణము తీర్చినవాఁడగును. కాఁబట్టి మర్త్యుఁడు కేవల పురుషప్రయత్నము చేతనే త్రికరణశుద్ధిగా సకల జనరంజనమను యజ్ఞము విధిగా నాచ రింపవలయును. అవిద్యాబద్ధుఁడై సంసరిచుచున్న జీవుఁడు విభ్రాంత మనస్సునందు స్వప్నజాగ్రద్దశలం దద్దమునఁ బర్వత మగుపట్టుచంద మున కరాంగుళి చాటున సూర్యబింబము మరుగుపడిన తీరున జగ ద్రూపమున వివర్తించుచున్న యాత్మను గనుగొనుచున్నాఁడు. అద్ద మందలి కొండయు చేతిచాటున సూర్యబింబము మరుగుపడుటయు స్వప్నజాగ్రద్దశలందు జగద్రూపమున వివర్తమగు నాత్మయు యథా

ర్థముగా నస్తితామాత్రమువై యున్నప్పటికి మృత్తునిత్యమును సత్య
మునై యున్నప్పటికిని మృద్వికారమగు ఘటాకారము మాత్రము
కృత్రిమమనః కల్పితమయినట్లు రజ్జువివర్త రూపమగు పామువలె
భ్రాంతికల్పితాకారముగాని వాస్తవముకాదు. "మాయామాత్ర
మిదం విశ్వమద్వైతం పరమార్థతః-మృదేవసత్యం-అహంబ్రహ్మ...
తత్త్వమసిశ్వేతకేతో-ఏకమేవాద్వితీయం బ్రహ్మ" స్వస్వరూప
జ్ఞానము జీవునకు నిత్యము ప్రత్యక్షానుభూతమగు చున్నప్పటి కనిర్వ
చనీయ మాయాబద్ధుఁడగుట చేతఁ దనచేతిచాటున సూర్యుఁడు మరుగు
పడినాఁడనియు-నాకసము నల్లరంగుకలదనియుఁ జీకటినీడలు పొడ
వుగా పొట్టిగాఁ బెఱుగుచుం దఱుగుచుం బాఱుచున్నవనియు స్వప్న
జగమాదశయందు యథార్థమనుకొన్నట్లు "సాక్షీచేతాః కేవలో
నిర్గుణశ్చ"అని నిత్యనిర్గుణాత్మ స్వరూపముం దెలిసియుం దెలియక
నిత్యశుద్ధ బుద్ధముక్త స్వరూపుఁడయ్యును సుఖదుఃఖాత్మక బద్ధునివలె
సహజముగా నటించుచున్నాఁడు. సత్త్వరజస్తమో గుణాత్మకుఁడై
సృష్టిస్థితిలయములను జాగ్రత్స్వప్నసుషుప్తిదశ లనుభవించుచు బ్రహ్మ
విష్ణు శివాఖ్యలం బరగుచు విశ్వ తైజస ప్రాజ్ఞ సంజ్ఞలన్వహించి
యనాద్య విద్యాబద్ధుఁడై "ఏకః స్వాదు పిప్పలమత్తి" అనునట్లు
విభ్రాంతుఁడై సంసరించుచుండియు "అన్యోఽనశ్నన్నభిచాకశీతి"
అనునట్లు తురీయసంజ్ఞ నిర్గుణుఁడై విద్యోపాధి నొక్కయాత్ముఁడే
కైవల్యానందమందుచు సహజలీలచేఁ దనకుఁదా వేఱై భోజ్యమును
భోక్తయున్ దృశ్యమును దృక్కును బద్ధుఁడును ముక్తుఁడున్నానేయై
శృంగారాది నవరసా స్వాదమొనర్చుచు నాటాడుకొనుచున్నాఁడు;
అద్దమునఁదోఁచు కొండవాస్తవమయ్యును వాస్తవముగా గ్రహింపఁ
బడనిచందమున జగద్రూపమున వివర్తించు నాత్మవాస్తవమయ్యును
వాస్తవముగా స్వస్వరూపమును రసపరవశుఁడగు వేసగానివలె

గ్రహింపనొల్లక సంసార రంగమున నటించుచున్నది. "నచబంధోऽనవా ముక్తిరిత్యేషా పరమార్థతః" అనునట్లు కొంచెయద్దమం దిమడలేదు. సూర్యుఁడు చేతిచాటున మరుగుపడలేడు, ఆత్మునకు సంసారము లేనేలేదు. ఆత్మునకుఁ బ్రవృత్తి నివృత్తులు సహజలీలలు, ప్రవృత్తి చేతఁ దనకుఁ దావేత్రై సంసరించుచు నివృత్తి స్వభావముచేతఁ దన కంటె నొండుగనక కేవలుఁడగుచు "లేలాయతీవ ధ్యాయతీవ" అను నట్లు తనకుఁ దాబద్ధుఁడైనట్లు ముక్తుడైనట్లు పసిపాపవలె నాటాడు కొనుచున్నాఁడు. కాబట్టి "ఆత్మైవేదగ్ం సర్వమ్" అనువిధమున రాముండుకాని పదార్థ మింకెద్దియున్లేదు లేదు లేదు.

## పరాపశ్యన్తీ మధ్యమా వైఖరులు

"రమ క్రీడాయామ్" అనునట్లు సమస్తజగమును జతుర్విధాభి నయాత్మకమగు నాట్యమే, "తస్మాద్విద్వానీవ స్మృత్యేత్ "అను విధి ప్రకార మహంకార మమకారము లున్నట్లు తనకంటె వేఱేలోక మున్నట్లు లీలకై భావించుకొని యాటాడుకొనుట నిక్కముగా విద్వాంసుని లక్షణము. ఆటయే యాట యాయాట కొక పద్ధతి కలదు "లేడికి లేచినదే ప్రయాణ ముహూర్తము" అన్నట్లు "యోగరతోవా భోగరతోవా సంగరతోవా సంగవిహీనః యస్య బ్రహ్మణిరమతే చిత్తం నందతినందతి నందత్యేవ" అనునట్లే విశ్వ మంతయు న్నాట్యరంగము కావించుకొని యాటాడుకొనుచున్న యాత్మరామున కాదేయహేయములు విధినిషేధములు న్లేనేలేవు. సాహిత్యమ్మ ముదిరిన దనుకనేకదా యక్షరాభ్యాసము గుణింతము న్గావ్యపఠనమును శాస్త్రశిక్షయుం గావలయును, ఉత్తీర్ణు డయిన వాఁడు మఱల నోన్నమాల బుగ్గి యంటించుకొనునా? "వాసుదేవః సర్వమితిన మహాత్మా సుదుర్లభః, నపునరావర్తతే, బ్రహ్మ విద్బ్ర

హ్యేవ భవతి" అను చందమున యథార్థ మెఱిఁగినపిమ్మట నెఱుఁగ నట్లు నటించుట యదొక యానందలీలాక్రీడగాని సుఖదుఃఖాత్మక సంసారబంధము కానేకాదు. సరియే, సాహిత్యము కుదిరినవాఁడెవ్వఁడైన సంసారాక్షరాభ్యాస మొనర్చుచున్నాఁడా యని ప్రశ్నించిన యెడ సాహిత్యాంకుర మున్నవానికే యక్షరాభ్యాసము చేసినకొలంది నా సాహిత్యపాండిత్యము కొనసాగుచు బ్రహ్మవిదుఁడు విద్వత్తరుఁడు విద్వద్వరేణ్యుఁడు నగుచు సంసార మంటియంట కాటాడుకొను నేర్పరి యగు విద్వాంసుఁ డగుచున్నాఁడు. సంపూర్ణ విద్వాంసుఁడు శివుఁ డొకఁడే, సచ్చిదానందలక్షణుఁడై ప్రకాశించుచున్నాఁడు. సరియే యహంకార మమకారాత్మకమై సంకల్పప్రవృత్తితో దేహస్మృతి యున్నంతవఱకు సంసార వ్యవహారము తప్పదు. మఱి సంసార వ్యవహారముచేత! నే పురుషప్రయత్నముచేత "క్షణశః కణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్" అను రీతిని మనుష్యుఁడు తన తోడిపాటి వారితోఁ బొంది పొసఁగి మైత్రితో నుండఁగల నేర్పును మఱియుం దన నిద్రాహార విహారసౌఖ్యమును సంపాదించుకొనక తీరదుగా! అన్నివిధములచేత నిహలోక సౌఖ్య మున్న వానికే పరలోకసౌఖ్యము కూడ లంభించును, ఇహలోకమునఁ దిన్నఁబడనివాఁడు పరలోకమునఁ దిన్నఁబడఁడు తిన్నఁబడఁడు, కాఁబట్టి మనుష్యుఁ డీ యాప్తవాక్య రూపములగు వేదశాస్త్రముల నురుముఖముగాఁ దెలిసికొని "విద్యవలని ఫలము వినయము"అను రీతిని వినయముతోఁ దనతోడిపాటి జనుల యనుగ్రహమును సంపాదించుకొని యిహపరములం దరింపఁగలిగిన పరమభాగవతుఁడై తన జన్మమును సార్థక మొనర్చుకొనవలయును.

"తత్సృష్ట్వా తదేవానుప్రవిశ్య" భగవంతుఁ డీజగము సహజ లీలచేత సృజించి జగమంతటను "అంతఃపూర్ణం బహిఃపూర్ణం మధ్యాం పూర్ణం సమస్తతః" దా నిండుకొని "ప్రయోజన మనుద్దిశ్య సమం ధోఽపి ప్రవర్తతే" అను తీరున సర్వశక్తి సర్వజ్ఞుఁ డౌట చేత నా

నారాయణుఁ డఖిలవస్తువులను సకల లోకోపకారముకొఱకై యుపయోగపడునట్లు సృజించెను. ఈజగమునం దనుపయోగమై వ్యర్థముగా నేపదార్థమైనను సృజింపఁబడలేదు. ఆ భగవంతుఁడు సర్వచరాచరములం దుండి "లోకకావ్యాద్యవేక్షణాత్" అను తీరున బెద్దయై తెన్ను మప్పుచుఁ బిన్నయై కర్తవ్యా కర్తవ్యముల న్నేర్చుకొనుచున్నాఁడు. ముందున్న గొఱ్ఱెయే తెన్నున నడుచునో వెనుకనున్నదికూడ యట్లే వెంబడించును. సహవాసముం బట్టి సహజముగా ననాదిగాఁ జతుర్విధాభినయవిశేషములం బెద్దలు పిన్నలకుం దెన్ను మప్పరీతి వేదశాస్త్రములు ప్రవర్తిల్లుచున్నవి. దేవుఁడు వాన కురిపించుచున్నాఁడు. మఱి యానీటి న్నాబడిపంటలకును స్నానపానములకు నెట్లుపయోగించుకొనవలయునో వర్తమాన భవిష్యత్కాలోపయోగముగా నెట్లు నిల్వచేసికొనవలయునో పెద్దల సహవాసమునఁ బిన్న లనాదిగా నేర్చుకొనుచున్నారు. కాని విష్ణు మాయాబద్ధులై సంసరించు జీవులు కాలానుక్రమముగాఁ బ్రమాదమున దారితప్పి యేవస్తువు నెట్లుపయోగించుకొనవలెనో తెలియక రుజాజరావశులౌటచేతను బుద్ధిపొరపాటుచేతను బెద్దల సహవాసము దైవవశమున లభించకుంటచేతను జననమరణ సుఖదుఃఖ పరవశులై యెడతెగని యపార సంసారసముద్రమునఁ దాపత్రయాగ్ని సంతప్తులయి యరిషడ్వర్గ ఝంఝూనిలముచే నెగురఁగొట్టఁబడి నిల్కడ లేకుంటచేతను భ్రాంతులై విపరీతదృష్టులై పెద్దల బోధ న్దెలియనేరక వేదశాస్త్రముల న్సరిగా నన్వయించుకొనఁజాల కహంకార మమకార మదోన్మత్తులై కృత త్రేతా ద్వాపర కలియుగములు రాను రాను బిదపకాలమున జాతినీతుల న్వావివరుసలం బిన్న పెద్ద తారతమ్యముం గడింపక కేవల స్వార్థపరులై జ్ఞానలవదుర్విదగ్ధులై పండితమానులై

క్రూరులై తమ తోడిపాటి జనులం బాధించి తాము సుఖపడ దలంచుచుం గ్రిందుమీఁదు లెఱుంగక ధనాశచేత దంభవేషములతో లోకవంచకులై భూతద్రోహులై జంతుహింసాపరాయణులై కలి కాలమున శనిగ్రహావశులై పెద్దల మర్యాదం బాడుచేసి తమ తోడి పాటివారలం జెఱచి తా ముభయలోకభ్రష్టు లగుచున్నారు.

కృతయుగమున జనులకుఁ జెక్కు చెదరక నిల్కడగా ధర్మ బుద్ధి స్వర్గమున్నట్టినంతవరకుం బెరిఁగి త్రేత ద్వాపరయుగములం దగ్గుచుం గలియుగమున నడుగంటినది, తనతోడి వారితోఁ బ్రేమాను రాగములం బొత్తుగలిగి తన జీవితమును మనుష్యుఁడు కొనసాగించు కొనఁగలిగిన సమయము కృతయుగము "స్వయం తీర్ణాః పరాం స్తార యన్తి" అను తీరున సంసారజలధినుండి తనతోపాటు తనతోడి పాటి జనుల నొడ్డెక్కించిన బుద్ధిమంతుఁడు మనుష్యులం బరమగురుఁడు మఱి యొరులఁ జెఱచి తాఁ జెడువాఁడు శనిగొట్టు, గ్రహములందు గురునివంటి శుభుఁడు శనినంటి పాపియు న్లేఁడుగా! పరోపకారపరా యణుఁ డగు మనుష్యుఁడు స్వర్గమేలించు గురుఁడు. తనతోడిపాటి జనులన్ హింసపెట్టు దుష్టు నరకమునఁ ద్రోయుశని. గురునివలె సర్వ లోక శుభదాయకుఁడు కావలసినదనియు శనివలెఁ గూళ కాకూడ దనియు తప్పుదారి తప్పించి మంచిమార్గమున నడిపించుచు జతు ర్విధాభినయ విశేషాత్మకములై యనాదులై యపౌరుషేయములై సకల వేదశాస్త్ర పురాణేతిహాసములు దైవ స్వరూపములయి ప్రవ ర్తిల్లుచున్నవి.

సచ్చిదానందలక్షణమగు నాదబ్రహ్మము పాంచభౌతిక జగ ద్రూపమున వివర్తమైనయది. కాఁబట్టి రజ్జువునందలి వివర్తరూప మగుసర్పమువలె నాదబ్రహ్మమందువివృతమగుచతుర్విధాభినయాత్మక పాంచభౌతికజగమంతయును మిథ్యారూపమై యెండమావులయందలి

నీటివలె స్వప్నప్రపంచమునీతి హులిక్కిగాని వాస్తవ మెంతమాత్రము
న్గానేకాదు, ప్రతిబింబము యథార్థవస్తువు కాకున్నను వాస్తవబింబము
నెఱిఁగించు సాధనము గనుక మిథ్యాభూతమైనప్పటికిం బాంచభౌతిక
జగత్సృష్టి నిష్ప్రయోజనము కాక నిక్కముగా సప్రయోజనమై లౌకిక
త్రేతాగ్నిహోమపూర్వపారలౌకిక స్వర్గసాధనమైనట్లు "శరీర
మాద్యం ఖలు ధర్మసాధనమ్" అను రీతిని మర్త్యజీవితము పరమార్థ
సాధనమైనట్లు వాచికాంగికాహార్య సాత్త్వికాభినయాత్మకమై లౌకిక
వ్యవహారమయమై పరమార్థసాధనమై బ్రహ్మానందఫలక మగు
చున్నది. వాచికాంగికాహార్య సాత్త్వికాభినయములు "యస్య భాసా
విశ్వమిదం విభాతి" యనునీతిని సచ్చిదానంద లక్షణమగు నాదబ్రహ్మము
తేజముచేత నామరూపాత్మక ప్రపంచముగాఁ దోఁచుచున్నది, "అహ
మన్న మహమన్నాదః అనునట్లు "కర్తాభోక్తాజనార్దనః"అనుతీరునఁ
జతుర్విధాభినయ స్వరూపమును జతుర్విధాభినయ ప్రయోక్తయును
మఱియుం జతుర్విధాభినయరసికుఁడును నిక్కముగా వాసుదేవపరబ్ర
హ్మ మొక్కటియే, ద్రష్టృదృగ్దృశ్యములును సత్త్వరజస్తమోగుణము
లును జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలును భూతభవిష్యద్వర్తమానకాల
ములును స్వర్గమర్త్యపాతాళములును సృష్టిస్థితినాశములును నాదబిందు
కళలును త్రేతాగ్నులును వేయేల ముల్లోకములును సకలేంద్రియ
దృష్టములు మఱి యింద్రియాతీత పదార్థములన్నియును "పురుష ఏ
వేదగ్ం సర్వమ్"అనునట్లు"ఏకో నారాయణః పరః" అను విధమున
దేవునికన్న నితర వస్తు వెద్దియు న్లేనేలేదు. సేవకుఁడును సేవ్యుఁ
డును బద్ధుఁడును ముక్తుఁడును దేవుఁడే మఱి యీ పరమాత్ముఁడు
దప్ప మఱి యే పదార్థమును లేదు. ఇట్లెఱింగిన యోగి పరాపశ్యన్తీ
మధ్యమాశబ్దక్షేత్రమై యాత్మానందమున నలరారును. నాదబ్రహ్మ
మునకుఁ బరయను శబ్దము పరాశబ్దమునకుఁ బశ్యంతియను పశ్యన్తీ
శబ్దమునకు మధ్యమయను శబ్దమును మధ్యమా శబ్దమునకు వైఖరి

యనంబడు కంఠధ్వనియుం గ్రమముగాఁ బ్రతిబింబములు, స్వయం ప్రకాశమగు నాదబ్రహ్మమే యీ చతుర్విధాభినయాత్మక సకల జగత్తుగా రజ్జువునందు సర్పము భ్రాతిభావనమగుచున్నది. ఈ యధ్యారోపాపవాద సిద్ధాంతాద్వైతమత మొకటియే నిశ్చయముగాఁ బరమార్థసత్యము సత్యము. నాదబ్రహ్మముయొక్క వికారము కేవలధ్వని. కేవలధ్వనియొక్క వికారమువర్ణాత్మకధ్వని. వైఖరీవిశేషవేత్త మనుష్యగంధర్వుఁడు. మఱియును సుధ మాపశ్యన్తీ పరాశబ్దతత్త్వవేత్త దేవగంధర్వుఁడు "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అను తీరున నాదబ్రహ్మవేత్త నాదబ్రహ్మగంధర్వుఁడే యనఁగా సంగీతజ్ఞుఁడగు మనుష్యుఁడు మూర్తీభవించిన బ్రహ్మమని సిద్ధాంతీకరింపక తీఱదు.

"శబ్దసంప్రయోగాత్" అను పూర్వమీమాంసాశాస్త్రమును సారముగా శబ్దమనఁగా వేదమని యర్థము. "అనంతావై వేదాః" అనుటచేత శబ్దము లనంతవిధములు "ధాతూనా మనేకార్థత్వా దవ్యయానామనేకార్థత్వాత్" అనుటచేత ననంత సంఖ్యాకములయిన శబ్దములందుఁ బ్రతిశబ్దమున కనేకార్థములు కలవు. "యథా నామ తథా గుణాః-రూపమేవాస్య మహిమానం వ్యాచష్టే" అను ప్రాచీనోక్తులం బట్టి చతుర్విధాభినయస్వరూపక నామరూపములచేత జగద్రూపమున వివర్తితయయిన యతీంద్రియకారణాత్మక నాదబ్రహ్మతత్త్వమును బ్రత్యక్షకార్యాత్మక జగత్తుంబట్టి యనుమానప్రమాణముచేత సర్వజ్ఞులయిన మునులు తెలిసికొని వేదశాస్త్రములమూలన్ లోకోపకారముకై కించిజ్జ్ఞులగు సాధారణమనుష్యులకుబోధించి యుభయలోకముల నిస్తారణ ప్రేమచేఁ దరింపఁజేయుచున్నారు. శ్రవణేంద్రియ విదితనుయినదెల్ల నామము, చక్షుర్ఘ్రాణ జిహ్వాత్వగ్వేదితములయిన పదార్థములన్నియును రూపము నామరూప ప్రవర్తకము మనోరూపక శరీరస్మృతి-ఈస్మృతికే మాయ యనియుం బ్రధాన

మనియు నవిద్యయనియుం బ్రకృతి యనియును భగవల్లీలయనియును సహజగుణ మనియుం బర్యాయపదములు. కేవల ధ్వన్యాత్మక శబ్దముయొక్క వికారము వర్ణాత్మకశబ్దము. వైఖరి యనంబడిన కంఠ ధ్వని నాదబ్రహ్మముయొక్క తుట్టతుది ప్రతిబింబము. మఱియు నా నాదబ్రహ్మముయొక్క తుట్టతుది యాకారప్రతిబింబములు స్పర్శరూప రసగంధములు. ఇంద్రియదృష్టములగు శబ్దస్పర్శరూప రస గంధములను ననిత్య జగత్కార్యములంబట్టి యతీంద్రియ నిత్యజగ త్కారణమగు నాదబ్రహ్మ మును మానముచే మునులు తెలిసికొని లోకోపకారమునకై వేదశాస్త్రముఖములం బ్రచురించుచున్నారు.

## నాదబ్రహ్మము - మానవప్రవర్తన

షడ్జాది సప్తస్వరముల శ్రుతులు హెచ్చుతగ్గు స్థానములంబట్టి కోమలములయ్యు దీవ్రములయ్యుం రెండు తెఱగులగుటచేతం బదు నాల్గుశ్రుతులని నారదుండును షడ్జమధ్యమ పంచమములు ప్రతిస్వరము నాల్గువిధము లగుటచేతను నిషాదగాంధారములు రెండేసి యగుట చేత నాల్గును ఋషభధైవతములు మూండేసి శ్రుతులగుటచేత నాఱును మొత్తముపై $12+4+6=22$ ఇరువదిరెండు శ్రుతులని భరతముని యును ఒక్కొక్కవిధమై షడ్జపంచమ స్వరములు రెండు శ్రుతులు ఋషభధైవత గాంధార నిషాదములు నాల్గు ప్రతిస్వరమును మూండేసి విధములై పన్నెండును మధ్యమము రెండై రెండువిధములు లగుటచేతను మొత్తముపై దేశీయస్వరములు $2+12+2=16$ పదాఱు విధములయి దేశీసంగీతమున వాడంబడుచున్నవని యాధునికమతమును జగము లోని చేతనాచేతనముల నలిగెడు నానావిధ ధ్వనులు శ్రుతిభేదములే కనుక శ్రుతు లనంత సంఖ్యాకములనియుం గొందఱి మతమునై శ్రుతుల గూర్చి వివిధాభిప్రాయము లున్నవి. "అనంతా వై వేదాః"

అనుటచేతను వేదముల ననుసరించి "ధాతా యథాపూర్వ మకల్పయత్, యథాలోక స్తథా వేదః" అను వచనములం బట్టి స్వరస్థానకాల ప్రయత్న విశేషములన్నలుగు శబ్దమునకు వేదమందుఁగాని లోకమందుఁగాని మతభేదముండుటచేత నొక నియమ మెద్దియు నేర్పర్చ వీలు లేదు. దేశకాలపాత్రానుసారముగా నాయా జనులకు రంజకమైన నామరూపములు దేశీసంగీతము, దేవతాప్రీతికై ప్రయోగింపఁబడు నామరూపములు మార్గిసంగీతమనియును వాడంబడుచున్నవి, దైవ శక్తిచేత ప్రయుక్తములయిన నామరూపములు వైదికములు మార్గి సంగీతము, జనరంజకములుగాఁ బ్రయోగింపఁబడు నామరూపములు లౌకికములు దేశీసంగీతము. మార్గిసంగీతమునకెద్దియో యొక నియమమును ననుసరించుట స్వభావము. దేశకాల పాత్రోచిత రంజనము కావించుటకన్న దేశీసంగీతమున మతే నియమమైన నవసరములేదు. మానినది మందు బ్రతికినది దూరు-జనరంజకమైనది సంగీతము. వేద శాస్త్రపద్ధతు లెఱిఁగి లోకులు చతుర్విధాభినయము లొనర్ప నెంత మాత్రమున్సమర్థులు కారుగాని లోకులు వ్యవహరించు చతుర్విధాభి నయాత్మక నామరూపములన్నియును వేదశాస్త్ర పద్ధతుల ననుసరించియే ప్రవర్తిల్లక తీరదు. జగత్కార్యమంతయును మిథ్యయు ననిత్యమైనప్పటికి నిత్యమునువాస్తవమైన దివ్యకారణమునఁ బ్రవర్తిల్లక తీరునా? వర్ణాత్మకమైన సంస్కృతాపభ్రంశభాషాశబ్దమునకు బ్రయోజనము ప్రాణులు తమతమ యూహాలం బరస్పరము తెలిసికొనుట యుం దెలుపుటయునైనట్లు శ్రుతి లయాత్మక షడ్జాది స్వరముల ప్రయోజనము ప్రాణులు పరస్పరము రంజిల్లి రంజింపఁజేయుటయే.

వేదశాస్త్రములంబట్టి యనాదిసంప్రదాయసిద్ధనియమము గాను దేవతాప్రీతికై ప్రకటింపఁబడు నామరూపములు వైదికములు. దేశకాల పాత్రోచితముగాఁ గేవల జనరంజనప్రయోజనమాత్ర

ములై యథేష్టముగాఁ బ్రకటింపబడు నానారూపములు లౌకికములు. వైదిక సంప్రదాయమెఱిఁగి దేశకాల పాత్రోచితముగా వర్ణాత్మక ధ్వన్యాత్మక శబ్దప్రయోగము చేయువాఁడు పండితుఁడు. దేశకాల పాత్రోచితములయిన వేషభాషలం జనరంజకముగాఁ బ్రయోగింప నేరనివాఁడు పామరుఁడు. నియమనానారూపాత్మక వైదికమార్గ సంగీతముచేత దేవతలను, యథేష్టముగా జనుల దేశకాలపాత్రోచితముగా లౌకిక దేశి సంగీతముచేత మర్త్యులను నిట్లుభయులన్గూడ వేషభాషల స్వాధీనపఱచుకొనువాఁడే మహానుభావుఁడు. షడ్జము నగ్ని-ఋషభస్వరమును బ్రహ్మయు-గాంధారమును జంద్రుఁడు-మధ్యమ స్వరమును విష్ణువును-పంచమస్వరమును నారదమహర్షియును-ధైవత నిషాదస్వరములు రెండింటిని తుంబురుఁడును బాడుచుందురు. షడ్జమునకు బ్రహ్మయు-ఋషభమునకగ్నియు-గాంధారమునకు గోవును-బ్రాహ్మణులకు రాజైన సోముఁడు పంచమధైవత స్వరములకు రెండింటికిని-నిషాదమునకు సూర్యుఁడును-మధ్యమమునకు విష్ణువునధిదేవతలు, షడ్జర్షభగాంధార మధ్యమ పంచమ ధైవత నిషాదములను గ్రమముగా మయూరము-గోవు-మేఁక-క్రౌంచపక్షి-కోకిల-గుఱ్ఱము-కుంజరమును గ్రమముగాఁ బల్కు ప్రాణులు. మయూరాది శబ్దము లెట్టి యుపాసులుగల జంతువులో మర్త్యు లెఱుఁగనేరరు. సామవేదమునకై నియమింపఁబడిన సప్తస్వరములు గనుఁగా షడ్జాది సంజ్ఞలుగల వైదికస్వరముల కెంతమాత్రమును సరిగమపధని సంజ్ఞలుగల లౌకికస్వరములతో సంబంధము లేనే లేదు. వైదికసంగీతమునకు లౌకికసంగీతమునకు వైదిక వేషభాషలకు మఱి నానారూపాత్మక చతుర్విధాభినయనములకును లౌకిక వేషభాషలకును మఱినానారూపాత్మక చతుర్విధాభినయనములకును సంబంధము పారమార్థిక వ్యావహారికములకువలెను సత్యాసత్యములకువలె బ్రహ్మజగత్తులకువలెఁబొత్తుగా

లేనేలేదు. అతీంద్రియములైన పరాపశ్యన్తీ మధ్యమాశబ్దములు వైదికములు వైఖరీశబ్దము లౌకికము. కాబట్టి లౌకిక నామరూపములు కార్యములు వైదిక నామరూపములు కారణములు. నెమలి కంఠధ్వని షడ్జమును బల్కుననియు నగ్ని షడ్జస్వరమును బాడుననియు షడ్జస్వరమున కధిదేవత బ్రహ్మయనియును షడ్జస్వరము కెందామర వలె నెఱ్ఱగా నుండుననియు "స్వరావై సార్వవైదికాః" అనుటచేతను పరాపశ్యన్తీమధ్యమాశబ్దముల వ్యక్తధ్వను లతీంద్రియములు వైఖరీ కారణములుం గేవల పారలౌకికములుగాని యైహలౌకికములు కానే కావు. వైఖరీసంజ్ఞికమగు మర్త్యకంఠధ్వని కారణరూపమైన నాదము యొక్క ప్రతిబింబమైన మిథ్యాకార్యముగాని వాస్తవము కానేకాదు. కాబట్టి "అగ్నిమీళే పురోహితమ్" అను మొదలగు సమస్త వర్ణాత్మక వేదశబ్దములు దేవతల సంతోషపర్చుటకై శ్రద్ధాభక్తుల చేత ననాద్యాచార్యగురు సంప్రదాయసిద్ధము లయిన చతుర్విధాభినయపద్ధతు లెఱయక ప్రయోగింపవలయును. కేవల వర్ణాత్మక లౌకిక శబ్దములను ధ్వన్యాత్మకమగు లౌకికశబ్దమును మంద్రమధ్యతార స్వర భేదముచేత శ్రుతిలయల నద్దేశకాల పాత్రోచితముగా జనరంజకమగు తీరున యథేష్టముగా నవరసాత్మకముగాఁ బ్రయోగించుకొనవచ్చును. వైదికవైఖరీ ప్రయోజనము దేవతలను భక్తిశ్రద్ధలతో సంతోష పర్చుకొని పరమును సాధించుకొనుటయును లౌకికవైఖరీ ప్రయోజ నము జనరంజనము కావించుకొని జీవనసౌఖ్యమును సంపాదించు కొనుటయును, లౌకిక చతుర్విధాభినయములన్నకలరంజనము కావింపఁ జాలిన పండితుఁడు మాత్రమే వైదికసంగీతప్రయోగదక్షుఁడై దేవత లను సంతోషపర్చి పరమును సాధింపఁగల పరమభాగవతుఁడు కాఁగలఁడు. ఇహమును దరించలేనివాఁడు పరమునెంత మాత్రమును సాధింపనేరఁడు తన తోడిపాటి జనులను త్రికరణశుద్ధిగా సంతోష

పెట్టఁజాలని దుష్టజనుఁడు వేదముల నుచ్చరింపఁగూడదు. వైదికకర్మ లాచరింపఁదగదు. జనకంటకుఁడైనవాఁ డిహపరముల రెండింటికిం జెడకమానఁడు. ప్రతిబింబితముం బట్టి బింబస్థితి గనిపెట్టఁగాలిగినట్లు దేవతల పాత్రానుసారముగా సకల జనరంజకముగాఁ గార్యరూపము లయిన మనోవాక్కాయ కర్మములగు నామరూపములం బ్రకటింపఁ గల విద్వాంసుఁడు మాత్రమే కేవల మానసికములై ధ్యానాత్మకము లయిన కారణాత్మకములగు వైదిక నామరూపముల ద్దేవతలను వశపర్చుకొను పరమభాగవతుఁడు కాఁగలఁడు. అనాదికాలము నుండియును త్రికరణశుద్ధిగాఁ జతుర్విధాభినయములచేతఁ దన తోడి పాటి జనుల న్సంతోషపర్చిన జనుఁడే వైదిక సంగీత విశేషములగు ధ్యానధారణ సమాధులచేతను సాధనచతుష్టయసంపదలచేతను సకల వస్తుతత్త్వజ్ఞానము చేతను యమాదియోగ విశేషములచేతను "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" అనునట్లు కపిలాదిమునులయి యణిమాదిసిద్ధు లంది పరమభాగవతులయి నిత్యకైవల్యానందమున నోలలాడుచుం ధర్మార్థకామమోక్షములను పురుషార్థముల న్సాధించి యిహ పరములం దరించిన మహాత్ములు సకల భూతమయులై పరమ కారుణికులై సకలలోక బాంధవులై వేదశాస్త్రస్వరూపముల నర్థవ్యా కర్తవ్యములన్ హేయోపాదేయముల నిత్యానిత్యవస్తుతత్త్వము నిహపర సంతరణమార్గము న్సకలజనులకు న్సంతతము బోధించుచున్నారు. దేశకాల పాత్రోచితముగాఁ జతుర్విధాభినయములం బ్రయోగించి జనరంజనము కావింపఁజాలినవానికే వేదశాస్త్రములు బోధపడును గాని జనరంజనము కావింపఁజాలనివాఁడు నిక్కముగా విద్వాంసుఁడు కానేకాఁడు. ప్రజారంజకమగు నడతకన్న నేర్చుకొనఁదగిన విద్య యింకెద్దియు న్గానేరాదు. జనరంజకుఁడుకానివాని విద్య గ్రుడ్డికంటి కిడిన కాటుకవలె వ్యర్థమగుటయేగాక హాస్యాస్పదమును మోస

కారియుం గూడనయి యట్టి ధూర్త నిహపరభ్రష్టుం గావింపక మానదు. విద్యకుఁ దగినలక్షణము సకలజనరంజక మగుట మాత్రమే. కేవల ధ్వనిని దేశకాలపాత్రోచితముగా సకలజనరంజకమగు తీరున శ్రోత్రియుల యథేష్టనియమముతో యథేష్టోదాత్తానుదాత్త మంద్ర మధ్య తారస్థాయిలతోఁ జవులూట్టుతీరున వర్ణాత్మక శబ్దార్థముల న్వెల్ల డించుచు నాంగికాహార్య సాత్త్వికాభినయములం బ్రకటించు విద్వాంసుఁడు క్రమక్రమముగా సర్వలోకరంజకుఁడై యాత్మానందముతో సర్వభూతమయుఁడై నిత్యసంతుష్టుఁడై యానందమయకోశమాత్రావశిష్టుఁడై పరమభాగవతుఁడై కపిలాదిపరమమునులవలెం గృతార్థుఁడై తాఁదరించి యొరులం దరింపఁజేయుఁగలఁడు.

నిత్యాపౌరుషేయ కారణాత్మక వేదనాదబ్రహ్మముయొక్క ప్రతిబింబముగాని యీ జగమంతయును వాస్తవము కానేకాదు. మఱియును "అశరీరమాత్మ" అనుటచేత మిథ్యాభూత మగు పాంచభౌతిక దేహసంబంధమగు కోర్కె యొద్దియున్లేని బ్రహ్మస్థితినందుటయే పరమపురుషార్థము గనుక నట్టి పరమభాగవతపదవి కెక్కించు మెట్టు సకలలోకరజంకమగు నడత, అట్టి జనరంజకమగు నడతను ద్రికరణశుద్ధిగా జనరంజకముగా మనోవాక్కాయ కర్మరూపక నామరూపాత్మక వాచికాంగికాహార్యసాత్త్వికాభినయములం బౌరుషమునఁ బ్రకటించుచు సకలలోకరంజకముగాఁ దన బ్రతుకు న్గొనసాగించుమని సర్వేశ్వరు నహర్నిశము ప్రార్థించు పరమభాగవతులగు విద్వాంసుల నాశ్రయించి పామరు లిహపరములం దరించవలెం దరించవలెను. గోడలేక చిత్రరచనము కలుగనేరకుకదా! "శ్రుతిః మాతా లయః పితా" అను విధమున నెద్దియో యొక యాధార మొక పాదేర్పర్చుకొని జనరంజకమగు తీరుననొక తెప్ప నానుకొని యీఁతాడు వాఁడు ప్రవాహానుసారముగాఁ దన తెప్పం ద్రిప్పుకొనుచు నొరులఁ దరింపఁ

చేసి తాఁ బరింపఁగలిగిన బుద్ధి యో యాప్తవాక్యము సూఁతగాఁ జేసి
కొని బ్రాహ్మణాది పంచజనజాతిమర్యాద నెద్దియో యాశ్రయించి
తన తోడిపాటి జనుల ప్రేమానురాగముల సంపాదించుకొను తీరున
నేయొండ బాగొడుగు పట్టుచు దేశకాలపాత్రానుసారముగా నడుచు
కొనుచు నుభయలోకములం దరింపఁజేయుమని దైవమును సంతతము
నిర్మలాంతరంగభక్తితో వేఁడుకొనుచు నొరుల సుఖపెట్టి తా సుఖ
పడుట మర్త్యవిహిత ధర్మము. జనకంటకుఁడైన దుర్బుద్ధి వేదమంత్ర
ములు పఠించి ముసిఁడిపండువలె నింపుగాఁ గన్పట్టినప్పటికి సకల
శాస్త్రార్థము చేయఁగలిగినప్పటికి జాతినీతి మర్యాదలం బ్రవర్తించు
నేర్పు కలిగినప్పటికి నూరునోము లోకకంటకుతో సరియన్న బ్రహ్మ
నిష్ఠలు తాల్చినప్పటి కుభయలోక భ్రష్టుఁడు కాకమానఁడు
మానఁడు. "సర్వేజనాః సుఖినోభవంతు" అనుకోర్కెతోఁ ద్రికరణ
శుద్ధిగా బ్రతుకువాఁడు మాత్రమే నిజముగా మనుష్యుఁడు గాని
స్వార్థైకపరుఁడైన లోకకంటకుఁడు "బుద్ధిభ్రంశాద్వినశ్యతి" అను భగవ
ద్వాక్యానుసారముగా సకల వేదశాస్త్ర పండితుఁడుగా నీలోకోత్తర
బలశాలిగానీ చక్రవర్తిగానీ మఱేయైహిక విభవములందనీ యెన్నాళ్లు
బ్రతుకనీ సకలలోకగర్హితుఁడై వెఱ్ఱికుక్కవలె నొరుల బాధించి
యొరులచే బాధింపఁబడక తీరదు తీరదు.

"వస్త్రేణవపుషావాచా" అనుతీరునఁ దనతోడిపాటివారికిరంజక
మగు విధమునఁ దొడవులు దాల్చవలెను. దేహమును బాగుపఱ్చు
కొనవలయును. త్రికరణశుద్ధిగాఁ బ్రవర్తింపవలయును. "అస్వర్గ్యం
లోక విద్విష్టంధర్మమపినాచరేత్, వేగవేదాంగ వేత్తాపి లోకాచారం
నలంఘయేత్" అను తీరున శకాదేల పాత్రోచితముగా జనరంజనము
చేయఁజాలని మనోవాక్కాయకర్మములు వేదశాస్త్రచోదితధర్మము

లయినప్పటికి స్వాతంత్రించి చేయఁగూడదు. సకల వేదశాస్త్రములను దేశకాల పాత్రానుసారముగా సకలజనరంజకముగా మనోవాక్కాయ కర్మముల నడిపించిన జనులే యిహపరములం దరింపఁగలరని ముఖ్యాభిప్రాయ మిచ్చుచున్నవి. షడ్జర్షభ గాంధారమధ్యమ పంచమ ధైవత నిషాదపర్యాయములగు సప్తస్వరములతో నార్చికాది సంజ్ఞలతో నుదాత్తానుదాత్త స్వరిత ప్రచిత నిఘాతసంజ్ఞలతోను మృదు దీప్తాది శ్రుతి జాతుల న్వోలయు స్వరమండలియంగుళీ వీణాదిన్యాసములతో ఋగ్యజుస్సామవేదపఠన మనాది సంప్రదాయపద్ధతులతో నియమింపఁబడెను. దీప్తాయతా కరుణామృదుమధ్యలను శ్రుతిజాతుల న్వోలయు సప్తస్వరములును ఋగ్యజుర్వేద పఠనమునందును సామవేద గానమునందును జెప్పఁబడిన షడ్జాది సప్తస్వరోచ్చారణ పద్ధతులును వేదసంజ్ఞం బరఁగు సుప్తిగంత పదరచనా విశేషోచ్చారణ పద్ధతులును కేవల పారలౌకికా పూర్వస్వర్గ ప్రాపకకారణము లగుటచేత వేదములకు మాత్రమే శిక్షావ్యాకరణచ్ఛందో నిరుక్త జ్యోతిషకల్పవిధు లేర్పడినవిగాని సంస్కృతాపభ్రంశాదిభాషలకై దేశకాలపాత్రోచిత రంజక మార్గములు తప్పమఱే నియమములుండనికిరావు.

వేదములయందలి సప్తస్వరాత్మకోదాత్తానుదాత్తస్వరిత ప్రచిత నిఘాత పద్ధతులుగాని యాంగికాహార్య సాత్త్వికాభినయ విశేషనియమములుగాని వ్యావహారిక భాషలకుఁగాని కేవల ధ్వన్యాత్మ శబ్దమునకుఁ గాని యాంగికాహార్య సాత్త్వికాభినయ విశేషములకుఁగాని పనికిరావు. ఏదేశమం దేకాలమం దెట్టి జనులలో నే యాచారము జనరంజకమగునో యా యాచారానుసారముగా నామరూపాత్మక చతుర్విధాభినయములం బ్రయోగించి యొరుల సుఖపెట్టు నేర్పరి యొరులచేఁ దా నాదరింపఁబడుటకన్న బ్రతుకునకు వేఱె వేఱేనియమము లక్కఱకావు. వైదిక పద్ధతి లోకవ్యవహారమునకుఁ బనికిరాకుండు

టయే గాక జనులకుఁ బరస్పరద్వేష జనకమై కేవలము పరిహాసాస్ప దము కాకమానదు. "ఊరికి జోగి వెఱ్ఱి జోగికూరు వెఱ్ఱి" అను సామెతగా కేవల పారమార్థికములయిన వైదిక సంప్రదాయము లైహ లౌకిక వ్యవహారముల నవలంబింప శక్యముగాదు. సూర్యబింబమును ముండలో దాఁచుకొనన నెవరితరము ? వైదికుల మనియు శ్రోత్రియుల మనియు వేదపాఠకుల మనియుఁ గులగోత్రములు కలవారమనియు శ్రౌత స్మార్తక్రియానిష్ఠుల మనియు నీషణత్రయ వశులై సంచ రించు ధూర్తజనులు పరిహింసాపరులై స్వార్థైక తత్పరులై పరస్పర జనద్వేష ముఖ్యహేతువులై పరులం జెఱచి తాముభయలోక భ్రష్టు లగు దుష్టులుగాని నిక్కముగా శిష్టు లెంతమాత్రము న్గారు. వేద శాస్త్ర విహిత ధర్మాచరణమున కధికారులు సాధన చతుష్టయ సంపన్నులగు మునులు గాని సంసారు లెంతమాత్రము దగరు. సంసా రుల కన్యోన్య ప్రేమానురాగములం బుట్టించుకొను విధమున దేశ కాల పాత్రాను సారముగా నడుచుకొనుటకన్న వేఱే యిహపరసాధక పద్ధతి మాటలందుఁ గాని పాటలందు గాని పనులందుగాని మఱే నడతల యందుఁగాని యే వ్యవహారమందుఁ గాని కూడదు.

నిత్యము లపౌరుషేయము లనంబడు "అగ్నిమీళే" అను మొదలగు వైదిక శబ్దముల నుచ్చరించుటలోను వ్యుత్పత్తి యేర్పఱచు టలో నర్థము వివరించుటలోఁ దన్విహిత కర్మాచరణము గూర్చియు మఱి యా వైదిక శబ్దములకుఁ జరణము లేర్పర్చి లయకాలాను సారముగా నడిపించుట విషయమై పౌరుషేయములుగాఁ బ్రవర్తిలు శిక్షావ్యాకరణ నిరుక్త కల్పచ్ఛందో జ్యోతిషములు కూడఁ గేవల వైదికములు గావుననే వేదాంగము లనంబడినవి. కాఁబట్టి శాస్త్రీయ నియమము లెవ్వియును సంసారులకు వ్యవహార దశయం దేమాత్ర మవలంబ్యములు కారాదు. సన్న్యాసికి గార్హస్థ్య ధర్మ మెట్లు పనికి

రాదో వేదశాస్త్ర పద్ధతులు సంసారమున కట్లు తగదు "మనుష్యావా ఈడేన్యాః" వా శబ్దముం బట్టి స్తోత్రమునకుఁ దగినవారు ప్రియు లగుట మిక్కిలి న్యాయమేగాని నిక్కముగా స్తోత్రమున కెంత మాత్రము దగని మనుష్యులు కూడ స్తోత్రప్రియులని తేలుచున్నది. స్తోత్రమనఁగా స్వాధీనము చేసికొనుటకై సల్పెడు ప్రియాచరణము. లేని సుగుణము లున్నట్లు పొగడినప్పటికి మనుష్యు లుల్లసిల్లెదరు. కాఁబట్టి మనుష్య ప్రవర్తక మశాస్త్రీయమును బ్రమాదకరమైనప్పటికి న్వేదశాస్త్ర సమ్మతమనియును బొరపాటులేని నడతయని యొక్కం డొకనిం గొనియాడనప్పుడా మనుష్యుఁ డుల్లసిల్లి తనతోడిపాటి జనులు తా సుగుణశాలియని పొగడురీతిగా సకలలోక సమ్మతముగా నడుచుకొనుట మనుష్య స్వభావమని తెలిసిన సర్వజ్ఞులగు మునులు మనుష్యులం దనాదికాలమునుండియును దేశకాల పాత్రానుసార ముగా వివిధజాతి మర్యాదలున్నా లోకరంజక ప్రవర్తన పద్ధతు లేర్పర్చి పిల్లలకుఁ బెద్దలు బాగుపడు తెన్నగపర్చునట్లు వేదవేదాంగా ద్యష్టాదశ విద్యలుపదేశించిరి.

సూర్యుఁడు భూగోళము నంటీయంటక లోకబాంధవుఁడై వెలయునట్లు వేదశాస్త్రములు సంసారుల నంటీయంట కనాదిగా మనుష్యలోకముసుద్ధరించుటకై యిహపర సంతారక మార్గ భోధ కములగు నామరూపాత్మక చతుర్విధాభినయ విశేషముల సహజ ముగా నడిపించుచున్నవి. సూర్యబింబము నీటికుండలోఁ బ్రతిబింబించు నట్లు మనుష్యులందు వేదశాస్త్రములం బేర్కొనఁబడిన జాతి నీతులు స్ఫటికమందలి జపాపుష్పచ్ఛాయవలెఁదోఁచుచున్నవి. కాని వాస్తవ ముగా నీ లోక వ్యవహారము స్వప్నజగమువలె మాయాకల్పితము గనుక నిత్యులగు జీవాత్ములందు బ్రాహ్మణాది జాతులు శ్రౌత స్మార్త క్రియాకలాపము న్వావి వరుసలు స్త్రీపురుష విభేదము న్నామరూప

విశేషము లన్నియుం గృత్రిమములు మిథ్యలు నగాని వాస్తవములుకావు నిశ్చయముగా వేదపురుషాత్మకమగు నాదబ్రహ్మముకన్న సత్యపదార్థము మఱి లేనేలేదు. కావునఁ దనకు లేని భావనాశ్వము బ్రతికున్నను మఱేమయినను దన కేమి కొఱఁత? విష్ణుమాయాబద్ధులై జీవులహంకార మమకార విమూఢాత్ములై తమకు లేని గుణములు తమకున్న ట్లారోపించుకొని రాగద్వేషములు సుఖ దుఃఖములందు ననాదికాలము నుండియు నెడతెగని సంసారతాపత్రయ సంతప్తు లగుచుం బరమకారుణికులయిన మునుల యనుగ్రహమునఁ దత్త్వజ్ఞాన బోధితులయి వైరాగ్యమంది "త్రిపాదస్యామృతం దివి" యని పేర్కొనఁబడిన విష్ణుపదమందు లయముం బొంది కైవల్యానందమందుచున్నారు. "నియమంబుగలచోట నిలుచును సిరులు" అను నీతి చొప్పున జాతి నీతులుకల మనుష్యులు లోకోపకారము చేయఁ గలిగి యొరులఁదరింపించి తాము తరించగల "సహవాసతో దోషగుణాభవన్తి సహవాసతః పుణ్యగుణాభవన్తి దేశాటనం పండితమిత్రతాచ వారాంగనా రాజసభాప్రవేశః" అను తీరున సహవాసమునుం బట్టి మంచిచెడ్డలు తప్ప కలవడకతీరదు. కాఁబట్టి తమతోడిపాటి జనుల సుఖపెట్టి తాము సుఖముగా బ్రతికెడివివేకవంతులగు పెద్దల నడత ననుసరించి పిన్నలు తాముగూడ నిహపరములం దరింప వలయును.

## శిష్టాచారము - మానవోచిత ధర్మము

"పిక-నేమ-తామరస" అను శబ్దము లార్యభాషయందు కన్పట్టక మ్లేచ్ఛభాషితములయినప్పటి కార్యజన గ్రాహ్యములయిన విధమున వేదశాస్త్రానుసార ధర్మములందు సంసార వ్యవహార ధర్మములు చేరనప్పటికి లోకోపకారకము లయ్యేనని యట్టిసంసార

వ్యవహారప్రవర్తనకు జాతిమతాచారానుసారప్రవర్తనముగూడ సకల
మునిసమ్మతమై యుభయలోక సంతారకము తప్పకగును. శంకరా
చార్యుఁ డాజన్మసిద్ధుఁ డద్వైతబ్రహ్మమూర్తియైనప్పటికి లోకసంగ్ర
హార్థమై షణ్మతస్థాపకుఁడయ్యెను. కాఁబట్టి వేదశాస్త్రవిహితధర్మా
చరణము మనుష్యు లతిక్రమింపఁగూడదు. కూడదు. దేశకాలపాత్రాను
సారముగాఁ బెద్దలు నియమమున నడిచినజాతి నీతులం బిన్న లనుస
రింపక తీరదు. మఱియు నాస్తికులై శ్రద్ధాభక్తులన్మాని వితండవాద
ములో విపరీతజ్ఞులై జనకంటకులై దురభిమానమున స్వతంత్రించి
ప్రాచీన శిష్టాచారముల న్గాని యనాది సంప్రదాయ సిద్ధములగు జాతి
నీతులన్గాని తప్పి మెట్ట వేదాంతములు బల్కుచుఁ జెడగొట్టులు కాఁ
గూడదు. జనులం బరస్పర ప్రేమానురాగములు పుట్టించు విధమునఁ
బూర్వులే వేదశాస్త్ర పద్ధతు లనుసరించి తరించిరో యట్టి ధర్మమార్గ
మునం బిన్నలు నడువక తీరదు. కాఁబట్టి యే దేశమునం దేకులము
నందు మనుష్యుఁడు పుట్టెనో యామనుష్యుఁ డా దేశ కుల సంప్రదాయ
ము లనుసరించి తనతోడిపాటిజనుల కనుకూలముగా సర్వభూతదయా
పరుఁడై యొరులసుఖము తనసుఖముగా నొరులకష్టము తనకష్టముగాఁ
త్రికరణశుద్ధిగా భావించుకొని స్వకులాచారముం దప్పక ప్రవర్తించి
యిహపరముల న్సాధించి ప్రకృత కాలమునకుఁ దగునట్లు దేశకాల
పాత్రోచితముగాఁ జనరంజకముగాఁ జతుర్విధాభినయ విశేషముల
నొరుల సుఖపెట్టి తా సుఖపడుటమేలు. ఏజంతుహింసయు నెట్టినెప
మునైనఁ జేయకెట్లు తనతోడిపాటి జనులు తన్నానందించెదరో
యన్ని విషయములందుఁ దా నట్లు మంచిగ నడువవలయును.

వేదశాస్త్రపద్ధతులు లోక వ్యవహృత కార్యకారణముల
వ్యక్తములు భగవత్సంకల్పములవలె సకలలోక వ్యవహారమూలము

లయ్యు నతీంద్రియ మునైహిక గ్రాహ్యములుగాని మర్త్యవేద్యములు గానేకావు. వైదికశబ్దములకును లౌకికశబ్దములకును బింబప్రతిబింబ ములవలెఁ బోల్కియున్నప్పటికి వాస్తవ సంబంధములేదు. వీలుశబ్ద మున కార్వభాషలో నొకవిధమైన వృక్షమని యర్థము మ్లేచ్ఛ భాషలో నేస్గువ కర్థము ధ్వనియొక్కటియైనప్పటికర్థము వేఱు. కావల సినది వ్యవహారమున్దెల్పు నర్థముగాని యర్థరహితమయిన కేవల శబ్ద మాత్రముకాదుగదా! కాఁబట్టి తనతోఁడిపాటిజను లేయర్థ ముద్దే శించి యెట్టినామరూపముల నెల్లడించుచున్నారో యట్లే మనుష్యుఁడు నడుచుకొని తనవారి నంతోషపెట్టి వారి యనుగ్రహమును సంపా దించుకొని తా సుఖముగా బ్రతుకుటకన్న మనుష్యుఁడాచరింపవలసిన ధర్మ మింకెద్దియు న్లేదు.

“బ్రహ్మాణ స్పతి రేతాసంకర్మార ఇవాధమత్, దేవానాం పూర్వ్యేయుగే౽సతః సదజాయత” అనుఋక్కునందలి యక్షరముల మీఁది నిల్వుగీఁటులు తారస్థాయియు నక్షరముల క్రిందున్న యడ్డ గీఁతలు మంద్రస్థాయియును మఱియేగీఁట్ల గుర్తులున్లేని యక్షరములు మధ్యస్థాయియును దెల్పును.

సారినీసరినీసా<br>బ్రహ్మణస్పతిరేతా } అని యేయక్షరములమీఁదనిల్వుగీతలున్నవో యా యక్షరముల నుదాత్తశ్రుతితో ననఁగాఁ దారస్థాయిస్వరముల తోను మఱి గుర్తులులేని యక్షరములే శ్రుతికి హెచ్చుస్వరశ్రుతియు మఱియుం దగ్గుస్వరశ్రుతియుం బ్రవర్తిల్లునో యట్టిస్వర శ్రుతితో నుచ్చరించవలయును. షడ్జస్వరముకంటె ఋషభస్వర ముదాత్తము

మఱి నిషాదస్వర మనుసాత్త్రము. కాఁబట్టి షడ్జము మంద్రస్థాయిగా నాధారముచేసికొని షడ్జ శుతికంటె హెచ్చుగా నసఁగా దారస్థాయిగా ఋషభస్వరమును మఱియు నాషడ్జస్వరముకంటెఁ దగ్గుగా నసఁగా మంద్రస్థాయిగా నిషాదస్వరముం బల్కువలయును "అన్నమా...ధపతి యగు నడతియను దేవత యీదేవతలయొక్క పుట్టువులను గొల్మితిత్రినూఁదువాసివలెఁ బ్రజ్వలింపఁజేసెను. సృష్టికిముందు నామరూపములులేని వస్తువునుండి నామరూప విశేషములుగల జగము కలిగెను." అని యీ ఋగ్వాక్యమున కర్థము గదా! అర్థవంతములయిన షడ్జాది సప్తస్వరాత్మ కోదాత్తానుదాత్తస్వరిత ప్రచయనిఘాతసంజ్ఞికమయిన యవ్యక్తనాదము పరాపశ్యన్తీ మధ్యమా సంజ్ఞల స్థూలరూపముగా వ్యక్తీకరించి వర్ణాత్మక ఋగ్వాక్య రూపముగా వినంబడెను. మఱి యతీంద్రియద్రష్టలు సర్వజ్ఞులు నగుమునులు లోకరక్షార్థమై మనుష్యులకా ఋక్కులు విన్పించిరి కనుక ననాదికాలమునుండియు నాఋగాది వేదమంత్రములు పారంపర్యముగా గురూపదిష్టము లయి మనుష్యలోకమున వర్ణక్రమమును బదసందర్భము నొకింతయును మాఱక యథాపూర్వ శ్రుతముగా నొక్కరీతిగాఁ బఠనపాఠముల న్సుస్థిరములయి ప్రవర్తిల్లుచున్నవి. నానావిధములుగా వికారమందుచున్న పృథివ్యప్తేజో వాయుసమ్మిళిత పదార్థముల కాధారమైన నిర్వికారమైన యాకాశమువలె నానావిధములుగా ధ్వన్యాత్మక వర్ణాత్మక శబ్దముల యుత్పత్తిస్థితి నాశముల కాధారమై నిర్వికారమైన నాదబ్రహ్మము వెలయుచున్నది. సకలలోక వ్యవహార బోధకమయిన యుపారుషే యావ్యక్తనాదబహ్మముయొక్క వ్యక్తదశ ఋగాది వేదత్రితయమై శ్రవణగ్రాహ్యముగా ననాది సంప్రదాయానుసారముగా గురు

పారంపర్యముగా నుపదిష్టమగుచున్నది. కాఁబట్టి యపౌరుషేయ వేద మంత్రార్థములంబట్టి సర్వజ్ఞు లతీంద్రియద్రష్టలు మనుష్యులకు హేయోపాదేయములం దేశకాలపాత్రానుసారముగా స్మృతిముఖముల ననాదికాలమునుండియు న్వెల్లడించిరి.

కాఁబట్టి యేదేశముల నేకాలమం దేసంప్రదాయమున నే యేకర్మము లెట్లెట్లున్నవో యారీతి న్మనుష్యు లవలంబించిన న్గాని వారిలో వారికిఁ బొందు పొసఁగదు మనుష్యపరిష్ట సంప్రదాయాను సారముగ నడుచుకొన్న జనుల కన్యోన్యకలహము లుండవు వేద శాస్త్రానుసారముగా నడువని విపరీత దుష్టజనులు పరస్పర ప్రేమానురాగము లెడసి యన్యోన్యముం గొప్పవారమనుకొని యహంకార మమకారబద్ధులై కొట్లాడి తన్నుకొని యిహపరములకుం జెడియుదరు. తల్లిదండ్రులు గురువు లాప్తులగు తెలిసిన పెద్దలు కేవల లోకోపకార పరులై యుపదేశించిన మార్గముంబట్టి భక్తిశ్రద్ధలతో నడుచుకొను బుద్ధిమంతులు సకలలోకరంజకులై మనోవాక్కాయకర్మము లాచరించి యొకలన్సుఖపెట్టి తాముసుఖపడియుభయలోకములంబరించెదరు కుతర్కముచేయు పండితమ్మన్యులై స్వార్థైకపరులై యనాదిసంప్ర దాయాను సారముగా వంశపారంపర్యముగావచ్చుచున్న పూర్వాచారములు జంతుహింసాపరములు కానిచో మఱియుం జనులకుఁ బరస్పరద్వేష మొనరింపకున్నచోఁ దమయిష్టానుసారముగా మార్చి పూర్వాచారపరాయణులగు పెద్దల న్నిందించు దుష్టు లుభయలోక భ్రష్టులై చెడెదరు. కాఁబట్టి యేదేశమం దేయాచారములు ప్రాణి హింసను విధింపక జనులందఱఁ బరస్పర ద్వేషమును కల్పింపక కుల క్రమాగతములై వచ్చుచున్నవో యట్టి శిష్టాచారములంబట్టి యిహ పరసౌఖ్యము న్సాధించుకొనుట మానవోచిత ధర్మము జనులకుం

బరస్పర కలహముగాని జంతుహింసనుగాని వేదశాస్త్రములు రవంత యు నొప్పఁ బోధింపవు. సకల వేదశాస్త్రములయొక్క ముఖ్య సమన్వయార్థాభిప్రాయము సకలభూతదయ గలిగి జను లన్యోన్యస్వార్థ ములతో హాయిగా దమబ్రతుకుం గొనసాగించుకొనుటకుఁ బ్రయ త్నించవలయునని. మఱియుం దమపూరుషార్థమును సఫలింపఁజేయు టకై నిర్మలాంతఃకరణముతో భక్తసులభుఁడగు పరమేశ్వరుం భజించుచుంట యనియే.

షడ్జస్వరము కెందమ్మివంటి చాయగలిగినదయి మిక్కిలి జగదా హ్లాదకరముగాఁ బాడుచుం ద్రిభువనవంద్యయగు శ్రీదేవతయనిసర్వజ్ఞు లయిన మును లుపదేశించిరి. అతీంద్రియద్రష్టలు సర్వజ్ఞులు సకల లోకబాంధవులగు ఋషులు నిక్కముగా యథాదృష్టములు శ్రుతము లగు వివిధ స్వానుభవములను కేవల లోకోపకారపరాయణులై యుపదేశించినశాస్త్రములనుట తప్పుగానేరదు.పృథివ్యప్తేజోవాయ్వా కాశములను పంచభూతములు పరస్పరముం గలిసియున్నవిగాని దేని మట్టుకు దానికిఁ బ్రత్యేకస్థితి లేదు. పరమాణువులను కొలత పృథి వ్యప్తేజోవాయువులకుఁ దార్కికులు శిష్యబోధకై చేసిన యేర్పాటు గాని యాకాశము వలెఁ దక్కిన నాల్గు భూతములు ప్రభువులే యంత టను వ్యాపించియున్న యవియె. మఱియు నొక్క యాకాశమే మహాభూతమై పృథివ్యప్తేజోవాయు రూపములనింద్రియ ప్రత్యక్షమగు చున్నదనఁగా నాదబ్రహ్మమునుండి పరాశక్తి మధ్యమలను స్వర్గ మర్త్యపాతాళాకాశము లోనవి శబ్దమను గుణమును శ్రవణేంద్రియ గ్రాహ్యముగా వెల్లడించుచున్నవి.గంధ రసరూపస్పర్శగుణములతోడి పృథివ్యప్తేజోవాయువు లాకాశమందు మఱి యాకాశము నాద

బ్రహ్మమునందును లయమగుచున్నవి. వాస్తవముగా నాదబ్రహ్మమే సత్త్వరజస్తమోగుణములం దాల్చిన కాలమందు సర్వజగద్రూపమునం దన్నుఁదా వేఱుగాఁ జూచుకొనుచు మఱొకప్పుడు త్రిగుణమయ నిజ లీలా విలాసము స్వసమాధి స్వభావమునం జాలించుకొని కైవల్యస్థితి నందుచున్నది. శబ్దస్పర్శరూపరసగంధముల న్వేలయు నాకాశ వాయ్వగ్ని జలపృథ్వ్యాదు లన్నియు నాదబ్రహ్మముయొక్క త్రిగుణాత్మక లీలా విశేష ప్రవృత్తములుగాని నిక్కముగా స్వప్న జగత్కార్యముల వలె మిథ్యలేగాని వాస్తవము లెంతమాత్రము న్గానేకావు. "మాయా మాత్రమిదం విశ్వమద్వైతం పరమార్థతః" అనెడు నాత్మజ్ఞానాను భవానంద మందుటకై వేద శాస్త్రోపదిష్ట ధర్మమార్గ గమన క్లేశము, చల్లని చెట్టునీడ సుఖమనుభవించుట యెండలోఁదిరిగెడి కష్టమువలెఁ గారణమగునని యతీంద్రియ ద్రష్టలగు మునులు పామరజన బోధకై వేదశాస్త్రములద్వారమున నాదబ్రహ్మమును జగద్రూపమున జీవాత్మ లయి తమకుఁ దామే గురుశిష్యరూపముల త్రిగుణమయలీలతోఁ బాంచ భౌతికోపాధుల నుద్భవస్థితి నాశములం గుచుఁ జతుర్విధాభినయ విశేషముల న్నవరసాస్వాదన మొనర్చుచుం గ్రీడించుచున్నారు. ఎద్దియొయొక విశ్వాసముచేతఁదనకు సహజముగాఁదోఁచిన తత్త్వముం బ్రతిమానవుఁడు ప్రమాణ ప్రమేయాది పదార్థ కల్పన మూహించు కొని "ఇదమిత్థమేవ" అని నిశ్చయించుకొని సంతుష్టుడై బ్రహ్మానంద మనుభవించుచున్నాఁడు. అహంకార మమకారము లుడిగి పరవశుఁ డైనపుడుగాని జీవుఁడు సంసారము న్దాఁటిఁగి కైవల్యానంద మనుభవించ నేరఁడుకదా!

అహంకార మమకారములుడిగించి పరవశత పుట్టించు శబ్ద స్పర్శరూపరసగంధము లన్నియునుం బరమాత్ముని గుణమయ లీలా

స్వరూపక నామరూపాత్మక చతుర్విధాభినయ స్వరూపమై మూర్తీభవించిన గాంధర్వవేదమే. కాబట్టి నామరూపాత్మకము లగుసమస్త జగత్కార్యములు వాచికాంగికాహార్య సాత్త్వికాభినయ విశేషముల నొప్పారుచున్న మహానటుఁడగు శివునియొక్క తాండవవిశేషములై యాకాశ మొకప్పు డాకస్మికముగాఁ గారుమబ్బుల నలమికొని శబ్దస్పర్శరూపరస గంధవిశేషము లుత్పత్తిల వర్షించు చందమున నాదబ్రహ్మము శబ్దస్పర్శ రూపరసగంధ విశేషము లొప్పారు షడ్జాదిస్వరములం బంచేంద్రియ ప్రత్యక్షమగుటకు సందేహమేమి? కాబట్టి షడ్జస్వరము కెందామరవలెనెఱ్ఱనిదను మునికృతశాస్త్రముకల్లగాదు ఆ నాదబ్రహ్మము "శ్రోతవ్యో మంతవ్యో ధ్యాతవ్యో నిధిధ్యాసితవ్యః" అను రీతిగా పంచేంద్రియ ప్రత్యక్షమై వెలయుచున్నది.

కేవల శ్రవణగ్రాహ్యమైనప్పటికిం దక్కిన యింద్రియములచేతఁగూడ ననుభవింపఁబడును. ఆకసము శబ్దించును. గాలివిసరును, వానగురిపించును, నేల నన్నిపుట్టించును, పాంచభౌతికము కానిపదార్థమే లేదు. గుణమయములై సమ్మిళితములైన పంచభూతములలో సహజకాలసిద్ధమైయే భూతగుణము ప్రకోపించి స్థూలదశ నందునో నాయాగుణ మాయాయింద్రియ దృష్టమగును. నామరూపాత్మక జగత్తుగా నాదబ్రహ్మము నిజలీలచేనవి...... శ్చములయి తనకుఁదా వేత్తై జీవాత్ముఁడై కించిజ్ఞత నాటాడుకొనును. పరమాత్ముఁడై, సర్వజ్ఞతఁ దనకంటె నన్యమెఱుఁగక కైవల్యానంద మందుచుండును. కాబట్టి పరబ్రహ్మ సాగరతరంగముయొక్క యుద్భవస్థితి నాశాత్మక సంసారానంద దశ క్షణికబుద్బుదము వంటిది.

కాన "పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి" అను శ్రుతి ప్రవర్తిల్లెను. అహంకార మమకారాత్మక జగదవస్థలుపర

మాత్మని బ్రహ్మానంద సముద్రమునందలి తరంగ బుద్బుదములవలె క్షణికవికారములు కనుకనే "యేన భూతాని జాయంతే యేనజాతాని జీవన్తియం ప్రతి సంవిశన్తి" అనుటచేత బుట్టుటయు నిల్చుటయు గిట్టుటయును బ్రహ్మానంద విశేషము లేకనుక "రసో వై సః" అనుటచే శృంగారాది రసము లన్నియుం బ్రహ్మానందాస్వాదన యోగ్యములయిన రసములని యానందించుట ఒక్క బ్రహ్మమే నవబ్రహ్మలయి లోకముల సృజించినట్లు ఒక్క రసమే శృంగారాది నవరసములై జీవునకుం బారవశ్యసుఖము బుట్టించుచున్నది. నిద్రాహారములు మఱచి స్త్రీపురుషు లొండొరు సహవాసముం గోరుకొనుట తన యనుకోనని యాకస్మికాపదవస్థకై నవ్వుకొనుట తప్పిపోయిన పిల్లలు క్షేమముగా దొరికినతోనే కన్నీరు వంచుకొనుట ఆపదసన్నాహాదులను చర్మప్రాణము అర్పించుకొనుట—స్వప్నజగమువలె నసంగుడగు నాత్మునకీ మిథ్యాప్రపంచ మెట్లు వాస్తవముగాఁ దోఁచుచున్నదో యని యబ్బురపడుట, సజ్జనులన్వేడిపించు దుర్జనుల రూపుమాపఁ గనులెఱ్ఱచేయుట—నాలోని కామక్రోధలోభమోహమదమత్సరములను నంతశ్శత్రువుల నోర్చలేని యసమర్థుఁడు న్లోకులకే నెట్లు పచరింపఁగలనయ్యో యెంతపనికి మాలినవాఁడనని జుగుప్సపడుట నాపౌరుషము దైవముపట్ల నొక గ్రుడ్డిగవ్వకైన మాలునా? విధి నెదిరింపనాతరమా యని దేవునకు వెఱచుట—నా యహంకార మమకారములేకదా నన్నీ సంసారతాపత్రయ సంతప్తునిగావించుచున్నవి. "సుఖస్యానంతరం దుఃఖందుఃఖస్యానంతరం సుఖమ్" అనునట్లున్న యీసంసార సుఖదుఃఖములు రెండును నాకు వలదువలదు "పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్" అని దృఢభావనాభ్యాసమున పరవశుఁడగుటయు నిట్లుశృంగార హాస్యకరుణ వీరాద్భుత రౌద్రబీభత్సభయానక శాంతరసాస్వాదనపరవశుఁడై నిత్యుఁడై యద్వితీయుఁడై నిర్గుణుఁడై నిష్కాముఁడై

జీవుఁడీశ్వరున కభిన్నుఁడై యున్నాఁడని జగద్గురుఁడగుశంకరాచార్యుఁ డనవరత నిశ్చలాద్వైతాదిత్యరూపమున సకలజనప్రత్యక్షుఁడై లోకలోచనుఁడగు పరంజ్యోతియై వెలుంగుచున్నాఁడు. నామరూపాత్మకమగు నీజగత్తు వాస్తవముగ యతీంద్రియముగనుక బాహ్యదృక్కులగుసంసారులందరింకఁజేయుటకై వేదశాస్త్రప్రముఖముల స్థూలతత్త్వరూపమును, మునులవ్యక్తతత్త్వమును వ్యక్తపఱచుచున్నారు. అ-ఇ-మొదలు...హల్ మొదలగు హల్లులు ప్రత్యేకముగా హ్రస్వదీర్ఘప్లుతాది కాలజ్ఞానముతో నుదాత్తానుదాత్త స్వరములతోను...స విశేషములతోను ప్రయత్న విశేషములతో నొక్కటి వ్యవహారయోగ్యముల ననంతమయునయిన కొలత కనంత సంఖ్యాకభేదములుగాను బిగియింపఁబడియును. ప్రత్యేకముగాగాని, నానావిధములం గలిసిగాని, నానావిధార్థము లిచ్చు సంస్కృతాద్య నిర్వచనీయవైఖరీ శబ్దమయానంత సంఖ్యాకభాషలై, మనుష్యులచే వ్యవహరింపఁబడును ......లువున నానావిధాంగ విన్యాస విశేషాభినయవిశేషములతోడను మఱియు వివిధ రూపానంతవిధసాత్త్వికాభినయ విశేషములతోడను వాచికాంగికాహార్యాద్యభినయాత్మకమై మనుష్యులనుండి వెలుపడుచుండును స్వరకాలస్థాన ప్రయత్నములం బట్టి బోధరూపకా...ది విధములుగా నచ్చుగాని హల్లుగాని వ్యవహరింపఁబడుచు నచ్చు హల్లురూపములు గలిసిగాని యాంగికాహార్య సాత్త్వికాభినయ విశేషములతోఁగూడిగాని వివిధమాత్ర గ్రాహ్యములై గాని దేశకాలపాత్రములం బట్టి ధ్వన్యాత్మకములయి భాషావిశేషములయి మనుష్యులచే వ్యవహరింపఁబడును. ఈ రీతిగ ననాదికాలము నుండియును మారుచువచ్చుచున్నవి. పరాపశ్యన్తీ మధ్యమశబ్దముల హెచ్చుతగ్గుల మంద్రమధ్య తారస్థాయిలతో తీవ్రకోమల తమ విశేషములన్నిలంబ్రమితము ... న్నవరతమున్ గీతవాద్యముల

న్వాలువడి యాంగికాహార్య సాత్త్వికాభినయప్రవృత్తి విశేషజనక మయి ... కేవలముగాను మతివర్ణాత్మకముగాను వ్యాపింపబడుచున్న మైనా...తౌర్యత్రికమనియు సంగీతమనియును ఛందోభాషాత్మకమయి పరగుచున్నది. షడ్జాది... యిలంబరగుచున్నది. ఋగ్యజుస్సామ వేద మంత్రాక్షరములుచ్చరించుటలోనియమిత ... స్వరకాలస్థానప్రయత్న విశేషములు కేవల మతీంద్రియ ద్రష్టలగు మునులకు మాత్రమే విదితము.

ఇది శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాస విరచితమగు జగజ్జ్యోతి
యందు దైవపౌరుష నిర్ణయ విచారణ నిర్వచనము

—o—

# జగజ్జ్యోతి

## ఎనిమిదవ ప్రకాశము

### నిత్యశుద్ధ బుద్ధముక్త బ్రహ్మస్వరూపము

ఏవస్తు "వంద్దైనను రాగపడ కుండుటచేతను మఱే భోగమైనఁ గోర కుండుటచేతను మనస్సు క్రమక్రమమున నలవాటుచే చిత్తమున వశమయియుండును." అను వచనములఁ బట్టి యింద్రియములను బురుష ప్రయత్నముచేత జయింపవచ్చును. సూర్యచంద్రాది గ్రహచారముచేతను నక్షత్రగతులవల్లను రేలుంబవళ్ళు ఋతువుల మాఱువు మొదలగు కాలభేదములచేతను పంచభూతమయములగు దేహములందుఁ గలుగు నుద్భవస్థితినాశములు పురుషప్రయత్నముచే యథేష్టానుకూలములుగాఁ గొంతవఱకు జేసికొనఁజాలినప్పటి కెండవానల కిండ్లు గొడుగులచేతను శీతబాధ నగ్నిసోడుగులచేతను మఱి యాఁకలి దప్పికల నన్నపానములచేతను రోగము నౌషధములచేతను మఱి కొన్ని బాధలను మఱికొన్ని యుపాయములచేతను గొట్టకొనకు సుఖ దుఃఖాకర మగు మనస్సు నభ్యాసవైరాగ్యములచేతను సకలేంద్రియ ప్రవృత్తిని దపస్సుచేత నడ్డుకొని చిన్నప్పటినుండియు సత్సహవాసమున కలవడి పరోపకారము చేయుటకు మాత్రము తప్ప మఱేకోర్కెయును లేక జీవించు పుణ్యాత్ములు సర్వజ్ఞులై సర్వభూతసములై శాశ్వత కైవల్యానందపదవిని జూరఁగొనెదరు, లోపల వెలుపల మఱియు నంతటను స్వప్నజాగ్రత్సుషుప్తులను నవస్థాత్రయమందును భూతభవిష్యద్వర్తమాన కాలములందును సచ్చిదానంద

లక్షణస్వరూపమగునాత్మ యొక్కటియే నిర్గుణమై నిత్యమై సత్యమై శాశ్వతమైనస్వభావముగ త్రిగుణాత్మకములగు స్వప్నజాగ్రత్సుషుప్తుల నాటాడుకొనుచుండి జగన్నాటక మాడించుచుండును. లోకోపకారమునకు మాత్రమే జీవించు పుణ్యాత్ములు తన్నాటకంబుఁ జూచుచు నీ జగమంతయును చిత్తభ్రమకల్పితముగాని వాస్తవము కాదని యభ్యాస నిశ్చితాత్ములై వైరాగ్యమూని కైవల్యానంద మందుచున్నారు. ఈ జగమంతయును మనోమూలముగాన మనస్సు కంటె వేఱే వస్తువేలేదు. మఱి యీ మనస్సు స్వప్నజాగ్రత్సుషుప్తులను మూఁడవస్థలను సత్త్వరజస్తమోగుణమయమై పొందుచుండును. మనస్సనగా నాత్మయొక్క సంకల్పము. ఆత్మ తన లీలకై త్రిగుణాత్మకమగు మనస్సుం దాల్చి జగదుద్భవస్థితినాశము లొనర్చును. మఱియును లీలచేఁ దనకు నేసంకల్పములేక తనకన్న వేఱొద్దియు లేనక నిర్గుణమై కైవల్యానందమున నుండును. మేల్కొన్నపిదప స్వప్నమబద్ధ మనుకొన్నట్లు స్వలాభపరులుగాక యహంకార మమకారములఁదొలఁగి లోకోపకారమునకు బ్రతుకుట కలవడినపుణ్యాత్ములకు మనస్సు నిర్విషయము కాఁగా నిర్గుణమగు నాత్మకన్న దోఁచు గుణమయ ప్రపంచమంతయు నుత్త కల్లయనియును మనోభ్రమకృతమనియును కేవల సచ్చిదానందలక్షణమగు బ్రహ్మ మొకటియే సత్యమని యీ జగమంతయు నబద్ధమని నిరూఢి కాక మానదు.

"తదా సంపన్నో భవతి" అప్పుడు బ్రహ్మముతో జీవుఁడేకమగునను వాక్యానుసారముగా సుషుప్తియందు భేదబుద్ధి దొలంగి నానావిధద్వైత ప్రపంచదృష్టిలేక స్వపర భేదంబులేక యహంకార మమకారములఁదొలఁగి కేవలానందమయుఁడగుచున్నాడు. "పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యమ్- అసంగోహ్యయం పురుషః- నేహ నానాస్తి కించన- అయమాత్మా బ్రహ్మ- సత్యం జ్ఞానమనంతం

బ్రహ్మ" భూత భవిష్యద్వర్తమానకాలములనుండు సమస్తమును బురుషుండే- పురుషుం డెద్దియు నంటదు- ఆత్మ తప్ప నిచట మఱే వస్తువును లేదు- మాఱనిదియు తెలివియె స్వరూపమైనదియు హద్దు లేనిదియు నంతట నిండుకొన్నదియు నగు వస్తువు బ్రహ్మ మనఁబడు చున్నది. గాఢనిద్ర మూర్ఛమస్తతలు గల దశలం దహంకార మమకారములు గాని మఱేవస్తుజ్ఞానముగాని లేకుంటయును స్వప్నమందును మద్యమును పానఁగాఁ గొంత మీఱి మదద్రవ్య సేవచేసినప్పుడు పిచ్చెత్తినప్పుడును దాఁగన్న వికారములు మేల్కన్న పిదపను మత్తు నిశ్శేషము తగ్గిపోయినప్పుడును వెఱ్ఱి సరిగా శాంతించిన తరువాతను స్వప్న మదోన్మత్త దశల దాఁ గాంచిన దెల్లఁ జిత్తభ్రమ గాని వాస్తవము కాదని యెట్లనుకొనునో స్వలాభపరతిమాని కేవలమును లోకోపకారమునకు మాత్రమే బ్రతికెడు పుణ్యాత్ములు సర్వభూతసములై యహంకార మమకారములతో జూచిన జగమంతయును మనోభ్రమగాని వాస్తవము కాదనియును యథార్థదృష్టి కాత్మ తప్ప నితరవస్తు వెద్దియును దగులకుండుననియును గామక్రోధలోభ మోహ మదమత్సరములు విపరీత దృష్టిచేత మదయు త్తునకు బొమ్మలవలెఁజిత్త భ్రమచేఁ గల్పితంబులనియు నిర్గుణమగు నాత్మను నానావిధ జంగమ స్థావరాత్మకమగు జగముగా మాఱనిదని దెలిసికొని జీవన్ముక్తులై బ్రహ్మానంద స్వరూపులగుచున్నారు. పురాణవాక్య లటుండనీ తన తోడి జనులకు మేలె చేయుచు బ్రతికెడు లోకోపకారపరాయణులకు మనస్సే సంతుష్టి. "సంతుష్టుండే మూఁడు జగముల బూజ్యుఁడు" అన్నట్లు తమ మనస్సంతుష్టికై కదా యందరు జనులను దేవులాడు చున్నారు. సంతుష్టాంతరంగమే సచ్చిదానంద లక్షణమగు బ్రహ్మము- లోకోపకారపరాయణులకుఁ దప్ప మనస్సంతుష్టి కలుగనేరదు. తాఁ గోరి యొప్పుకొన్న స్థితి యెట్టిదైనను జనుఁ డద్దానిని దన హితముగాఁ

గ్గైకొని సంతుష్టి పడక మానఁడు. తా వాంఛించినది తనకు నిత్య సంతుష్టి కలిగించునో లేక తొలుత సుఖముగా దోఁచి పిదప దుఃఖముగా మాఱునో యాసంగతి తన బాల్యము మొదలుకొని యిది నీకు మేలు మఱి యిద్ది కీడునకగునని మంచిచెడ్డలు వివరించు లోకోపకారపరాయణులు ప్రత్యక్ష దేవతలు సకల విద్యాస్వరూపులు లయి తల్లిదండ్రులు గురు లాప్తులు బ్రోవ గన్పర్చుచున్నారు. "అశరీర మాత్మా- అభయ మమృత మాత్మా" ఆత్మకు శరీరములేదు. ఆత్మకు భయములేదు. మఱియుఁ జావును లేదు. లోకోపకారములగు అష్టాదశ విద్యల సార మెఱిఁగిన లోకోపకారపరాయణులు కేవలాత్మస్వరూపులై కైవల్యానందమందుచున్నారు. అనాదిగా నానావిధ జంగమస్థావర ప్రాణులు జగమునఁ బుట్టుచు గిట్టుచుఁ దమ శరీరావయవములచేతఁ జేయు క్రియలన్నియు అష్టాదశ విద్యాంతర్భూతములే-సకల జంతువులలో మనుష్యుల గుణములు మనుష్యులే యధికముగాఁ దెలిసికొనఁ గలరు. మఱియు నే దేశమందలి యే సంఘములో నే జాతిలో నేభాష యే కుటుంబమే వయస్స్థితి యందలి వారా దేశ మా సంఘ మా జాతి యా భాష యా కుటుంబ మా వయస్స్థితి విశేషము లెక్కువగాఁ గనిపెట్టగలరు. పదార్థ విజ్ఞాన మఖిలవిద్యల యెఱుక వలనఁగల్గును. మనుష్యులందున్న సకలవిద్య లెఱిఁగినవారికి జగము నందలి సకలపదార్థముల వివిధతత్త్వము లెఱుఁగఁబడును. పదార్థ తత్త్వజ్ఞానమువలన మనస్సునకెద్దియో యొకనిశ్చయమేర్పడును. మఱి యట్టి నిశ్చయమువలన మనస్సెదో యొకమార్గమును మాత్రమే యవలంబించును. మఱియొకదానియందు మాత్రమే తప్పక నడిచెడు మనస్సు సంతుష్టిపొందును. తమ మనస్సంతుష్టికొఱకై కదా సకల జీవులును స్వభావముగా విశ్వప్రయత్నములు చేయుచున్నారు! ముఖ్యముగా మనుష్యులు తమ మనస్సంతుష్టికై సకలరాజ భోగములన్గోరు

చున్నారు! చక్రవర్తిభోగము దేవేంద్రభోగముకూడ నాసించు చున్నారు! భోగేచ్ఛ యెంతమాత్రమును జిత్తశాంతికలిగించనేరదు! భోగములకు మేరలేదు. తనతోడివారికెల్ల సంతోషకరమగు వినయముతో సకలజన సమ్మతమగు కష్టపాటున ధనసంపాదన మొనర్చి జనులందఱ కంగీకారముగా భోగభాగ్యముల నొన్నకొనుడు మాత్రమే మనస్సు నిర్మలమై చెడనిసంతుష్టిపొందును. కోరికెద్దియులేక సంతృప్తిగా మనసున్న సమయమున మృతిచెందుటయే మోక్షమందుట. దేహముపువ్వువంటిది. మనస్సు వాసనవంటిది. దేహమున్మనస్సును రెండును, పాంచభౌతికములే. పువ్వునశించినన్గూడనాపరిమళము మిగులును దేహమును జీవమెట్లో మనసునకు గోరికట్లు జీవమున్నంతవఱకు స్థూల దేహము నశించదు. కోరికయున్నంతవరకు సూక్ష్మదేహమగు మనస్సు నశించదు. ఆధారములేనివా రాధారముకకై దేవులాడునట్లు సజీవమగు స్థూలదేహమను నాధారమునువిడిచినకోర్కితోడి మనస్సు మఱల స్థూలదేహమను నాధారమునొంది తనకోరిక తీర్చుకొనుటకై వేసఁగి యందాకసమున లయమైతిరిగి భూమికివచ్చుటకు స్వభావముగాఁ బ్రవర్తిలు నీరువలె దేహమందు జొచ్చుటకై యల్లాడుచుండును. కోరికతోనున్న మనస్సే జీవుఁడనఁబడును. కోరికే కర్మమనబడును. కర్మానుసారముగా జీవుఁడు ఫలమనుభవించుటకై సహజముగా నానాశరీరములుదాల్చుచు బొత్తిగా కర్మస్వరూపమగు కోర్కినశింపఁగా నిత్యసంతుష్టుఁడై నిర్బాధకమగు శాశ్వతకైవల్యానందమున నుండును. కోరికయే దేహధారణమునకు మూలకారణము. కోర్కి లేని మనస్సు దేహధారణ మపేక్షింపక సచ్చిదానంద లక్షణమగు నాత్మలో లయము చెందును.

"పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" పుట్టుట పెరుగుట నశించుటలు కల పాంచభౌతికమగు నీ సమస్త జగమును

పరమాత్మయొక్క యొక మిక్కిలి సూక్ష్మాంశము. ఈ సమస్తజగము
కన్న లెక్కింపశక్యముగాని యున్న రెండవభాగము నిత్యశుద్ధబుద్ధ
ముక్త స్వరూపము అను వాక్యానుసారముగా సంకల్పేచ్ఛాప్రవృత్తి
లేకాత్ముడు......న్నయుగములుండును. ఆత్ముడు సంకల్పేచ్ఛా
ప్రవృత్తితోనున్న తృటికాలము మర్త్యులకు వేయి బ్రహ్మకల్పము
లుగా లెక్కకు వచ్చును. మహాసముద్రము పరిమితిలో నొక నీటి
తుంపురు పరిమాణము గణింపఁబడక యులక్ష్యము గాఁబడినట్లు మహా
సముద్రమువంటి యాత్మయందు పనికిరాని యత్యంత సూక్ష్మమగు
నీ సర్వజగమును నీటితుంపురువలె గణింపఁబడక యుపేక్షింపఁబడఁ
దగినది. మఱియును సంపూర్ణముగా దాహశాంతిని జేయఁజాలకున్న
ప్పటికిని తాపమును జల్లార్పగల నదియున్న తెన్నా నెఱిగించు నీటి
గాలివలె దేహధారణ రూపకమగు బ్రతుకుదాపత్రయశాంతి నొసర్చ
గలయాత్మదిక్కు దెలుపఁదగిన గుఱుతైయున్నది. సుఖజీవితేచ్ఛయే
తీఱనిదప్పి —"అహమన్న మహమన్న మహమన్నమ్—అహమన్నాదోఽ
న్నాదోఽన్నాదోఽన్నాదః నేనే మున్మాటికన్నమునై యున్నాను.
నేనేముమ్మాటికి నన్నము భుజించువాఁడను అను వాక్యానుసారముగ
నాత్మయే తనకుఁ దా నన్నమును భోక్తయునై యున్నది. "యోఽ
స్యాధ్యక్షః పరమే వ్యోమన్ సోఽంగ వేదయది వానవేద" ఈసమస్త
జగత్సృష్టికి నధ్యక్షుఁడై మరి యీసృష్టికి వేఱుగానున్న పరమాత్మ
మనుగూఁడ నీసమస్త జగత్సృష్టి యెట్లగుచున్నదో యీసంగతి తెలి
యునో తెలియదో అను వాక్యానుసారముగా నిజ్జగముయొక్క
మూలమును దెలిసి వాస్తవమిదియని రూఢిగఁజెప్ప నెవరికిని దరము
కాదు. కాని—రోగమెట్లుకలిగెనో యని రోగకారణము తెలిసికొను
టకై చింతించుటకన్న రోగముపశమింపఁజేసికొని సుఖపడుటకై
యత్నింపకతీరదు. యేదుఃఖమును లేక శాశ్వతమగు సంతోషము

పొందుటకై కదా బ్రతుకునఁ గావలసినకోరిక! కరకర 'యాఁకలియగు
చుంటయును వింతవింత కోరిన చవులతోఁ గడుపునిండఁ దినుటయును
మఱి యిచ్చవచ్చినట్లు భోగించుటయును హాయిగ నిదురించుటయును
దేహమునకుఁగాని మనస్సునకుఁగాని యే నొప్పియును లేక యథేష్ట
ముగా శాశ్వతముగా నే యడ్డులును లేక జీవించుచుంటయు నిదికదా
బ్రతుకుకోరిక! సరియె-ఈకోరికల కన్నింటికిని గారణము దేహస్మృతి
కదా! ప్రతిజనుఁడును బ్రత్యక్షముగా నేకోర్కెగాని మఱి స్మృతియుగాని
తనకుఁదోఁచనినిగాఢని ద్రననుభవించుచునేయున్నాఁడుగదా! బ్రతుకులో
నెట్టికలలుగాని మఱే బాధలును గాని లేని గాఢనిద్ర యొక యవస్థ-
మఱియును నెల్లకోరికలతో మేలుకొనియుంట యింకొక యవస్థ-కనుక
నిద్రాస్వరూపమగు విస్మృతియును జాగ్రత్స్వరూపమగు స్మృతియును
బ్రతుకునందు రెండవస్థలు-సహజసిద్ధములు- బాధనుండి తప్పించు
కొనుటకు సుఖమునఁ బ్రవర్తించుటకును బ్రతిజీవుని స్వభావము-
మఱియును సకల ప్రయత్నములకును దేహస్మృతియే కారణము—
కాఁబట్టి స్మృతిచే బంధమును మఱియు విస్మృతిచే ముక్తియును బ్రతి
జీవుఁ డనుభవించుచుంటయే రూఢి. విస్మృతివశనుండి స్మృతినందుటకు
జనునకుఁ దన ప్రయత్నమున్నట్టు లనుభవము లేదు గానిస్మృతితొలఁగి
మత్తుమందు మొదలగు సాధనములచేత విస్మృతిచెందుట తనప్రయత్న
సాధ్యమగుట యనుభవములో నున్నది. కాఁబట్టి సుఖదుఃఖాత్మకముల
స్మృతి రూపమునగు బ్రతుకు సంసారమున సహజమును దైవికమును-
విస్మృతి రూపకమగు ముక్తి పురుషప్రయత్న సాధ్యము. లోకోప
కారులగు ధర్మాత్ములు తమ పౌరుషముచేఁ గలిగించుకొను విస్మృతి
రూపకమగు ముక్తి శాశ్వతము-లోకద్రోహులగు పాపాత్ములు మత్తు
మందులచే కలిగించుకొను విస్మృతి రూపకమగు ముక్తి క్షణికము,
నేను నాది యను నహంకార మమకారములు దొలఁగి లోకోపకార్థ

మునకై మాత్రమే జీవించు సజ్జనులకుఁ జిత్తమేకాగ్రత చెంది తమ దేహమును మఱపించి శాశ్వతముక్తి నలిగించును మఱియును లోకోప కారపరాయణులకు మాత్రమే యీ సంసారరోగము శాంతించి నిత్యసుఖారోగ్యము కలుగును.

## సంగీత సాహిత్య సంబంధ గంధము

సకల దుఃఖ విముక్తికై జనులు చేయఁదగిన కార్యములఁ గురించియే యష్టాదశ ప్రస్థానాత్మకములగు నానావిద్యలును మను ష్యులయం దనాదిగఁ బ్రవర్తిల్లుచున్నవి. సంగీత సాహిత్యాత్మకమై విద్య రెండు విధముల నున్నది. సంగీతము పని మఱియు సాహిత్య మాపని నొనర్చు తెలివి, దృశ్యము సంగీతము ద్రష్ట సాహిత్యము. సంగీతము జగమును సాహిత్య మాత్మయును-సంగీతము పౌరుషము. సాహిత్యము దైవము- సంగీతము భోజ్యము- సాహిత్యము భోక్త- లోకోపకారము సంగీతము- లోకోపకారము సలుపు నేర్పు సాహి త్యము-సంగీతము ప్రకృతి-సాహిత్యము పురుషుఁడు- సంగీతము లౌకి కము- సాహిత్యము- పారమార్థికము- సంగీతము జగత్తు - సాహిత్య మీశ్వరుఁడు- జాగ్రత్స్వప్నములు- సంగీతము వికృతి- సాహిత్యము ప్రకృతి-సంగీతముజీవితము-సాహిత్యముమరణము-సంగీతముమిథ్యయు ననిత్యమును-సాహిత్యము వాస్తవమును శాశ్వతమును, సంగీతము సగుణము-సాహిత్యము నిర్గుణము.

## విద్యా ప్రకాశిక

విద్య యనఁగా సహజముగా జీవులు తమకుఁ గల తెలివిచే నెల్లవస్తువుల నెఱిసికొని యొండొరులకుఁ దెలుపు నేర్పు, విద్యవలన ఫల మన్నివిధములచే జీవుఁడు తాఁ సుఖపడి యితరుల సుఖపెట్టుట.

సుఖదుఃఖము లెల్ల జీవులకు సహజములు. నొప్పి బోఁగొట్టునది
సుఖము. నొప్పించునది దుఃఖము. స్థిరజీవులయిన చెట్లు చేమలకన్నఁ
జరజీవులలోఁ బశుపక్షికీటములు, వానికన్న మనుష్యులు న్దమ
దుఃఖము పోఁగొట్టుకొను నుపాయములు వెదకుట కన్పట్టును దుఃఖము
పోఁగొట్టుకొని శాశ్వతసుఖ మనుభవింపఁజేయు సాధనసామగ్రి కల
వారు మానవులలో విద్వాంసులు. మనస్సుచే గ్రహింపఁబడి శరీ
రావయములచేఁ దెలుపఁబడు సుఖానుభవము విద్యయన జ్ఞానమన
నొప్పును. తనకును బరులకు ససహ్యమును వేదనమిచ్చు కర్మము
దుఃఖ మద్దియే యజ్ఞానము నవిద్యయనఁదగును. సమాభేదదృష్టివిద్య
యనియును భిన్నవిషమదృష్టియే యవిద్యయనియుం జెప్పవచ్చును.
వెలితిపడుట విద్యాహీనుని లక్షణము. కేవల పరోపకారమునకు
మాత్రమే జీవించు చెట్లు మొదలగు స్థావరప్రాణు లుత్తమ విద్యా
బుద్ధులు గలవి. పశుపక్షిమృగాది తిర్యక్జంతువులు మధ్యమబుద్ధిగలవి.
మానవు లధమబుద్ధులు గనుకనే విద్వాంసుల మనుకొని తప్పని
సహజదుఃఖములకుఁ దోడు తెలిసియు న్గోరి లేనిపోని దుఃఖములు
తగిలించుకొనుచున్నారు. ఈవిద్యాబుద్ధులు నిత్యములనియు ననిత్యము
లనియు రెండు తెఱఁగులు, పరమాత్మాశ్రయ మగు బుద్ధి నిత్య
మలౌకికము యథార్థమును స్వతంత్రమును జీవుల బుద్ధి లౌకికము
యథార్థాభాసమును బరతంత్రమును, అనిత్యబుద్ధులగు దేహధారు
లకు నిత్యనిశ్చితబుద్ధి యగు పరమాత్మ తెలియఁబడుట చెవిచే దివ్వె
నొల్చుటవలన ననంభవము సర్వప్రాణులందు ముఖ్యముగమనుష్యులు
విపరీతబుద్ధులై, లేని దున్నట్లు మఱి యున్నది లేనట్లు భావించి సుఖ
దుఃఖము లందుచున్నారు. నిత్యబుద్ధుఁ డగు పరమాత్మునిలో సమ
దర్శనులగు జీవన్ముక్తులు మాత్రమే కలిసి నిత్యానందు లగుచున్నారు.
విద్యచే వైరాగ్యము న్వైరాగ్యముచేఁ గైవల్యానందము న్సిద్ధించును.

అవిద్యచే రాగద్వేషములు నందుచే సంసారదుఃఖము గలుగుచున్నవి. దైవానుగ్రహమున యథార్థజ్ఞాన మబ్బిన జీవులకు భ్రాంతిజన్యమగు సంసారదుఃఖము లంటనేరవు. పరోపకారపరులకు మాత్రమే దైవానుగ్రహము చేకూరును. పరోపకారమునకుఁ బ్రోత్సాహమిచ్చు దైవానుగ్రహమే విద్యాస్వరూపము. విద్యాఫలము సత్కార్యాచరణ మవిద్యాఫలము దుష్కర్మప్రవర్తకము. సత్కర్మమన సర్వభూతదయయు స్వార్థత్యాగము పరోపకారము వైరాగ్యమును దైవధ్యానమును దుష్కర్మ మన స్వార్థపరతయు హింస యొనర్చుటయుం బరులకు ద్రోహ మాచరించుటయుం దుచ్ఛవిషయభోగేచ్ఛయును.

## బుద్ధిస్వరూపము

విద్యలు పరాపరములని రెండు విధములు. పరమాత్మునిలోఁ జేర్చి నిత్యానందదాయకమగు విద్య పరవిద్య. పరవిద్యాప్రాప్తి సాధన మపరవిద్య. వైరాగ్యమునఁ బుట్టిన పరమాత్మైకధ్యానము పరవిద్య. వైరాగ్యసాధన మపరవిద్య. పరవిద్య యలౌకికము. అపరవిద్య లౌకికము. పరవిద్య యథార్థజ్ఞానమున లభించును. అపరవిద్య భ్రాంతిమూలము. పరవిద్యచేఁ గర్మబంధవిమోచనము నపరవిద్యచేఁ గర్మబంధప్రాప్తియుం గలుగుచున్నవి. పరవిద్యావంతుని లక్షణము సమాధి. అపరవిద్యావంతుని చిహ్నము సంసారప్రవృత్తి. విద్య యనఁగా దెలివి. మఱి యా తెలివి తెలిసికొన్నవిధమునఁ బ్రవర్తిల్లుటచేఁ గలుగు నేర్పని ముఖ్యతాత్పర్యము. ఈ తెలివి సర్వ దేహధారులకు మఱియుం గొన్ని యచేతనము లనుకొన్నవానియెడ న్గూడ జూపట్టెడు. కొన్ని సహజపద్ధతుల ననుసరించి తమంతటఁ దాముగాని యితరవస్తువుల వశమునఁ గాని శబ్దస్పర్శ రూపరసగంధ ప్రచారము నెలిపించు నవయవవిశేషముల కదలిక తీవ్ర మందావస్థలఁ

చేతనాచేతనముల క్రియావిశేషణముఁ బట్టి యీపదార్థములు జ్ఞాన వంతములు మఱి యివి జ్ఞానవిహీనములని యెఱుఁగఁబడుచున్నవి. స్థిరసుఖావాప్తికై తోఁచు నైసర్గికపలిక యుంచి తెలివి. అల్పసుఖాధిక దుఃఖకారమగు చేష్ట సద్బుద్ధిచేతను బ్రవర్తించుచున్నది. ఆకాశము గాలి, యగ్ని, నీరు, మన్ను మఱియు వీని స్థితిగతి విశేషములు కనిపెట్టిన కొలఁది మనము జడములని యనుకొన్నవానియెడలఁ గూడ సహజ ముగాఁ గాని యాగంతుకముగాఁ గాని స్వతంత్రముగా గాని పర తంత్రముగాఁ గాని చేతనాంశ మున్నట్లు కన్పట్టుచున్నది. జంగమ స్థావర ప్రాణివిశేషములందుఁ గూడఁ బంచభూతవశముననే చైతన్య ప్రవృత్తి నివృత్తులు తోఁచుచున్నవి. సహజపాంచభౌతిక సంపద లేనిచో దృఢారోగ్యము గల జంతువులందుఁ గూడఁ దెలివి చూపట్ట నేరదు. కాఁబట్టి తెలివి కాధారము పంచభూతముల పరస్పరసంయోగ వియోగావస్థా విశేషముగానియుండు గాదు. ఆకాశమం దన్నిపదార్థ ములును మఱి సర్వపదార్థములం దాకాశ మున్నట్లే తెలివియం దెల్ల లోకములు మఱి యెల్లలోకములందుఁ దెల్వియు నెడతెగకున్నవి. మన మెద్ది యాకాశ మనుకొనుచున్నామో యద్దియే యాత్మ దైవము విద్య సత్యము ప్రకృతి నిత్యము ఆనందము చైతన్యము తెలివి యనఁదగును. మఱి యేపదార్థములను మన మాకాశముకన్న భిన్నము లనుకొనుచున్నామో యాపదార్థ సమూహమే యవిద్యా, మాయ, జగము అవిద్య యవాస్తవము వికృత యనిత్యము దుఃఖము జడము నెఱుకలేమి యనఁదగును. తమ యంతరాత్మలచే నెఱింగియు నిద్దక్కు మాలిన నాస్తికులు తమ బాహ్యేంద్రియ ప్రత్యక్షముకాని కారణమాత్రముచే నాకాశము లేదని యాస్తికుల న్గాదనుట కహంక రించి పైకిమాత్రము వితండవాదము చేయుచున్నారు.

పృథివ్యప్తేజోవాయువులు నాల్గుభూతముల నాధారముగ నొక
దానియందొకటి యిమిడియుండుట కాకాశములేనిచో నవకాశ
మెట్లు? మఱియీనాల్గింటికిఁ బరస్పరాధారము కలదన్న యెడల నొక్క
భూతమే కాలవశమున నాల్గురూపులఁ గన్పట్టునని చెప్పక నాల్గు
చిన్నభూతములకాకాశావకాశము లేకన్యోన్యసంయోగవియోగము
లభించు టెట్లు? కాఁబట్టి యాకాశము ద్రవ్యము లేదనుట యొండి
వాదమదటుండనీ, ఆకాశమునందే వివిధపదార్థసృష్టిస్థితిలయము లగు
చుంట కన్పట్టుటచే బట్టబయులగు నీయొకటియే సర్వజగత్స్వరూపమని
కాని యనిత్యములగు సమస్తచరాచరోద్భవస్థితి వినాశముల కీబట్ట
బయలు తెల్వియే యాటపట్టనికాని చెప్పకతీఱదు. కాఁబట్టి యాత్మైక
వేద్యమై స్వప్రకాశమై నిరాకారమై నిర్గుణమై కేవల సచ్చిదానంద
స్వరూపపరమాత్మయే బట్టబయలనియుఁ దెలివియనియు నూహకందు
చున్నది. ఎద్దానింబట్టి జంగమస్థావరప్రవృత్తినివృత్తులగపడుచున్నవో
యెద్దియిజాగ్రత్స్వప్నసుషుప్తులంగని పెట్టుచున్నదో యద్దియే నిత్యసత్య
శుద్ధబుద్ధముక్తస్వరూపకము విద్యయాత్మ చైతన్య మానసులకునయిన
మానసేంద్రియప్రత్యక్షానుభవము కాకమానదు. చైతన్య స్వరూపిణి
యగు విద్య స్వప్రకాశమగు తెలివియని నిరూపింపబడియెనుగదా-
ఆయొక బయలంతటనిండి శరీరము శేమంబులందు మందతీవ్రావస్థల
న్వెలువడుచు నవయవ సంచలనము కావించుచు వాచికాంగికాహార్య
సాత్త్వికాభినయప్రయోగ హేతువగుచున్నదనఁగా శబ్దస్పర్శరూపరస
గంధానుభవద్యోతకమై నామరూపవిశేషములఁ గాన్పించుచున్నది.
పృథివ్యప్తేజోవాయ్వాకాశములు సత్తద్గుణములును గటకకుండల
వికారములు బంగరున వేఱుకానట్లు తెల్వికంటె భిన్నములుకానేరవు.
నామరూపభేదంబు లుపేక్షించినప్పుడు మిగిలినదంతయు బ్రహ్మస్వ
రూపమగు బట్టబయలు తెల్వితప్ప మఱెద్దియులేదని విశదపడును.

సహజముగాఁ బెరుఁగుట తఱుఁగుట వికసించుట వాడుట చలించుట పుష్పించుట ఫలించుటయు దప్పితీర్చుకొంట గాలికావలసియుండుట యెరువారగించుట మొదలగుచిన్నెలు స్థావరజీవులందును, తిరుగాడుట భయపడుట యపాయము తప్పించుకొనఁ బ్రయత్నించుట నిద్రాహార విహారవిశేషముల జూపుట-ఖేదమోదములఁ గాయచేష్టలగపర్చుట-భయపెట్టుట హింసించుట - దొంగతనము మోసములఁ బ్రవర్తిల్లుట మచ్చికపడుట - యలవాటందుట మస్పఁబకుట - కట్టుబాటులకు లొంగుట నవరసంబులన్దలికచేత మఱియు నెల్లుచేత నగపర్చుట మొదలగు చేష్టలు పశుపక్షులయందు సూక్ష్మదృష్టిచే నరసినకొలంది కీటములందు న్గాన్పించుచున్నది. జడములనుకొన్న వస్తువులన్గూడ శోధింపఁగాఁ గొంత చైతన్యముసూచింపఁబడుటచే ఆకసమంతయున్ జైతన్యమే - చైతన్యము నెఱుఁకయుంగాని పదార్థమేలేదని ఫలితము తేలుచున్నది. తేనెటీఁగలకు సంగ్రహశక్తి - భ్రమరములకు లాతి పురుగులన్ భ్రమరములుగఁజేయు నుపాయము - సాలెపురుగులకు బట్టల్లునేర్పు చీమల కన్యోన్యాభిప్రాయమెఱింగికొనితిరుగునేర్పు-నల్లులకుఁ గఱచి చేతికందక దాఁగుకొను దొంగతనము - కప్పలు గుంపుగూడి బృందగాన మొనర్చుట - పాములు నాగస్వరమునకుఁ జొక్కియాడుట మఱియుం బలువిధముల తిర్యగ్జంతువుల మఱికొన్ని చమత్కారములు న్విద్యావిశేషములన్ సూక్ష్మదృష్టిచేఁ గనిపెట్టినకొలంది "సర్వం విష్ణుమయంజగ" త్తనియు "సర్వంఖల్విదం బ్రహ్మ" యనియుం "బురుష ఏవేదగ్ంసర్వ" మనియుం బల్కువాక్కులు ప్రత్యక్షానుభవ మొనరించుచున్నవి. స్థూలదృష్టిచే జంగమస్థావర విభాగ మొనర్చుటయును సూక్ష్మదృష్టిచేఁ బరమాత్మవిద్యాస్వరూపముతప్ప మఱివేఱు పదార్థము లేనేలేదనియును స్పష్టపడుచున్నది. కావునఁ బరిపూర్ణవిద్వాంసుఁడు నిత్యతృప్తుఁడై భ్రాంతిన్విడనాడి యానందించు

చుండును. మఱియు నల్పవిద్వాంసులు భేదబుద్ధిచే భ్రాంతులై కర్మ
వశమున నైహికసుఖదుఃఖము లనుభవించుచున్నారు. సర్వజగద్రూ
పిణియగు విద్య పలుతెఱంగుల జ్ఞప్తి - భ్రాంతి - మఱవు - మందత -
వివేకము - విచక్షణత - వైపరీత్యము - యథార్థజ్ఞానము - ఎఱుం
గమి - కామక్రోధలోభమోహమదమత్సరములు - అహంకార మమకార
ములు - రాగద్వేషములు - స్వప్నజాగ్రత్సుషుప్తులు - శౌర్యగాంభీర్య
ధైర్యౌదార్య చాతుర్యము - నవరసములు - దొంగతనము - మో
సము - చమత్కారము - నవ్వులు సిగ్గులు - తెగనీల్గు - డంభము -
విఱ్ఱవీగుట - దయాదాక్షిణ్యములు - సంతోషము - దుఃఖము -
దైన్యము - వదాన్యత - ఆర్తి - క్రౌర్య - కోప - బాల్యయౌవన
వార్ధక వయోవిశేషములు - కల్మిలేములు - సింగువెల్లులు - చీకటి
వెల్గులు - స్థైర్యచాపల్యములు - జపతపంబులు - పుణ్యపాపములు -
సుఖదుఃఖములు - జనన మరణములు - సృష్టిస్థితిలయములు - జంగమ
స్థావరవిశేషములన్నియుం జేరి సప్తపదార్థములనియు - షోడశపదార్థ
ములనియుం జతుర్వింశతితత్త్వములనియుం బ్రకృతియనియుం బురుషుం
డనియు నీశ్వరుఁడనియుం బ్రజ్ఞానమనియు శూన్యమనియు బ్రహ్మమని
యు నవాఙ్మానసగోచరమనియు నతీతమనియు నామరూపవిశేషముల
వివిధమతంబులం బరఁగుచున్నది.

విద్యాశబ్దము యథార్థజ్ఞానమునకు బుద్ధికి వర్తించును. పర
మాత్మయందలి ప్రకాశగుణము బుద్ధి సర్వవ్యవహారముల కారణ
మగు జ్ఞానము - అంతఃకరణ స్వరూపమనియు - అంతఃకరణ భిన్న
మనియు - నిరాకారము నిశ్చయాత్మకమనియు బుద్ధి స్ఫూర్తి వివిధవిధ
ములం బల్కుచున్నారు. నిత్యము ననిత్యమనియు బుద్ధి రెండు విధ
ములు. పరమాత్మబుద్ధి నిత్యము. అది ప్రత్యక్ష ప్రమాణస్వరూపమై
సాక్షాత్కారమనఁబరఁగును. చరాచరజీవుల బుద్ధి యనిత్యము.

అనిత్య బుద్ధి స్మృతియనియు యనుభవమని రెండు తెఱఁగులు. స్మృత్యనుభవములు రెండును యథార్థములనియు నయథార్థములనియు రెండేసి విధములందు స్మృతి యొక విధమే- ప్రత్యక్షము ఉపమితి యను మితి శాబ్ద బోధమని యనుభవము నాల్గువిధములు. అందు యథార్థానుభవము ప్రమ యనియు నయథార్థానుభవము భ్రమ యనియుం జెప్పఁబడుచున్నవి. ప్రత్యక్షము సవికల్పకమనియు నిర్వికల్పకమనియు ద్వివిధము. అందు నిర్వికల్పకము ప్రమయుం గాదు భ్రమయుం గాదు. సంశయ ప్రత్యభిజ్ఞోపనీతభానాదికములు సవికల్పక ప్రత్యక్షమునందే యంతర్భూతములు నిత్యానిత్య భేదముచేఁ బ్రత్యక్షము రెండు విధములు. పరమాత్మాశ్రయమగు ప్రత్యక్షము నిత్యము న్యథార్థమును జీవసంబంధమగు ప్రత్యక్షము యథార్థమున యథార్థము కూడ నగును. జీవాత్మమాత్రసమవేతములగు ననుమిత్యుపమితి శాబ్దబోధములను మూఁడు ననిత్యములే యని యొక మతము- విద్య యనియు నవిద్యయనియు బుద్ధి రెండు తెఱఁగులు. అందుఁ బ్రత్యక్ష లైంగిక స్మృత్యార్ష లక్షణ భేదముల నాల్గు విధములు అవిద్యగూడ సంశయ విపర్యయ స్వప్నా నధ్యవసాయ భేదముల నాల్గు విధములు యెద్ది లైంగికమో యది యనింద్రియజము. ఇంద్రియజము కూడ సర్వజ్ఞీయ మసర్వజ్ఞీయమని రెండు విధములు అందు సర్వజ్ఞీయము యోగజధర్మలక్షణ ప్రత్యాసత్తిచే నాయాపదార్థసార్థ జ్ఞానము అసర్వజ్ఞీయప్రత్యక్షము సవికల్పకమనియు నిర్వికల్పకమనియు రెండు తెఱఁగులు అందు సవికల్పక జ్ఞానము ప్రమాణము కాదని కొందఱి మతము. ఇది యొక మతము. మొట్టమొదట బుద్ధి యనుభూతి యనియు స్మృతియనియును రెండు విధములు అనుభూతి కూడ నొకరి మతమునఁ బ్రత్యక్షము ననుమితి యని రెండు విధములు ప్రత్యక్షము కూడ ఘ్రాణజాది భేదముచే నాఱు విధములు కలదై సవికల్పక నిరి

కల్పక భేదముచే రెండు తెఱఁగులై లౌకికా లౌకిక భేదముచే ద్వివిధము. అనుమితి కూడఁ గేవలాన్వయి కేవల వ్యతిరేక్యన్వయవ్యతిరేకిరూప త్రివిధానుమానజన్య మౌట మూఁడు విధములు. ఇది యొక మతము. ప్రమాప్రమారూపములు బుద్ధి రెండు విధములు. అది మఱియును సంశయ నిశ్చయభేదముచేఁ గూడ రెండువిధములు ఈ మతమునందు సాధ్యశ్యవిలోకనస్థలమందుఁ బదజ్ఞాన స్థలమందుఁ గూడఁ దఱువాత లింగపరామర్శోత్పత్తియే ప్రత్యక్షానుమానాతిరిక్త ప్రమాణాంతర మొప్పకొనకుంటచే ననుమితి యగుచున్నది. ఇది యొక మతము. సాత్త్వికరాజసతామస భేదములచే బుద్ధి మూఁడు విధములు అందుఁ బ్రవృత్తి నివృత్తులుఁ గార్యాకార్యములు, భయాభయములుం బంధమోక్షములు నెద్ది తెలిసికొనుచున్నదో యది సాత్త్వికబుద్ధి ధర్మాధర్మములు కార్యాకార్యములుం బొరపాటుగా దేనిచేఁ దెలియఁబడునో యద్ది రాజసబుద్ధి. అధర్మము ధర్మమని మోహము నన్నియుంటచే విపరీతముగా సకలార్థముల నెది యెన్నుచున్నదో యది తామసబుద్ధి, ఇష్టానిష్ట విపత్తి వ్యవసాయసమాధిసంశయ ప్రతిపత్తులని బుద్ధి గుణము లైదు. శుశ్రూషా శ్రవణ గ్రహణ ధారణోహాపోహార్థ విజ్ఞానతత్త్వజ్ఞానములని బుద్ధి కేడు గుణములు. ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రాస్మృతులని బుద్ధి కైదు వృత్తులు. మానసమలములైన శోక క్రోధ లోభ కామమోహ పరాసుతేర్ష్యామానవిచికిత్సాహింసాసూయాజుగుప్సలని బుద్ధి నాశహేతువులు పన్నెండు. ఇది యొక మతము. చేర్పు చెంతల నున్న వస్తువును గూర్చి యిది యనియు దూరముగ నున్నదాని నదియనియు క్రియా స్వాతంత్ర్య కర్తృంగని నీచేతననియు, కరణవ్యాపారము ననుసరించి చేయఁబడె ననియుఁ గర్తృప్రయోజకత నపేక్షించి యిమ్మనియు నియోజ్య నియోక్తృవ్యాపార మనుసరించి వీని ననియు నీమొదలుగా బుధ్య

పేక్ష్యమూహనీయము. నిరాకారనిశ్చయము లాత్మ బుద్ధి మనోబుద్ధి చిత్తాహంకారము లన్తఃకరణమనియు సంశయనిశ్చయ గర్వస్మరణములు తద్విషయములనియు నిటు బుద్ధి గూర్చి న్యాయ వైశేషిక సాంఖ్య వేదాంతశాస్త్రములం దెలియఁబడుచున్నది. గాలవాది ఋషులయొక్క యతీతానాగతాజ్ఞాన మార్గమనఁబడుచున్నది. విజాతి జ్ఞానహేతువు విద్య.

న్యాయశాస్త్రము వేదములు నీతిశాస్త్రము. సర్ధశాస్త్రమని విద్య నాల్గువిధములనిగౌతమమహామర్షియు-నాల్గువేదము లాఱు వేదాంగములు ధర్మశాస్త్రము పురాణము తర్కము నలిసి పదునాల్గు విద్యలని మనువును- షడంగములతోఁ గూడిన నాల్గువేదములుం బురాణ న్యాయమీమాంసా ధర్మశాస్త్రము నలిపి పదునాల్గు విద్యలని యాజ్ఞవల్క్య మహర్షియు- ఈ పదునాల్గిటి కాయుర్వేద ధనుర్వేద గాంధర్వవేదార్థశాస్త్రముల నాల్గింటి నలుపఁగాఁ బదునెన్మిది విద్యలని విష్ణుపురాణమును- బ్రహ్మము నెలిసికొను నద పరయనియును ఋగ్వేదాది లక్షణి యపరయనియు న్విద్య రెండు విధములఁ శ్రుతియుం బల్కుచున్నది.

తెల్వియొక్క కార్యరూపము విద్య. ఆ కార్యమునకుం బనిముట్లు లింద్రియములుం బాహ్య పాంచభౌతికవస్తువులును. సహజకృత్రిమభేదముల విద్య రెండువిధములు స్థావరములు తిర్యగ్జంతువులు స్వయముగా నొనర్చు కార్యములు సహజవిద్యలు, మనుష్యులలో ఋషులుగాక తక్కువారొనర్చుచున్న కార్యములన్నియుం గృత్రిమ విద్యలు,ఆహారనిద్రాభయ సంభోగకార్యములు సర్వప్రాణిసామాన్య సహజవిద్యలు. సహజవిద్యవాస్తవము. కృత్రిమవిద్య వాస్తవము న్గా దవాస్తవము న్గాదు. ఆఁబెయ్యయున్ గేదెపెయ్యయు న్గాని దిక్కుమాలినపెయ్య. జగదుపకారపరులగు మునులు తప్పఁ దక్కిన

మనుజులు తిర్యగ్జంతులవలె నిద్రాహారవిహారముల నలుగుచుఁ బుట్టుచు గిట్టుచున్నారుగాని తమ కృత్రిమవిద్యావిశేషముచేఁ దామీ దుఃఖము దప్పించుకొని యితర ప్రాణుల సృష్టిస్థితిజాలకుంటకుఁ దోడుగా స్వార్థపరులై సర్వభూతద్రోహ మాచరించి మఱియు నితరప్రాణుల కన్న నూఱంతలెక్కు దుఃఖము ననుభవించుచున్నారు.

తిర్యగ్జంతువులలోఁ గూడఁ బశువులలో హనుమంతుఁడు, పక్షులలో సులూకుఁడు, పాములలో బలిం జలి మొదలుగా ననేకులు ఋషు లున్నారు. ఈ మహర్షులందఱు నతీంద్రియద్రష్టలై జగదుపకారమునకు స్వయంప్రకాశమగు ప్రజ్ఞానము పరవిద్యారూపమని తెల్పిరి. ఆ ఋషులకట్టి తెల్వి సహజము. అస్మదాది సామాన్యమనుష్యుల కట్టి విద్యలం దెలిసికొని యట్లు ప్రవర్తిల్లి యుభయతారకముగా నడువఁగల సహజశక్తి కాలవశమునో గ్రహచారమునో మఱెందుచేతనో గాని పొడజూపకుంట శోచనీయము. మానవులలో వేదశాస్త్రానుసారమున జరిగినపని యొండొయు స్వాభావిక విద్యాధర్మము. సద్గురుముఖమున వేదశాస్త్రరహస్య మెఱిఁగి భక్తిశ్రద్ధలం బ్రవర్తిల్లు విద్వాంసులు మాత్రమే తాము తరించి యితరులం దరింపఁజేయఁగలరు. అన్నివిద్యలలో గొప్పవిద్య యీ ప్రస్థానత్రయము నమ్ముకొని యాప్రకారము ప్రవర్తిల్లుట మునులందఱు నాప్తులే కాని వారిలో గౌతమమహర్షి వ్యాసమహర్షియుం బరమాప్తులు. గౌతముఁడు పదార్థతత్త్వ జ్ఞానముచే నిశ్శ్రేయసము లభించుననియును వ్యాసుఁడు బ్రహ్మజ్ఞానముచేఁ గైవల్య మబ్బుననియుం దెల్పిరి. గౌతమునివలన సత్కర్మాచరణమును వ్యాసునివలన స్వాకర్మసన్న్యాస విధియు నేర్చుకొనవలసిన యంశములు. ఈ సంసారచక్రమునఁ దిరుగువారలకు సేవ్యములుగా సకలశ్రుతిస్మృతీతిహాసపురాణములందు ధర్మార్థ కామమోక్షములను నాల్గు పురుషార్థములు వర్ణింపఁబడు

చున్నవి. కాలజ్ఞుఁడైన పండితుఁడు కాలము న్వంచుకొని ధర్మార్థ కామములను సేవించవలయునని భారతమును, నిత్యసుఖాభిలాషులకు మోక్షమే కోరఁదగినదని స్మృతియుం దెల్పుచున్నవి. ఈనాల్గు పురుషార్థములలో నిరతిశయానందలక్షణము నిశ్శ్రేయసముగా దుఃఖమును బోఁగొట్టునదియు నిరూపాధీచ్ఛావిషయ మాటచే ముఖ్యముగా గోరదగిన పురుషార్థము మోక్షమే.

ధర్మార్థకామములు మోక్షము న్సాధించుటకుఁ దగిన సాధనములు. ముఖ్యముగాఁ బ్రవృత్తినివృత్త్యాత్మక ద్వివిధధర్మమే పురుషార్థములు సాధించుట కవశ్యసాధనము. ప్రవృత్తి యను ధర్మమున కత్యంత శుభాభ్యుదయమును నివృత్తియను ధర్మమునకుఁ గైవల్యమును ఫలములని స్కాందపురాణమును ధర్మమువలన సుఖమును జ్ఞానమును సిద్ధించును గనుక విద్వాంసుఁ డన్నిటినిఁ బరిత్యజించి ముఖ్యముగా ధర్మమునే యాచరింపవలయునని భారతమును, ధర్మాచరణముచేఁ బాపము న్బోఁగొట్టుచున్నాఁడని శ్రుతియు నిట్లు ప్రాయశ్చిత్తాదిధర్మముచే దురితక్షయము కాఁగా దుఃఖము నశించునని సకలశ్రుతి స్మృతీతిహాసపురాణాదుల న్వాక్కాణింపఁబడు చున్నది. అర్థముగూడ దుఃఖము న్బోఁగొట్టునని యందఱి యను భవముచేతను సువర్ణాదిద్రవ్యదాతలు దీర్ఘాయువులై స్వర్గాపవర్గము లందెదరని మంత్రవర్ణమును సువర్ణదానము చేయువాఁడు తత్క్షణమే పరిశుద్ధుఁ డగునని స్మృతియు నుడువుచున్నవి. కామముకూడఁ బురుషార్థమే. అర్థమును గోరి ధర్మమాచరించును. కామార్థమై యర్థమును గోరును. కామము తీఱినవెన్క నేదియుం గోరఁడు. విషయభోగములందు సంచరించువారల కెట్టి ప్రీతి కల్గుచున్నదో దానికే కామమని పేరదియే కర్మములయొక్క శ్రేష్ఠఫలమని భారతము. కామమనఁగా నిహలోకసుఖము. ఈ సుఖమునకు నాశము

కలదు గాన నిట్టి కామము ముఖ్యపురుషార్థము కాదని వ్యాసమహర్షి తాత్పర్యము.

ఈ పురుషార్థసర్వజ్ఞత్వము యథావిధిగా వేదాధ్యయనము చేయువారికిఁదప్ప నితరులకుఁ గలుగనేరదు.

## విద్యాశబ్ద నిర్వచనము

వేదమున కిట్టి మాహాత్మ్య మెట్లువచ్చెననఁగా మనుష్యుల వలనఁగాక కేవలేశ్వర ప్రకాశితము లౌటచే నపౌరుషేయములు గనుక వేదములకు స్వతఃప్రామాణ్యము సిద్ధించెను. ఋగ్వేద యజుర్వేదము లీశ్వరుని నిశ్శ్వాసములు - ఎవ్వఁడు బ్రహ్మను సృజించెనో మఱియా బ్రహ్మకు వేదము లెవ్వఁడు నేర్పెనో - సర్వవిద్యలను శాసించినవాఁడు అని శ్రుతులును - వేదములకుఁ గర్త యెవ్వఁడున్లేఁడు వేద మీశ ప్రకాశితమని స్మృతులును బురాణములును వందలకొలది బల్కుచున్నవి గనుకను, కార్యము కారణమునుండియే కార్యము వెంటనే పుట్టుటవేఱుగాఁగాదు - జగత్కారణమగు నీశ్వరునికంటె నితరమైన మఱియెవ్వఁడైన నపూర్వవేదప్రకాశకుఁ డిది వఱకును లభింపకుంటచేత నయ్యాది వేదమందు సంభవించుచున్నది. వేదముల కపౌరుషేయత్వమైనచో నిదియిట్లు కానిమ్ము - కాని యనట్లు కానేరదేలననగా - వాక్యములౌటచే మహాభారతాది వాక్యముల వలె వేదవాక్యములు పౌరుషేయములు - ఈ యనుమానముచేఁ బౌరుషేయత్వసిద్ధి కలుగుటచేతను - పౌరుషేయమనఁగా స్వతంత్ర పురుషపూర్వకత్వమే, ఆ హేతువుచేఁ గ్రమవంతములగు వర్ణములు పదము క్రమవంతములైన పదములు వాక్యము - క్షణోపలబ్ధవర్ణము లందుఁ గ్రమము నైజముగా సంభవింపదుగనుక నుచ్చారణక్రమనిబంధనమే - యుచ్చారణక్రమము పురుషప్రయత్నసాధ్యమే. ఇట్లగుటచేఁ

్రగమముకలవగుటవలన వేదవాక్యములు పురుషప్రయత్న నిష్పాద్య
ములేకాఁబట్టి వానికిఁ బౌరుషేయత్వము సిద్ధించెనన్నయెడల నిట్లు
సమాధానము చెప్పఁబడుచున్న దెట్లనఁగా, వేదములకుఁ గృతకత్వ
మొప్పుకొని తత్కర్త కల్పింపఁబడుచున్నాఁడుకదా యట్టి పురుషునకు
శరీరమున్నదా లేదా - శరీరముండుటయేఁ సంభవించ దఁతటన్ జక్షు
రాదీంద్రియ జన్యములగు నాయాపదార్థవిశేషవిషయకమగు పరస్పర
విలక్షణక్షణిక జ్ఞానముకలవాఁడై వృద్ధవ్యవహారముచేఁ బదపదార్థ
సంబంధమెఱిఁగిన శరీరవంతునకుమాత్రమే స్వతంత్రకర్తృత్వముండునని
చెప్పఁబడిన వాక్యత్వము తాదృశకర్తృత్వముచే వ్యాప్తమగుచు నట్టి
కర్తృత్వమే స్వవ్యాపకమైనచో నశరీరకర్తృత్వాసిద్ధినుండి యొకపక్ష
మున సాధించుచున్న యశరీరకర్తృత్వమరికట్టుచున్నది-పోనీ యిచట
న్గూడ ననిత్యజ్ఞానేచ్ఛగలశరీరవంతునకే కర్తృత్వముకానీ - కాని -
బుద్ధియున్కికి బాధకానేరదు. చిరవృత్తిగలకర్తయందు బుద్ధిప్రాప్తియే
కాదనినయెడల నిద్ది చతురబుద్ధుల చిత్తమునకు జమత్కారముం
దోఁపింపదు. వేదవాక్యములకు శరీరకర్తయైనచో నట్టివానికిఁ జిరవృత్తి
త్వముచే నుపలబ్ధియొక్క యభావముండుఁగూడ నెవ్వనికో నిశ్చయ
ముగానది స్మృతికిరాకమానదు. అట్లెవనిచేనైనను స్మరింపఁబడలేదు.
కాఁబట్టి వేదమునకుఁగర్త లేఁడనియునిత్యస్వభావసిద్ధము వేదమనియును
నిశ్చయింపఁబడుచున్నది - ఇదీలాగుకానీ - నిత్యత్వమునకుఁ గారణ
మెవ్వనిచేతనో యొకనిచే స్మరింపఁబడకుంటయా? లేకందఱిచేతన్గూడ
స్మరింపబడకుండుటయా? మొదటిదికాదు. దేవదత్తుని స్మృతిలో లేని
ఘటము విష్ణుమిత్రునింట నున్నదిగనుక- రెండవదికూడకాదు- జైమి
నీయులచే స్మరింపబడకున్నను కణాదాక్షపాదాదిమునులచే స్మరింపఁ
బడుటచేతను - ఇట్లనినయెడల నదట్లుకాదు - వారల సంబంధులచేఁ
గూడ వృద్ధవ్యవహారముచేఁ దెలియఁబడిన పదార్థసంబంధముకలిగి

తదర్థవిషయకమైన విలక్షణక్షణికచక్షురాదీంద్రియజన్య వేదనతోఁ గూడితలిదంద్రులచేఁబొడమినపాంచభౌతికశరీరింగూర్చి స్మృతిబొత్తిగా నెవ్వరియెడ్డనగలుగకుంటచేత నశరీరుఁడగు పరమేశ్వరునిచే వేదప్రకాశితత్వమందుఁ బర్యవసాన హేతువుచేతను వారెట్టి వేదకర్తనుస్మరించుచున్నారో యట్టి కర్తృత్వముయొక్క వాక్యత్వము నిత్యత్వసిద్ధాంతశత్రుత్వముచే విరోధకముకానేరదు. సర్వశాస్త్రములలోఁబురాణము మొట్టమొదట బ్రహ్మచేస్మరింపఁబడెను. పిమ్మట వాని నలు మొగములనుండి వేదములు వెలువడియె నని పురాణస్మృతిచేతను-తొలుత ఋగ్వేదము కలిగెను. వాయువునుండి యజుర్వేదము నాదిత్యునివలన సామవేదముం బుట్టెనని యైతిరేయబ్రాహ్మణముచేత నాయజ్ఞమునుండి ఋక్సామము లుద్భవిల్లెనని మంత్రవర్ణముచేతను వేదములకుఁ బౌరుషేయత్వము సిద్ధించుచున్నదని చెప్పఁగూడదు. ఆ ప్రమాణములకుఁ బరస్పరవిరుద్ధములగుటచేతను బ్రమాణాంతరబాధితము లౌటచేతను, గనుక ప్రజాపతి తన వపయను ప్రేగును బెకలించెను - ఈ మొదలగు నర్థవాదముల యుపపత్తికి స్వార్థతాత్పర్యము లేదుగనుకను-సత్కార్యవాద సిద్ధాంతమునందు సృష్ట్యాదిన్ బ్రహ్మముఖములనుండి వేదావిర్భావ మాత్రమే కాని యనత్తుల యుత్పత్తియని యంగీకరించుటలో నేకమూల కల్పనాలాఘవముచే నవిచ్ఛిన్న ధారావాహికచే ననాది సిద్ధినుండి కాదు:-?

## పురుషార్థ సర్వజ్ఞత్వము

అట్లైనచోఁ గాఠకము కౌథుమము తైత్తిరీయక మని యీ మొదలగు తత్తద్వేద విషయక సమాఖ్య లోకమం దగపడుచున్నది కదా-తద్ధిత మను ప్రత్యయము "వానిచేఁ బ్రోక్తమను" నీయర్థ

మందు వర్తించుచున్నది. అట్లైనచో వ్యాసునిచేఁ బ్రోక్తమయిన భారతము వైయాసికమన్నట్టులీప్రకారముగా వేదములకుఁ బౌరుషేయత్వము తోఁచుచున్నది. మఱియును "వేదవాక్యము వాది ప్రతివాదులకు వివాదావిషయము, కాళిదాసాదికవి వాక్యమువలెనే వాక్యమగుటచేతనని" యిట్లు తెలుపఁబడినయనుమానమునుబట్టియపౌరుషేయత్వము సిద్ధింపదన్నచో నట్లుకాదు. అధ్యయన సంపర్కప్రవర్తకత్వముచే సమాఖ్యాప్రతిపత్తికనుక కఠకౌథుమాంకితమని యొప్పుకొనుటలోఁ బూర్వోక్తావిర్భావమాత్ర బోధకముచే నా యజ్ఞమునుండి కలిగెనను మొదలయిన వాక్యముచే విరోధముయొక్క దుష్పరిహారముం బట్టి ఒక మునికృతమం దితర ముని కప్రామాణ్యము తోఁచినయెడలఁ జారిణీన్యాయముచే సర్వవేదశాఖలకు నప్రామాణ్యాపత్తియు దుబ్రహ్మాదివ్యాసపర్యంత మంగీకరింపఁబడిన ప్రామాణ్యమునకసతిభవాపత్తిహేతువుం బట్టియును యాజ్ఞవల్క్యశాకల ప్రభృతి మునీశ్వరులకు విషయాన్తరములందు విరుద్ధార్థ ప్రతిపాదకవాక్యము లున్నవి కాని వేదపౌరుషేయత్వమందు కాదు. ఇంతియేగాక కాళిదాసాది కవిగ్రంథముల నాయాసర్గల తుదియం దాయాగ్రంథకర్తల పేర్లు దొరకుచున్న వాతీరుగనే వేదము పౌరుషేయమైనచో నాయా యధ్యాయ సమాప్తియందుఁగాని గ్రంథసమాప్తియందుఁగాని కర్తలెవరో వెల్లడికాఁదగినది. అటుల వేదకర్తలపేర్లు చిక్కలేదు. కావున వాక్యత్వహేతువుచేఁ బ్రతికూలతర్క పరాహతత్వముచేత వేద మపౌరుషేయమని జైమినీయులచే సాధింపఁబడెను. కాని వేదాధ్యయన సామాన్యముం బట్టి యిప్పటి యధ్యయన మెట్లో యట్లే సర్వవేదాధ్యయనము గుర్వధ్యయనపూర్వకమే. ఈ హేతువుచేత వేదాపౌరుషేయత్వము నిశ్చయింప శక్యమగుటచేతను యథాపూర్వముగ ధాత కల్పించెనను శ్రుతింబట్టి యేది కల్పమో యది కల్పపూర్వకమే యను న్యాయముచేత సంసార మనాదియగుటచేత నీశ్వరుఁడు సర్వజ్ఞుఁ డౌటచేతను గతకల్పీయమగు వేదము నీశ్వరుఁ

డీకల్పమం దుపదేశించుచున్నాఁడని యింతమాత్ర ముపపత్తియుండుఁ బ్రమాణాంతరముచే సర్థము నొందికచేసి కల్పనానుపపత్తి చేతను వైదికశబ్దముల కనాదిత్వము సిద్ధించుచున్నది. కాని యిది విశేష మేమనఁగా, ఏ హేతువుచే లోకసిద్ధపదములకుఁ బౌర్వాపర్యనియమ మొప్పక యథేష్టముగాఁ గవీశ్వరులు వాక్యములం బ్రయోగించు చున్నారో యాలాగుననే వృద్ధిసంజ్ఞాసూత్ర మహాభాష్యమందు సంస్కరించి సంస్కరించి పదములు విరచింపఁబడుచున్నవి. వాని కిష్టమువచ్చిన ట్లభిసంబంధము కలుగుచున్న దెట్లనఁగాఁ దెమ్ము పాత్రముం బాత్రముం దెమ్మన్నట్లు వేదమం దో పౌర్వాపర్యనియ మము తప్పదు. ఆ నియమ మెవ్వరు న్దాఁటశక్యముకాదు. కనుకనే వేదమర్యాదా సంరక్షణముకొఱకై భిన్నభిన్న ప్రాతిశాఖ్యలు ప్రతిఁ శాఖమున నాయామునులచేఁ జేయఁబడినయవి. కావుననే లౌకిక శబ్దములకంటె విలక్షణార్థ ప్రతిపాదకములుగా మాత్రమే వేదస్థ శబ్దములు నిఘంటు నిరుక్తి గ్రంథములందు యాస్కమునిచే నిరూపిత ములు కాఁబడినవి. వేదము మనుష్యకృతమైనచో నర్థబుద్ధి దోషశంకా కలుషితత్వముంబట్టి వేదప్రామాణ్య మెవ్వరిచేతనైన న నంగీకరింపఁ బడకుండుఁగదా! ఈ హేతువుచేతనే మీశ్వరప్రకా శితములయిన మంత్రాయుర్వేదములందుఁ బ్రవృత్తి సామర్థ్యమును బట్టి యర్థవ్యభిచార వినిశ్చయముచేతఁ బ్రామాణ్యము సిద్ధము. ఔషధభేదముల యొక్కయుం దత్సంయోగ విశేషములయొక్కయు నాయా వర్ణావాపోద్ధారణముచేఁ బదివేలేండ్ల జీవితముచేతనైనప్పటికిని నన్వయవ్యతిరేకము చేయుటకు లౌకికవ్యవహారి సమర్థుఁడుఁ గాఁడని యోగవాచస్పత్యమునందు వక్కాణింపఁబడియెను. కల్పాంతరీయ మైన వేదానుపూర్వీభేదము కానేరదను నభిప్రాయముతో వేదములు శబ్దప్రధానములని మమ్మటభట్టు సూచించెను. ఇంతేగాక, కర్తలపేర్లు కనపట్టని యితరగ్రంథము లనేకము లుండును. వానికిఁ గూడ నిత్యా త్వేశ్వరప్రకాశితత్వాద్యాపత్తి కలదని చెప్పఁజనదు. వానికి వేదము

వలెం బ్రసిద్ధి లేమిచేతను మఱి యిటువంటి పురుషార్థ సాధనతా భావముచేతను శిష్టు లంగీకరింపమిచేతను, బాహ్యులుకూడ నట్టియ నుపాదేయములని చెప్పఁగలరు. కావునను మఱి యీ హేతువు చేతనే వేదమంతయును ధర్మమూలమను మనువచన వ్యాఖ్యానావస రమున వేదముయొక్క ధర్మమూలత్వము మన్వాద్యుపదేశ సమధి గమ్యము కాదుగాని యబాధిత విషయప్రతీతి జనకత్వముచేతను బురుష సంసర్గదోషములచేఁ గూడ మిథ్యాభిధానా శంకాభావము వల్లను నైజముగా శబ్దాదుష్టత్వముంబట్టి ప్రత్యక్షవత్స్వతః ప్రామా ణ్యము సిద్ధించుచున్నదని మేధాతిథిప్రభృతులచే నుడువఁబడు చున్నది యీ హేతువుచేతనే సాంఖ్యాద్యాస్తికదర్శనకారులకందఱి కిని జగత్కారణవిషయమై పరస్పరభేద మున్నప్పటికి వేద ప్రామాణ్యము విషయమై లేశమైనను విప్రతిపత్తి లేనేలేదు. వేదోది తానుష్ఠానముయొక్క ఫలావశ్యం భావనిశ్చయమువల్లనే దేవతలే యజ్ఞము నేసిరో యద్దియే యసురులుగూడ నొనర్చిరను మొదలు వేదవాక్యములం దసురులకుఁ గూడ వేదమందుఁ బ్రవృత్తి యగపడు చున్నది. ఈ సంగతి కొంచెమైనం దెలిసికొనక తమకుఁ దోఁచిన కుతర్కముచేతనే వేదము లప్రమాణములని తెల్పుటకై యవి మనుష్యకల్పితములని తప్పఁబల్కుచున్నా రాహా! వీఁడు నన్ను నిష్కారణము దూషించుఁగదాయని యల్పవిద్వాంసునకు వేదము జడియుచున్నదను సర్వశిష్టాంగీకృత స్మృతాదివచనములచేత నట్టి యల్పవిద్వాంసులు వేదాధ్యయమునకుఁ గాని వేదవిమర్శకుఁ గాని యధికారులు కారా దాస్తికు లాయల్పవిద్వాంసుల కల్పన లంగీక రించుట కేవల మనుచితము. పైఁజెప్పిన ప్రకారము వేదము లపౌరు షేయములు స్వతఃప్రమాణములని సిద్ధాంతము.

ఆకాశము నిత్యము భూమి నిత్యము మఱియు నీ జగమంతయు న్నిత్యమనిన ప్రకారముగా వేదములు ధ్రువములనియు నీశ్వరప్రకా శితములనియు సర్వజ్ఞులగు తత్త్వవేత్తల సిద్ధాంతమునకు బాధక మెం తయు గలుగఁబోదని విద్వాంసులు బాగుగ నాలోచించి నిశ్చితులు కావ

లయును. ఇంతేగాక యాధునికులుగూడఁ బాణిన్యాదిమునుల బుద్ధి చాతుర్యము నెన్నికచేసి యావాక్యులు ప్రమాణమనుచున్నారు. "తదశిష్యం సంజ్ఞాప్రమాణత్వాత్" అని యీ మొదలగుసూత్రములచే శబ్దార్థసంబంధముల కనాదిత్వము పాణిని సూచించెను". "సిద్ధే శబ్దార్థసంబంధే - ఛన్దసిద్దృష్టానువిధిః" అని కాత్యాయనుఁడు పాణిని వల్కినది స్పష్టపర్చెను. "సిద్ధశబ్దోనిత్యపర్యాయ వచనః" అని మహాభాష్యకర్తయగు పతంజలి వ్యాఖ్యాన మొనర్చెను. "చోదనా లక్షణోధర్మః" ఇట్లు పల్కి భగవానుఁడైన జైమిని వేదనిత్యత్వము న్దాని ప్రామాణ్యము న్విశదపర్చుచు శబ్దమున కర్థముతో సంబంధమౌత్పత్తికమనియు నవ్యతిరేకోపదేశము తజ్జ్ఞానమనియు ననపేక్షంబట్టి యను వలశార్థమందు బాదరాయణున కది ప్రమాణమని సూచించెను. ఔత్పత్తిక మనఁగా నిత్యము-లక్షణచే నుత్పత్తిభావమని చెప్పఁబడుచున్నదిగనుక శబ్దార్థములయొక్క భావము సంబంధముగాని యది వఱకేపుట్టిన రెండువస్తువులకు వెనుకసంబంధముకలిగెననుట యుక్తము కాదు. అర్థముతో శబ్దమునకు సంబంధ మౌత్పత్తికము. ప్రత్యక్షాది ప్రమాణములచేఁ దెలియఁబడని యగ్నిహోత్రాదిలక్షణముగల యీ వేదధర్మమునకు నిమిత్తముపదేశ మెట్లు కాఁగలదు? ఉపదేశ మనఁగా జ్ఞానావ్యతిరేకవిశిష్టశబ్దోచ్చారణము అందువలనంబుట్టినజ్ఞానమువిపర్యయము కానేరదు. విపర్యయముకాని జ్ఞానమిట్టిదని చెప్పశక్యముకాదు. అదిటువంటిదని తెలిసికొన్నట్లుగాని యీవిధముగా నద్ది తెలియఁబడదన్నట్లుగాని యది యుండదు.మనస్సునం దొకవిధముగానున్న వాక్కునం దింకొకవిధముగానున్నది వాక్కునం దికొక్కవిధముగాఁబయల్వడును. ఇట్లనెడువారి కున్నదిగాని యద్దిలేదనిగాని యెట్లు తెలియఁబడును? కాఁబట్టి యనపేక్షత్వమునుండి యద్ది ప్రమాణము. ఇది యిట్లుండఁగాఁ బ్రత్యయాన్తరముగాని పురుషాన్తరముగాని యపేక్షింపఁదగదు. ఈ ప్రత్యయమేయిది, బాదరాయణుని గౌరవించుటకై తన్మతము కీర్తింపఁబడెను. తనమతము చెప్పుటకుఁగాదని స్వయముగా వ్యాఖ్యానావసానమున వృత్తికారుఁడన్యవిధముగాన్గ్రంథము

"తస్యనిమిత్తపరీష్టిః" యని యీ విధముగా వర్ణించినాఁడు. కారణముం బరీక్షింపరాదు. ప్రత్యక్షాది ప్రమాణములు ప్రసిద్ధములే. ఆ ప్రమాణాంతర్గతము శాస్త్రము - కాఁబట్టి యా శాస్త్రమును గూడఁ బరీక్షింపఁగూడదు. ఇందును గురించి చెప్పఁబడుచున్నది. వ్యభిచార హేతువు నుండి పరీక్షింపఁబడవలసినది - ముత్తెపుచిప్ప వెండివలె మెఱయుచున్నది. ప్రత్యక్ష మందుచే వ్యభిచరించుచున్నది. దానికారణము ననుమానాది ప్రమాణములకుఁ గూడ వ్యభిచారదోషము కలుగుచున్నది. అందుఁ గూర్చి పరీక్షింపకయే ప్రవర్తించువాఁ డనర్థము బొందును. అనర్థ మెట్లైనఁ బొందకపోవదు - ఇది ట్లుకాదు. ఏది ప్రత్యక్షమో యది వ్యభిచరించును. మఱియు నేది వ్యభిచరించునో యది ప్రత్యక్షము కాదు. సరిగాని, ప్రత్యక్షమన నేమి? పురుషుని యింద్రియము తత్సంప్రయోగమున బుద్ధిజన్మ మెద్దియో యది ప్రత్యక్ష మనఁబడును. ఇంద్రియమనోర్థసన్నికర్షమైనదే సమ్యగ్జ్ఞానహేతువు దుష్టముల యెడల జ్ఞానము మిథ్యయౌను, అదెట్లు తెలియుననఁగా - దోషము తొలఁగినపిమ్మట సంప్రతిపత్తి యగపడును కనుక - దుష్టాదుష్టావగమ మెట్లనఁగాఁ బ్రయత్నముతో నన్విచ్ఛయించుమన దోషము తెలియకుంటిమేని ప్రమాణభావమున నదుష్టమని తలంచెదము. కాఁబట్టి దేనికిఁ గరణము దుష్టమో యెచట మిథ్యయను సమ్మకమో యద్దియే యవిశ్వాసమగుఁగాని యితరము కాదు. సరిగాని - అంతటియెడ స్వప్నమువలె నిరాలంబన ప్రత్యయము కలదు. స్వప్నమందు బుద్ధికే నిరాలంబన స్వభావము కాన్పించుచున్నది. మేల్కొన్నవానికి స్తంభమని కాని గోడయని కాని తప్పక బుద్ధిపొడముచున్నది. కాఁబట్టి యది కూడ నిరాలంబన మనఁబడుచున్నది. మేల్కొన్నవానికి స్తంభమను సుపరినిశ్చితబుద్ధి యెట్లు విపర్యయమగునో మేల్కొనకముందు స్వప్నమునఁ గూడ నీతీరుగనే సుపరినిశ్చితముగా బుద్ధియుండును. అచట విశేష మెద్దియు న్లేదనిన నట్లుకాదు. స్వప్నమున విపర్యయదర్శనమగును గనుక, సామాన్యముగా నది యితరమందు గూడఁ నవిపర్యయముగా నుండుటచే నన్యస్థితియందు నట్లే యుండుననినచోఁ బ్రత్యయత్వముచే స్వప్నప్రత్య

యము మిథ్యాభావముగుటవలన జాగ్రత్ప్రత్యయమునకుఁగూడ నట్లే కాఁదగినది. అప్పుఁడా భానమునకు హేతువగు ప్రతిప్రత్యయత్వమును బట్టి యది యితరముచేఁ జెప్పఁబడ శక్యముకాదు - ఇతరస్థలమున స్వప్న ప్రత్యయముయొక్క మిథ్యాభావము విపర్యయమునుండి తెలియఁబడినది.

కారణ మేమనఁగా నిద్రించుచున్నవానియొక్క మనో దౌర్బల్యముచే మిథ్యాభానమునకు నిద్ర హేతువు. స్వప్నాదియందు స్వప్నాంతమందును విపర్యయమువలన సుషుప్తిక భావమే-భ్రాంతిగాఁ దెల్వి తప్పినపుడే సుషుప్తఁ యని చెప్పఁదగును గనుక మేల్కొన్నవానికిఁ బ్రత్యయము మిథ్య కాదు- గాని-మేల్కొన్నవానికిఁ గూడ నింద్రియ దోష ముండవచ్చును. అట్లున్న యెడలఁ దెలియఁబడవలసినది-స్వప్న దర్శకాలమందుఁ గూడఁ దెలియఁబడదన్నచో దానినుండి మేల్కొన్నవాఁడా సమయమున నామనసు నిద్రాక్రాంత మయ్యెనని తెలిసి కొనుచున్నాఁడు. అర్థజ్ఞానాకార భేదము శూన్యవాదము నట్లు పొందకుండుము. మన బుద్ధి ప్రత్యక్షమైనది. కావునఁ దద్భిన్నమైన యద్ధి రూపమన్న దెద్దియుం గోచరమైనప్పటికి లేదని తెలిసికొనుచున్నాము ఇదిట్లు కానీ-అర్థాకారము బుద్ధియైన యెడల నిరాకారమైనది బుద్ధి కానేరదు-బాహ్యార్థ మాకారముకలది - బహిర్దేశసంబద్ధమై యది ప్రత్యక్షముగాఁ బొందఁబడుచున్నది. ప్రత్యక్ష బుద్ధి యర్థ విషయము గాని బుద్ధ్యంతర విషయము కాదుగదా? అది క్షణికమేకదా— బుద్ధ్యంతరకాలమువఱకుండ దీ విధముగా నది పుట్టఁగానే దివ్వోవలె నర్థాంతరముం దెలిసికొనును. మఱియుఁ దెలియునన్నచో నదట్లు కాదు- అజ్ఞాతార్థముం దెవ్వనికైనం బుద్ధి ప్రవర్తించదు. జ్ఞాతార్థ మనుమానముతోఁ దెలిసికొనుచున్నాఁడు. ఏకకాలమునందే తెలిసీ తెలియకుంట యసంభవము-సరేకాని- బుద్ధి పొడమినప్పుడే వస్తు వెలుఁగఁబడె ననఁబడు న్గాని బుద్ధియే ప్రసరించనియప్పు డట్లు కాదుగా?- కావున మొదటం బుద్ధి పొడమును బిమ్మట వస్తువు జ్ఞాత మగును. నిజమే- తొల్త బుద్ధి పుట్టును గాని తొల్తనే వస్తు వెలుఁగఁబడనేరదు.

ఇత్తీరుగా నొకప్పు డగును-వస్తువు-తెలియఁ బడుచుం దెలియఁబడె ననఁబడును-కాని-అర్థవ్యపదేశము లేకయే బుద్ధికి రూపోపలంభనము కాఁబోదు-కావున బుద్ధి వ్యపదేశము కాదు..అవ్యపదేశ్యమే ప్రత్యక్షము-కనుక-బుద్ధి యప్రత్యక్షము- ఇంతేగాక- కేవల మేకరూపత్వమందు బుద్ధికే యభావమగును. ప్రత్యక్షము కానున్న వస్తువునకు మాత్ర మట్లభావము కానేరదు. ఏకరూపత్వము కాదు. బుద్ధి యనాకారమనియే యనుమానించెదము. ప్రత్యక్షవస్తువు సాకారమని తెలిసికొనుచున్నాము. కాఁబట్టి యర్థాలంబనము ప్రత్యయము- మఱియును-ఉపాదేయమానతంతువులందే పటప్రత్యయము నియత నిమిత్తము. ఇంకొకరీతిని తన్త్వాదానమందు సైతము వికలేంద్రియునకు ఘటబుద్ధి యొకానొకవేళఁ గలుగును. అకీతిగా లేదు. కావునం బ్రత్యయము నిరాలంబనము కాదు. కనుక ప్రత్యక్షము వ్యభిచరించదు. జ్ఞాతసంబంధముయొక్క యేకదేశ దర్శనమువల్ల నేక దేశాంతరమందు సన్నికృష్టార్థమునందలి బుద్ధి యనుమానము. ఆ యనుమానము ప్రత్యక్షముగఁ జూడబడిన సంబంధము న్సామాన్యముగఁ జూడఁబడిన సంబంధమని రెండు విధములు. ధూమాకృతి దర్శనము నుండి యగ్న్యాకృతి దర్శనము మొదటిది.

## వేదపౌరుషేయ ప్రమాణత్వము

దేవదత్తుఁడు వెళ్ళిన దేశాంతర ప్రాప్తి నెఱిఁగిన పిదపనాదిత్యగతి స్మరించుట రెండవది. ధ్వనిం బట్టి దూరముగా నున్న యర్థము నెలిసికొనుట శాబ్దము (ఎ) దగ్గరలేని వస్తువునందు బుద్ధి ప్రసరింపఁజేయు సాదృశ్య ముపమానము. గవయదర్శనముచే గోస్మరణము. చూడఁబడినది. వినఁబడినదియు నగు వస్తు వితరముగా నుపలభ్యము కాదను నర్థకల్పన మర్థాపత్తి-యెట్లనఁగా- జీవించియున్న దేవదత్తుఁ డింటలేకుంట తెలిసికొని చూడకయే యితర స్థలముల నున్నాఁడనుట. మాత్రమైన నర్థము లేదనుట ప్రమాణాభావము

గనుక దాని హేతువు పరీక్షింపఁ బడరాదు సరిగాని, ప్రత్యక్షాది ప్రమాణము లన్యములుండనీ- శబ్దమాత్రము ప్రమాణము కానేరదు. ఎల యనఁగా - విద్యమానోపలంభనమువలన నిమిత్తము, అనిమిత్తమైన శబ్దప్రమాణము కాదు. ఉపలభ్యము కాని యుపలంభన విషయము కుందేటికొమ్మువలె లేనేలేదు. పశ్వాదులయొక్క యింద్రియము లుపలంభకములు కావు కామేష్టి తరువాతఁ బశువు లుపలభ్యములుకావు గనుక-ఇష్టి నిష్ఫలము కాదు. కర్మకాలమున ఫలముతోఁ గాఁదగినది. ఏ సమయమున మర్దనమగుచుండునో యపుడేకదా మర్దన సుఖము. కాలాంతరమున నిష్టిఫలము కాఁబోదు. కారణ మేమన నెవ్వఁడు దేనినైనను సదో యంతవఱ కిష్టి ఫలమునీఁ బోదు. మఱి యెపుడు ఫలము కలుగునో యపు డిష్టియే లేదు. లేని దెట్లు ఫలమీఁగలదు? ప్రత్యక్షమున నితర ఫలకారణము తెచ్చుకొనుచున్నాము దృష్టకారణముగ నదృష్టకారణము తెచ్చుకొనుట శక్యముకాదు. ప్రమాణము లేదు గనుక, ఈ ప్రకారము దృష్టాపచారమైన వేదమునకు స్వర్గాది ఫలము సైతము కలుగదని తలంచెదము. కొంత వచనము కూడ స్పష్ట విరుద్ధమగుచున్నది. పాత్రచయనము చేసి యజ్ఞాయుధుఁడగు నాయజమానుఁడు వేగముగా స్వర్గమేగుచున్నాఁడు. అని ప్రత్యక్ష శారీరకమును వ్యపదేశించుచున్నాఁడు. ప్రత్యక్షముగా నద్ది తగులఁ బెట్టఁబడుచున్నది గాని స్వర్గలోకమునకు యజమానుఁడు పోలేదని విధిశబ్దము. ఈ ప్రకారముగాఁ బ్రమాణ విరుద్ధమైన వచన మప్రమాణము.

ఇది శ్రీమదజ్జా డాదిభట్ల నారాయణదాస విరచితమగు జగజ్జ్యోతి
యందు నిత్యశుద్ధ ముద్ధముక్త బ్రహ్మస్వరూప నిర్వచనము.

—o—